మీరూ జర్నలిస్ట్ కావచ్చు
గోవిందరాజు చక్రధర్

ప్రథమ ముద్రణ
సెప్టెంబరు 1988

మూల్యం
**25 రూపాయలు**
లైబ్రరీ ఎడిషన్
**30 రూపాయలు**

టైటిల్ డిజైన్
కారికేచర్లు : మోహన్

కాపీరైట్ :
చక్రధర్

కార్టూన్లు : శ్రీధర్

ప్రచురణ :
**జి. చక్రధర్**
1-9-289/7
పోస్టాఫీస్ బిల్డింగు
విద్యానగర్, హైదరాబాదు-500044

ముద్రణ :
**జయశ్రీ ప్రెస్**
2-2-1167/2/జి
తిలక్‌నగర్
హైదరాబాదు-500044

తెలుగు విశ్వవిద్యాలయం, వారి
ఆర్థిక సహాయంతో ప్రచురితం.

# అక్షరాభిషేకం

తెలుగు పత్రికా రంగానికి కొత్త వరవడి దిద్దిన

**రామోజీరావు గారికి**

ప్రేమతో, గౌరవంతో...

# హైలైట్స్

- ◎ రిపోర్టర్లు, సబెడిటర్లు కావాలనుకునే వారికోసం
- ◎ నాలుగు ప్రధాన అధ్యాయాలు
- ◎ నలభైకిపైగా శీర్షికలు
- ◎ సంపాదకులతో ఇంటర్వ్యూలు
- ◎ మోహన్ కారికేచర్లు
- ◎ శ్రీధర్ కార్టూన్లు
- ◎ జర్నలిస్టిక్ జోక్స్, కొటేషన్లు
- ◎ అందరికోసం అన్నీ

కాపీలకు రచయితకు రాయండి

లేదా

ప్రముఖ పుస్తక విక్రేతల నడగండి

# యోగ్యతా పత్రం

ఆధునిక విజ్ఞాన యుగంలో జర్నలిజంవల్ల ప్రభావితంకాని రంగం లేదు. జర్నలిజం గొప్పతనాన్ని చెప్పడానికి కాదు ఈ మాట లంటున్నది. జర్నలిస్టు బాధ్యతను గుర్తుచేయడానికి మాత్రమే ఈ ప్రస్తావన. జర్నలిస్టు తన వృత్తిలో పరిపూర్ణకుశలత సంపాదించడం ఎంత అవసరమో గుర్తుచేయడానికే. జర్నలిస్టుకి ప్రతివిషయాన్ని గురించి ఎంతో కొంత,



కొన్ని విషయాలను గురించి మాత్రం కూలంకషంగా తెలిసి ఉండాలన్న నానుడి శాశ్వత సత్యాన్నే చెబుతున్నా అరిగి పోయిన రికార్డులా వినిపిస్తుంది. అంతమాత్రాన సమాజంలోని సమస్త వర్గాలకు నిత్యవిజ్ఞానదాయినిగా సమాచార వితరణ రంగం కృషిని విస్మరించే వీలులేదు. మనం వెస్ట్‌మినిస్టర్ పార్లమెంటరీ తరహా గణతంత్ర పాలనా వ్యవస్థను ఏర్పాటు చేసుకున్నాం గనుక ప్రామాణిక పత్రికారచన ప్రాముఖ్యం ఇనుమడిస్తున్నది. ఈ తరహా పాలనా వ్యవస్థ ఆశయ సిద్ధికి నిరంతరం కొత్తభావనలను, కొత్త ఆలోచనలను చర్చించడం, తర్కించడం, అంగీకరించడమో నిరాకరించడమో చేయడం ఆవశ్యకం. ఈ ప్రక్రియ నిరాఘాటంగా, నిర్విరామంగా సాగుతూ ఉండటానికి వీలైనన్ని ఎక్కువ భావ సుమాలను, అభిప్రాయ గుచ్ఛాలను ప్రజలముందు ఉంచ వలసిన అవసరం ఉంటుంది. ప్రజాస్వామ్యంలో సమష్టి నిర్ణయాలు గైకొనే ఆచరణ విధానంలో ప్రజలందరికీ భాగస్వామ్య హక్కు ఉంది. తమకిష్టమైన రాజకీయ నిర్ణయానికి రావడానికి అవసరమైన ప్రాథమిక సమాచారం కోసం ప్రజలు పూర్తిగా

పత్రికలపైనే ఆధార పడతారు. అందుచేత పత్రికారంగం, మరీ ముఖ్యంగా వర్ధమాన దేశాలలోని పత్రికారంగం సాంఘికంగా మరింత చైతన్యశీలంగా ఉండకతప్పదు. అభిప్రాయ వర్ణమాలను రంగులు కలగాపులగం కాకుండా ఏ రంగూ వెలిసిపోని విధంగా ప్రజలముందు సాక్షాత్కరింప జేయాలి. ప్రజాస్వామ్య వ్యవస్థకు పునాదివంటిదైన బహిరంగ చర్చ శూన్యంలో జరగదు. అందుకు అవసరమైన సకల సమాచారం అందుబాటులో ఉండాలి. అందు కోసమే భావప్రకటనా స్వాతంత్ర్యాన్ని పరిరక్షించడమేగాక, భావప్రకటన అవకాశాలను విస్తరింపజేయడంకూడా తప్పనిసరి అవుతుంది. పత్రికా స్వేచ్ఛ మీద బాహిరమైన ఒత్తిడులను ప్రతిఘటించడం ఎంత అవసరమో, అంతర్ బలహీనతలను నివారించుకోవడం కూడా అంతే ముఖ్యం. ఏ సమాచారాన్ని స్వీకరించాలో దేన్ని ఉపేక్షించాలో నిర్ణయించుకునే అధికారం ప్రజలది. పత్రికారచయితలు, సంపాదకులు, ప్రచురణకర్తలకు దాన్ని హస్తగతం చేసుకునే హక్కు లేదు.

పత్రికారచయిత ప్రతిరోజూ, ప్రతిక్షణం ఏవో సంఘటనల గురించి, పరిణామాల గురించి, వాటి పూర్వాపరాలగురించి సమాచారాన్ని సేకరిస్తూ వీలువెంబడి వార్తగా మలుస్తూఉంటాడు. తానురాసిందాన్ని చదివే పాఠకుల ఇష్టాయిష్టాలతో, అభిరుచులతో అతడికి ప్రత్యక్ష పరిచయం ఉండే అవకాశంలేదు. ఆత్మాశ్రయంగా వార్తాసంకలనం, ప్రాధాన్య ప్రచురణార్హతల నిర్ణయం చేసి అవసరమనుకున్నప్పుడు వివరణాత్మకంగా, విశ్లేషణాత్మకంగా అందిస్తుంటాడు ఇందులో అసంకల్పిత వక్రీకరణ ప్రమాదం లేకపోలేదు. చెప్పదగిన ప్రతి అంశం, ప్రతివివరం చెప్పేయడమే ఆదోష నివారణకు మార్గం. అలాచెప్పే వెసులుబాటు కల్పించడానికే వాక్, భావప్రకటనా స్వాతంత్ర్యంలో భాగంగా పత్రికా స్వేచ్ఛకు రాజ్యాంగం స్థానం కల్పించింది. నిర్హేతుక నిర్బంధాల నుంచి రక్షణ కల్పించింది. సప్తస్వాతంత్ర్యాలలో పత్రికా స్వాతంత్ర్యానికి అగ్రాసన మిచ్చింది. దీంతో వేయి భావసుమాలు వికసించడానికి అనువైన వాతావరణం వెల్లివిరుస్తుందని ఆకాంక్షించింది ఈ ఆకాంక్ష నిజంకావాలన్నా, ఈ అవకాశాన్ని సద్వినియోగ పరుచుకోవాలన్నా జర్నలిస్టుకు తన ధర్మమేమిటో, బాధ్యతేమిటో హక్కులేమిటో, అధికారాలేమిటో, పరిధులేమిటో, పరిమితులేమిటో తెలియాలి.

ఈ అంశాలను తరగతి గదులలో, పాఠ్యపుస్తకాలద్వారా బోధించడం

అసాధ్యమని కొన్నాళ్ళు, కొన్నేళ్ళక్రితం ఒక అపోహ ఉండేది. కాని దేశంలో, రాష్ట్రంలో సైతం కళాశాలలలో జర్నలిజం మూలసూత్రాలను, అభ్యసించి, సుశిక్షితులైవచ్చిన స్నాతకులు అసంఖ్యాక పత్రికలలో కీలక పదవులను సమర్థతతో నిర్వహిస్తూ ఆ వాదాన్ని పూర్వపక్షం చేశారు, చేస్తున్నారు. ఇప్పుడు కళాశాలలో లభిస్తున్న శిక్షణ కనీసం తెలుగు పత్రికారంగానికి సంబంధించినంత వరకైనా నూటికినూరుపాళ్ళు ఆదర్శప్రాయంగా లేదని గుర్తించి ఈ పరిస్థితిని పునస్సమీక్షించినట్టయితే శిక్షణ ప్రయోజనం, ప్రాముఖ్యం సువిదితమవుతుంది. అయితే తెలుగు మాధ్యమంద్వారా జర్నలిజం స్వరూప స్వభావాలను లక్ష్య లక్షణాలను, గుణదోషాలను, విధినిషేధాలను తెలియపరిచే పాఠ్య పఠనీయ గ్రంథాలులేవు. ఒకటిరెండు జర్నలిజం విభాగాలలో తెలుగు పత్రికారచన ఐచ్ఛికాంశంగా ఉన్నా, పరీక్షలు తెలుగులో రాసే అవకాశం కల్పించినా ఆంగ్ల గ్రంథాల మీదనే పూర్తిగా ఆధారపడవలసి రావడంవల్ల విద్యార్థికి ఎదురీత తప్పడంలేదు. యూనివర్సిటీల్లో ప్రవేశ పరీక్ష దశనుంచి బోధన శిక్షణ అనంతర వార్షిక పరీక్షవరకు విద్యార్థి అభినివేశాన్ని, అభివ్యక్తిని కొలిచేందుకు ఆంగ్లభాషనే గీటురాయిగా వాడుతున్నందున ఈ ప్రతిబంధకాన్ని తొలగించే ప్రయత్నాలు జరగడంలేదు. ఎక్కడో ఒకటీ అరాఅవైనా విద్యార్థులు తమ శిక్షణా కార్యక్రమంలో భాగంగా రచించిన అధ్యయన పత్రాలు తెలుగు జర్నలిజం అంగోపాంగాలను స్పృశించడానికి యత్నించినవి ఉన్నా అవి నైష్ఠిక విద్యార్థికి అట్టేఉపకరించవు. ఇటీవలికాలంలో రాశివాసి ఉభయ విషయాలలో గణనీయమైన అభివృద్ధిని సాధించిన పత్రికారంగంసైతం ఈ కొరతను తీర్చుకునేందుకు క్రమబద్ధమైన చర్యలేవీ చేపట్టలేదు. అవసరార్థం కొన్ని పత్రికలు స్వల్పకాలిక శిక్షణ తరగతులను నిర్వహించుకున్నప్పటికీ పాఠ్య, పఠనీయ సామగ్రి తయారీ విషయంలో ఆశించదగినంత ముందంజ వేయలేదు. ముద్రణా రంగంలో వచ్చిన సాంకేతిక విప్లవ ఫలాలను వినియోగించుకోవడంలో చూపిన శ్రద్ధాసక్తులు మానవవనరుల వికాసం విషయంలో చూపలేదు. పత్రికారచన నియత విజ్ఞానశాస్త్రంకాదనీ ఇందులో పాత్రికేయుని వైయక్తిక విచక్షణ, అంతః ప్రేరణల పాత్ర విశేషంగా ఉంటుందని, గుర్తించినప్పుడు ఆయన వృత్తికుశలతను పెంపొందించే సాధన సామాగ్రి నిర్మాణం ఎంత అవసరమో స్పష్టమవుతుంది. మిత్రుడు గోవిందరాజు చక్రధర్ జర్నలిస్టుగా విధి నిర్వహణలో తనకు లభించిన అనుభవాన్ని పెద్దలనుంచి గ్రహించిన

మెళకువలతో అన్వయం చేసి "మీరూ జర్నలిస్టుకావచ్చు" అనే ఈ పుస్తకాన్ని సులభశైలిలో సుగ్రాహ్యమైన రీతిలో ఆసాంతం చదివించే విధంగా రూపొందించారు. ఇందులో (1) ఉపసంపాదకులకోసం (2) విలేకరులకోసం (3) అవీఇవి (4) ఇంటర్వ్యూ పాయింట్ అనే నాలుగు అధ్యాయాలక్రింద బడు రాస్తే బడుద్దాయి, సత్తాతోపాటు శరీరదార్ఢ్యం, వేగం జర్నలిస్టువేదం, శీర్షికలతో సిగపట్లు, చెల్లని వార్తలు, మీరు ఇలారాయకండి, మౌనప్రబోధం వంటి శీర్షికలతో విషయవివరణ గావించారు. విహంగ వీక్షణకు ఇదొక శీర్షికా తోరణంగా తోచవచ్చు. కాని లోనికివెడితే వార్తాలేఖనం, ఎడిటింగ్ పద్ధతులు, శీర్షికారచనా నియమాలు ఆదిగాగల సకల అంశాలగురించి పూర్ణఅవగాహన ఏర్పడుతుంది. గ్రంథారంభంలో "మీరూ జర్నలిస్టు కావచ్చు" అంటూ ఇచ్చిన హామీని నెరవేర్చడానికి రచయితగట్టిప్రయత్నం చేశాడన్న తృప్తికలుగుతుంది. జర్నలిజాన్ని వృత్తిగా చేపట్టే ఆలోచన అవసరం లేనివారికికూడా సామాన్య లోకజ్ఞానం అందించే పుస్తకంగా హాయిగా చదువుకోడానికి ఉపకరిస్తుంది,

జి. యస్. వరదాచారి
అసిస్టెంట్ ఎడిటర్, ఈనాడు.

---

## మన పత్రికల సిత్రాలు

వార్తలు అందించే తీరులో ఇంగ్లీషు పత్రికలు ఇప్పటికీ సంప్రదాయ పద్ధతులనే అనుసరిస్తున్నాయి. తెలుగు పత్రికలు ఇందుకు భిన్నంగా ఉన్నాయి. కొత్తగా అక్షరాస్యులైన వారిసంఖ్య పెరుగుతున్నందున సరికొత్త మార్కెట్ అవతరించింది. ఈ మార్కెట్‌ను సొమ్ము చేసుకోవడం కోసం తెలుగు పత్రికల్లో వార్తలను అందించే తీరులో వినూత్న ధోరణి ప్రారంభమైంది. ఈ తరహా రిపోర్టింగ్ వాస్తవాలు, వదంతులకు మధ్య తేడానిగాని, కేవలం అభిప్రాయాలు సూచనలు, నిందల మధ్య తేడానిగాని గుర్తించడంలేదు. అసలు అలాంటి తేడా ఉంటుందన్న స్పృహకూడా ఉన్నట్టులేదు.

కె. బాలగోపాల్

---

# ఇదే నేటి బానర్



మీరూ జర్నలిస్ట్ కావచ్చు అనే పేరు వినగానే ముప్పై రోజుల్లో హిందీ భాషనేర్చుకోవచ్చు తరహా పుస్తకాలు స్ఫురణకు వస్తాయి. వివిధ స్థాయిల పాఠకులను ఆకట్టుకునే లక్ష్యంతో పుస్తకానికి రచయిత ఆ పేరుపెట్టినట్లు తర్వాత తెలిసింది. తెలుగు పత్రికల్లో వార్తల సేకరణ నుంచి అవి అచ్చయ్యే క్రమం వరకూ జరిగే పరిణామాలను అద్దం పట్టారు రచయిత. జర్నలిజంపై తెలుగులో ఒకటీ అరా పుస్తకాలు వెల్వడినప్పటికీ ఇంత ప్రాక్టికల్‌గా, సమగ్రంగా ఉపయోగపడే రీతిలో రాసిన పుస్తకం ఇదొక్కటేనని చెప్పవచ్చు. ఇటు ఉపసంపాదకులు కాగోరేవారికి అటు రిపోర్టర్లు కావాలని ఉవ్విళ్లూరే వారికి పనికొచ్చే విషయాలు ఎన్నో చెప్పారు. ఇంటర్‘వ్యూ’ పాయింట్ అధ్యాయంలో ప్రముఖ సంపాదకులతో జరిపిన ఇంటర్వ్యూలు ఈ పుస్తకానికి ప్రత్యేక ఆకర్షణ. నువ్వీపనిచేయి అని ఎవరూ మనకు చెప్పరు. మన లక్ష్యాలని మనమే నిర్దేశించుకోవాలి. ఆలక్ష్యసాధనే ముందుకు నడిపిస్తుంది. అలాలక్ష్యం నిర్దేశించుకున్న జర్నలిజంలో తన అనుభవాన్ని రంగరించి చక్రధర్ వెలువరించినదే ఈ రచన. ఒకప్పుడు జర్నలిజాన్ని వృత్తిగా చేపట్టడానికి అంతగా ఉత్సాహం చూపేవారుకాదు. ఇప్పుడలా లేదు. ఎందరో యువతీ యువకులు కలాలు పట్టుకుని ఈ వృత్తిలో నిలదొక్కుకుంటున్నారు. ఇది శుభ పరిణామం. జర్నలిజం వృత్తి చేపట్టే వారికి అవసరమైన టెక్నిక్‌లన్నీ ఇకమీరే చదివి తెలుసుకోండి. తెలుగులో జర్నలిజం పుస్తకాల ప్రచురణలో ఇదే హైలైట్. ఇదే నేటి బానర్.

వి. రమేష్ బాబు
డైరెక్టర్, న్యూస్ టు డే.

# I

# ఉపసంపాదకత్వం

ఇందులో

1) మీరూ జర్నలిస్ట్ కావచ్చు
2) పత్రిక ప్రారంభం ప్రయాసే
3) ప్రాంతీయ వార్తలే ప్రాణం
4) వేగం జర్నలిస్ట్ వేదం
5) సత్తాతో పాటు శరీర దారుఢ్యం
6) ఎంత చదివితే అంత మంచిది
7) చలాకీగా ఉంటూ చక్కగా రాయాలి
8) ప్రశ్నతోనే వార్త పుట్టుక
9) ఈ పదాలు తెలిసుండాలి
10) వార్తను గుర్తించే ఒడుపు
11) అనుకోని అతిధి
12) ఇంగ్లీషు లిపిలో తెలుగు వార్త
13) బడురాస్తే బడుద్దాయి
14) వాక్య నిర్మాణ దోషాలు
15) తర్జుమాల తకరారు
16) మీరు ఇలా రాయకండి
17) శీర్షికలతో సిగపట్లు
18) అచ్చు తప్పుల అమీ తుమీ
19) పేజికి ముస్తాబు
20) పత్రికకు పెద్ద తలకాయ
21) వియ్యాల వారి కయ్యాలు

# మీరూ జర్నలిస్ట్ కావచ్చు

అవును ఇది నిజం. కాస్తంత పట్టుదల తెలుసుకోవాలన్న ఇచ్ఛ, తెలియ చెప్పాలన్న కాంక్ష వుంటే మీరూ జర్నలిస్టుగా కొత్త జీవితా ధ్యాయం మొదలిడవచ్చు. చెప్పదలిచిన విషయాన్ని సూటిగా,సరళంగా శిష్ట వ్యవహారికంలో చెప్పగలగడం, ఇంగ్లీషును అవగాహన చేసుకో గల్గడం ఈ వృత్తి చేపట్టే వారికి చాలా ముఖ్యం. ఈ రెండూ తెలుగు జర్నలిజం బండికి రెండు చక్రాలవంటివని మరచి పోవద్దు.

తెలుగు పత్రికల పనితీరుకు సంబంధించిన సమాచారం కొంత వరకు ఇక్కడ పొందుపరిచాను. ఇది కేవలం ప్రాథమికం మాత్రమే. తెలుగులో జర్నలిజం గురించి తెలియచేప్పే పుస్తకాల లేమిని పూరించ డానికే ఈ ప్రయత్నం. ఆంగ్లంలో జర్నలిజంపై అనేక ఉద్గ్రంధాలు ఉన్నాయి. తెలుగు పత్రికలపై అవగాహన, ఆసక్తి కల్పించాలన్న ఆశయ ఫలితమే ఈ చిరుదీపం.

కొండంత జర్నలిజానికి పట్టిన అద్దం ఇది. జర్నలిజంపట్ల అవగాహన కల్పించి, జర్నలిస్టుకాగోరు యువతకు మార్గదర్శకంగా నిలిస్తే ఈ ప్రయత్నం సఫలీకృతమైనట్లే.

# పత్రిక ప్రారంభం ప్రయాసే

తెలుగునాట కొత్తపత్రికలు ఆవిర్భవిస్తున్నాయి. పెరుగుతున్న జనాభాతో పాటు పాఠకుల సంఖ్య కూడా పెరుగుతోంది. అయితే రాష్ట్రంనలు చెరగులా విస్తరించి పదిమంది లోగిళ్ళ ముంగిట ప్రత్యక్షమయ్యేలా కాస్తంత భారీ ఎత్తున పత్రిక నెలకొల్పడం ఎంతో ప్రయాసతో కూడుకున్న పని. లక్షలు కాకుంటే కోట్ల రూపాయల్లో పెట్టుబడులు పెట్టి మరమరాలు ఏరుకున్నట్లుగా రూపాయి చొప్పున (పత్రిక ఖరీదు) పోగు చేసుకోవాలి.

పత్రికలకు సమర్థులైన సంపాదకవర్గం ఒక్కటే సరిపోదు. పత్రికలకు వ్యాపార ప్రకటనలే ఆధారం. ఆ ప్రకటనల రూపేణా వచ్చే ఆదాయంతోనే పత్రిక మనుగడ ఆధారపడి ఉంది. వ్యాపార ప్రకటనలకూ పత్రిక సర్క్యులేషన్‌కు లింకు. సర్క్యులేషన్ ఎక్కువగా వుంటేగానీ వ్యాపార ప్రకటనలు రావు ప్రకటనలకోసం ఆదిలో ఒక్కో కాపీకి ఉత్పత్తి ఖర్చులో కొంత మేరకు నష్టం భరిస్తూ సర్క్యులేషన్ పెంచుకోవాలి. ఆ తర్వాతే ప్రకటనలు వచ్చేది.

అంత వరకూ పత్రిక మనుగడ మాత్రం దినదిన గండం నూరేళ్ళాయుష్షే. ఇదిలా వుంటే కేవలం పి.టి.ఐ,యు.ఎన్.ఐ వంటి వార్తా సంస్థల మీద ఆధారపడితే చాలదు. తనకంటూ స్వంత విలేకర్ల నెట్‌వర్క్‌ను ఏర్పాటు చేసుకోవాలి. కనీసం రాష్ట్రంలోని జిల్లా, మండల కేంద్రాల్లో, ఇతర రాష్ట్రాల రాజధానుల్లో స్వంత విలేకరులు వుండటం తప్పనిసరి. అప్పుడే తోటి పత్రికల పోటీకి తట్టుకు నిలబడి వార్తలు అందించ వీలుంది. పత్రిక స్థాపనలోని ప్రాథమిక ఇబ్బందులివి:

# ప్రాంతీయ వార్తలే ప్రాణం

ఆంగ్ల పత్రికల సరళివేరు. అవి జాతీయ పత్రికలుగా చలామణికాగల అవకాశంవుంది. భాషా పత్రికలు ఇందుకు భిన్నం. తెలుగు పత్రికలనే ప్రత్యేకంగా తీసుకుంటే వాటి సర్క్యులేషన్ ఆంధ్రరాష్ట్రానికి మాత్రమే పరిమితం. ఇరుగు పొరుగు రాష్ట్రాలలోని ప్రవాసాంధ్రులు తెలుగు పత్రికలు తెప్పించిచదువుతున్నా ఆసర్క్యులేషన్ నామ మాత్రమే. ప్రవాసాంధ్రులు తెలుగు పత్రికలు చదవటానికి కారణంకూడా తమ స్వరాష్ట్రం వార్తలు తెలుసుకుందామనే.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నిర్ణయాలు ప్రజల జీవితాలను ప్రభావితం చేస్తాయి. కేంద్ర ప్రభుత్వ నిర్ణయాలు మొత్తం దేశ ప్రజలపై, రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయాలు ఆరాష్ట్ర ప్రజలపై ప్రత్యక్ష ప్రభావం చూపుతాయి. ఈ కారణంగా రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయాలు, ప్రభుత్వ పనితీరు, మంచి చెడ్డలపై ప్రాంతీయ పత్రికలు ప్రధానంగా దృష్టి సారించక తప్పదు. అప్పుడే తమ పాఠకులకు తగు న్యాయం చేసినవవుతాయి.

అలాగే ఎక్కడో వేలమైళ్ల దూరంలో జరిగిన ఒక సంఘటన కంటే తమ రాష్ట్రంలో లేదా జిల్లాలో, మండల గ్రామంలో జరిగిన సంఘటన ఎక్కువ సంచలనం కలిగిస్తుంది. ఉదాహరణకు రాష్ట్రంలో జరిగిన ఒక రైలు ప్రమాదాన్నే తీసుకుంటే కలిగే పరిణామాలు- ఆ ప్రమాదం కారణంగా ఆ మార్గంలో రైళ్ల రాకపోకలు నిలిచిపోవచ్చు. తర్వాత ఆ మార్గంలో ప్రయాణం పెట్టుకున్న వారు ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసుకోవాలి. అలాగే తమ బంధువులు, మిత్రులు ప్రమాదానికి గురైన రైలులో ప్రయాణిస్తూ ఉండ వచ్చు. తమ ప్రాంతంలో జరిగింది కనుక అసలు ఆ మార్గంలో ప్రమాదం జరగడానికి కారణమేమిటన్నది పాఠకుడు తెలుసుకోగోరే మరో ముఖ్యాంశం

ఇదే రైలు ప్రమాదం మరో రాష్ట్రంలోనో, పరాయి దేశంలోనో సంభవిస్తే అరుదుగా తప్పించి ప్రత్యక్ష, పరోక్ష ప్రభావమేదీ ఉండకపోవచ్చు. ఈ దృష్ట్యానే స్థానికంగా జరిగిన వార్తలను ప్రాంతీయ పత్రికలు తగు ప్రాధాన్యం ఇచ్చి ప్రచురిస్తాయి.

అలాగే ఒక గ్రామంలో జరిగిన దొంగతనం ఆగ్రామ ప్రజలు కొన్ని రోజుల పాటు చెప్పుకునే వార్తా విశేషమే. అలాంటి వార్త పత్రికలో వస్తే ముఖ్యంగా ఆ గ్రామ ప్రజలు, వారి బంధువులు మిత్రులు ఆసక్తిగా కుతూహలంగా చదువుతారు. వ్యవసాయాధారమైన మన దేశానికి గ్రామసీమలే పట్టుగొమ్మలు. అయితే ఈ నాటికీ పత్రికల్లో గ్రామీణ సమస్యలకు ఇవ్వవలసినంత ప్రాధాన్యం ఇవ్వడం లేదు. పత్రికలకు గ్రామీణ ప్రాంతంలో తగిన యంత్రాంగం లేకపోవడం ఒక కారణం కాగా, పాత్రికేయులకు గ్రామీణ సమస్యలపై సరైన అవగాహన, పరిచయం లేకపోవడం మరొక కారణం.

అయితే ఇటీవలి కాలంలో తెలుగు పత్రికలు గ్రామీణ జీవనంపై కొంతలో కొంత దృష్టి సారించటం శుభ పరిణామం. చాలా పత్రికలు మండల స్థాయిలో ఇతర ప్రధాన గ్రామాలలో సైతం వార్తల సేకరణకు విలేకరులను నియమిస్తున్నాయి. విలేకర్ల నియామకంతో ఇబ్బడి ముబ్బడిగా వచ్చి పడుతున్న ప్రాంతీయ వార్తలకు పత్రికల్లో చోటు కల్పించడానికి కృషి చేస్తున్నారు. 'ఈనాడు' పత్రిక జిల్లా వార్తల కోసం జిల్లాల వారీగా ఒక పేజిని కేటాయించడం ఈ దిశగా చేపట్టిన చర్యే. కొన్ని వార్తలు జిల్లాలకే పరిమితం అయినప్పటికీ, ఎక్కువ వార్తలను అందించే సౌలభ్యం ఏర్పడింది. ఆలశ్యం లేకుండా ఏ రోజు వార్త ఆరోజే ప్రచురించ వీలుకుడా ఏర్పడింది పత్రికల సర్క్యులేషన్ పెరగడానికి కూడా ప్రాంతీయ వార్తలే బాటవేస్తాయి ప్రాంతీయ వార్తలే భాషా పత్రికలకు సోపానం

---

## పుస్తకమే సమస్తం

అసలు ప్రతి ఇంట్లోనూ వంటగది ఉన్నట్లే పుస్తకాల గదొకటి ప్రత్యేకంగా ఉండాలి. మనిషి అయిన వాడికి కడుపుమేత ఒకటే చాలదు. మెదడుకు కూడా మేతకావాలి. చదవటం ఎంత అవసరమో, చదివినదాన్ని గురించి ఆలోచించడంకూడా అంతఅవసరమే. లేకపోతే ఆ చదువు నిరర్ధకం. దేశంలో వాతావరణం ఎట్లా ఉన్నా చదవటం అడుగంటాలని ఎక్కడాలేదు. మందుతాగే ఓపిక లేనంతగా రోగి క్షీణించవచ్చు. కాని ఆస్థితిలో మందు మరింత అవసరం. అట్లాగే ఈ స్థితిలో లోకానికి రచనలు కావాలి. బాధల్లో చికాకుల్లో సైతం ఒక నిమిషంసేపైనా చదవడమో, ఆలోచించడమో మంచిది.

గుంటూరు శేషేంద్రశర్మ

# వేగం జర్నలిస్టు వేదం

నార్ల వారన్నట్లు వేగం జర్నలిస్టు వేదం. వార్త రాసినా, వ్యాఖ్య రాసినా, సంపాదకీయం రాసినా జర్నలిస్టు గడియారంతో పరుగులు తీయాల్సిందే. ఇలా పరుగులు తీస్తూనే నాణ్యతకు ఎక్కడా లోపం రానీయకూడదు. వార్తల వాసి, రాశి రెండూ ముఖ్యమే. ముఖ్యంగా దినపత్రికలో పని చేసే వారు రాతలో వేగం సాధించడం ఎంతో అవసరం. ఆ పూట ఎడిషన్‌కు వార్తలు అందచేసే తుదిగడువు సమీపిస్తున్నపుడు టెలిప్రింటర్ మీద ముఖ్యమైన వార్త ఒకటి వస్తుందనుకుందాం. అది ఆ ఎడిషన్‌కే అందచేయాల్సి వుంటుంది. ఆవార్త ప్రాధాన్యం అటువంటిది. అప్పుడు సబ్ ఎడిటర్ ఆ వార్తను చకచకా రాయడం ముగించి కంపోజింగ్‌కు సకాలంలో అందచేయాలి. కొన్ని సందర్భాల్లో టెలిప్రింటర్ మీదే కాగితాలు పుంచుకుని ఎప్పటి టేక్ అప్పుడే రాసి పంపించవలసిన అవసరం కూడా ఏర్పడుతుంది. ఈ తొందరలో వార్తలో ఎక్కడా పొరబాటు దొర్లకుండా కూడా జాగ్రత్తపడాలి. అప్పుడే వేగంగా వార్త రాసిన ఫలితం దక్కేది.

తప్పు దొర్లకుండా చూడటం, దొర్లిన తప్పును వెంటనే సరిదిద్దుకోగల్గడం జర్నలిస్టుకెంతో అవసరం. ఈ విషయంలో ఏ మాత్రం ఉదాసీనత పనికిరాదు. వార్తలో తప్పుదొర్లితే అది వ్యక్తిగతంగాను, పత్రికా పరంగాను అప్రతిష్టకు దారి తీస్తుంది. న్యూస్ ఎడిటర్ దృష్టిలో సబ్ ఎడిటర్ విశ్వాసం కోల్పేయే ప్రమాదానికి బాట వేస్తుంది.

---

## పీచుమిఠాయి రిపోర్టు

"ఇవాళ నేను పీచు మిఠాయి రిపోర్టర్‌ని" అన్నాడు విలేకరి సుబ్బారావు కొలీగ్ పాపారావుతో. ఆ కొలీగ్‌కు విషయం అర్థంకాలేదు.

"పీచు మిఠాయికి నీకూ ఏమిటి సంబంధం? పీచు మిఠాయి మీద ఏదైనా స్పెషల్ వార్త ఇస్తున్నావా?" అన్నాడు పాపారావు **పీచు** మిఠాయి, రుచుల్ని గుర్తు చేనుకుంటూ.

సుబ్బారావు మందహాసం చేస్తూ. "అదేంకాదు, ఇవాళ పొలిటికల్ వార్తలేంలేవు. అందుకని ఓ పొలిటికల్ గాసిప్ ఇద్దామనుకుంటున్నా, అందులో విషయం ఎటూ ఉండదు. చిన్నపాయింట్‌ని పట్టుకు సాగదీయాలిమరి" అంటూ సుబ్బారావు చిదంబర రహస్యాన్ని చెప్పాడు.

---

# సత్తాతో పాటు శరీర దారుఢ్యం




జర్నలిస్టుగా వృత్తిలో నిలదొక్కుకోవలిచిన వ్యక్తికి సృజనాత్మక శక్తి, తగు రాజకీయ పరిజ్ఞానంతో పాటు మంచి శరీర దారుఢ్యం కూడా ఎంతో అవసరం. జర్నలిస్టు చాలా సందర్భాల్లో వేళాపాళా లేకుండా పని చేయాల్సి వుంటుంది. సబ్ ఎడిటర్‌కు షిఫ్ట్ డ్యూటీలు తప్పవు. విలేకరి ఇరవై నాలుగు గంటలూ డ్యూటీలో వున్నట్లే లెక్క. పత్రికకు కావలసిన ఒక్క సంఘటన నిర్ణీత వేళల్లోనే జరగాలనే రూలేం లేదు. ఒక్కోసారి ఏ అర్ధరాత్రో అనుకోని అవాంఛనీయ సంఘటన జరిగినపుడు ఆ సంఘటనకు సంబంధించిన వివరాల సేకరణకు విలేకరి పరుగులు తీయాల్సి వుంటుంది. తుఫాన్లు, వరదలు వంటి ప్రకృతి వైపరీత్యాలు సంభవించినపుడు ఆ వార్తల సేకరణలో విశేష శ్రమకు, ప్రయాసకులోను కావల్సి వుంటుంది. రవాణా సౌకర్యాలు లేక మైళ్ల కొద్ది నడవాల్సి వుంటుంది. తినడానికి, తిండి, తాగడానికి గుక్కెడు నీళ్లు కూడా దొరక్కపోవచ్చు. ఇలాంటి సందర్భాల్లోనే విలేకరికి ఓర్పు, సహనం అవసరం. ఇందుకు అన్నిటికీ తట్టుకోగల శరీర దారుఢ్యం వుండాలి. అలాగే మత ఘర్షణలు, ప్రదర్శనలు, అలజడులు వంటివి జరిగేటప్పుడు పొంచి వున్న ప్రమాదాన్ని సైతం ఖాతరు చేయక విలేకరి చొరవ చూపాలి. యుద్ధరంగం వార్తలు సేకరించే విలేకరికి ప్రమాదాన్ని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. ప్రెస్ ఫొటో గ్రాఫర్ కూడా ఇలాంటి ప్రతికూల పరిస్థితులను ఎదుర్కోవల్సి వుంటుంది.

సబ్ ఎడిటర్‌కు షిఫ్ట్ డ్యూటీలు వుంటాయని చెప్పుకున్నాం. ఎడిషన్ల వేళలకు అనుగుణంగా షిఫ్ట్ పని కాలాన్ని నిర్ణయిస్తారు. కొన్ని పత్రికల్లో మూడు షిఫ్ట్‌లు (డే, మిడిల్, నైట్) వుండగా మరి కొన్ని పత్రికల్లో రెండే (మిడిల్, నైట్) షిఫ్ట్‌లు వుంటాయి. వారం వారం షిఫ్ట్ మారుతుంది. షిఫ్ట్‌ల వల్ల క్రమబద్ధం లేని పనివేళలకు శరీరం తట్టుకోగలిగి వుండాలి. షిఫ్ట్ డ్యూటీల వల్ల నియమబద్ధంగా ఆహారం. విశ్రాంతి తీసుకోవడానికి వీలుండదు. ఇలాంటప్పుడే ఆరోగ్యాన్ని జాగ్రత్తగా చూసుకోవాలి. షిఫ్ట్‌లకు అనుగుణంగా ఎప్పటికప్పుడు అలవాట్లు మార్చుకుంటూ తట్టుకు నిలబడగలగాలి. జర్నలిస్ట్ అనగానే బయటి ప్రపంచంలో వాస్తవానికి అతీతమైన అభిప్రాయం నెలకొని వుంది. ఈ వృత్తిపట్ల కొన్ని వర్గాల్లో క్రేజ్ కూడా లేకపోలేదు. అయితే జర్నలిస్టు వృత్తిపరంగా అనేక రకాల ఒడిదుడుకులు, శారీరక మానసిక ఒత్తిళ్లు ఎదుర్కోక తప్పదు.

## మర్మరాలు

---

- సబ్ఎడిటర్ తిరిగిచెడ్డాడు, రిపోర్టర్ తిరక్కచెడ్డాడు
- ఎవరివార్త వారికింపు
- రాసింది రాయబోకు, రాసేదిచెప్పబోకు
- వార్తలు చెప్పేవాడిదగ్గరికి విలేకరులు చేరినట్లు
- రాయడానికి చేతులువస్తాయికానీ, ఖండన వేయడానికి చేతులురావు
- విలేకరి గోత్రాలు ఎడిటర్‌కు ఎరుకే
- తనురాసిందివార్త, తనుపెట్టిందే హెడ్డింగ్
- తా రాయను వార్త లేదు, పక్కనోఅసిస్టెంట్
- రిపోర్టర్ కపిత్వంకొంత, సబ్ఎడిటర్ పైత్యంకొంత.

---

# ఎంత చదివితే అంత మంచిది

ప్రముఖ సంపాదకుడు గోరాశాస్త్రి దగ్గరకు ఒకరోజు ఒకాయనవచ్చి ఏంచేస్తున్నారు? అని ప్రశ్నించాడట. దానికి గోరాశాస్త్రి 'పెన్సిల్ చెక్కుతున్నాను' అని జవాబిచ్చారట. అనునిత్యం తనవృత్తి కౌశలానికి సంబంధించిన విషయాలను మరింత మెరుగు పెట్టుకోవడానికి ప్రయత్నించేవాడే జర్నలిజంలో ఉన్నత పదానికి చేరగలడు. ఆంగ్లపత్రికల్లో క్రీడలు, సాంస్కృతిక విషయాలు-ఇలా ప్రత్యేక విభాగాలు ఉంటాయి, క్రీడల విభాగంలో పనిచేసే రిపోర్టర్ లేదా సబ్‌ఎడిటర్ క్రీడలకు సంబంధించిన మెళకువలను, ప్రాధాన్యతలను తెలుసుకుంటే కొంతవరకు సరిపోతుంది. తెలుగు పత్రికల్లో ఇలా ప్రత్యేక విభాగాలు అరుదు. సబ్ ఎడిటర్‌లేదా రిపోర్టర్ అన్ని రకాల విషయాలను 'డీల్' చేయవలసి వుంటుంది. ఒకే రోజు రాజకీయ నాయకుడి ప్రసంగం నుంచి అంతరిక్ష ప్రయోగం వరకు, టెస్ట్ మ్యాచ్‌నుంచి సాంస్కృతిక విషయాలవరకు అతను వార్తల రూపేణారాయవలసి వుంటుంది. అందుకే తెలుగు జర్నలిస్టుకు అన్ని శాస్త్రాల్లో, శాఖల్లో కొంతలో కొంత తెలిసి వుండాలి. రాజ్యాంగ విషయాలు, కవిత్వం, కళలు, సామాజిక శాస్త్రం, ఆర్థిక శాస్త్రం ఒకటేమిటి జర్నలిస్టుకు అక్కరకురాని విషయమంటూ ఏదీలేదు. ప్రతి విషయాన్ని తనకెందుకులే అని దాటవేయకుండా తెలుసు కోవడానికి ప్రయత్నించాలి-ఇందుకు నిరంతర పఠనం బాగా ఉపకరిస్తుంది. వివిధ పత్రికలను రోజూ తిరగేయాలి. ఎవరు ఏ వార్తలకు ఎంత ప్రాధాన్యం ఇచ్చారో తెలుసుకోవచ్చు. అలాగే పొలిటికల్ మాగజైన్స్ ద్వారా రాజకీయపరిణామాలను, జనరల్ నాలెడ్జిని ఎప్పటికప్పుడు ఆకళింపు చేసుకుంటూ వుండాలి. జర్నలిస్టు ఎంత ఎక్కువ చదివితే అంతమంచిది.

---

## ప్రశ్నల వర్షం

కోసిగిన్ ఓమారు భారత నాయకులతో చర్చలు జరిపాక విలేకరుల సమావేశంలో పాల్గొన్నారు. చర్చల మీద విలేకరులు ప్రశ్నలవర్షం కురిపించారు. దానికి కోసిగిన్ ప్రతిగా బాణం సంధించారు.

"మీరడిగే ప్రశ్నలను చూస్తుంటే నేరుగా మీతోనే చర్చిస్తే బావుండేదనిపిస్తోంది" అని కోసిగిన్ అనగానే సమావేశంలో నవ్వులు విరిశాయి.

---

# చలాకీగా వుంటూ చక్కగా రాయాలి.

పత్రికా సౌధానికి మూలస్తంభం సబ్ ఎడిటర్. తెలుగు పత్రికల్లో సబ్ ఎడిటర్ ప్రధాన విధులు రెండు. ఒకటి - వార్తా సంస్థల నుంచి, విలేకరుల నుంచి ఇంగ్లీషులో వచ్చిన వార్తలను సరళమైన తెలుగులోకి స్వేచ్ఛానువాదం చేయడం. రెండు - విలేకరులు తెలుగులో పంపిన వార్తలను తిరగరాయడం. అవసరమైతే కుదించడం. ఈ రాసిన వార్తలకు శీర్షికలు వుంచడం కూడా అతని విధుల్లో భాగమే. ఒక్కో పత్రికలో ఒక షిఫ్ట్‌లో పని భారాన్ని బట్టి అయిదుగురు అంతకుమించి సబ్ ఎడిటర్లు ఏక కాలంలో పని చేయవలసి వుంటుంది. సబ్ ఎడిటర్లు కలిసి పని చేసే చోటునే డెస్క్ అంటారు. డెస్క్‌కు చీఫ్ సబ్ ఎడిటర్ హోదాలో ఒకరు ఇన్‌చార్జిగా వుంటారు. ఆ ఇన్‌చార్జి ఇంగ్లీషు లేదా తెలుగులో వచ్చిన వార్తలను సబ్ ఎడిటర్‌కు కేటాయించి రాయిస్తుంటారు.

సబ్ ఎడిటర్లు పని చేసేటపుడు కలివిడి తనాన్ని, స్నేహ వైఖరిని అలవరచుకోవాలి. ఎవరికి వారు ఒకరితో పట్టకుండా మూతి బిగించుకొని కూర్చుంటే కుదరదు సబ్ ఎడిటర్లు మధ్య మధ్యలో మనసు విప్పి మాట్లాడు కోవడంవల్లనే మానసికంగా రిలీఫ్ కలుగుతుంది ఎవరికైనా ఏదైనా వార్తకు సంబంధించి అనుమానం తలెత్తినపుడు పక్కన వున్న కొలీగ్స్‌ను సంప్రదించ టానికి వీలవుతుంది.

వార్తా సంస్థల నుంచి ఇంగ్లీషులో వచ్చిన కాపీని తెలుగులో రాసేటపుడు సబ్ ఎడిటర్ కొన్ని మెళకువలను తెలుసుకోవాలి. ఇంగ్లీషు వాక్య నిర్మాణం వేరు. తెలుగు వాక్య నిర్మాణం వేరు. మక్కికి మక్కి అనువాదం చేయటానికి ఎప్పుడూ ప్రయత్నించరాదు. ఇంగ్లీషులో పెద్ద వాక్యాలు వున్నప్పటికీ తెలుగులో రాసేటపుడు దానిని విడగొట్టి రెండు మూడు చిన్న వాక్యాలుగా రాయాలి. అసలు ముందు, రాయవలసిన వార్తను ఓమారు ఆసాంతం చదివి అవగాహనకు రావడం మేలు. అలా చదవటం వల్ల ఆ వార్త ప్రాధాన్యం తెలుస్తుంది. ఆవార్తను పూర్తిగా ఇవ్వాలా! లేక కుదించినా పర్లేదా అన్న విషయం నిర్ధారించుకోవచ్చు. సామాన్యంగా ఇంగ్లీషులోని ఒక లైనును తెలుగులో రాసేటప్పటికి రెండు లైన్లు అవుతుంది. పత్రికలో స్పేస్ ఎంతో విలువైనది కనుక వార్త ప్రాముఖ్యాన్ని బట్టి వార్త నిడివి వుండాలే కాని అనవసరమైన వార్తలను చాంతాడులా రాస్తూ పోకూడదు. మన పాఠకులకు ఈ వార్త ఎంత వరకు ముఖ్యం, ఈ వార్త వారికి ఆసక్తి కల్గించేదేనా? కాదా?

అని తెల్సుకున్నాక తదనుగుణంగా వార్తను రాయాలి. కొన్ని సందర్భాల్లో జటిలమైన విషయాలు ఉంటాయి. వాటిని తనకు తెలిసిన పరిజ్ఞానాన్ని జోడించి విపులీకరించవలసి వుంటుంది. అలాగే యునెస్కో, ఐ.ఎన్.టి.యు.సి. వంటి పేర్లు రాయవలసి వచ్చినపుడు తొలిసారి ఆ సంస్థ పేరు రాసి ఆ తదుపరి రాయవలసినపుడు సంక్షిప్త నామం రాస్తే సరిపోతుంది. యునెస్కోను మొదటిసారి వార్తలో రాసేటపుడు ఐక్యరాజ్య సమితి విద్యా, శాస్త్ర సాంకేతిక సంస్థ (యునెస్కో) అని రాసి తర్వాత వాడవలసి వచ్చినపుడు యునెస్కో అని రాయాలి.

ఒక్కోసారి నిన్నటి వార్తను ఆ మర్నాడు పత్రిక కోసం రాయవలసి వుంటుంది. ఒకవేళ జనవరి 15న వచ్చిన వార్తను ఆ మరునాడు రాయవలసి వస్తే జనవరి 16గా మార్చవలసి వుంటుంది. అలాగే వార్తలో 'నేడు' 'నిన్న' అవుతుంది.

ప్రతి పత్రికకూ వార్త రాయడంలో ఒక సరళి వుంటుంది. సబ్ ఎడిటర్ ఆ సరళిని అలవరచుకోవాలి. ఒక సబ్ ఎడిటర్ తన డ్యూటీ పూర్తయ్యేలోపు ఎంత మేరకు రాయాలి అనడానికి కొలబద్దలేదు. ఆ రోజు పత్రికలో వ్యాపార ప్రకటనలు తక్కువగా వుండి ఎక్కువగా వార్తలతో నింపవలసి వస్తే ఆ అదనపు భారం సబ్ ఎడిటర్లందరి పైనా పడుతుంది. వ్యాపార ప్రకటనలు ఎక్కువగా వుండి వార్తలు తక్కువ రాయవలసి వున్నపుడు కొంత రిలీఫ్ దొరుకుతుంది. తనకు అభిరుచి ఆసక్తి లేని విషయాలను సైతం వార్తా పరంగా పూర్తి న్యాయం చేయడం సబ్ ఎడిటర్ విధి. అందుకే అన్ని విషయాలపై ఆకళింపు, ఆసక్తి పెంచుకోవాలి.

వార్త రాయడం పూర్తయ్యాక కంపోజింగ్‌కు పంపే ముందు చకచకా ఓసారి చదివి పంపడం మేలు. వేగంగా రాసేటప్పుడుఒక్కోసారి తెలీకుండానే తప్పులు దొర్లవచ్చు. ఒకసారి చదివినందువల్ల ఆ తప్పును తొలగించ వీలుంది.

మరో ముఖ్య విషయం - సబ్ ఎడిటర్ కామన్ సెన్స్‌ను బాగా ఉపయోగించాలి. పొరపాటున తప్పు దొర్లితే అది కొన్ని వేలమంది పాఠకుల దగ్గరకు వెళ్తుందన్న వాస్తవాన్ని గుర్తుంచుకోవాలి. మొదటి గంటలో ఎంత చురుగ్గా వున్నామో చివరి క్షణంలో కూడా అంతే చురుగ్గా వుండాలి ఏ మాత్రం ఏమరుపాటుగా వున్నా పొరపాట్లు దొర్లడం, ముఖ్యమైన వార్తలకు సరిగా న్యాయం చేయలేకపోవడం జరుగుతుంది.

# ప్రశ్నతోనే వార్తపుట్టుక

ఆరు ప్రశ్నలకు జవాబులు దొరికితేగాని ఒక వార్త సమగ్రంకాదు. అయితే అన్ని వార్తల్లో అన్ని ప్రశ్నలకు ఒకేసారి సమాధానం దొరకక్క పోవచ్చు. అంతమాత్రంచేత అది అసమగ్రవార్త అని తోసి పారేయలేం. వార్త సరళినిబట్టి ఈ ఆరు ప్రశ్నలకు జవాబులు లభించేదీ లేనిదీ ఆధారపడి వుంటుంది. ఇంగ్లీషులో ఈ ప్రశ్నలనే ఫైవ్ డబ్ల్యూస్, అండ్ వన్ హెచ్ అని అంటారు. అవి ఇవి.

1) When-ఎప్పుడు
2) Where-ఎక్కడ
3) Why-ఎందుకు
4) What-ఏమిటి
5) Who-ఎవరు
6) How-ఎలా

కొన్ని వార్తలను తీసుకుని వాటిలో ఈ పై ప్రశ్నలకు సమాధానాలు వున్నదీ లేనిదీ గుర్తిద్దాం.

1) చిక్కడపల్లి పోలీస్‌స్టేషన్ పరిధిలోని దోమల్‌గూడాలోని ఓ చెత్త కుండీలో ఆరు నెలల పసికందు శవం దొరికింది. ఈ పసిగుడ్డు ఒళ్ళంతా కాలిపోయి ఉంది. ఏవరో పరమ కిరాతకంగా ఈ మగ శిశువును కాల్చి చెత్త కుండీలో పారేసి ఉంటారని అనుమానిస్తున్నారు. పోలీసులు ఆదివారంనాడు ఈ శిశువు శవాన్ని పోస్ట్‌మార్టమ్‌కోసం ఆస్పత్రికి తరలించారు.

ఏమిటి : పసికందు శవం.

ఎక్కడ : దోమల్‌గూడాలోని చెత్తకుండీలో

ఎప్పుడు : ఆదివారం

ఎవరు, ఎందుకు అనే ప్రశ్నలకు పోలీస్ దర్యాప్తులో సమాధానాలు దొరకాల్సిఉంది.

ఎలా : పరమకిరాతకంగా కాల్చిచంపారు.

2) కేంద్ర హోంశాఖ సహాయమంత్రి చింతామణి పాణిగ్రాహి ఇంట్లో శనివారం రాత్రి కొందరు దుండగులు దొంగతనం చేసేందుకు విఫలయత్నం

చేశారు. ఇంటికి వెనుక భాగంలో ఉన్న ఇనుప ఊచలను కోసి దుండగులు లోపలికి ప్రవేశించినట్లు పోలీసులు చెప్పారు.

ఏమిటి: దొంగతనానికి యత్నం

ఎక్కడ : కేంద్రహోంశాఖ సహాయమంత్రి చింతామణి పాణిగ్రాహిఇంట్లో

ఎప్పుడు : శనివారం రాత్రి.

ఎవరు : కొందరు దుండగులు

ఎందుకు: దొంగతనం వాళ్ళవృత్తి అయి వుండవచ్చు. ప్రత్యేక కారణం ఉండదు.

ఎలా : ఇనుప ఊచలు కోసి.

3) శ్రీలంకలో భారత సేన పురోగతిని సమీక్షించేందుకు సైనిక దళాల ప్రధానాధికారి జనరల్ సుందర్జీ బుధవారంనాడు జాఫ్నా వెళుతున్నారు.

ఏమిటి : జాఫ్నా పర్యటన

ఎప్పుడు : బుధవారం

ఎవరు : సుందర్జీ

ఎందుకు . భారత సేన పురోగతి సమీక్షకు. ఎక్కడ, ఎలా అనే ప్రశ్నలకు ఈ వార్తలో తావులేదు.

మీరూ మరికొన్ని వార్తలు తీసుకుని అందులో అయిదు డబ్ల్యూల్యూ ఒక హెచ్‌ని గుర్తించడానికి ప్రయత్నించండి.

---

## విలేకరి అంటే ఇలా వుండాలి

చైనానేత చౌ ఎన్‌లై ఓమారు జెనీవా పర్యటనకు వెళ్లాడట. అక్కడ అంతకుముందు పరిచయంఉన్న ఓ విలేకరి తారసపడ్డాడు. చౌ ఎన్ లై పలకరింపుగా 'జెనీవాలో ఉంటున్నారా?' అని ప్రశ్నించారట. ఆ కాస్త అవకాశాన్ని తీసుకుని ఆ విలేకరి చౌ ఎన్ లైనుంచి ఒక విషయాన్ని రాబట్టేందుకు ప్రశ్నలు గుప్పించాడు-దానికి చౌ ఎన్ లై నవ్వుతూ మొత్తానికి నీ విలేకరిబుద్ధి పోనిచ్చుకున్నావుకాదు" అంటూ చురక అంటించాడు. విలేకరి అంటే ఇలా ఉండాలిమరి-తనసొంత పరిచయాలు పలుకుబడిని కూడా వార్తల సేకరణకు వినియోగించే వాడే అసలు సిసలైన విలేకరి.

---

# ఈ పదాలు తెలిసుండాలి

వార్తాపత్రికలో ఉపయోగించే అనేక పదాలను జర్నలిస్టు తెలుసుకుని వుండాలి. ఈ పదాలను వృత్తి వ్యాసంగాలలో ఉపయోగించవలసిన అవసరం ఏర్పడుతుంది. అందుకే ఆ పదాలను తెలుసుకు తీరాలి. ఈ దిగువన కొన్ని ముఖ్యమైన పదాలను పొందుపరుస్తున్నాం.

ఎ.బి సి: ఆడిట్ బ్యూరో ఆఫ్ సర్క్యులేషన్‌ను ఎ.బి.సి. అని సంక్షిప్తంగా పిలుస్తారు. ఏ పత్రిక సర్క్యులేషన్ ఎంత వున్నదీ నిర్ధారించే సంస్థ ఇదే.

Ad లేదా Advt: పత్రికల్లో ప్రచురించే వ్యాపార ప్రకటనలను సంగ్రహంగా Ad లేదా Advt అంటారు.

Add : అప్పటికే కంపోజింగ్ సెక్షన్‌కు పంపిన వార్తకు ఇంకా ఏదైనా జతచేయవలసి వున్నపుడు యాడ్ అని వాడతారు. అలా జత చేయవలసిన వార్తపై యాడ్ అని రాస్తారు. అంతకుముందు ముఖ్యమంత్రికి సంబంధించిన వార్త పంపి వుంటే దానికి జత చేయాల్సిన వార్తపై యాడ్ ముఖ్యమంత్రి అని గుర్తురాసి పంపుతారు. ఇందువల్ల మేకప్ సెక్షన్‌లో పని సులువవుతుంది.

బానర్ : దీనినే తెలుగులో పతాక శీర్షిక అంటారు. ఆ రోజు వచ్చిన వార్తల్లోకెల్లా ముఖ్యమైనదానిని పతాక శీర్షికగా ప్రచురిస్తారు. బానర్ వార్త పత్రికలో అన్నివార్తలకంటే పై భాగాన ప్రముఖంగా పెద్ద హెడ్డింగ్‌తో ప్రచురిత మవుతుంది. దీనినే 'లీడ్ స్టోరీ' అని కూడా అంటారు.

బీట్ : విలేకరికి నగరంలో నిర్దిష్టంగా కేటాయించిన పరిధికి బీట్ అంటారు. పోలీసులనుంచి వార్తలు సేకరించే బాధ్యతను కేటాయించినపుడు పోలీస్ బీట్ అంటారు.

బోల్డ్ : పెద్ద అక్షరాలను ఉపయోగించమని సూచించడాన్నే బోల్డ్‌గా వ్యవహరిస్తారు.

బోర్డర్: బాక్స్ వార్తకు చుట్టూవుండే రూళ్లే బోర్డర్.

ఫిల్లర్ : నాలుగయిదు లైన్లతో కూడిన చిన్నవార్తను ఫిల్లర్ అంటారు పేజీలో ఎక్కడయినా కొద్దిపాటి ఖాళీని భర్తీచేయవలసి వచ్చినపుడు ఈ ఫిల్లర్ ఉపయోగపడతాయి.

ఫాలో అప్ : ఒక వార్తావిశేషానికి అనంతర పరిణామాన్నే ఫాలో అప్ అంటారు. ఎక్కడైనా ఒకరోజున అల్లర్లు ప్రారంభమైనపుడు ఆ మరురోజు కూడా కొనసాగే అల్లర్లను ఫాలో అప్ వార్తగా పరిగణిస్తారు.

గ్యాలీ : కంపోజ్ చేసిన వార్తలను ఉంచే పొడవాటి ట్రేని గ్యాలీ అంటారు. పేజీల్లో అమర్చడానికి ముందు కంపోజ్ అయిన వార్తల్ని గ్యాలీల్లో ఉంచుతారు. ఇప్పుడు గ్యాలీలకు కాలం చెల్లింది.

మస్ట్ : తప్పనిసరిగా ప్రచురించవలసిన వార్తను మస్ట్ అంటారు.

కిల్ : ఒకవార్తను కంపోజింగ్‌కుపంపి అనుకోని కారణాలవల్ల ఆవార్త ప్రచురించవద్దని చెప్పడానికి 'కిల్' అంటారు.

పేజిప్రూఫ్ : పేజి సిద్ధమయ్యాక చేతితో తీసే ప్రూఫ్‌నే పేజిప్రూఫ్ అంటారు. పేజిప్రూఫ్‌లో శీర్షికలను వార్తలను మరోసారి తనిఖీ చేస్తారు. ఆధునిక ముద్రణా విధానంలో పేజిప్రూఫ్ కనుమరుగైంది.

రష్ : సత్వరం వార్త పంపాల్సినపుడు 'రష్' అనేపదం ఉపయోగిస్తారు.

క్రెడిట్‌లైన్: వార్తపై విలేకరి పేరును ఇవ్వడాన్ని క్రెడిట్‌లైన్ అంటారు. పేరున్న ప్రాతినిధ్యులకు లేదా ప్రత్యేక వార్తలకు క్రెడిట్‌లైన్ ఇచ్చే సంప్రదాయం వుంది.

---

## 'పామర్రు'ణ్ణి

సబ్‌ఎడిటర్ సుబ్బారావుకి తెలుగు, సంస్కృతాల్లో మంచి ప్రవేశం ఉంది. తనురాసిన వార్తలకు అప్పుడప్పుడు ఆవేశపడి 'ఇనుపగుగ్గిళ్ళ'వంటి పదాలతో శీర్షికలు రాస్తుంటాడు. అలాగే ఓ శీర్షికను రాసి న్యూస్ ఎడిటర్‌కు చూపాడు, వెంటనే ఆ న్యూస్ ఎడిటర్ "ఇదిగో సుబ్బారావ్! నేనొట్టి పామరుణ్ణయ్యా! కాస్తనాకు అర్థం అయ్యేట్లు హెడ్డింగ్‌రాయి" అని వేళాకోళంగా అన్నాడు.

"అదేంటిసార్! మీరు పామరులెలా అవుతారు?" అని కంగారుపడుతూ అన్నాడు సుబ్బారావు.

"అవునయ్యా! మా ఊరు పామర్రు నేను'పామర్రు'ణ్ణేగదా! అంటూ ఆ న్యూస్ ఎడిటర్ తిప్పికొట్టాడు.

---

# వార్తను గుర్తించే ఒడుపు

కుక్క మనిషిని కరవటం వార్తకాదు. మనిషి కుక్కను కరవటం అసలుసిసలైన వార్త. అంటే ఇక్కడ మనం గమనించాల్సింది నవ్యత, సంచలనం, అందరూ భావించేదానికి భిన్నమైన ఒరవడి అని అర్థం అవుతుంది. నాలుగు దిక్కుల నుంచి సమాచారం అందుతుంది కనుక న్యూస్ (NEWS) అని అన్నారు.

మంచి వార్త ఇదీ అని నిర్ధారించి చూపడానికి ఒక మూసలో పోసినట్లు కొలమానం ఏంలేకపోయినా మంచివార్త లేదా ముఖ్యమైన వార్తని కొన్ని అంశాల ప్రాతిపదికగా నిర్ధారించవచ్చు.

వార్త హాట్ హాట్‌గా వుంటేనే విలువ. గతంగతః. నిన్న నిన్నే. నిన్నకంటే నేటికి విలువ ఎక్కువ. ఒక పార్టీకి మద్దతు ఇస్తున్నామంటూ ఓ రాజకీయ నాయకుడు నిన్న చేసిన ప్రకటనకంటే, మద్దతు ఇవ్వడం లేదంటూ అదేరాజకీయ నాయకుడు నేడు చేసిన ప్రకటన ఆ సమయానికి సందర్భోచితమైనది అవుతుంది. అలాగే గతాన్ని కూడా గుర్తుచేస్తూ రాస్తే ఆ వార్త సమగ్రమూ, శక్తివంతమూ అవుతుంది.

నిన్న పదిమంది మరణించిన రోడ్డు ప్రమాదం వార్తకన్నా, నేడు అయిదుగురు మరణించిన రోడ్డుప్రమాదం వార్తకు విలువఎక్కువ. ప్రముఖుల జీవితాలలో జరిగే ఏ స్వల్ప సంఘటన అయినా అది విశేషమే అవుతుంది. రాష్ట్ర ముఖ్యమంత్రికి స్వల్ప జ్వరం వస్తే అదివార్తే. సామాన్యుడికి తీవ్రజ్వరం వచ్చినా వార్తకాదు. ఓ ప్రముఖ సినీనటో, నటుడో పెళ్ళి చేసుకున్నావార్తే, విడాకులు తీసుకున్నావార్తే.

వార్త విలువను నిర్ధారించే అంశాల్లో సామీప్యత ఒకటి. బొంబాయిలో అగ్నిప్రమాదం సంభవించి 50మంది మరణించిన సంఘటన మహారాష్ట్ర పత్రికలకు ముఖ్యమైన వార్త. అదే రోజున విజయవాడ సమీపంలో బోటు ప్రమాదం జరిగి పదిమంది మరణిస్తే అది విజయవాడనుంచి వెలువడే పత్రికలకు ముఖ్యమైన వార్తఅవుతుంది. వార్తాబంధుత్వం దూరం పెరిగేకొద్దీ తగ్గుతుందన్నమాట.

ఎక్కువ మందికి ఆసక్తి కల్గించేది, వారికి వర్తించేది ముఖ్యమైన వార్త అని అనుకున్నాం కదా! ఆర్.టి.సి. బస్ చర్జీలు, రైలుచార్జీలు, సినిమా టికెట్ ఖరీదు పెంచటం దీనికి ఉదాహరణలు. ఆర్.టి.సి. చార్జీలు పెరిగితే ఆ పెంపు ప్రభావం బస్సుల్లో ప్రయాణించే ప్రతివారిమీద పడుతుంది. సహజంగా తమకు వర్తించే విషయాలు తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా పాఠకులకు ఎక్కువే. ఇందువల్ల అత్యధిక సంఖ్యాక ప్రజలకు వర్తించే వార్తల పట్ల అప్రమత్తంగా వుండి పత్రికల్లో వాటికి ప్రముఖంగా చోటు కల్పించవలసి వుంటుంది.

వార్తా పత్రికల కార్యాలయాలకు ప్రతిరోజూ వివిధ మార్గాలద్వారా కుప్పలు, తెప్పలుగా వార్తలు వచ్చిపడుతుంటాయి. షిఫ్ట్ ఇన్‌చార్జి నెల్లూ, పొల్లూ చెరగినట్లుగా ప్రజలకు ఉపయోగించే వార్తలను ఎన్నుకోవాలి. అక్కడే న్యూస్ నోస్-వార్తను పసిగట్టే తెలివి తేటలు అవసరం. పత్రికా కార్యాలయానికి వచ్చే వార్తలన్నీ ప్రచురించ ప్రారంభిస్తే ఎన్నిపుటలైనా చాలవు. నిజానికి పత్రికల్లో ఉపయోగించే వార్తలకంటే వ్యర్థంగా చెత్తబుట్టపాలుచేసే వార్తలే ఎక్కువ వుంటాయనడం అతిశయోక్తికాదు. ఇలా పారేసేవన్నీ వార్తలు కాదనగ మా, అవీ వార్తలే. మనకు అవసరంలేని వార్తలు. ఏమారుమూల రాష్ట్రంలోనో పది శాతం విద్యుత్‌కోత విధిస్తే మనకేల? కూరలమార్కెట్‌కువెళ్ళి అక్కడ మన అభిరుచికి తగ్గట్లు ఆ పూట వున్నవాటిల్లో మంచికూరగాయలను ఏరితెచ్చు కున్నట్లే ఆ రోజువచ్చిన వార్తల్లో మంచివి ఏరుకుని పత్రికలో ప్రచురణకు సిద్ధంచేయాలి.

---

## గోల్డెన్ రూల్

జర్నలిస్టులు తమ విధి నిర్వహణలో తమకుతాము కొన్ని కట్టుబాట్లను' నియమాలను ఏర్పరచుకుని ఆ సూత్రాల పరిధిలోపని చేస్తుంటారు. అయితే ఎప్పుడైనా ప్రత్యేక పరిస్థితి ఉత్పన్నమయినపుడు ఈ నియమాలు, కట్టుబాట్లకు తిలోదకాలివ్వాల్సి ఉంటుంది. ప్రతిబంధకంగా మారిన ఆ నియమాల్ని ఉల్లంఘించి ఆ ప్రత్యేక పరిస్థితికి దీటుగా వ్యవహరించాలి. జర్నలిస్ట్ మరవరాని గోల్డెన్ రూల్ ఇదే.

జి. ఎస్. వరదాచారి.

---

# అనుకోని అతిథి

వార్తకూడా అనుకోని అతిథే. ఎప్పుడు వచ్చేది తెలియదు. ఆ వచ్చిన వార్తా అతిథిని సాదరంగా ఆహ్వానించాలి. అతిథి మర్యాదలు చేయాలి. అప్పుడే మర్యాదదక్కేది. ఇక్కడ సాదరంగా ఆహ్వానించడమంటే వార్తా ప్రాముఖ్యాన్ని గుర్తించడమన్నమాట. వార్తను తూనికలో జేరేజు వేసి వెలకట్టడమన్నమాట. వెలకట్టడంలో ఏమరుపాటుగా ఉంటే రెండు ప్రమాదాలు జరగవచ్చు. మొదటిది. అనవసర వార్తకు విశేష ప్రాధాన్యం దొరకడం. రెండోది, ప్రాధాన్య వార్తకు తగినచోటు దొరక్కపోవడం. మంచి జర్నలిస్టు వార్తలకోసం ఎదురుచూసే వానకారు కోయిల. మంచి వార్తంటే జనాలకు ఏది తప్పనిసరిగా తెలియ చెప్పాలో, వారి జన జీవితాలను ఏదైతే అమితంగా ప్రభావితం చేస్తుందో అదే మంచివార్త.

ప్రాత్రికేయులు కొందరికి కొన్ని అభిప్రాయాలు పాతుకుపోయి వుంటాయి. పత్రికా ప్రకటనలపై చిన్నచూపు వాటిలో ఒకటి. పత్రికా కార్యాలయాలకు కుప్పతెప్పలుగా పత్రికా ప్రకటనలు వస్తుంటాయి. చోటా మోటా రాజకీయవేత్తల ప్రకటనలనుంచి ప్రభుత్వ ప్రకటనలదాకా అందులో వుంటాయి. ఒక్కోసారి ప్రభుత్వం తీసుకునే విధాన నిర్ణయాలనుసైతం ప్రకటనలద్వారానే విడుదలచేస్తుంది. ఈ ప్రకటనల గుట్టలోంచి వార్తలకోసం శోధించాలి. ముఖ్యమైన వార్తా ప్రకటనను వెలికి లాగాలి.

ఓ సారి ప్రభుత్వం కొన్నివస్తువులపై పన్నులు పెంచింది. వాటిల్లో పైర్లతో పాటు, పెట్రోలు, వంటగ్యాస్ కూడా ఉంది. ఈ విషయాన్ని ప్రభుత్వం ప్రకటనద్వారా విడుదలచేసింది. వంటగ్యాస్, పెట్రోల్ ప్రజల నిత్యవసరాలు. వాటి ధరల్లో ఏమాత్రం మార్పుజరిగినా అది సామాన్యుడి బడ్జెట్‌ను దెబ్బతీస్తుంది. పైగా ఆ పెంపుపట్ల మరునాడు ప్రతిపక్షనాయకుల ప్రతిస్పందనా ఉంటుంది. అంటే ఫాలోఅప్ వున్నవార్త. సామాన్యుడు తప్పనిసరిగా తెలుసుకోవలసిన వార్తఅన్నమాట. అందుకే ఈ వార్తను పత్రికల్లో మొదటి పేజీలో ప్రముఖంగా స్థానం కల్పించాలి. వార్తను గుర్తించడమే అతిథిని సాదరంగా ఆహ్వానించడంగా చెప్పాను. ఇక అతిథి మర్యాదలంటే ఆ వార్తను తగుప్రాధాన్య రీతిలో రాయించి పాఠకుడి దృష్టిని ఆకరించేలా పేజీల్లో వుంచటం.

ఇక్కడ ఓ విషయం చెప్పడం బావుంటుంది. రామాయణంలో హనుమంతుడు సీతజాడ తెలుసుకునేందుకు లంకకు వెళ్తాడు. అక్కడ సీతను చూసివస్తాడు. హనుమంతుడిరాక కోసం వానర సమూహం, రామ లక్ష్మణులు ఆతృతగా ఎదురు చూస్తుంటారు. హనుమంతుడు వెళ్ళిన పనేమిటి? సీతను అన్వేషించడం. ఎదురు చూస్తున్నవారిలో ఆతృతఏమిటి? హనుమంతుడికి సీత కనపడిందా లేదా అన్నది. అప్పుడు హనుమంతుడు అసలు సిసలైన జర్నలిస్టిక్ టాలెంట్‌ను చూపిస్తాడు. ఎదుటివారి ఆతృతను గమనించి తొలివాక్యంగా 'చూశాను సీతను' అంటాడు. ఇదే విషయాన్ని 'సీతను చూశాను' అనికూడా చెప్పకోవచ్చు. కాని ఆ క్షణకాల వ్యవధినికూడా ఇవ్వకుండా వార్తచెప్పాలన్న ఆలోచనతోటి హనుమంతుడు 'చూశానుసీతను' అని అంటాడు.

ఓ పత్రికలో ప్రచురితమైన వార్త చూడగానే పై విషయం స్ఫురణకు వచ్చింది. పాత్రికేయులు అప్పుడప్పుడు పప్పులో కాలేస్తుంటారు. అందుకు ఈ కింద ఉదహరించిన వార్తే నిదర్శనం. జంటనగరాల్లో పాడిపరిశ్రమాభివృద్ధి సంస్థ కార్మికులు సమ్మెచేశారు. ఈ సమ్మెవల్ల ఆ మర్నాడు జంటనగరాల్లో పాలురాలేదు. కొన్ని లక్షలమంది పాలులేక ఇబ్బందిపడ్డారు. ముందుగా పత్రికలోవచ్చిన వార్త చదవండి.

పాడి పరిశ్రమలో మెరుపుసమ్మె. ఇది శీర్షిక. వార్త కథనం ఇలా ఉంది. హైదరాబాదు, జూన్ 26: యాజమాన్యం చూపుతున్న మొండి వైఖరికి నిరసనగా ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధిసంస్థ లాలాపేట కార్యాలయంలో ఐ. ఎన్. టి. యు. సి టి. ఎన్. టి. యు. సి. బి. ఎం. ఎస్ ఆధ్వర్యంలో ఉద్యోగులు, కార్మికులు గురువారంనాడు మెరుపుసమ్మె చేసి విధులకు గైరుహాజరు అయ్యారు. పాడిపరిశ్రమాభివృద్ధిసంస్థ యాజమాన్యం ఆరుసూత్రాల పథకాన్ని ఉద్యోగులకు, కార్మికులకు అమలుచేయకుండా ఉండేందుకు సన్నాహాలు చేస్తోందని వారు విమర్శించారు. ఇటీవల జరిగిన బోర్డు సమావేశంలో దీనిని ప్రవేశపెట్టారని, అయితే తాము వ్యతిరేకించామని కార్మికులు తెలిపారు. ఆరు సూత్రాల పథకాన్ని తప్పకుండా అమలు చేయాలని వారు డిమాండ్ చేశారు.

సవరించిన వేతన బకాయిలను చెల్లిస్తామని ఎం. డి. హామీఇచ్చినా ఇంతవరకు ఇవ్వలేదని వారు విమర్శించారు. ఎం. డి. మాత్రం తన బకాయిల

డబ్బును తీసుకున్నారని అయితే కార్మికులకుమాత్రం డబ్బుచెల్లించలేదని కార్మికులు ఆరోపించారు. కార్మికులు గత నాలుగు రోజులుగా తమసమస్యల పరిష్కారం కోసం ధర్నాలు చేస్తున్నారు. అయితే యాజమాన్యం నుంచి ఎటువంటి ప్రతిస్పందన రాకపోవడంతో సుమారు రెండువేలమంది కార్మికులు మెరుపుసమ్మె జరిపి విధులకు హాజరుకాలేదు. ఇందువల్ల రేపు నగరంలో పాల సరఫరాకు అంతరాయం కలగవచ్చు యాజమాన్యం ఇలాగే మొండివైఖరి అవలంబిస్తే నిరవధిక సమ్మెచేస్తామని కార్మిక నాయకులు హెచ్చరించారు.

డబుల్ కాలమ్ డిస్ప్లే లోపలి పేజీల్లో అచ్చొత్తిన ఈ వార్తతోపాటు ఆందోళన చేస్తున్న కార్మికుల ఫొటోకూడా ఇచ్చారు. ఈ వార్తరాసిన విలేకరి పూర్తిగా పాఠకులను మరిచిపోయాడు.

ఇక్కడ స్వీయానుభవం అప్రస్తుతం కాదనుకుంటాను. ఉదయం లేవగానే పేపర్లో వార్తచూశాను. పాలు రావన్న విషయం ఎక్కడో చివర ఒక్క ముక్కరాశారు. పైపైన తిరగేస్తూ వార్తచూసిన నాకు పాలు ఆవేళ రావన్న విషయం తట్టలేదు. పాలు ఎందుకురాలేదోనని పాలబూత్ దగ్గర కెళ్ళికూడా వచ్చాను. ఆ తర్వాతే పక్కింటాయన అంటే తెలిసింది. పాల సిబ్బంది సమ్మె చేశారు, అందుకని ఈ పూట పాలురావు అని. పాలు,నీళ్ళు అనేవి ప్రజలకు ఎంత ప్రఖ్యాతిముఖ్యమో చెప్పనక్కర్లేదు. పసిపిల్లలుంటారు. కాఫీచుక్కగొంతు దిగందే మంచందిగని మహాశయులుంటారు. మనకు పెరుగులేందే భోజనం పూర్తికాదు. ఆ పెరుగు పాలనుంచేగదా రావాలి.

పాలు రావన్న విషయాన్ని చివరరాసినా ఆ విషయాన్ని ఖచ్చితంగా చెప్పలేదు పాలసరఫరాకు అంతరాయం కలగవచ్చు అనివుంది. పాడి పరిశ్రమల అభివృద్ధి సంస్థ అధికారులకు ఫోనుచేస్తే పాలు వస్తాయో లేదో స్పష్టంగా తెలుస్తుంది గదా! ఇలాంటి వార్త రాసేటపుడు ఆపాటి మెళకువ అవసరం లేదా? ఈ వార్తలో కార్మికుల డిమాండ్లు ముఖ్యంకాదు. హైలైట్ పాలురాకపోవడమే. పాలురావన్న విషయాన్ని ముందుగా చెప్పుకోవాలి. ఆ తర్వాత ఎందుకురావటంలేదో రాయాలి. ఆ పిదప కార్మికుల సమస్యలను, డిమాండ్లను చర్చించాలి. ఇలాంటివార్తను విధిగా మొదటిపేజీలో వేస్తేనే న్యాయం. కొన్ని తెలుగుపత్రికలు ఈ వార్తప్రాముఖ్యాన్ని గుర్తించాయి. మొదటిపేజీలో

ప్రముఖంగానే వచ్చింది. కార్మికుల మెరుపుసమ్మె జరిగిన మర్నాడు మరో వార్తవచ్చింది,

అదేమంటే సిబ్బంది సమ్మె విరమించారు. ఈ వార్తను మొదటిపేజీలో వేశారు. నిన్నచేసినతప్పు సరిదిద్దుకునే ప్రయత్నం కాబోలు, ఈసారికూడా పాల సరఫరా విషయానికి ప్రాధాన్యం ఇవ్వలేదు. 'డైరీ ఉద్యోగులసమ్మె విరమణ' అనే హెడ్డింగ్‌తో ఈ వార్తవచ్చింది. ఇక్కడ 'డైరీ' అనిరాయటం తప్పు. దాన్ని 'డెయిరీ' అనాలి. ఇకపాలసరఫరా యధాతధంగా కొనసాగుతుందన్న విషయాన్ని మూడో పేరాలో చెప్పారు ఉద్యోగులు సమ్మె విరమించారంటే పాలు సరఫరా అవుతాయనేగదా అర్థం అని ఎవరేనా వాదించవచ్చు. కానీ ముందుగా పాఠకుడికి పట్టాల్సింది, ఆతను తెలుసుకోగోరేది పాలువస్తాయా? రావా? అనేది. దానికి వార్తలో ప్రాధాన్యం ఇవ్వకపోతే ద్రోహమే అవుతుంది.

ప్రభుత్వోద్యోగులు సమ్మెలు చేస్తారు. ఆర్టీసి సిబ్బంది సమ్మెలుచేస్తారు. ప్రభుత్వోద్యోగుల సమ్మెతో మొత్తంప్రభుత్వయంత్రాంగమే స్తంభించిపోతుంది. ఆర్టీసి సిబ్బంది సమ్మెతో బస్‌లుతిరగవు. ప్రయాణికులు చిక్కుల్లో పడతారు. ఇలాంటపుడు ఆ సమ్మె సామాన్యుడిని ఎలా ప్రభావితం చేస్తుందన్న విషయాన్ని మరువకూడదు.

---

## పాపర సంఘం

పాత బస్తీ రచయితలందరూ కలిసి సంఘాన్ని ఏర్పాటు చేసుకోవాలనుకున్నారు.

"అయితే మన సంఘానికి ఏం పేరు పెడదాం?" అన్నారొకరు.

"పాపర సంఘం అయితే బావుంటుంది" అని చిద్విలాసం సూచించాడు.

"అంటే?" ఓ రచయిత అడిగాడు.

"పాత పట్టణ రచయితల సంఘానికి ఇది సంక్షిప్త నామం" చిద్విలాసం విషమరచి చెప్పాడు.

---

# ఇంగ్లీషు లిపిలో తెలుగువార్త

జిల్లాకేంద్రాలనుంచి టెలిప్రింటర్‌పై వార్తలు పత్రికా కార్యాలయాలకు వస్తుంటాయి. ఆ జిల్లాకు సంబంధించిన వార్తలన్నీ జిల్లాకేంద్రానికివస్తే అవన్నీ జిల్లావిలేకరిద్వారా కార్యాలయం చేరుతాయి. ఈ వార్తలన్నీ తెలుగులోరాసినవే. టెలిప్రింటర్‌లో తెలుగులో పంపే సౌలభ్యంలేదు. అంచేత తెలుగువార్తనే ఇంగ్లీషులిపిలో పంపిస్తారు. పత్రికల్లో పనిచేసేవారు ఇలా ఇంగ్లీషులిపిలో వచ్చిన తెలుగువార్తనుకూడా రాయాల్సివుంటుంది. ఆ వార్త ఎలా ఉంటుందో మీకో ఉదాహరణ.

*ASAADHAARAN'A BASS PRAMAADAM*
*21 MAMDI SAJIIVADAHANAM*

HAYDARAABAAD, JUUNE 16 (NYUST'UD'EE): NAGARA SIVAARLALONI EL BI. NAGAR VADDA GURU-VAARAM TELLAVAARU JAAMUNA JARGINA GHOORA AGNI PRAMAADAMLOO TENAALI NUMCHI VASTUN-NA BASSU PUURTIGAA KAALIPOOYI 21 MAMDI PRA-YAAN'IKULU SAJEEVADAHANA MAYYAARU. 18 MAMDI PRAYAAN'IKULU SURA rSHITAMUGAA TAPP-IMCU UKOOGALIGAARU. AGNIPRAMAADAMLOO MAR-AN'IMCINA PRAYAAN'IKULU NAAMARUUPAALU KUUD'A LEEKUMD'A MAAD'I MASAY-POYAARU KAA-LIPOOYINA VAARI S'ARIIRAMMUKKALANU ROOD DD U PAKKA MUDDALUGAA PET'T'AD'AMTOO CUUSEEVAARIKI GUMD'ELU TARUKKUPOOYAYI TENAALI NUMCI HAYDARAABAD LOONI BI HEC.I EL KU VASTUNNA II BASSU EL BI NAGAR RIMGUROO D D U KUUD ALIKI RAA GAANEE ROOD D' UD IVAYD'-AR NU DHIIKONI II AGNIPRAMAADAM JARIGI-NAT'T U BAAVISTUNNRU MUMDU CAKRAALA SET MOTTAM UUD'I POOVAD'AMTOO AAYILT'AMKAR PAGIL' MAMT'ALU VYAAPIMCINAT T'U CEBUTUN-NAARU. MAMTALU PRAARAMBHAMAYNA 15 NIMI-SHAALLOONEE BASSU MOTTAM DAGDHA MAY MDANI PRATYATSHASAATSHULA KATHANAM NIDR-AMATTULOO JOOGAAD'U TUNNA PRAYAANIKULU PRAMAADAM JRAIGINAT T'U TELUSUKONEE LOOPEE CAALAMAAMDI MARANIMCAARU KOMTAMAMDI BASSU'DOOR NUMCI BAYATAKU RAAGAA MARI-KODARU KIT|KIILA GUMD'AA DUUKI PRAANAALU KAAPAAD'UKONNAARU.

దీన్ని తెలుగులో ఎలా రాయాలో చూద్దాం

## అసాధారణ బస్సుప్రమాదం : 21 మంది సజీవదహనం

హైదరాబాద్, జూన్ 16 (న్యూస్‌టుడే) : నగర శివార్లలోని ఎల్. బి. నగర్‌వద్ద గురువారం తెల్లవారుజామున జరిగిన ఘోర అగ్నిప్రమాదంలో తెనాలినుంచి వస్తున్న బస్సు పూర్తిగా కాలిపోయి 21 మంది ప్రయాణికులు సజీవదహనమయ్యారు. 19 మంది ప్రయాణికులు సురక్షితంగా తప్పించుకోగలిగారు. అగ్నిప్రమాదంలో మరణించిన ప్రయాణికులు నామ రూపాలు కూడా లేకుండా మాడిమసైపోయారు. కాలిపోయినవారి శరీరం ముక్కలను రోడ్డుప్రక్క ముద్దలుగా పెట్టడంతో చూసేవారికి గుండెలు తరుక్కుపోయాయి. తెనాలినుంచి హైదరాబాద్‌లోని బి. హెచ్. ఇ. ఎల్‌కు వస్తున్న ఈ బస్సు ఎల్. బి. నగర్ రింగురోడ్డు కూడలికి రాగానే రోడ్డు డివైడర్‌ను ఢీకొని ఈ అగ్నిప్రమాదం జరిగినట్టు భావిస్తున్నారు. ముందుచక్రాల సెట్ మొత్తం ఊడిపోవడంతో ఆయిల్‌టాంకర్ పగిలి మంటలు వ్యాపించినట్లు చెబుతున్నారు. మంటలు ప్రారంభమైన 15 నిమిషాల్లోగానే బస్సు మొత్తం దగ్ధమైందని ప్రత్యక్షసాక్షుల కథనం. నిద్రమత్తులో జోగాడుతున్న ప్రయాణికులు ప్రమాదం జరిగినట్లు తెలుసుకొనేలోపే చాలామంది మరణించారు. కొంతమంది బస్సుడోర్‌నుంచి బయటకురాగా మరికొందరు కిటికీల గుండా దూకి ప్రాణాలు కాపాడుకొన్నారు.

ఇలాసాగుతుందివార్త. సాధారణంగా దీర్ఘంవచ్చినప్పుడు 'రెండక్షరాలు' ఉపయోగిస్తారు. 'రాష్ట్రాల' అనేమాటే వుందనుకోండి RAA (రా) STRAA (ష్ట్రా), LA (ల) అలా టెలిప్రింటర్‌మీద టైప్‌చేస్తారు. 'న' 'ణ'లమధ్య తేడా తెలుసుకునేందుకుకూడా ఓకోడ్ ఉంది. 'NA' అంటే 'న'. N'A అంటే 'ణ'. చూడగానే జటిలంగాఉన్నా అలవాటయితే ఆడుతూ పాడుతూ ఇంగ్లీషు లిపిలో వచ్చిన తెలుగువార్తను రాసేయచ్చు.

---

### నా రాత బాలేదు

కార్టూనిస్ట్ శ్రీధర్ దగ్గరకు ఓ స్నేహితుడు వచ్చి ఏదో మాటర్ ఇచ్చి రాసిపెట్టమన్నాడు.

"ఏదో బొమ్మలయితే వేస్తాను. నా రాత బావుండదు"అని శ్రీధర్ నచ్చచెప్ప చూశాడు.

ఎంత చెప్పినా ఆ స్నేహితుడు వినిపించుకోలేదు.

"నా రాతే కాదు, ఈరోజు నా తలరాత కూడా బాలేదు." అంటూ శ్రీధర్ ఆ స్నేహితుడి మాటర్ అందుకున్నాడు.

---

# బడురాస్తే బడుద్దాయి

శిష్టవ్యవహారికం పత్రికాభాషకుజీవం. ఆధునిక విజ్ఞాన అభివృద్ధి కారణంగా ఆవిర్భవించిన అనేక కొత్తపదాలకు తెలుగులో విస్తృత ప్రచారాన్ని, ప్రాచుర్యాన్ని కల్పించినవి పత్రికలే. పత్రికలను ఆబాలగోపాలం చదువుతారు. ప్రత్యేకించి అంతంతమాత్రం చదువవచ్చినవారుసైతం వార్తలకోసం దిన పత్రికపై ఆధారపడతారు. అక్షరజ్ఞానం తక్కువైనా రాజకీయ సామాజిక అంశాలపై ఆసక్తిమెండు. అందుకే అన్నిస్థాయిల పాఠకులకు అందుబాటులో వుండేభాషను పాత్రికేయుడు ఉపయోగించాలి. సరళమయిన భాషే ఉత్తమ మాధ్యమం. సంక్లిష్ట పదజాలంవల్ల పడబిడదప్ప ప్రయోజనం శూన్యం. తేట తెనుగుపదాలతో వార్త ఒకమారు చదవగానే హృదయానికి హత్తుకుపోవాలి. సందర్భానుగుణంగా సరళమైన కవితాత్మనుకూడా జోడించవచ్చు. అంటేకొన్ని వార్తల వ్యక్తీకరణకు ఒక స్థాయికిచెందిన భాషప్రయోగించడం ఆ వార్తకు కొత్తఅందాల్ని తెస్తుంది.

సరళమయిన శిష్టవ్యావహారిక పదప్రయోగంలోసైతం జర్నలిస్టుకొన్ని అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి. ఇంగ్లీషులో తరచూ ఉపయోగించే 'అండ్'కు తెలుగులో 'మరియు' అనే సమానార్థకం వుంది. అయితే ఇది ఇంగ్లీషునుంచి ఎరువుతెచ్చుకున్నదే కానీస్వతఃసిద్ధంగా తెలుగులో పుట్టినదికాదు. 'మరియు' అనేపదం తెలుగు జర్నలిజంలోనిషిద్ధం. ఇంగ్లీషు కాపీలో అండ్‌వచ్చినపుడు 'మరియు' దొర్లకుండా తదనుగుణంగా వాక్యనిర్మాణందిద్దాలి. అలాగే 'బడు' ధాతువుకూడా. కొనబడినది. చేయబడినది అనే ప్రయోగాలస్థానే కొన్నది, చేసిందివంటి పదప్రయోగాల ద్వారా 'బడు'ను నివారించాలి. బడురాసేవాడు 'బడుద్దాయి' అని ఎగతాళిపట్టించి చురకలు వేసేవారు. 'యొక్క'అనే పదం వాడకూడదు. ఏర్పాటు చేయటం జరుగుతోంది, ప్రవేశపెట్టడం జరుగుతుంది వంటి పదాలస్థానే 'ఏర్పాటుచేస్తారు' 'ప్రవేశపెడతారు.' అనిరాయాలి. వాడుకలో రెండుమాటలు ఉన్నప్పుడు ఏమాటను ప్రయోగించాలో నిర్ణయించటానికి దాని వ్యవహారరూపం ప్రమాణం. ఉదాహరణకు నుండి, నుంచి అనేపదాల్లో 'నుండి' కంటే, 'నుంచి' అనేపదం వ్యవహారానికి మరింతదగ్గర కనుక 'నుంచి'

వాడటం శ్రేయస్కరం. చూచుట, చూచాను అనటంకంటే చూడటం. చూశాను మెరుగు. నేడిచ్చటకంటే నేడిక్కడ మరింత మెరుగైనరూపం.

ఒకటవ, రెండవ, మూడవ అనటానికిబదులు ఒకటో, రెండో, మూడో అని ప్రయోగించాలి. కులవృత్తులపేర్ల విషయంలో కొన్ని జాగ్రత్తలు అవసరం. కంసాలి అనేమాటకుబదులు స్వర్ణకారి, చాకలిబదులు రజకుడు. చేపలుపట్టేవారు బదులు మత్స్యకారులులేదా గంగపుత్రులు, మంగలిబదులు క్షురకులువంటి శిష్టపదాలను ఉపయోగించాలి. రాజీవ్, చెన్నారెడ్డిల సమావేశం అనటంబదులు రాజీవ్ చెన్నారెడ్ల సమావేశం అనాలి. బాలుని దుర్మరణం, యువకుని హత్య స్థానే బాలుడిదుర్మరణం, యువకుడి హత్యఅనిరాయాలి. ఆశక్తితప్పు. ఆసక్తి ఒప్పు. సాధారణంగా మాట్లాడేటప్పుడు దొర్లని తప్పులురాయటానికి వచ్చేసరికి దొర్లుతాయి. వాటిలో కొన్ని ఇవి.

| తప్పు | ఒప్పు |
|---|---|
| నాలుగుమంది | నలుగురు |
| ఆరు మంది | ఆరుగురు |
| ఏడుమంది | ఏడుగురు |

తెలిసో, తెలియకో నిష్ణాతులైన జర్నలిస్టులుసైతం ఈనాటికీ రాష్ట్ర వ్యాపితంగా, దేశవ్యాపితంగా అనివాడుతున్నారు. నిజానికి అదిరాష్ట్ర వ్యాప్తంగా, దేశవ్యాప్తంగా అనిరాయాల్సిఉంది. అంకెల విషయానికొస్తే పదిలోపు అంకెలను అక్షరాల్లో రాయటం శ్రేయస్కరం. ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది, అని రాయాలి. చాలమంది 'తెలియచేశారు' అని రాయటానికిబదులు 'తెలియచేసారు' అనిరాస్తుంటారు. కానీ 'శ' ప్రయోగం సరైనది. గెలుపుకుఅని రాయటానికి బదులు గెలుపునకుఅని మధ్యలో 'న' చేర్చాలి. వ్యక్తులపేర్లముందు 'శ్రీ' అని రాస్తేసరిపోతుంది. చివర 'గారు' అనిరాయనవసరంలేదు. కొన్నిపత్రికలు 'శ్రీ' అనివాడకుండా చివర బహువచన ప్రయోగంతో గౌరవాన్ని ఆపాదిస్తున్నారు. ఉదాహరణకు 'రాజీవ్‌తెలిపారు',

# వాక్యనిర్మాణ దోషాలు

"రాముని తోక పివరుండిట్లనియె" కొద్దిపాటి ఏమరుపాటు, పదవిభజన లోపంతోపైవాక్యంఅర్థమే మారిపోయింది. కపివరుడు కాస్తా నామ రూపాల్లేకుండాపోయి 'తోక' ఆవిర్భవించింది.

మాట్లాడేటపుడు మనంసాఫీగా మాట్లాడతాం. కొందరైతే ధారలా అలా వాక్యాల్ని అల్లుకుంటూపోతారు వాళ్ళేకాగితంపై అక్షరాలు రాయవచ్చేసరికి అన్నీతప్పులే, కలంకదలదు. కొందరైతే వ్యవహారికాన్ని వదిలిపూర్తిగ్రాంధిక రూపంలో రాస్తుంటారు. ఇందుకు ఉత్తరాలేమంచి ఉదాహరణ.

ఇందుకు కారణంఒకటివుంది.మాట్లాడేటపుడు దాన్ని గ్రహించే మీడియం (వ్యక్తి) ఉంటుంది. రాసేటపుడు ఇలాంటి మీడియం వుండదు. రాతలోతప్పులకు అసలు కారణంఇదే. రాసేటపుడుకూడా మనం మరొకరికి విషయాన్ని చెప్తున్నామని అనుకుని, ఎదుట ఓవ్యక్తిని వూహించుకుని రాయటంప్రారంభిస్తే ఈ దోషాలు చాలావరకు నివారించవచ్చు.

పత్రికాభాష విషయానికొస్తే పాత్రికేయుడు ఒకవిషయాన్ని ప్రధానంగా మనసులో ఉంచుకోవాలి. తెలుగుపత్రికల పాఠకుల మధ్యస్థాయీ భేదాలుంటాయి. అక్షరాలు కూడదీసుకుని చదివేవారి దగ్గర్నుంచి పండితులవరకూ పత్రికను చదువుతారు. వాక్యంలో అన్వయం లోపించినా, పండితులు తమప్రతిభా పాటవాలతో 'ఓహో! ఇది ఇలాఅయివుండవచ్చును, అని సమాధానపడతారు. మరిసామాన్య పాఠకుడసంగతి ఏమిటి?

ఏ విషయం రాస్తున్నామన్నది ప్రధానంకాదు. ఆ విషయాన్ని గంద్ర గోళ పరచకుండా ఎంత సరళంగా చెప్తున్నామన్నదే ప్రధానం, ఇది సైన్స్ ఇంతకంటేబాగా అర్థమయ్యేట్లు చెప్పలేను అని వాదించడం అసమర్థతకు సంకేతం.

వార్తలు రాసేటపుడు పెద్దవాక్యాలను సాధ్యమైనంతవరకూ తగ్గించాలి. చిన్నవాక్యాలు రాయటమూ ఒకళే.దాన్ని సాధనతో అందుకోవాలి. బాగారాయ టానికి భాషాశాస్త్రమే తెలిసి వుండనక్కర్లేదు. మనం చెప్తున్నదిఏమిటి, అది మొదటిసారి చదవగానే బుర్రకిఎక్కుతున్నదా? లేక చికాకుపెడ్తున్నదా అని మనమేముందు నిర్ధారణ చేసుకోవచ్చు. రాసినదాన్ని ఒకసారి చదివితే, చద వంగానే సరళంగా అర్థమవుతుందాలేదా అని చూసుకోవాలి. ఇంకా అవసర

మనిపిస్తే పక్కవారికిచ్చి చదవమనాలి. అతను చదవగానే విషయం బోధ పడిందంటే పర్లేదు.

వ్యవహారిక భాషకుకుడా కొన్ని పరిమితులున్నాయి. ప్రజలు మాట్లాడే దాన్ని పూర్తిగా అదేభాషను ఉపయోగించడానికి వీల్లేదు. ఒక్కో మనిషి ఒక్కో రీతిలో, శైలిలో భావాన్ని ప్రకటిస్తాడు మౌఖికంగా చెప్పినప్పుడు అతని భావం స్పష్టంగా తెలుస్తూనేవుంటుంది. అతడు చెప్పినదాన్ని ఉన్నదున్నట్లురాస్తే సరళత లోపించవచ్చు. వార్తారచయిత అతనిభావాన్ని ఉద్దేశ్యం చెడకుండా పరిపుష్టం చేయాలి.

కొన్నిపదాలు ప్రజలనోళ్లలోపడి రూపాంతరం చెందుతుంటాయి. ఇలా రూపాంతరం చెందినమాటే ప్రామాణికం అనుకోకూడదు. ప్రజలభాషపై పత్రికల ప్రభావం విశేషం. కనుక తప్పురూపాలను అలాగే ఇవ్వడంకంటే వాటి సరైన రూపాన్ని వాడడంద్వారా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయొచ్చు

కొందరు ప్రణాలిక అంటారు. వాడుకలోని రూపం 'ప్రణాళిక' అలాగే 'సమిష్టి' అని వాడుతున్నా అసలు రూపం 'సమష్టి'. బలవర్ధకమైన అశ్లీలమైన వంటి పదాల్లో 'మైన'లు అనవసరం. బలవర్ధక ఔషధం, అశ్లీల చిత్రం అని రాస్తే సరిపోతుంది. నెలలు, సంవత్సరాలు రాసేటపుడు జూన్ నెలలో, 87 వ సంవత్సరంలో అని రాస్తుంటారు. జూన్‌లో అంటే చాలు. అది నెల అనివేరే చెప్పనక్కర్లేదు. అలాగే సంవత్సరంకూడా. పట్టణాల విషయం లోనూ ఇదేసూత్రం వర్తిస్తుంది. గుంటూరు పట్టణంలో సభ ఏర్పాటు చేశారు అనిరాయక్కర్లేదు. గుంటూరులో సభ ఏర్పాటుచేశారు అంటేచాలు.

అన్నారు, చెప్పారు, పేర్కొన్నారు, వెల్లడించారు వంటి మాటల ప్రయోగంలో సందర్భశుద్ధి అవసరం. ఒక విషయాన్ని వెల్లడిస్తే 'వెలిబుచ్చు' అనిరాయచ్చు. ఒక పాయింట్‌ని ఎత్తిచూపితే 'పేర్కొన్నారు' అనాలి. ఒక విషయాన్ని గట్టిగాచెప్తే ఉద్ఘాటించడం ఎవరిమాటనైనా కోట్‌చేస్తే ఉటంకించడం లేదా ఉల్లేఖించడం, హితవుచెప్తే ఉద్బోధించటం. సంశయాలను అనుమానాలను తొలగించే ప్రయత్నం స్పష్టం చేయటం. ముందు వెనకలను, బాగోగులనుచెప్తే విశ్లేషించడం. ఒక విషయాన్ని విపులంగా చెప్తే వివరించడం, విపులీకరించడం, విశదీకరించడం. అన్నారు. చెప్పారు అనే పదాలను ఎక్కువసార్లు వాడాల్సిన అవసరం వుంటుంది. రామారావు ఇలా అన్నారు. తాను ఢిల్లీ పర్యటనకు వెళ్తున్నట్లు చెప్పారు.

సౌలభ్యంకోసం కొన్ని వాక్యాలను వాటిలోని దోషాలను ఇక్కడ వివరిస్తున్నాను

| దోషం | సవరణ |
|---|---|
| 1) జైల్‌సింగ్ భౌతిక కాయంపై పుష్పగుచ్ఛం ఉంచారు. | భౌతికకాయంపై జైల్‌సింగ్ పుష్పగుచ్ఛం ఉంచారు. |
| 2) పాతబస్తీలోని కొన్ని ప్రాంతాల్లో మంచినీటితోపాటుమురికినీరుకూడా సరఫరా చేస్తున్నారని స్థానికుడు తుమ్మరి దర్శన్ ఓ ప్రకటనలో తెలిపారు. | ఎవరీ స్థానికుడు? ఇలా ఎవరు రాసి పంపినా దాన్ని వార్తగా చెలామణి చేయడం పొరపాటు. దర్శన్ ప్రకటన ఆధారంగా ఆ ప్రాంతానికి విలేకరి వెళ్ళి స్వయంగా వాకబు చేసి వార్త రాయడం మంచిది. |
| 3) ప్రధాని ఆదేశాలను అనుకరించి ముందురోజు రాత్రి ఆయన రాజధానికి వచ్చారు. | అనుకరించి కాదు ఆదేశానుసారం. |
| 4) కేంద్రం అనుమతి పొందిన ఈ హైడల్ ప్రాజెక్టును | కేంద్రం అనుమతి పొందిన ఈ జల విద్యుత్ ప్రాజెక్టును |
| 5) ఇప్పటికే నూటపది మెగావాట్ల ఉత్పాదక సామర్థ్యంగల టర్బయిన్లు ఏడు పున్నాయని తెలిపారు. | నూటపది మెగావాట్ల ఉత్పాదక సామర్థ్యం గల టర్బయిన్లు ఏడు ఇప్పటికే వున్నాయని తెలిపారు. |
| 6) ప్రధాని రామారావుతో చెప్పారు. | ఇలాంటి సందర్భాల్లో ప్రధాని రాజీవ్ ముఖ్యమంత్రి రామారావుతో చెప్పారు అనాలి. లేదా ప్రధాని ముఖ్యమంత్రితో చెప్పారు అనచ్చు. అదీ కాదంటే రాజీవ్, రామారావుతో చెప్పారనవచ్చు. |
| 7) శ్రీ రెడ్డి ఈ లాటరీలో 17 సార్లు డ్రా తీశారని ఎవరికీ బహుమతి మొత్తాన్ని. అందించలేదని కూడా ఆరోపించారు. | ఈ లాటరీలో 17 సార్లు డ్రా తీశారని బహుమతి మొత్తాన్ని ఎవరికీ అందించలేదని కూడా శ్రీ రెడ్డి ఆరోపించారు. |

8) మురికివాడల అభివృద్ధిలో ఆంధ్ర ప్రదేశ్ ఓ. కె.

ఇక్కడ అభివృద్ధి అనేది మురికి వాడల్లో సౌకర్యాలకు సంబంధించినది. ఆ మాటను విస్మరిస్తే మురికివాడలను పెంచి పోషిస్తున్నారన్న భావం వస్తుంది. మురికివాడల్లో సౌకర్యాలు అని రాయాలి.

9) ఈ వారాంతంలోగా ప్రభుత్వం ఒక నిర్ణయం తీసుకుంటుంది.

ఇలాంటి చోట్ల 'ఒక' అక్కర్లేదు ఒక కోటి, ఒక లక్ష అన్న చోట్ల కూడా 'ఒక' వ్యర్థం.

10) ఈ అపురూపమైన విగ్రహాన్ని చెక్కటం.

ఈ అపురూప విగ్రహాన్ని చెక్కటం.

11) ఈ విగ్రహం బరువుకు కుంగి పోగల తక్కువ సామర్థ్యం గల వంతెనలు రెండు మూడు దారిలో వున్నట్లు గమనించారు.

వాక్యం సరళంగాలేదు. విగ్రహాన్ని చేరవేసే దారిలో రెండు మూడు వంతెనలు వున్నాయి. విగ్రహం బరువును తట్టుకునే సామర్ధ్యం వీటికి లేదని........

12) ఈ సంస్థ ఇప్పటికి దేశంలోని 17 రాష్ట్రాలలో తమకు సంబంధించిన ఎనిమిది అడ్మినిస్ట్రేటివ్ అండ్ కంట్రోల్ ఆఫీసులు నలభై ప్రాంతీయ కార్యాలయాల ద్వారా 1250 బ్రాంచీలను నెలకొల్పి లక్షల కొద్ది డిపాజిట్ల ద్వారా 100 కోట్ల రూపాయలకు పైగా వ్యాపారం చేయటం జరిగిందని, అనేక నిబంధనలలో కేరళ, కర్నాటక

వాక్యం చాలా పెద్దదయింది. గుక్క తిప్పుకోనివ్వడంలేదు. వ్యా పా రం చేయడం జరిగింది, అనడం తగదు. వ్యాపారం చేసినట్లు అంటే సరి. ఈ వాక్యాన్ని ఇలా రాయవచ్చు.

"ఈ సంస్థకు దేశంలోని 17రాష్ట్రాలలో పాలనాపరమైన ఎనిమిది కార్యాలయాలు, నలభై ప్రాంతీయ కార్యాలయాలు వున్నాయి. వీటిద్వారా ఈ సంస్థ 1250 శాఖలను తెరిచింది.

| | |
|---|---|
| రాష్ట్రాలలో రెండు సంవత్స రాలకు పైగా వ్యాపారం చేస్తున్న ఈ కంపెనీ 1986 నుండి ఇటు ఖాతాదారులకు, ఉద్యోగస్తులకు అకస్మాత్తుగా సమస్యలు తెచ్చి పెట్టిందని వారు తెలిపారు. | ఈ శాఖలు డిపాజిట్ల ద్వారా వంద కోట్ల రూపాయలకు పైగా వ్యాపారం చేశాయి. కేరళ, కర్నాటకలలోని నిబంధనలకు లోబడి రెండేళ్ళుగా సంస్థ వ్యాపారం చేస్తున్నది. 1986 నుంచి అకస్మాత్తుగా ఖాతాదారులకు, ఉద్యోగస్తులకు సమస్యలు తెచ్చి పెట్టిందని వారు తెలిపారు. |
| 13) రాజవ్వ అనే వితంతువుపై ఆమె మరిది శనివారం ఉదయం గొడ్డలితో తీవ్రంగా గాయపరిచి పరారైనట్లు పోలీసులు చెప్పారు. | వితంతువుపై గాయపరచడమేమిటి? రాజవ్వ అనే వితంతువును ఆమె మరిది శనివారం ఉదయం గొడ్డలితో తీవ్రంగా గాయపరిచి పరారైనట్లు పోలీసులు చెప్పారు. |
| 14) ఇంతమంది ఉద్యోగస్తుల జీవనోపాధిని దృష్టిలో ఉంచుకుని, ప్రజల పెట్టుబడి గురించి అవగాహన చేస్తూ ఒక సమర్ధమైన కమిటీని ఏర్పాటుచేసి కంపెనీని జాతీయం గురించి ప్రభుత్వం ఆలోచించాలని వారు కోరారు. | ఈ వాక్యమూ పెద్దదయింది. ప్రజల పెట్టుబడి గురించి అవగాహన చేయటమేమిటి? ఒక సమర్థమైన కమిటీఅంటే? జమిటీల్లో అసమర్థ కమిటీలుకూడా వుంటాయా? దీన్ని ఇలారాయచ్చు. "ఉద్యోగులు, ప్రజల ప్రయోజనాల దృష్ట్యా సంస్థకార్యకలాపాలను ఓ సంఘంచేత దర్యాప్తు జరిపించాలని సంస్థను జాతీయంచేసే విషయాన్ని కూడా పరిశీలించాలని వారు కోరారు" |
| 15) కాంగ్రెస్ సభ్యుడు మైసూరారెడ్డి ఆరోపణ చేయడంతో | మైసూరారెడ్డి ఆరోపించడంతో. |
| 16) శ్రీ రెడ్డి రాజకీయవేత్తయేగాక ప్రముఖ సహకారవేత్త కూడా అని | రాజకీయవేత్తేకాక ప్రముఖ సహకార వేత్త కూడానని, |

17) **తిరుపతిలోనే** ఈ ఫ్యాక్టరీని ఏర్పాటు చేస్తారా అని ప్రశ్నించగా **తమిళ** ప్రాంతాలతో నిమిత్తం లేదని **అనుమతి** పొందిన సంస్థ **తిరుపతిలో** తమ కర్మాగారాన్ని **ఏర్పాటు** చేయాలని భావిస్తే హర్ష దాయకమని జవాబిచ్చారు.

ఇందులో అచ్చు తప్పు భావాన్నే మార్చేస్తోంది. తమిళ ప్రాంతాలు కాదు. తమకు ప్రాంతలతో నిమిత్తం లేదు అని వుండాలి.

18) ఆంధ్రప్రదేశ్‌కు చెందిన 281 మంది శాసన సభ్యులు ఏడుమంది పార్లమెంట్ సభ్యులు ఇక్కడ తమ ఓటు హక్కు వినియోగించుకున్నారు.

ఏడుమంది కాదు. ఏడుగురు అనాలి.

19) ఆస్పత్రుల్లో అన్ని సదుపాయాలు కల్పించేందుకు ప్రభుత్వం అన్ని చర్యలు తీసుకుంటోందని.

రెండు సార్లు 'అన్ని' అవసరంలేదు సకల సదుపాయాల కల్పనకు ప్రభుత్వం చర్యలు తీసుకుంటోందంటే సరిపోతుంది.

20) మాజీ రెవిన్యూ మంత్రి, మాజీ శాసన సభ్యుడు.

రెవిన్యూ శాఖ మాజీ మంత్రి, శాసన సభ మాజీ సభ్యుడు.

21) ఆ రాత్రికి రాత్రే రతికాంత్ కోపంతో వెళ్ళిపోతాడేమో ఇల్లు విడిచి అని కూడా అన్పించింది.

ఆ రాత్రికి రాత్రే రతికాంత్ కోపంతో ఇల్లు విడిచి వెళ్ళిపోతాడేమోనని కూడా అన్పించింది.

22) నేరస్తులుగా క్రిమినల్ రికార్డులు వున్నవారిని

క్రిమినల్ రికార్డులు వున్నవారిని అంటే సరిపోతుంది.

23) ఈ సంఘటనలో ఇంతవరకు ఒక వ్యక్తిని కూడా అరెస్టు చేయలేదు.

ఈ సంఘటనలో ఇంతవరకూ ఎవరినీ అరెస్టు చేయలేదు.

24) **కాగా పరీక్షలో** తప్పిన వారికి

పక్కపక్కనే 'కాగా లు అనవసరం.

| | |
|---|---|
| తెలుగు విజయంలో ప్రత్యేకశిక్షణ ఇస్తారు. తిరిగి వారు పరీక్షలో పాసయ్యేవరకూ ప్రత్యేక శిక్షణ కొనసాగుతుంది కాగా వచ్చేనెల నుంచి.... | |
| 25) సర్పంచ్ నరసింహారెడ్డి (55)ను పీపుల్స్ వార్ గ్రూప్.... | నరసింహారెడ్డిని అని రాయాలి. |
| 26) ఈ దేశ ప్రధానమంత్రి,కి అంతూలేకన్నా మంచి న్యాయవాది దొరకలేదా? లేక ఈ రెండూ ఒకే గూటి పక్షులనుకోవాలా? | ఈ రెండూ ఒకే గూటి పక్షులు-తప్పు వీరిద్దరూ ఒకే గూటి పక్షులను కోవాలా? |
| 27) ప్రధాని నిర్ణయాన్ని గురించి పార్టీ ప్రధాన కార్యదర్శి వెల్లడించారు. | ప్రధాని నిర్ణయాన్ని పార్టీ ప్రధాన కార్యదర్శి వెల్లడించారు. |
| 28) పార్టీ నాయకత్వం సమర్థమైన చర్యలు తీసుకోనట్లయితే | పార్టీ నాయకత్వం సమర్థ చర్యలు... |
| 29) అత్యవసరమైతే తప్ప సిక్కులు తమ ఇండ్లనుంచి | తమ ఇళ్ళ నుంచి |
| 30) ఒరిస్సాలో జానకీ వల్లభుణ్ణి అరణ్యవాసానికి పంపించడానికి | జె.బి. పట్నాయక్‌గానే అతను సుపరిచితుడు. ఇలాంటి చమత్కారంతమకు పట్నాయక్ పూర్తి పేరు తెలుసని చెప్పుకోడానికి తప్ప పాఠకుడికి కలిగే మేలుండదు. |
| 31) శ్రీ చౌదరి బడ్జెట్‌పై ఇరిగిన చర్చలో పాల్గొంటూ ఈ అంశాలను ప్రస్తావించినపుడు | బడ్జెట్‌పై జరిగిన చర్చలో శ్రీ చౌదరి పాల్గొంటూ ఈ అంశాలను ప్రస్తావించినప్పుడు. |

| | |
|---|---|
| 32) 580 బస్సు రూట్లను జాతీయం చేసే విషయం ప్రభుత్వం పరిశీలనలో ఉంది. | ప్రభుత్వ పరిశీలన అనాలి. లేదా ప్రభుత్వం పరిశీలిస్తోంది అనొచ్చు. |
| 33) సాయుధ దోపిడీలను చట్ట విరుద్ధంగా ఆయుధాలను సేకరించటం, ప్రభుత్వ సేవలకు ఆటంకపరచటంవంటి సంఘ విద్రోహ చర్యలను | సంఘ విద్రోహచర్యలైన సాయుధ దోపిడీలను, చట్ట విరుద్ధ ఆయుధాల సేకరణను, ప్రభుత్వ సేవల ఆటంకాన్ని నిలువరించడానికే.... |
| 34) సమరసింహారెడ్డి విలేకరులతో మాట్లాడుతూ చెప్పారు. | ఎవరైనా మాట్లాడకుండా ఏమైనా చెప్పగలరా? సమరసింహారెడ్డి విలేకరులకు చెప్పారు అనాలి. |
| 35) ఉభయ గోదావరి జిల్లాల్లోని పరిశ్రమలకు పైప్‌లైన్ల ద్వారా సహజవాయువు సరఫరా 1988 మార్చి నెలనుంచి ప్రారంభం అవుతుందని | ఉభయ గోదావరి జిల్లాల్లోని పరిశ్రమలకు 1988 మార్చినుంచి పైప్‌లైన్ల ద్వారా సహజవాయువు సరఫరా ప్రారంభమవుతుందని |
| 36) జిల్లా అధికారులు లాటరీ నిర్వహణ నిమిత్తం టెండర్లు పిలిచారు. | లాటరీ నిర్వహణ నిమిత్తం జిల్లా అధికారులు టెండర్లు పిలిచారు. |
| 37) ఆరు సంస్థలు టెండర్లు పెట్టగా నాలుగు శాతం రాయల్టీ చెల్లించటానికి ముందుకు వచ్చిన సికింద్రాబాద్‌కు చెందిన ధనిక్ ఏజన్సీస్‌కు కాంట్రాక్టు ఇచ్చారు. | ఆరు సంస్థలు టెండర్లు దాఖలు చేశాయి. సికింద్రాబాద్‌కు చెందిన ధనిక్ ఏజన్సీస్ నాలుగు శాతం రాయల్టీ చెల్లించటానికి సిద్ధపడింది. దాంతో కాంట్రాక్టును ధనిక్ ఏజన్సీస్‌కే ఇచ్చారు. |
| 38) నందిగామ ప్రాంతంలోని 9 వ జాతీయ రహదారిపై గురువారం తెల్లవారుజామున 3 గంటల | విషయమంతా మొదటి వాక్యంలో గుప్పించాలనే ప్రయత్నం మంచిది కాదు. "ఆర్టీసీ బస్ ప్రయాణీకులను |

| | |
|---|---|
| ప్రాంతంలో అమలాపురంనుండి హైదరాబాద్ వెళుతున్న ఆర్. టి. సి. సెమిలగ్జరీ బస్సును కొందరు దుండగులు ఆపి, ప్రయాణీకులను మారణాయుధాలతో బెదిరించి లక్ష రూపాయలకు పైగా విలువచేసే నగలు, నగదు దోచుకుపోయారు. | కొందరు దుండగులు మారణాయుధాలలో బెదిరించి లక్షరూపాయలకు పైగా విలువచేసే నగలు, నగదు దోచుకున్నారు. నందిగామ ప్రాంతంలోని తొమ్మిదో జాతీయ రహదారిపై గురువారం తెల్లవారుజామున ఈదోపిడీ జరిగింది. ఈ ఆర్. టి. సి. బస్ అమలాపురంనుంచి హైదరాబాద్ వెళ్తోంది. |

## ఎం. బి. బి. ఎస్.

"సార్! నేను పెళ్ళి చేసుకుంటాన్నా మీరు తప్పకుండా రావాలి" అంటూ సబ్ ఎడిటర్ సురేష్, రాంభట్ల కృష్ణమూర్తికి శుభలేఖ అందించాడు.

"ఏం ఫ్రెండూ! నీకూ ఎంబి.బి,ఎస్. పట్టా ప్రదానం చేయాలన్న మాట" అన్నారు రాంభట్ల నవ్వుతూ.

రాంభట్ల అన్నదేమిటో అర్థంగాక సురేష్ తెల్లముఖం వేశాడు.

"ఎం.బి.బి.ఎస్. అంటే మెంబర్ ఆఫ్ భార్యా బాధిత సంఘం అని. అర్థమయ్యా! నువ్వు కూడా మా సంఘంలో చేరుతున్నందుకు సంతోషం" అన్నారు రాంభట్ల.

## కార్నర్ స్టోన్

ఓ రోజు 'ఈనాడు' కార్టూనిస్ట్ శ్రీధర్, న్యూస్ ఎడిటర్ సలీమ్ దగ్గరకొచ్చి పిచ్చాపాటి మాట్లాడుతూ, "మీ డిపార్ట్‌మెంట్‌లో చోటు ఇచ్చేట్లయితే నా మకాం మార్చేస్తాను" అన్నారు సరదాగా.

"దాందేముంది రండి. ఎక్కడ కూర్చుంటారు?" అని సలీమ్ అడిగారు.

"ఆ మూలగానీ ఈ మూలగానీ" శ్రీధర్ జవాబు.

"అదేమిటో మూలల్లో తప్పితే పని సాగదా?" సలీమ్ ప్రశ్న.

"నేను కార్నర్ స్టోన్ లాంటివాణ్ణి. అందుకే మూలచోటు అడుగుతున్నా" శ్రీధర్ జవాబుకు నవ్వులు చిందాయి.

# తర్జుమాల తకరారు

భాషా పత్రికలకు సొంతవిలేకరుల బలగం ఉంటుంది. తొంభైశాతంమంది తెలుగులోనే వార్తలు రాసిఇస్తారు. తెలుగుపత్రిక తెలుగు తెలిసినవ్యక్తిని విలేకరిగా నియమించుకోవడం తప్పనిసరి అవసరం. తెలుగురాపోతే తెలుగు పలుకుబడి తెలీదు.

అయితే అన్నిసందర్భాల్లోనూ తెలుగు వచ్చినవారినే విలేకరిగా నియమించుకోవడం సాధ్యపడదు. ఉదాహరణకు ఈనాడు గ్రూప్‌నే తీసుకుంటే వాళ్ళకి న్యూస్‌టైమ్ ఇంగ్లీషు పత్రికకూడ ఉంది. న్యూస్‌టైమ్ అవసరాలకోసం ఇంగ్లీషు రిపోర్టరు అవసరం. ముఖ్యంగా ఢిల్లీలో, రాష్ట్ర రాజధానుల్లో ఇంగ్లీషు రిపోర్టర్లు తప్పనిసరి. ఒకేసంస్థ ఆధిపత్యంలో తెలుగు, ఇంగ్లీషు పత్రికలు ఉన్నప్పుడు విడివిడిగా తెలుగు, ఇంగ్లీషు రిపోర్టర్లను నియమించడం సాధ్యపడదు.

తెలుగులోవచ్చిన వార్తను ఇంగ్లీషు పత్రికకోసం ఇంగ్లీషులోకి తర్జుమా చేసుకోక తప్పదు. అలాగే ఢిల్లీనుంచి ఇంగ్లీషులోవచ్చిన వార్తను తెలుగుపత్రిక కోసం తెలుగులోకి మార్చుకోకతప్పదు.

ఇదేకాక, ఎంత సొంతవిలేకరులున్నా వార్తాసంస్థ అందించే వార్తలను ఉపయోగించుకోకతప్పదు. పి. టి. ఐ, యు. ఎన్. ఐ. వంటి జాతీయ వార్త సంస్థలు ఇంగ్లీషులోనే వార్తలు అందిస్తాయి. ప్రాంతీయ వార్తా సర్వీసు అనేది ఇప్పటికీ అందనిద్రాక్షలానేవుంది.

ఇలాచూస్తే ఏభాషాపత్రికకయినా వార్తల్లో ఎక్కువభాగం కాదంటే సగభాగం ఇంగ్లీషులోనే వస్తాయి. వాటిని విధిగా అనువాదం చేసుకోక తప్పదు.

అలా అనువాదంచేసి వార్తను సిద్ధం చేయడం ఉపసంపాదకుడి మౌలిక విధి. అనువాదం అనేటప్పటికి ఇటు ఇంగ్లీషు అటు తెలుగు భాషలపై గట్టిపట్టు ఉండాలి. ఇంగ్లీషులో ధారాళంగా మాట్లాడలేకపోవచ్చు. అయితే ఇంగ్లీషును క్షుణ్ణంగా అర్థంచేసుకోగల శక్తిసామర్థ్యాలు సబ్ఎడిటర్‌కు అవసరం.

ఇంగ్లీషులో వార్తను పూర్తిగా జీర్ణం చేసుకోవడం ఒకఎత్తు, దాన్ని

సరళమైన తెలుగులోకి మార్చడం మరోఎత్తు. ఇంగ్లీషులో వాక్యనిర్మాణం వేరు. తెలుగులో వాక్య నిర్మాణం వేరు. ఇంగ్లీషులో వాక్యాలను కలుపుకుంటూపోతూ ఎంతపొడుగయినా రాయవచ్చు. తెలుగులోకూడా పొడుగు వాక్యాలు రాయవచ్చు. కానీసామాన్య పాఠకుల దృష్ట్యా అది అభిలషణీయంకాదు. మనం కిందిస్థాయి పాఠకులనే ప్రమాణంగా తీసుకోవాలి. అంటే మనం చెప్పేది సామాన్యుడికి అర్థంకావాలి. ఈ చిన్న విషయం తెలియదా అనే ఉదాసీనత పనికిరాదు.

ఇంగ్లీషు వార్తలోని విషయం ఎంత జటిలంగానయినా ఉండవచ్చు. ఏశాస్త్ర, సాంకేతిక విషయమైనా కావచ్చు. కానీ తెలుగులో అందించేటపుడు ఆ వార్త మరింత జటిలం, క్లిష్టంకాకూడదు. అలా జరిగితే వార్త అందివ్వడంలోని ప్రాధమిక లక్ష్యమే దెబ్బతింటుంది.

ఇంగ్లీషులో వాక్యం పొడుగ్గాఉన్నా దాన్ని తెలుగులో సరళంగా రెండు మూడు వాక్యాల్లో రాయగలగాలి. ఇంగ్లీషులో విషయం అర్థంచేసుకున్నాక దీన్ని తెలుగులో అయితే ఎలా చెప్తాం, ఎలా చెప్తే బావుంటుంది, అని ఓక్షణం పాటు ఆలోచించాలి. మనం అదే విషయాన్ని ఒకరికి నోటిద్వారా చెప్పాల్సి వస్తే ఏమని అంటామో మననం చేసుకోవాలి.

స్వేచ్ఛానువాదమే ఉపసంపాదకుడికి శిరోధార్యం. మక్కీ అనువాదం ఎప్పుడూ చెయకూడదు. మక్కీ అనువాదంతో వార్త అర్థమయినా తెలుగుదనం లోపిస్తుంది. అలాగే ఇంగ్లీషు సామెతలు వస్తే సమానార్థానిచ్చే తెలుగు సామెతను ఎంచుకోవాలి.

నిజానికి భాషవేరయినా భావప్రకటన ఒక్కటే. మానవుల ఆలోచనలకు భాషాబంధాలున్నా అంతస్సూత్రం ఒక్కటే. ఈ కోణంనుంచి చూస్తే ఏ భాష నయినా మరో భాషలోకి సహజత్వం చెడకుండా తర్జుమాచేసే అవకాశం ఉంది. సంప్రదాయాలు వేరుకావచ్చు.

"ఉపసంపాదకుడికి ఇంగ్లీషులో బాగా పాండిత్యం వుండాలికాబోలు, మనకు ఇంగ్లీషులో అంతగా పాండిత్యం లేదే" అని ఎవరూ బెంబేలు పడక్కర్లేదు.

ఇంగ్లీషు పరాయిభాష. ఎవరికయినా మాతృభాషలో ఉన్నంత సౌలభ్యం పరాయి భాషలో ఉండదు. ఇంగ్లీషుభాష బాగా పెరుగుతూ వస్తోంది. శాస్త్ర సాంకేతిక రంగాల్లో చోటు చేసుకుంటున్న అభివృద్ధితోపాటే కొత్తపదాలు, ప్రయోగాలువచ్చి చేరుతున్నాయి. ఇది కాదనలేని సత్యం. అయితే వార్తలకు

సంబంధించి తరచూ ఒకేపదాలు ఎక్కువగా వస్తుంటాయి. తీయగా తీయగా రాగంలానే ఇంగ్లీషు వార్తలు తెలుగులోకి తర్జుమా చేయడం సాధనచేస్తే ఎక్కువగా కొన్ని పదాలే దొర్లుతుంటాయి. వాటి అర్థాలూ వెంటనే స్ఫురిస్తుంటాయి. ఆమాట కనపడగానే దాని సమానార్థకం అలావచ్చి కాగితంపై వాలుతుంది. ఇందుకు కొంత సాధన, పట్టుదల కావల్సివుంది.

ఇంగ్లీషులో ఏడులక్షల పదాలుఉన్నట్లు అంచనా. వీటిలో మూడువేల పదాలు ఇంగ్లీషులో మామూలుప్రవేశం ఉన్నవారికి అర్థం అవుతాయి. కాగితం పైకి ఎక్కిన ఇంగ్లీషులో నాల్గోవంతు ది, ఎ, అండ్, టూ, ఆఫ్, ఇన్, ఐ, ఇట్, ఈజ్, దట్ అని పది పదాలే ఆక్రమిస్తున్నాయి.

మరో విషయం కూడా గమనంలోకి తీసుకోవాలి. ఒక పదాన్ని ఏ సందర్భంలో ప్రయోగించారు? ఆ సందర్భంలో దాని అర్థమేమిటి అనేది గ్రహించడంముఖ్యం. ఈపదాన్ని తెలుగులో ఇలా అంటారుగదా అని వాదిస్తే ఉపయోగంలేదు. ఆ పదాన్ని ఒక్కటే విడిగా చూస్తే అర్థం అదే అయినా వాక్య ప్రయోగంలో భిన్నార్థంలో వాడి ఉండవచ్చు.

కొన్ని ఇంగ్లీషు మాటలు స్పెల్లింగ్‌లో కొద్దిపాటి తేడాతో భిన్నార్థాలనిస్తాయి. డిసీజ్ అనే మాటే తీసుకోండి. Decease అంటే డెత్ కాగా Disease అంటే అనారోగ్యం. డిసీజ్‌డ్ పర్సన్స్ అని వస్తే అనారోగ్యానికి గురయినవారు అనిరాసేస్తే చాలాప్రమాదం జరిగిపోతుంది. స్పెల్లింగ్‌ను జాగ్రత్తగా పరికించాలి

అలాగే Affect, Effect కూడా.

Affect : The extreme cold affected his health The culprit affected madness to escape.

Effect : (to bring about) : Ashoka effected many reforms in the Country.

Amiable =lovable; Amicable=Friendly
Adapt=make something Suitable to;
Adopt=to take a person into a new relationship.
Apposite=relevent, Suitable
Opposite=contrary.
Assent=official concurrence.
Ascent=climbing up.

Apprehend=to grasp.
Comprehend=to understand fully.

అలాగే ఒక్కో పదాన్ని ఒక్కో దేశంలో భిన్నదృకోణంతో చూస్తారు.

అమెరికాలో ప్రజాస్వామ్యం (డెమక్రసి) అంటే వ్యక్తుల స్వేచ్ఛను ప్రభుత్వం కాపాడటంగా పరిగణిస్తారు. అదే రష్యాలో అయితే వ్యక్తుల ప్రయోజనాలకంటే దేశ ప్రయోజనాలను కాపాడేదే ప్రజాస్వామ్యంగా భావిస్తారు.

ఇక అనువాదం చేయడానికి పూనుకున్నపుడు ముందు బాగా చదివి అర్థంచేసుకోండి. తెలియని పదాలకింద గీతపెట్టండి. పక్కవారిని అడగండి లేదా డిక్షనరీ చూసి తెలుసుకోండి. ఇంగ్లీషులో వాక్యాన్ని సాధారణంగా పూర్తయిన దగ్గరనుంచి మనం తెలుగులో రాయటం మొదలిడితే సరిపోతుంది. అన్నిసందర్భాల్లో ఇదేసూత్రం వర్తించకపోవచ్చు. ఈ విషయాన్ని ఉదాహరణ సహితంగా వివరిస్తాను.

Rama is a good boy

రాముడు మంచిబాలుడు అని అంటాం. మంచిబాలుడు రాముడు అనీ అనం. అంటే ఇక్కడ వాక్యాన్ని ముగింపు దగ్గర్నుంచీ మొదలు పెట్టడం కుదర్దన్నమాట.

ఉప సంపాదకుడు మరో ముఖ్య విషయం గుర్తుంచుకోవాలి. పాఠకుడికి తెలియని పదాన్ని వాడటానికి ఎప్పుడూ ప్రయత్నించకూడదు. పాఠకుల భాషను పెంచే బాధ్యత పత్రికేయుడిదని అనుకోవటం పొరబాటు. పాఠకుడికి అర్థంకాని మాట విధిగా ఉపయోగించాల్సివస్తే దాన్ని వివరించాలి.

ఉప సంపాదకుడికి రాసే అలవాటుముఖ్యం. ప్రతిభముఖ్యం. పాఠకుల గురించి అవగాహన ముఖ్యం. భాషముఖ్యం. రాసినదానికి కట్టుబడి ఉండటం అన్నిటికన్నా ముఖ్యం.

ఇక్కడ రెండు ఇంగ్లీషు వార్తలను, వాటి తెలుగు రూపాలను చూద్దాం.

**NAXALITES**

**Kakinada, DEC 16 (UNI) In a major breakthrough, Police nabbed eight hardcore naxalites belonging to the militant people's war group, including two arms dealers and seized a catch ofarms and ammunition worth Rs ten lakhs in visakhapatnam and East Godavari districts recently.**

East godavari district police superintendent Dr D T Naik told newsmen here today that in all, forty seven guns of different makes and sizes, handgrenades, Rifles, about 1200 Live catridges, besides explosives and arms were seized during the Operation.

A Large quantity of extremist literature, 38 secret letters and pamphlets and Rs 61,000 and olive green uniforms were also recovered in the two districts, the agency areas of which had become strongholds for naxalites movement. Some of the arms had british markings, he odded.

The peoples' war group, which had literally declared +war+ against the state government and resorted to +annihilation of class enemies+ had allegedly committed 43 offences in the East Godavary district alone.

The group led by the 65 year old Kondapalli Seetharamaiah, who himself made a daring escape in 1934 from the Osmania General Hospital at Hyderabad, after gunning down armed sentry, had trained its Underground caders in several Miltary Operations as a prelude to lunching a guerilla war to Liberate the tribals from expoltitation in the first phase, according to intelligence reports.

The arrested included a woman member, K. Padma alias Subha, a post - graduate student, Gummadi Venkata kishan Prasad, said to be the chief courier of the group, and V M Chandramouli, divisional committee member of the East Godavari forest division. A couple in charge ofthe medical unit of the extremist group were also taken into custody.

The last major offence of the group was in the Adilabad district where a patrol of ten policemen were killed in a daring ambush early this year in a forest area.

( నక్సలైట్స్ )

కాకినాడ, డిసెంబరు 16: విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాల్లో పోలీసులు ఇటీవల దాడులు జరిపి పీపుల్స్‌వార్ గ్రూప్‌కు చెందిన ఎనిమిది

మంది నక్సలైట్లను అరెస్టు చేశారు. అరెస్టు చేసినవారిలో ఆయుధాల డీలర్లు ఇద్దరు కూడా ఉన్నారు. నక్సలైట్లనుంచి పెద్దమొత్తంలో ఆయుధాలు, మందు గుండు సామగ్రిని స్వాధీనం చేసుకున్నారు. వీటి విలువ పదిలక్షల రూపాయలు. తూర్పుగోదావరి జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ డాక్టర్ డి.కె. నాయక్ నేడిక్కడ ఈ విషయం విలేకరులకు చెప్పారు. వివిధ రకాలకు చెందిన మొత్తం 47 తుపాకులు, చేతిబాంబులు, రైఫిళ్ళు, 1200 తూటాలు స్వాధీనం చేసుకున్నట్లు ఆయన చెప్పారు.ఇవిగాక పేలుడు పదార్థాలు ఇతర ఆయుధాలుకూడా స్వాధీనం చేసుకున్నామన్నారు.

పెద్ద ఎత్తున తీవ్రవాద సాహిత్యం, 38 రహస్య లేఖలు, కరపత్రాలు ఆలివ్‌గ్రీన్ యూనిఫాంలు, 61 వేల రూపాయల నగదుకూడ పోలీసులు స్వాధీన పరుచుకున్నారు. కొన్ని ఆయుధాలపై బ్రిటిష్ గుర్తులు ఉన్నాయి. పీపుల్స్‌వార్ గ్రూప్ రాష్ట్రప్రభుత్వంపై 'యుద్ధం' ప్రకటించి, 'వర్గశత్రులవు సంహారానికి' నడుం బిగించింది. ఇప్పటివరకూ ఒక్క తూర్పుగోదావరి జిల్లా లోనే ఈ గ్రూప్ 43 నేరాలకు పాల్పడిందని భావిస్తున్నారు.

పీపుల్స్‌వార్ గ్రూప్‌కు 65 ఏళ్ల కొండపల్లి సీతారామయ్య నాయకుడు. హైదరాబాద్‌లోని ఉస్మానియా జనరల్ ఆస్పత్రినుంచి 1984లో ఆయన తప్పించుకున్నారు. ఈ ఘటనలో ఓ సెంట్రీ ప్రాణాలు కోల్పోయాడు. పీపుల్స్ వార్‌గ్రూప్ తన అజ్ఞాత కార్యకర్తలకు ఆయుధ శిక్షణ ఇచ్చింది. తొలిదశగా దోపిడీలనుంచి గిరిజనులను 'విముక్తం' చేసేందుకు గెరిల్లాయుద్ధాన్ని ప్రారంభించడానికి సన్నాహక చర్యగానే ఈ శిక్షణ ఇచ్చినట్లు గూఢచారి వార్తలు తెలుపుతున్నాయి. అరెస్ట్‌చేసిన వారిలో కె. పద్మ ఎలియాస్ శోభ అనేమహిళా సభ్యురాలు, గుమ్మడి వెంకట కిషన్‌ప్రసాద్ అనే పోస్ట్‌గ్రాడ్యుయేట్ విద్యార్థి కూడా ఉన్నారు. కిషన్‌ప్రసాద్ పీపుల్స్‌వార్ గ్రూప్ ప్రధాన వార్తాహరుడని భావిస్తున్నారు. ఈ తీవ్రవాద గ్రూప్‌కు వైద్య సేవలందించే దంపతులను, తూర్పుగోదావరిజిల్లా అటవీ విభాగానికి చెందిన డివిజనల్ కమిటీ సభ్యుడు వి. ఎం. చంద్రమౌళినికూడా నిర్బంధించారు. ఈ ఏడాది ఆరంభంలో ఆదిలాబాద్ జిల్లాలోని అటవీ ప్రాంతంలో పోలీస్ గస్తీదళంపై మెరుపుదాడి చేసి పదిమంది పోలీసులను కాల్చి చంపినదికూడా పీపుల్స్‌వార్ గ్రూప్ సభ్యులే

## EDUCATION

**Hyderabad, Dec 16 (UNI) Andhra Pradesh Chief Minister N T Rama Rao today pleaded for the Establish-**

ment of Zonal University Grants Commissions (UGCS) so that "Justice may be done to all the states which are in dire need of Assistance".

Inaugurating the 62nd Annual Conference of the Association of indian universities (AIU) at an impressive function at Osmania university here, the chief minister said, the effort that had to be made by state governments to improve the educational system, to ensure extension of educational opportunity without sacrificing the quality of education and to introduce change in consonance with the spirit of the times, would naturally involve heavy expenditures.

Mr Rama Rao reiterated in this context that the finaucial commitment of the union government should be substantial and purposeful More uni sms mr 1820

Mr Rama Rao said that "We have begun to set new horizon for our education a horizon different from the one that was set by macaulay over a 100 years ago to meet the demands of an imperialist power from its colonial dependency". The British had started an era of producing educated slaves, to serve them as clerks and typists and to dance to their tunes.

He said that the education should make our young men to cultivate the real spirit of independence to carve out acareer for themselves without depending on the governmental agencies, "The education we impart should be a preparation for life-long pursuit for perfection".

Listing the "Revolutionary innovations" that had been introduced by the State government in the education system, Mr Rama Rao said that the government had given a thrust to vocation'isation which would be extended speedily to the plus two stage,

( విద్య )

హైదరాబాదు, డిసెంబరు 16 : ప్రాంతీయస్థాయిలో యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్లను నెలకొల్పాలని ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు విజ్ఞప్తి చేశారు. తద్వారా సహాయం అందించాల్సిన అన్నిరాష్ట్రాలకు న్యాయం చేయ వీలుంటుందని ఆయన అన్నారు. నేడిక్కడ ఉస్మానియా యూనివర్సిటీలో కన్నులకింపైన కార్యక్రమంలో భారతీయ యూనివర్సిటీల అసోసియేషన్ (ఏ. ఐ. యు.) అరవై రెండో వార్షిక సమావేశాన్ని ముఖ్యమంత్రి ప్రారంభించారు. విద్యా వ్యవస్థను మెరుగు పరచడానికి, విద్యా ప్రమాణాన్ని పణం పెట్టకుండా విద్యావకాశాలను విస్తృత పరచడానికి, కాలానుగుణమైన మార్పులను ప్రవేశపెట్టటానికి రాష్ట్రప్రభుత్వాలు కృషి చేయాల్సి వుందని, సహజంగానే ఇందుకు భారీమొత్తాలు అవసరమవుతాయని రామారావు అన్నారు. కేంద్ర ప్రభుత్వం అందించే ఆర్థిక మొత్తం తగినంతగానూ, ఉపయుక్తంగాను ఉండాలని ఈ సందర్భంగా ఎన్టీఆర్ చెప్పారు.

విద్యారంగాన్ని కొత్తపుంతలు తొక్కించ సంకల్పించామని అన్నార సామ్రాజ్యవాద వలసపాలకుల అవసరాలకోసం మెకాలే వందేళ్ళక్రితం ప్రారంభించిన విద్యా విధానానికి తిలోదకాలు ఇస్తామన్నారు. గుమాస్తాలుగా, టైపిస్టులుగా పని చేయటానికి. తాము చెప్పినట్లల్లా ఆడటానికి వీలుగా విద్యావంతులైన బానిసల శకాన్ని బ్రిటిష్‌వారు ప్రారంభించారని అన్నారు. ప్రభుత్వ సంస్థలపై ఆధారపడకుండా తమకు తాముగా తమకాళ్ళమీద నిలబడేలా యువకుల్లో స్ఫూర్తిని విద్య కల్గించాలని అన్నారు. కౌశలంకోసం జీవిత పర్యంతం సాగించే కృషికి విద్య పునాదికావాలని రామారావు అభిప్రాయపడ్డారు. విద్యారంగంలో రాష్ట్రప్రభుత్వం ప్రవేశపెట్టిన విప్లవాత్మక చర్యలను పేర్కొంటూ, వృత్తివిద్యకు ప్రభుత్వం ప్రాధాన్యం ఇస్తోందని, ప్లస్‌టూ స్టేజిలో వృత్తివిద్యను శీఘ్రగతిన అమలులోకి తెస్తామని చెప్పారు.

ఈ విధంగా ఇంగ్లీషునుంచి తెలుగులోకి వార్తలను రాయడం అనాలికాని అనువాదం అనటం పొరబాటు. అంటే ఇక్కడ అనువాదానికి అస్కారమివ్వ కూడదు. మూలంనుంచి వైదొలగకుండా సరళంగా తేటతెనుగులో రాయడంగా చెప్పొచ్చు. ఇక్కడ ఒకవార్త ఇస్తున్నా-చదవండి.

Stockholm, Dec 5 : (AP) Sweden signed a secret memorandum with India relinqulshing the right to suspend weapons export if India becomes involved in an armed conflict Swedish news media reported today.

దీన్ని తెలుగులో ఇలారాశారు. "స్టాక్‌హోమ్, డిసెంబరు 5 : భారత్ కనుక యుద్ధంలో పాలుపంచుకున్నట్లయితే స్వీడన్ నుంచి భారత ప్రభుత్వానికి ఆయుధాల ఎగుమతిని రద్దుచేస్తూ చట్టపరమైన చర్యలు తీసుకోకుండా ఉండేందుకు వీలుగా భారత్‌తో స్వీడన్ ప్రభుత్వం ఒక రహస్య పత్రంపై సంతకాలు చేసింది. ఈ సంచలనాత్మక వార్తను స్వీడిష్ వార్తాపత్రిక ఒకటి శనివారం వెలుగులోకి తెచ్చింది.

పై వార్త కొంత గందరగోళంగా, క్లిష్టంగా ఉంది. అసలు విషయం ఏమంటే-భారతదేశం కనుక మరోదేశంతో సంఘర్షణలో చిక్కుకుంటే, భారత్‌కు ఆయుధాల ఎగుమతిని నిలిపివేసే హక్కు స్వీడన్‌కు ఉంది. అయితే స్వీడన్ ఈ హక్కును వదులుకుంది. అలా వదులుకుంటూ భారత్‌తో రహస్యంగా ఓ అవగాహనకుకూడా వచ్చింది. ఈ సారాంశాన్ని కాస్త పెద్ద వాక్యమే అయినా ఇలా రాయచ్చు.

"స్టాక్‌హోమ్, డిసెంబరు 5 ; భారతదేశం సాయుధ సంఘర్షణలో చిక్కుకుంటే ఆదేశానికి ఆయుధాల ఎగుమతిని నిలిపివేయడానికి తనకు గల హక్కును వదులుకుంటూ స్వీడిష్ ప్రభుత్వం భారతదేశంతో రహస్య అవగాహన పత్రంపై సంతకం చేసింది. స్వీడిష్ వార్తాపత్రిక ఒకటి శనివారం ఈ విషయాన్ని వెలుగులోకి తెచ్చింది"

---

## గోడదూకిన గోపాల్

గోపాల్ అనే రాజకీయవేత్త పార్టీఫిరాయించబోతున్నాడన్న సంగతి చూచాయగా తెలిసి రిపోర్టర్ బ్రహ్మానందం చక చకా వార్తరాసి పత్రిక్కి పంపాడు. ఆ వార్త మర్నాడే రంచన్‌గా వచ్చేసింది. దాని శీర్షిక "గోడదూకిన గోపాల్." ఈ వార్తను చూసిన గోపాల్ బ్రహ్మానందానికి కబురుపంపి "ఇదేమిటయ్యా! నేను గోడదూకడమేమిటి? గోప దూకడమే నాపనా?" అంటూ విరుచుకుపడ్డాడు.

"సరేసార్! ఈరోజే ఖండనరాసి పంపిస్తాను" అని చెప్పి బ్రహ్మానందం మరో వార్త రాశాడు. అదీ ఆ మరురోజు పేపర్లో వచ్చింది.

ఆ వార్త శీర్షిక ఇలాఉంది.

"గోడదూకలేదు : గోపాల్"

# మీరు ఇలా రాయకండి

కొత్తగా పత్రికల్లో చేరిన కుర్రాళ్ళకు ఓ ఉబలాటం ఉంటుంది. తమకు మంచి భాషవచ్చని, తమ భావాలను అవకాశం వచ్చినపుడు 'ఇనుపగుగ్గిళ్ళ' వంటి పదాలను రంగరించి ప్రతిభను కనపరచుకోవాలని చూస్తుంటారు. ఇలా చకోర పక్షుల్లా ఎదురుచూసే కుర్ర జర్నలిస్టుకు "ఇదో బాక్స్ ఐటమ్‌రాయండి" అని షిఫ్ట్ ఇన్‌చార్జి ఇచ్చాడనుకోండి. ఇక ఎక్కడలేని ఆవేశం పొంగుకొస్తుంది. ఛాతి విరుచుకుంటాడు; అలవాటుంటే ఓ సిగరెట్ వెల్గిస్తాడు; అలా పైకప్పుకేసి చూస్తాడు. ఏ శ్రీ శ్రీ మహాప్రస్థానంలోని పాదాన్నో అరువుగా తెచ్చుకుంటాడు. అదే తనసొంత కవిత్వమన్నట్లుగా భ్రమిస్తాడు. వార్తలోని ప్రాణాన్ని చిత్ర హింసచేసి, వార్తసారాన్ని తనపదాడంబరంతో పిల్చి పిప్పిచేసి చివరకు పాఠకులను గంద్రగోళం, చికాకుపరుస్తాడు.

ప్రాస కోసం మీరెప్పుడూ పాకులాడకండి. (ఇందులోకూడా పాకులాట ఉంది.) మీకు తెలుగుభాష బాగావచ్చని భ్రమించకండి. (నిజంగా వచ్చి ఉండచ్చు ఆదివేరే విషయం) ఒకపదం. ఒకపోలిక వాడుతున్నామంటే సందర్భ శుద్ధిఉండాలి. అసందర్భంగా ఉపయోగిస్తే అభాసుపాలవుతాం. అయినా పాఠకుడిముందు మనం కుప్పిగంతుల సర్కస్ ఎందుకు చేయాలి. ఒక హృదయ విదార కథనే వార్తగా అందిస్తున్నామనుకోండి. ఆ విషాదాన్ని పాఠ కుడికి కళ్ళకు కట్టించేలా బాగారాయచ్చు. చాలమంది సీనియర్ జర్నలిస్టులు సైతం ఓ మూఢ నమ్మకంలో ఉన్నారు. అదేమంటే- జనాలకు తెలియని, వాళ్ళు వినని మాటలను ఉపయోగిస్తే మేధావిముద్ర పడుతుందని. కానీ ఇదితప్పు పాఠకుడి స్థాయికి అందని భాష, ప్రయోగంలోలేని మృతభాష, కేవలం కావ్యాలకే పరిమితమైన భాషను 'పాండిత్యప్రకర్ష' ముసుగులో రాసుకుంటూ పోతే వార్తమౌలిక లక్ష్యాన్ని దెబ్బతీసి, అటు పాఠకుడిని ఇటు తనను వంచించుకోవడమే అవుతుంది.

శ్రీ శ్రీ 'మహా ప్రస్థానం' యువతరాన్ని ఓ ఊపు ఊపింది. ఇప్పటికీ యువతపై గట్టిముద్ర వేస్తూనేఉంది. అత్యాధునికుడైన శ్రీ శ్రీ రాసిన మహా ప్రస్థానాన్ని చూస్తే ప్రాచీన కావ్యప్రభావం, సంప్రదాయ ప్రభావం శ్రీ శ్రీ పై ఎంతగాఉందో తెలుస్తుంది. పదండి ముందుకు- పదండితోసుకు-ఇది భజ గోవిందం భజగోవిందం నడకలో సాగినదే. అసలు విషయానికి వస్తాను. యువకులు శ్రీ శ్రీ మహాప్రస్థానంతోనే సరిపెట్టుకోక ప్రాచీన కావ్యాలపైకూడా దృష్టిసారించాలి. పునాది గట్టి పరచుకోవడం ముఖ్యం.

పత్రికలకు సంబంధించినంత వరకూ మంచి భాషఅంటే - జనాల వాడుకలో ఉన్నదే. ఆరుద్ర ఓ సభలో మాట్లాడుతూ తనకెదురైన ఓ సంఘటనను వివరించారు. అదేమంటే మరో రాష్ట్రంలో ఉన్న కూతురును చూడటానికి ఆయన వెళ్ళారట. ఓ రోజు సాయంకాలం రోడ్డుమీద అలా నడిచి వెళ్తుండగా వెనకనుంచి తెలుగుమాటలు విన్పించాయట. ఇక్కడ తెలుగుమాటా? అని పొంగిపోతూ ఆరుద్ర వెనక్కు తిరిగి చూశారట. ఓ ముసలవ్వ, పదేళ్ళ మనవరాలితో కలిసి నడిచొస్తోంది. ఆ ముసలవ్వ దగ్గర కొచ్చాక ఆరుద్ర పలకరించార్ట- "ఏమవ్వా! నీది ఆంధ్రరాష్టంలానే ఉంది. ఈ ఊరు వచ్చావేం?" అని. దానికి ఆ అవ్వ వెంటనే "రాళ్ళు మొత్తుకోటానికొచ్చానయ్యా!" అందట. ఆరుద్రకు ఒక్కక్షణం ఆ పదానికి అర్థం తట్టలేదట. రాళ్ళుమొత్తుకోవడం ఏమిటి? అనుకున్నార్ట. ఆ తర్వాత వెంటనే ఆయనకే స్ఫురించింది. రాళ్ళు మొత్తుకోవడమంటే రాళ్ళుకొట్టడం అని. ఎంత-మొత్తుకున్నా విన్లేదు అని మనంవాడుతూనే ఉంటాం. అలాంటిదే రాళ్ళుమొత్తుకోవడమూనూ. ఆరున్నదే అన్నారు. పత్రికల్లో కలెక్టివ్ ఫార్మింగ్‌కు సమష్టి వ్యవసాయం అం' రాస్తుంటారు. కాని దానికి రైతు వాడే మాట వేరు. రైతు 'పొత్తుల సేద్యంట అంటాడు అని. తెలుగు నుడికారం, తెలుగు పలుకుబడి జర్నలిస్టు ఒంటి బట్టించుకోవాలి. గ్రామీణ సంబంధాలు లేకపోయినా (పట్నవాసాల్లో పు పెరిగితే) గ్రామీణ జీవనసరళి, పదాలపై ఆసక్తి పెంచుకుని తెలుసుకోవటానికి యత్నించాలి.

బాగా చదువుకున్నవాళ్లు సైతం కొన్ని సందర్భాల్లో సరైన తెలుగు పదం దొరక్క ఇంగ్లీషు వాడేస్తుంటారు. కానీ మీరు పల్లెపట్లలో చూస్తే నికార్సయిన తెలుగు అలా దూకుతుంటుంది. ఇక వార్తలు రాసేటపుడు ఉపోద్ఘాతాలు అనవసరం.

ఓ ఉపోద్ఘాత వార్తను మీరే చదవండి.

"ప్రభుత్వాలు మారుతూనే ఉన్నాయి. రాజ్యాంగ నిపుణులు కొత్త కొత్త శాసనాలను ప్రవేశపెడుతున్నారు. రాష్ట్రంలో గ్రామస్థాయి నాయకుని నుంచి, ముఖ్యమంత్రి వరకు, తెలుగింటి ఆడపడచులకు ఎలాంటి అన్యాయం జరుగదని పదే పదే చెప్తున్న గంభీరోపన్యాసాలు మన చెవులు వింటున్నా, మన కళ్ల ముందు అంతకు రెండింతలు మన కళ్లముందే జరుగుతున్నా చూస్తూ ఊరుకుంటూనే యున్నాం. మరి వీటికి అంతం ఎప్పుడో కాని .... అలాంటి కోవకే చెందిన గొడుగు రాజమ్మ (18) సంవత్సరాల వివాహిత యువతిని భర్త, అత్తమామలు చిత్రహింసలు పెట్టి, ఎక్కడో మాయం చేశారని వాపోతూ

ఆమె తండ్రి గొడుగు వెంకటయ్య పత్రికల వారిముందు తన గోడు వెళ్ళ బోసుకున్నాడు...."

ఇదికాక అసలు వార్త చాలా ఉంది. ఈ వార్త ఓ రాజకీయ నాయకుడి ప్రసంగ సరళిలా ఉంది తప్ప, విలేకరి ఉపోద్ఘాతం అసలు వార్తకు ఏ విధం గానూ ఉపకరించదు.

మరో మచ్చుతునక

"మరో రూప్‌కన్వర్ మన రూపాయి!!

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 6: కలువ చంద్రుడు, కమలం సూర్యుడు అడవిలో ఉసిరి సముద్రం ఉప్పుల ప్రేమకథ యుగాల పాతది. ఆ నింగినే ఈ నేలకు ముడేసి భావుకులు రసమయ కవితల్లి జగతిపై సిరివెన్నెలలు చిలికించారు. అలాంటి అనుబంధాన్నే ఇప్పుడు డాలర్‌కు రూపాయికి ముడే శారు జనతా నాయకుడు మధుదండావతే. 'డాలర్ చనిపోతే దాంతోపాటు రూపాయి సహగమనానికి పాల్పడుతోంది' అనే వ్యాఖ్యచేసి ఆయన పార్ల మెంటులో నవ్వులు పూయించారు.

'సతి' సంఘటనను దృష్టిలో పెట్టుకుని మధుదండావతే రూపాయికి డాలర్‌కీ పోలిక తెచ్చారు. ఆ వార్త రాసిన సబ్-ఎడిటర్ మాత్రం అంతటితో సరిపెట్టుకోలేదు. పోలికల్లో మధుదండావతేను మించిపోవాలని తాపత్రయ పడ్డాడు. అందుకే కలువ చంద్రుడిని కమలం సూర్యుడిని, అడవిలో ఉసిరిని, సముద్రంలోని ఉప్పుని తెచ్చి పోపు పెట్టాడు. ఫలితంగా అసలు వార్త పాలు తగ్గిపోయి సబ్-ఎడిటర్ కవిత్వం పెరిగింది.

ఇంకో వార్త చూద్దాం.

"శుభాభినందనలకు కరవు దండం"

న్యూఢిల్లీ, డిసెంబర్ 18:
పంట పొలాల్లో
కరవు రాక్షసి ఇనుపగజ్జల
సవ్వడి మిన్నంటుతున్న
ఆకలి దండెత్తి
అస్థిపంజరాలని కూల్చేస్తున్న
అన్నపూర్ణ ముద్దుబిడ్డలు

ముద్దకు దూరమై ఆకలిచావులు చస్తున్నా
పాత సంవత్సరానికి వీడ్కోలు :
కొత్త వసంతం వేడుకలు ::
మామూలుగా జరిగే తంతే
గ్రీటింగ్ కార్డులు, మందు పార్టీలు
దుబారా ఖర్చులు మన వేలం వెర్రి
మచ్చుతునకలు
అయితే ఈ ఏడాది
గ్రీటింగ్ కార్డులు పంపకూడదని
ప్రధాని తీసుకున్న నిర్ణయం అభినందనీయం.

తనకు వచ్చే లెక్కకుమించిన గ్రీటింగ్స్‌కు ఆయన సమాధానాలు గానీ, గ్రీటింగ్స్ కానీ పంపడం లేదు. దేశంలో కరవు కరుడుగట్టినందున ప్రధాని రాజీవ్ ఈ నిర్ణయం తీసుకున్నారు. దేశప్రజలకు, తమ మిత్రులకు ఆయన పత్రికల ముఖంగానే శుభాకాంక్షలు తెలపాలని నిశ్చయించుకున్నారు." ఈ వార్త రాసిన సబ్-ఎడిటర్ ఎవరో గానీ తను రాస్తున్నది కవిత్వమని రూఢి చేసుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

పదాలను కూడా విరిచి కవిత్వంలా రాసుకొచ్చేశాడు. దేశంలో దుర్భిక్షం తాండవిస్తున్నందున పొదుపు చర్యల్లో భాగంగా ఈ ఏడాది ప్రధాని రాజీవ్ గ్రీటింగ్ కార్డులు పంపకూడదని నిశ్చయించుకున్నారు. అదీ అసలు వార్త. సబ్-ఎడిటర్ ఓ అడుగు ముందుకేసి అలా నిర్ణయం తీసుకున్న ప్రధానిని అభినందించేశారు కూడా. ఆ అభినందనకు ముందు కరువు గురించి ఏకరువు పెట్టాడు. ఒక వార్తవస్తే దాన్ని అన్ని కోణాల్లోంచి నిశితంగా పరిశీలించాలి. గ్రీటింగ్ కార్డులు పంపకూడదని రాజీవ్ నిర్ణయించుకున్నారు. బానే ఉంది. అయితే అలా గ్రీటింగ్ కార్డులు పంపకపోవడంవల్ల ఎంత ఆదా చేస్తారు. ఎంతో కొంత ఆదా అవుతుంది కదా. అని వాదించవచ్చు. ఓ పక్కన ఆయుధ ఒప్పందాల్లో లక్షలు, కోట్లు చేతులు మారాయంటున్నారు. ఇలా అక్రమాలతో ప్రజాధనం దుర్వినియోగం ఎంత ? మనం చేసే ఆదా ఎంత ? నేనేదో నిరాశతోనో, రాజీవ్ వ్యతిరేకభావంతోనో ఈ మాటలు చెప్పడం లేదు. మనం ఒక విషయాన్ని స్పందించవలసిన రీతిలో స్పందిస్తేనే బావుంటుంది. ఎక్కువ స్పందిస్తే ఇదిగో మీరే చూశారుగా అలా అర్థం పర్థంలేని కవిత్వం ధారను కప్పేస్తుంది.

సిగరెట్‌లకు సంబంధించిన ఓ వార్తలో వ్యాఖ్యానం చూద్దాం.

"సిగరెట్ ప్రియులకు కష్టాలే మరి"

న్యూఢిల్లీ, డిసెంబర్ 18 : ఇందు కలదు అందు లేదను సందేహం వలదన్నట్లు సిగరెట్ల పొగ గింగుర్లు తిరగని చోటు అంగుళం కన్పించదు భూమండలమంతా వెతికినా. ఆరోగ్యానికి హాని అని సాక్షాత్తు సిగరెట్ పెట్టెల పైనే ప్రచారం చేస్తున్నా పొగభక్తులు మాత్రం తగ్గడం లేదు. అయితే విమానాల్లో తిరిగే బంగారు బాబులకు ఆశనిపాతంవంటి నిర్ణయం ప్రభుత్వం తీసుకోబోతుంది. విమానాల్లో పొగ తాగడాన్ని నిషేధించవచ్చని కేంద్ర విమానయాన శాఖామంత్రి శ్రీ జగదీష్ టిట్లర్, ఇండియన్ ఎయిర్‌లైన్స్ ఛైర్మన్ శ్రీ రాహుల్ బజాజ్ ఇక్కడ గురువారంనాడు జరిగిన సలహాదారుల సమావేశంలో చెప్పారు."

సిగరెట్ల పొగ గింగుర్లు తిరగని ప్రదేశం అంగుళమైనా కన్పించదనటం అతిశయోక్తి. ఆ లెక్కన చూస్తే మనచుట్టూ ఇల్లూవాకిలి, స్కూళ్లు, ఆస్పత్రులు అన్నీ సిగరెట్ పొగ ఆవరించి ఉండాలి. విమానాలెక్కేవాళ్లు బంగారు బాబులట. ఆఫీసు పనులమీద ఆఫీసు ఖర్చులతో విమానాల్లో వెళ్లే మధ్యతరగతి జీవులు, ఏ చావుకబురో అందుకుని ఆదరాబాదరాగా విమానాల్లో వెళ్లే సామాన్యుల సంగతి సబ్-ఎడిటర్ మరిచిపోయాడు. ఈ వార్తను ఇలా రాయవచ్చు. విమాన ప్రయాణికులు ఇప్పటినుంచే సిగరెట్ అలవాటును మానుకుంటే అన్నిరకాలుగా మంచిది ముందు విమానాల్లో పొగ తాగడాన్ని నిషేధించనున్నారు. అలవాటు ఉన్నవాళ్లకు అప్పుడు విమాన ప్రయాణం ఇబ్బందిగా ఉంటుంది కనుక ఇప్పటినుంచే సిగరెట్ల అలవాటుకు స్వస్తిచెప్తే అది ఆరోగ్యానికీ మంచిది." ఈ పంథాలో వార్తరాస్తే కొంతలో కొంత మెరుగు. ఇవేవీ లేకుండా విషయమేమిటో చెప్పేయడం మరీ మంచిది.

మీరు మాత్రం అలా కవిత్వం ఒలకపోయకండి. సాదాసీదాగా చెప్పండి. సందర్భానికి తగ్గట్లు భాషను వాడండి. 'అల్పాక్షరం అనల్పార్థం' ముఖ్యం. తక్కువ పదాలతోనే ఆకట్టుకునేలా చేయడానికి సాధన, శోధన అవసరం. అందుకు కృషి చేయాలి తప్ప 'భేషజాలు' పెట్టుకుని ఏదో వచ్చనుకోవడం ఆత్మహత్యకన్నా పాపం.

# శీర్షికలతో సిగపట్లు

వార్తలు రాయడం ఒక ఎత్తయితే, ఆ వార్తలకు ఆకర్షణీయంగా శీర్షికలు రాయడం మరో ఎత్తు. శీర్షికల విషయంలో ఒక్కో పత్రికా ఒక్కో శైలిని అనుసరిస్తుంది. సబ్ ఎడిటర్ నిర్వర్తించే ప్రధాన విధులలో వార్తలకు శీర్షికలు రాయడం కూడా ఒకటి. చాలామంది పాఠకులు కేవలం శీర్షికలు మాత్రమే తిరగేసి పత్రికను పక్కన పెడతారు. ఈ కారణానే శీర్షిక-వార్త లోని మూలసారాన్ని పట్టివ్వగలగాలి. దీనికి అర్థం వార్త అంతా శీర్షికలోకి రావాలని కాదు. అలా చేస్తే వార్త చదవాలన్న ఆసక్తి పాఠకుడికి కొరవడు తుంది. శీర్షిక వార్తపట్ల ఉత్సుకతను, ఆసక్తిని రేకెత్తించేదిగా వుండాలి. అయితే శీర్షికలు వార్తను పెడదారి పట్టించే ప్రమాదాన్ని రానివ్వకూడదు. సంచలనం సృష్టించాలన్న తపనతో లేదా కొన్ని సందర్భాలలో తెలిసో తెలి యకో - ర్తల శీర్షికలను రాస్తే అవి పెద్ద అలజడిని సృష్టిస్తాయి. పత్రికల ప్రతిష్ఠ దెబ్బతీస్తాయి ఏ మత ఘర్షణకు సంబంధించిన వార్తకో సంచలనం కోసం ఒక వర్గంవారిని కించపరిచే విధంగా లేదా రెచ్చగొట్టే విధంగా శీర్షిక వుంచితే జరిగే పరిణామాలను ఎవరైనా ఊహించవచ్చు. కేవలం ఆ శీర్షిక కారణంగా తాజాగా అల్లర్లు చోటుచేసుకోవచ్చు. సమాజంపట్ల బాధ్యత దృష్ట్యా శీర్షికల విషయంలో అప్రమత్తత అవసరం.

తను రాసిన శీర్షికలకే కాక రిపోర్టర్ అందజేసిన వార్తలకు సైతం హెడ్డింగ్‌లు రాయవలసిన బాధ్యత సబ్ ఎడిటర్‌దే. బాగా వార్తలు రాయ గలగడంతోపాటు బాగా హెడ్డింగ్‌లు రాయడం కూడా అభ్యాసంతో సాధించ వలసిన విద్య. నిజానికి ఇది మంచి శీర్షిక అని ఒక నిర్వచనం ఇవ్వ వీల్లేదు. హెడ్డింగ్‌కు అనేక పరిమితులున్నాయి. హెడ్డింగ్ కేవలం మూడు కాలమ్స్ లోనే ఇవ్వాల్సి వుంటుంది అనుకుందాం. అదీ సిక్స్ పాయింట్ లో వార్తసారం పోకుండా హెడ్డింగ్ రాయడంలో నేర్పరితనం తెలుస్తుంది.

మంచి శీర్షికలు రాయడానికి సృజనాత్మక శక్తి అవసరం. దాంతో పాటు తెలుగు భాషమీద ఆధిపత్యం వుండాలి, తెలుగు నుడికారాన్ని తెలుసు కుని వుండాలి. సామెతలు వగైరా కంఠోపాఠంగా వుంటే మంచిది. ప్రత్యా మ్నాయ పదాలు నాలుకమీద నాట్యంచేస్తూ వుండాలి. ఫలానా సైజు అక్షరాలు ఇంత నిడివి (ఇన్ని కాలాల్లో) లో ఇన్నికంటే మించి సరిపోవు అని వుంటుంది. ఉదాహరణకు సిక్స్ పాయింట్‌లో మూడుకాలాల హెడ్డింగ్ రాయాలంటే 12 అక్షరాలకు మించి పట్టవు. వీటిలో కొన్ని పెద్ద అక్షరాలు మరికొన్ని చిన్న

అక్షరాలు వుంటాయి. 'క' అనేది చిన్న అక్షరం అయితే 'య' అనేది పెద్ద అక్షరం. ఇది సైజుకి సంబంధించి మాత్రమే.

శీర్షికను ఆలోచించి కష్టపడి రాశాక ఒకటో రెండో అక్షరాలు ఎక్కువ కావచ్చు. వ్యవధి తీసుకోకుండా, భావం చెడిపోకుండా ఆ శీర్షికలో తగు మార్పులు చేయాలి. ఈ సందర్భంగా ప్రత్యామ్నాయ పదాలు, సమానార్థకాలు ఎంతగానో ఉపకరిస్తాయి.

శీర్షికలతో సిగపట్లు వడే సబ్ ఎడిటర్ తెలుగు పద్యకావ్యాలు, వచన కవిత్వం బాగా ఒంట పట్టించుకుంటే చాలావరకు పదజాలం పెంచుకోవచ్చు. ఆకర్షణీయంగా శీర్షికలు దిద్దడం ఓ ఆర్ట్. నిరంతర పరిశ్రమతో ఆ ఆర్ట్‌ను అందిపుచ్చుకోవాలి. భాషమీద ఆధిపత్యం, వార్తాసారాన్ని అవగాహన చేసుకోవడం వంటి మెళకువలతో శీర్షికలతో పెద్దగా సిగపట్లు లేకుండా సాఫీగా బండి లాగించ వీలుంది,

శీర్షికలకు సంబంధించిన ప్రాథమిక సమాచారం: ప్రతి పేజి ఎనిమిది కాలమ్స్‌లో విభజించి వుంటుంది. పతాక శీర్షికను వార్త ప్రాముఖ్యాన్నిబట్టి ఎనిమిది కాలమ్స్‌లో లేదా ఆరేడు కాలమ్స్‌లో ఇస్తుంటారు. శీర్షికలకు వాడే టైప్ వివిధ సైజుల్లో ఉంటాయి ఎయిటీన్, ట్వంటీఫోర్, థర్టీసిక్స్, ఫార్టీ ఎయిట్, సిక్స్టీ, సెవెన్‌టీటూ, ఎయిటీఫోర్, వన్‌నాట్ ఎయిట్ పాయింట్ అని అక్షరాల సైజుల్నిబట్టి వ్యవహరిస్తుంటారు. సాధారణంగా ఎయిటీన్, ట్వంటీ ఫోర్ పాయింట్స్‌ను సింగిల్ కాలమ్ హెడ్డింగులకు మాత్రమే ఉపయోగిస్తారు. థర్టీసిక్స్, ఫార్టీఎయిట్ పాయింట్స్‌ను రెండు కాలాలు లేదా మూడు కాలాల నిడివిలో విస్తరించి వున్న హెడ్డింగులకు వాడతారు. అలాగే సిక్స్టీ పాయింట్‌ను మూడు కాలాలు ఆపై నిడివిలో ఉపయోగిస్తారు. ఒక్కో సైజు అక్షరాలు సింగిల్ కాలమ్‌కైతే ఇన్ని, డబుల్ కాలమ్‌కైతే ఇన్ని సరిపోతాయన్న ఉజ్జాయింపు అంచనా వుంటుంది. ఎయిటీన్ పాయింట్ సైజులో సింగిల్ కాలమ్ కయితే పన్నెండు అక్షరాలవరకు సరిపోవచ్చు. అలాగే ట్వంటీఫోర్ పాయింట్‌లో సింగిల్ కాలమ్‌లో ఎనిమిది, తొమ్మిది అక్షరాలకుమించి పట్టవు. థర్టీ సిక్స్ డబుల్ కాలమ్‌లో 12 అక్షరాలు, ఫార్టీఎయిట్ డబుల్ కాలమ్‌లో

తొమ్మిది అక్షరాలు పడతాయి. అయితే ఈ సంఖ్య అన్నివేళలా వర్తించక పోవచ్చు. అక్షరాలు పెద్దా, చిన్నా బట్టి ఒక్కోసారి అటూ ఇటూగా మారవచ్చు. గుర్తుంచుకోవలసిన మరో ముఖ్యవిషయం-శీర్షికల్లో వ్యాఖ్యానానికి తావు ఇవ్వరాదు. అలాగే ఒక సంఘటన అంతగా తెలియని ఒక చిన్న వూళ్లో జరిగినపుడు శీర్షికలో ఆ వూరు పేరు ఇవ్వడం అనవసరం. విజయవాడలో ట్రాఫిక్ నేరాలు లేదా విజయవాడలో ఎండలు అనేది సమగ్ర శీర్షిక కాదు. విజయవాడలో ట్రాఫిక్ నేరాల పెరుగుదలలో లేదా తరుగుదలలో అలాగే విజయవాడలో ఎండల తీవ్రతో సమగ్ర శీర్షిక అవుతుంది. కొన్ని హెడ్డింగ్‌లు కేవలం వ్యాసాలకు మాత్రమే పనికి వస్తాయి. ఆ తరహా హెడ్డింగ్‌లు వార్తలకు ఉపకరించవు. ఉదా : 'స్వాతంత్ర్యోద్యమం నాటి స్మృతులు' వంటివి.

---

## తీపి ఓటమి

ఓ పత్రికలో ఎడిటర్‌కూ, ఆ పత్రిక బాస్‌కూ మధ్య ఓ ఒప్పందం ఉండేది. పాఠకులు తెలుసుకోదలచిన వార్తను కనుక మిస్ అయితే ఎడిటర్ డెస్క్‌లో అందరికీ టీ తెప్పించాలి.

ఆ రోజు బాస్, డెస్క్‌లోకి వచ్చి "ఫలానా వార్త మిస్సయ్యారు. టీ తెప్పించండి" అన్నారు.

ఎడిటర్ ఓ క్షణం ఆలోచించి-

"ఆ వార్తా? అయితే మీరే టీ తెప్పించండి" అన్నారు.

బాస్ మాట్లాడకుండా టీ డబ్బులు బల్లమీద ఉంచి తన గదిలోకి వెళ్ళిపోయారు.

పక్కనున్న కొలీగ్‌కు ఇదేమీ అర్థం కాలేదు. అదే విషయాన్ని ఎడిటర్ దృష్టికి తేగా-

"ఆ వార్త పేపర్లో వచ్చిందయ్యా! మన బాస్ సరిగా చూడలేదు. ఆయన్ను టీ తెప్పించమనగానే తను పొరబడిన విషయం గ్రహించారు. ఇదిగో ఆ వార్త క్లిపింగ్‌ను బాస్‌కు పంపిస్తున్నా" అని వివరించారు ఎడిటర్.

ఇది ఆ బాస్‌కు తీపి ఓటమి.

---

# అచ్చుతప్పుల అమీతుమి

రక్తదానమయ్యా ఎడిటరూ.




కంపోజ్ చేసిన వార్తలను ఓ గ్యాలీలో ఉంచుతారు. ఆ గ్యాలీని ప్రూఫ్ తీస్తారు. ఆ ప్రూఫ్‌ను అసలు వార్త కాపీతో పోల్చిచూసి తప్పులు వస్తే సరి దిద్దడాన్నే ప్రూఫ్ రీడింగ్ అంటారు. ప్రూఫ్‌లు దిద్దేవారినే ప్రూఫ్‌రీడర్స్ అని పిలుస్తారు. ఇప్పుడు ఫోటో కంపోజింగ్ వచ్చాక గ్యాలీలు, చేతి ప్రూఫ్‌లతో పనిలేదు. లైన్‌ప్రింటర్ ద్వారా ప్రూఫ్ వస్తోంది.

ప్రూఫ్‌రీడర్‌లు కూడా వర్కింగ్ జర్నలిస్ట్ శ్రేణిలోని వారె. కనుక సెలవులు, జీతాల విషయంలో సబ్ ఎడిటర్లతోపాటు చాలామేరకు లబ్ధిపొంద వీలుంది. సాధారణంగా ఒకరు ఒరిజినల్ వార్తను ఫాలో అవుతుంటారు. ఇతనిని కాపీహోల్డర్ అంటారు. రెండో వ్యక్తి ప్రూఫ్‌ను చదువుతూ తప్పులను సరిదిద్దుతాడు. ఇతనిని రీడర్ అంటారు.

విలేకర్లు, సబ్ ఎడిటర్‌లు అక్షరాలు ముత్యాల్లా లేకపోయినా విడివిడిగా అర్థమయ్యేట్టు రాస్తే కొంతవరకు కంపోజిటర్ పని సులువవుతుంది. కంపోజ్ చక చకా సాగుతుంది. కంపోజిటర్‌కు రాత అర్థం కాకపోతే పని కుంటు పడుతుంది. ఒక్కోసారి అతను మరో పదం అనుకుని పొరబడి ఆ విధంగా కంపోజ్ చేయవచ్చు. ఇందువల్ల లేనిపోని కాలయాపన అవుతుంది. ఒక్కోసారి ప్రూఫ్‌రీడర్లు పని ఒత్తిడి వల్ల యాంత్రికంగా చదివేస్తూ ఉంటారు. అయితే వార్త రాసిన సబ్‌ఎడిటరో, విలేకరో పొరబాటున తప్పు రాసినా, వాక్య నిర్మాణం సరిగ్గా లేకపోయినా గంద్రగోళం, అసందిగ్ధం నెలకొని వున్నా ఆ విషయాన్ని వార్తరాసిన వ్యక్తి దృష్టికి తెచ్చి దాన్ని సరిచేయడానికి యత్నించాలి.

# పేజీకి ముస్తాబు

వార్తల ప్రాముఖ్యాన్ని బట్టి పేజీల్లో ఆకర్షణీయంగా పాఠకులను ఆకట్టుకునే విధంగా వాటిని కూర్చే పద్ధతినే 'మేకప్' అంటారు. మేకప్ విషయంలో ఒక్కో పత్రిక ఒక్కో తరహా శైలిని, సరళిని అనుసరిస్తుంటుంది. సాధారణంగా మేకప్‌లో మౌలిక సూత్రం-డబుల్ కాలమ్ పక్కన త్రిబుల్ కాలమ్ హెడ్డింగ్‌తో వార్త ఉండకూడదు. డబుల్ కాలమ్‌కు, త్రిబుల్ కాలమ్‌కు మధ్య సింగిల్ కాలమ్ తప్పనిసరిగా ఉండాలి. లేని పక్షంలో రెండు వార్తల హెడ్డింగ్‌లు కలిసిపోయే ప్రమాదం ఉంది. మేకప్‌ను ఎన్ని రకాలుగా అయినా చేయవచ్చు. అది ఎడిటర్ ఊహాశక్తి మీద, అనుభవం మీద ఆధారపడి ఉంది. మేకప్‌లో ప్రధానంగా పేజీ బ్యాలెన్స్ కావాలి.

అంటే ఒక పేజీని రెండు అర్ధ భాగాలుగా విభజించి చూస్తే పై భాగంలో పెద్ద పెద్ద హెడ్డింగ్‌లు ఉండి కింద దానికి తగ్గట్టుగా హెడ్డింగ్‌లు లేకపోవడం ఒక విధంగా బ్యాలెన్స్ తప్పినట్లే. అలాగే 'బాక్స్' ఐటమ్‌లు కూడా పేజీకి అందం తెస్తాయి. ఫోటోలు కూడాను. హ్యూమన్ ఇంటరెస్ట్ స్టోరీలు వంటి ప్రత్యేక తరహా వార్తలు, బాక్స్ కట్టి ఇవ్వటానికి పనికివస్తాయి. మీరు కొన్ని ప్రముఖ దినపత్రికల మొదటి పేజీలను గమనించండి. వార్తలు పొందికగా ఉన్నాయో లేదో స్వయంగా అవగాహన చేసుకోవచ్చు. వార్తా పత్రికలో వార్తలను బట్టి మేకప్ చేసి తదనుగుణంగా పేజీలో వార్తలను ఇంపోజర్ చేత కూర్చటం న్యూస్ ఎడిటర్ విధి. నైట్ డ్యూటీలో షిఫ్ట్ ఇన్‌ఛార్జి ఈ బాధ్యత నిర్వర్తిస్తాడు.

---

## ఇది నిజంగా జరిగింది

సి.ఆర్. నాయుడు ఒకప్పుడు గుంటూర్లో "ఈనాడు" విలేకరిగా పనిచేశారు. ఓపూట ఆయన పొగాకు బోర్డుమీద వార్త రాసి పంపితే పేపర్లో వచ్చింది.

ఆ రోజు పొగాకుబోర్డునుంచి నాయుడికి ఫోను వచ్చింది.

"సార్! మా బోర్డు గురించి మీ పేపర్‌లో వార్త రాశారు. దాని సోర్స్ చెప్తారా?"

"సోర్స్ చెప్పడం కుదరదండి" అని నాయుడు ఫోన్ పెట్టేశారు.

నిజానికి ఆ వార్తకి ఆధారం పొగాకుబోర్డే. వారు టొబాకో న్యూస్ పేరిట మాగజైన్ తెచ్చేవారు. ఆ మాగజైన్‌లోని సమాచారాన్ని తీసుకుని నాయుడు వార్తగా మలిచారు. పేపర్లో వచ్చిన వార్తకు తమ మాగజైనే ఆధారం అన్న విషయం వారికి స్ఫురించలేదు.

---

# పత్రికకు పెద్దతలకాయ

సంపాదకుడికి సహాయ సంపాదకులు ఉన్నప్పటికీ వార్తా పత్రికలో 'న్యూస్ ఎడిటర్'దే ద్వితీయ స్థానం. పత్రికలో చోటు చేసుకునే వార్తలకు, వాటి నాణ్యతకు నైతిక బాధ్యత వహించేది న్యూస్ ఎడిటరే. వార్తలకు సంబంధించి కీలక వ్యక్తి ఈయనే. పత్రికను సకాలంలో వెలువరించటం, సంపాదక వర్గంపై అజమాయిషీ, సెలవుల మంజూరు వగైరా బాధ్యతలను కూడా న్యూస్ ఎడిటర్ నిర్వర్తించ వలసి ఉంటుంది. అలాగే వివిధ పనుల మీద పత్రికా కార్యాలయాలను సందర్శించే వారితో పత్రిక తరఫున (వార్తలకు సంబంధించిన విషయాలు) మాట్లాడే వ్యక్తి కూడా న్యూస్ ఎడిటరే. ఫలానా వార్త మమ్మల్ని కించ పరిచే విధంగా ఉందనో లేదా ఆవార్తలో మా వాదనకు సముచిత ప్రాధాన్యత ఇవ్వలేదనో, మా ఊళ్లోని మీ విలేకరి పక్షపాతం చూపు తున్నాడనో ఫిర్యాదులు చేస్తూ కొందరు న్యూస్ ఎడిటర్‌ను న్యాయం కోసం సంప్రదించే సందర్భాలు ఉంటాయి. ఇలాంటి సమయాన పత్రిక ప్రతిష్ఠను దృష్టిలో ఉంచుకుని ఫిర్యాదు చేయటానికి వచ్చిన వారి వాదనలను న్యూస్ ఎడిటర్ సావధానంగా వినగలగాలి. ఆ తర్వాత తత్సంబంధిత విలేకరిని కూడా సంప్రదించి అతని ప్రతివాదన తెలుసుకోవాలి. ఉభయుల వాదనలు విన్నాక ఎవరిది సమంజసమో నిర్ణయించ వీలుంది. నిజంగానే కొందరు వ్యక్తుల పట్ల విలేకరి పక్షపాతం చూపుతున్నాడని రుజువైతే భవిష్యత్‌లో ఆ పొరపాట్లు సరిదిద్దుకోవలసిందని విలేకరిని మందలించవచ్చు. ఇలా ఆరో పణలు వచ్చిన విలేకరి భవిష్యత్‌లో పంపే వార్తలపై ప్రత్యేక దృష్టి ఉంచి వార్తలు సమతూకంలో ఉన్నదీ లేనిదీ నిర్ణయించుకొని ప్రచురణకు పంప వీలుంది.

సామాన్యంగా న్యూస్ ఎడిటర్ పగలు షిఫ్టులో తన విధులకు హాజరవు తుంటాడు. అయినప్పటికీ అవసర సమయాల్లో అన్నివేళలా ఆయన సలహాలు, సేవలు, సూచనలు సహచర సిబ్బందికి అందజేస్తూనే ఉంటారు. కొన్ని ప్రత్యేక సందర్భాల్లో ప్రముఖ విశేషాలు చోటు చేసుకున్నపుడు (ఉదా : ఎన్ని కల ఫలితాలు వగైరా) న్యూస్ ఎడిటర్ నైట్ షిఫ్టులో కూడా కొనసాగుతారు. సాధారణంగా న్యూస్ ఎడిటర్ ఇంటికి టెలిఫోన్ సౌకర్యం కల్పిస్తారు. ఆయన డ్యూటీనుంచి ఇంటికి వెళ్లాక సహచర సిబ్బంది, వార్తలకు సంబంధించి ఏవైనా అనుమానాలు తలెత్తినా లేదా సలహా కోర వలసి వచ్చినా ఇంటికి ఫోనుచేసి నివృత్తి చేసుకుంటారు. అలాగే న్యూస్ ఎడిటర్ ఇంటివద్ద ఉన్నప్పుడు రేడియో తదితర ప్రచారసాధనాల ద్వారా ముఖ్యమైన వార్తలు ఆయన దృష్టికి

రావచ్చు. అటువంటి సమయంలో ఆయన ఆఫీసుకు ఫోనుచేసి ఆ వార్తలు వచ్చిందీ లేనిదీ విచారించి అప్రమత్తం చేయ వీలుంది.

చీఫ్ సబ్ ఎడిటర్ లేదా షిఫ్టు ఇన్‌చార్జి సబ్ఎడిటర్‌ల చేత రాయించే వార్తలన్నీ న్యూస్ ఎడిటర్ దృష్టికి వస్తాయి. సబ్ ఎడిటర్లు రాసిన వార్తలను న్యూస్ ఎడిటర్ కంపోజింగ్ సెక్షన్‌కు పంపేముందు ఓమారు చదువుతాడు. వార్తలో ఎక్కడైనా సరళత లోపించినా అనుమానాలేవైనా ఉన్నా వాటిని ఆ వార్త రాసిన సబ్ఎడిటర్ దృష్టికి తెచ్చి సరిదిద్దటానికి న్యూస్ ఎడిటర్ యత్నిస్తాడు. ఒకవేళ షిఫ్టు ఇన్‌చార్జి వార్త రాయించినా అది పాఠకులకు అంతగా అవసరం లేదు అని భావించినపుడు న్యూస్ ఎడిటర్ ఆ వార్తను కంపోజింగ్‌కు పంపకుండా నిలిపివేయవచ్చు. అలాగే ఒక్కోరోజు ప్రకటనలు ఎక్కువగా ఉండి వార్తలకు చోటు తక్కువగా ఉన్నప్పుడు సైతం తదనుగుణంగా ముఖ్యమైన వార్తలను సంక్షిప్తంగా రాయమని న్యూస్ ఎడిటర్ ఆదేశిస్తాడు. అలాగే ఆ రోజు పేపర్లో ఏయే ఫోటోలను ప్రచురించాలో కూడా నిర్ణయిస్తాడు. విలేకరులు కొన్ని వార్తలతోపాటు ఆ వార్తకు సంబంధించిన ఫోటోలు పంపిస్తారు. ఉదా: తమ ఊళ్లో జరిగిన లారీ ప్రమాదం గురించిన వార్తతో పాటు ఫోటో జత చేయవచ్చు. కొన్ని సందర్భాల్లో వార్తముందు పంపి ఫోటో ఆ తర్వాత పంపవచ్చు. ఫోటో బాగా ఆలశ్యంగా అందినా లేక ప్రచురించవలసిన అవసరం లేదని భావించినా న్యూస్ ఎడిటర్ పక్కన ఉంచవచ్చు. ఒక్కొక్కప్పుడు ప్రచురించ నిర్ణయించినా సాంకేతిక కారణాల వల్ల ఫోటోను ఉపయోగించలేని సందర్భాలు ఉంటాయి. పౌర సంబంధాల శాఖ వారు, రాష్ట్ర ప్రభుత్వానికి చెందిన మంత్రులు, ప్రభుత్వ శాఖల కార్యకలాపాలకు సంబంధించిన చాలా ఫోటోలను అంద చేస్తుంటారు. కేంద్ర ప్రభుత్వ అధీనంలోని ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో వారుకూడా కేంద్ర ప్రభుత్వ శాఖలు, కేంద్ర మంత్రులు, ప్రధాని వగైరా ప్రముఖులు పాల్గొన్న కార్యకలాపాల ఫోటోలు పత్రికలకు అందజేస్తుంటారు. వీటిలో ఉపయోగించ దలచిన వాటిని న్యూస్ ఎడిటర్ ఎంపిక చేస్తాడు. కొన్ని సందర్భాల్లో తమకు కావలసిన ఫోటోలను స్టాఫ్ ఫోటోగ్రాఫర్‌కు చెప్పి తీయించుకుంటారు. ఉదాహరణకు వేసవికాలం సందర్భంగా వరుసగా కొన్ని రోజుల పాటు ఫోటోలు ప్రచురించ దలిచినపుడు తనకు ఏ యే ఫోటోలు ఏయేరీతుల్లో కావాలో ఫోటోగ్రాఫర్‌కు చెప్పి న్యూస్ఎడిటర్ రప్పించుకుంటాడు. చీఫ్ రిపోర్టర్‌తో చర్చించి ప్రత్యేక వార్తలకోసం తగు ఏర్పాటు చేస్తాడు. ఈ బాధ్యతలు కాకుండా డమ్మీని ఆధారం చేసుకుని ఏ పేజీల్లో ఏ వార్తలు ఉంచాలో నిర్ణయించ వలసిన బాధ్యత కూడా న్యూస్ ఎడిటర్‌దే. రేపటి పత్రికలో ఏ పేజీలో ఎన్ని ప్రకటనలు ఉన్నదీ, అవి పోనూ వార్తలకు ఎంత

ఖాళీ ఉన్నదీ తెలియచేసే నమూనాను డమ్మీ అంటారు. ఈ డమ్మీ ఆధారం తోనే మొదటి పేజీని ప్రత్యేక శ్రద్ధతో అలంకరిస్తారు. ఈ అలంకరణనే మేకప్ అంటారు. ఆ రోజు వచ్చిన వార్తల్లోంచి ముఖ్యమైనవి ఎన్నుకుని మొదటి పేజీకి కేటాయిస్తారు. ఆ మొదటి పేజీ వార్తల్లో మరీ ముఖ్యమైన వార్తను పతాక శీర్షిక (బానర్) చేస్తారు.

సబ్ ఎడిటర్‌ల షిఫ్టులు నిర్ణయించటం, వారికి వీక్లీ ఆఫ్‌లు కేటాయించ టం సెలవులు మంజూరు చేయటం న్యూస్ ఎడిటర్ నిర్వర్తించే ఇతర విధులు. మొత్తం మీద పత్రిక సకాలంలో సాఫీగా వెలువరించే సూత్రధారి న్యూస్ ఎడి టరే. పత్రిక క్వాలిటి, ప్రతిష్ట న్యూస్ ఎడిటర్ భుజస్కంధాలపై ఆధారపడి ఉంది. ఎట్టి ఒడిదుడుకులు ఎదురైనా, తీవ్ర సంచలనం కలిగించే వార్త వచ్చినా తను మాత్రం చెక్కుచెదరకుండా నిగ్రహంతో నిబ్బరంతో ఉండి సహచరులకు మార్గదర్శిగా ఉండేవాడే మంచి న్యూస్ ఎడిటర్ అనిపించు కుంటాడు.

---

## బుద్ధిమంతుడు

పుండరి అంటే ఎడిటర్‌కు అభిమానం. ఏది చెప్పినా దాన్ని అక్షరాలా పాటించే మనస్తత్వం పుండరిది. అందుకే ఎటర్‌గారి ఆప్త శిష్యుడయ్యాడు పుండరి.

పుండరి ఓ రోజు నెపోలియన్ వార్త రాస్తున్నాడు. నెపోలియన్ యుద్ధానికి వెళ్ళేటప్పుడు సర్వహంగులూ సమకూర్చుకుని కదిలేవాడు. సైనికుల అవసరాలకోసం సైన్యంలోనే క్షురకులు, వంటవారు వగైరా సిబ్బంది కూడా ఉండేవారు.

ఎవరి గురించి పత్రికలో రాసినా సభ్య పదాలనే వాడాలి అని ఎడిటర్ చెప్పిన మాట పుండరికి గుర్తుంది.

నెపోలియన్ వార్తను పుండరి ఇలా రాశాడు.

"నెపోలియన్ సైన్యంలో నాయీ బ్రాహ్మణులు, నలభీములు కూడా ఉండేవారు."

---

# వియ్యాలవారి కయ్యాలు

రిపోర్టరైనా, సబ్ఎడిటర్ అయినా జర్నలిస్టు మౌలిక వృత్తివ్యాసంగం పత్రికకు వార్తలు సిద్ధం చేయటం. సూక్ష్మంగాచూస్తే రిపోర్టర్ పనివిధానం వేరు. సబ్ఎడిటర్ పని విధానం వేరు. రిపోర్టర్‌వార్తకోసం నానా శ్రమపడాల్సి ఉంటుంది. సబ్ఎడిటర్‌ది డెస్క్ వద్ద నిర్వర్తించే కార్యక్రమం. ఏజన్సీ (వార్త సంస్థలు) కాపీలను అనువాదం చేయటం, విలేకరులనుంచి వచ్చిన వార్తలను అచ్చుకు సిద్ధంచేయటం అతనిపని. చాలా పత్రికల్లో ముఫిసిల్, జనరల్ అని రెండు వేర్వేరు సంపాదక విభాగాలు ఉంటున్నాయి. ముఫిసిల్ సెక్షన్‌లోని సబ్ ఎడిటర్లు జిల్లాలు, గ్రామాలనుంచి విలేకరులు తెలుగులో పంపే వార్తలను తిరగరాస్తుంటారు. జనరల్ సెక్షన్‌లోని సబ్ఎడిటర్లు ఇంగ్లీషులో వచ్చే ఏజన్సీ కాపీలను తెలుగులో రాస్తుంటారు. జనరల్ సెక్షన్‌లో పనిచేసే వారికి ముఫిసిల్ సెక్షన్‌లో వారంటే కొన్నిచోట్ల చులకన భావం. తెలుగులో వచ్చింది, తెలుగులో రాయటం ఏంగొప్ప అని జనరల్ సెక్షన్‌వారూ, జిల్లా వార్తలు లేకుంటే పత్రికేలేదు. అయినా ఎడిట్ అయివచ్చిన ఏజన్సీకాపీ ముక్కికి ముక్క దించటం ఓ గొప్పేనా అని ముఫిసిల్ సెక్షన్‌వారూ అంతరాంతరాల్లో ఈసడించు కొంటారు. ఇది సరైన అవగాహనలేక కలిగే దురభిప్రాయంతప్పించి మరొకటికాదు. అలాగే విలేకరులు కొందరికి సబ్ఎడిటర్లపై అక్కసు ఉండే సందర్భాలు ఉన్నాయి. 'మీకేమయ్యా! ఫ్యాన్ కింద కూర్చొని పని చేస్తుంటే ఏం తెలియటంలే. ఎండలో తిరిగి నే వార్తతెస్తే వెనకాముందు ఆలోచించకుండా కోసేశావు. వార్త ప్రాణాన్ని తీసేశావుకదా! అని రిపోర్టర్ సబ్ ఎడిటర్ దగ్గర మొత్తుకుంటే, 'నువు రాసిందంతా నీకు వేదంలా కన్పిస్తుంది. అందులో ఎన్ని పునరుక్తులు లేవు. వాటినే తగ్గించా అయినా చాట భారతంలా రాస్తే చోటుండొద్దూ నీ వార్త ఒక్కటేనా? ఎన్ని వార్తల్ని అకామడేట్ చేయాలి' అని సబ్ఎడిటర్ తన కష్టం ఏకరువు పెడుతుండాడు.

అలాగే విజయవాడ నుంచి పత్రిక వెలువడుతుంటే ఆ పత్రికకు ఇతర ప్రాంతాల్లో పనిచేసేవారు, విజయవాడ రిపోర్టర్లకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. వాళ్ళ వార్తల్ని మొదటి పేజీలో ఉంచుతారు. మావార్తల్ని అసలు పట్టించుకోరు. అని మథన పడతారు. ఇది కొంత వరకు నిజం కావచ్చు. పత్రిక ప్రచురణ జరిగే పట్టణానికి తగు ప్రాధాన్యం, మొగ్గు ఇవ్వక తప్పక పోవచ్చు. ఏది ఏమైతేనేం రిపోర్టర్లకూ సబ్ ఎడిటర్లకూ మధ్య నెలకొన్న ఈ వైరుధ్యం వియ్యాలవారి కయ్యాల వంటివే. పరస్పరం ఇబ్బందులను గ్రహించి తదను గుణంగా మసలితే సమస్యే ఉండదు.

# 2

# విలేకరీయం

ఇం దు లో



---

## స్వేచ్ఛంటే మాదె

తమ దేశాల్లోని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను గురించి ఓ అమెరికన్, రష్యన్ వాదించు కుంటున్నారు.

"అమెరికాలో మేం అసలు సిసలైన స్వేచ్ఛను అనుభవిస్తున్నాం. వైట్‌హౌస్ ముందు నిలబడి రీగన్ బుద్ధిహీనుడు అని కేకలు పెట్టినా నామీద ఈగవాలదు" అమెరికన్ గర్వంగా చెప్పాడు.

"అయితే ఏమిటి? నేను మా రెడ్ స్క్వేర్ ముందు నిలబడి రీగన్ బుద్ధిహీనుడు అని కేకలు పెట్టినా నా ఒంటిమీద ఈగే కాదు దోమ కూడ వాలదు" రష్యన్ తిప్పికొట్టాడు.

---

# రిపోర్టర్ల సేనా నాయకుడు

పత్రికల్లో చీఫ్ రిపోర్టర్, రిపోర్టర్లకు నాయకత్వం వహిస్తాడు. నగరంలో జరిగే కార్యక్రమాలకు హాజరు కావల్సిందని కోరుతూ ఆహ్వానాలు అందుతుంటాయి. వాటిలో ఏ కార్యక్రమాలు ముఖ్యమైనవీ ఏయేకార్యక్రమాలకు సంబంధించిన విశేషాలు సేకరించాలి అన్నది చీఫ్ రిపోర్టర్ నిర్ణయించి ఆ కార్యక్రమాల వార్తల సేకరణకు తనకింద నున్న రిపోర్టర్లను నియమిస్తాడు. ఏదైనా ముఖ్య కార్యక్రమానికైతే చీఫ్ రిపోర్టర్ స్వయంగా హాజరవుతాడు. విలేకర్ల సెలవులు వగైరా విషయాలను కూడా చీఫ్ రిపోర్టర్ చూస్తాడు. ప్రముఖులతో సంబంధ బాంధవ్యాలను కలిగి ఉంటాడు.

రొటీన్ వార్తలతో పాటు అవసరమైనపుడు ప్రత్యేక వార్తలకోసం ప్లాన్ చేసి ఆ మేరకు రిపోర్టర్లను విషయ సేకరణకు ఆదేశిస్తాడు. రాష్ట్రంలో ఒకవేళ తీవ్ర దుర్భిక్ష పరిస్థితులు నెలకొన్నప్పుడు దుర్భిక్షంమీద సమగ్రంగా వార్తల ప్రచురణకు ప్లాన్ చేయవచ్చు. ఏ యే జిల్లాల్లో ఏ మేరకు దుర్భిక్ష తీవ్రత నెలకొని ఉందో పంటలకు వాటిల్లిన నష్టం రైతుల కడగండ్లు వంటి కీలక అంశాల ప్రాతిపదికగా దుర్భిక్షం మీద సీరీస్ ప్రచురించ వచ్చు. ఇలాంటి వార్తల ప్రచురణ బాధ్యతాయుతమైన పత్రికకు ఎంతో ముఖ్యం ఇందువల్ల ఉన్న పరిస్థితులను ఇటు ప్రజలు, అటు ప్రభుత్వం దృష్టికి తెచ్చి కొంతలో కొంత సహాయ హస్తం అందచేయటానికి దోహదకారి కాగలదు. సామాన్యంగా పత్రికల్లో మూడు తరహాలకు చెందిన విలేకరులు పనిచేస్తూ ఉంటారు. స్టాఫర్: నెలసరి జీతాలపై పనిచేసే పూర్తి స్థాయి ఉద్యోగిని స్టాఫర్‌గా పరిగణిస్తారు. స్టాఫర్లు జిల్లా కేంద్రంలో, వివిధ రాష్ట్రాలలోని ముఖ్య పట్టణాల్లో పని చేస్తుంటారు. స్టాఫర్లు కాకుండా ప్రత్యేక విలేకరులు కూడా ఉంటారు. వారు వివిధ రాజకీయ పరిణామాలను సునిశితంగా పరిశీలిస్తూ అవసరమైతే వ్యాఖ్యలతో కూడిన వార్తలు పంపుతుంటారు. ప్రత్యేక విలేకరులకు ఉన్నతస్థాయి ప్రభుత్వ ఉద్యోగులతో మంచి సంబంధ బాంధవ్యాలు ఉండటం అవసరం. ఒక్కోసారి ప్రభుత్వం ఏదైనా కీలక నిర్ణయం తీసుకోవాలని సంకల్పించినపుడు ఆ నిర్ణయం తాలూకు వివరాలు ముందుగానే సేకరించి ప్రభుత్వం త్వరలో ఈ నిర్ణయం తీసుకోనున్నదని వార్త అందివ్వవచ్చు. ఇలా ముందుగానే ఓ వార్తను అంద చేయటం వల్ల పాఠకుల్లో ఆసక్తి రేకెత్తించే అవకాశం ఉంది. ప్రభుత్వ ప్రకటనను ముందుగానే ప్రచురించటంవల్ల ప్రయోజన మేమిటన్న సందేహం రావచ్చు. ప్రభుత్వ ప్రకటన వచ్చేవరకు వేచి ఉంటే పత్రికలకు, గజిట్‌కు తేడాయే ఉండదు. ఒక్కోసారి ప్రభుత్వం ఓ నిర్ణయం తీసుకోదలిచిందని

తెలిసినపుడు ఆ నిర్ణయం ఫలితంగా కలిగే చెడు పరిణామాలను హెచ్చరించ వచ్చుకూడా. అప్పుడు ప్రభుత్వం తన నిర్ణయాన్ని పునరాలోచించి ఆచరణలో పెట్టక పోవచ్చు. లైనర్ : తాలూకాలోనూ, ఇతర చిన్న పట్టణాల్లోను నియమించే పార్ట్‌టైమ్ విలేకరిని లైనర్ అంటారు. లైనర్ అడపా తడపా వార్తలు పంపుతుంటాడు. ప్రచురితమైన వార్తలనుబట్టి అతనికి ప్రతిఫలం చెల్లిస్తుంటారు.

స్ట్రింగర్ : లైనర్ మాదిరిగానే స్ట్రింగర్ కూడా పార్ట్‌టైమ్ విలేకరే. ఇతనికి కూడా వేరే ప్రధాన వృత్తి వ్యాసంగం ఉంటుంది. అయితే లైనర్ కంటే స్ట్రింగర్ పరిస్థితి కొంత మెరుగు. స్ట్రింగర్‌కు నెలకు ఇంత మొత్తం చొప్పున నిర్ణయించి పత్రిక చెల్లిస్తుంటుంది. జిల్లా కేంద్రాల నుంచి పత్రికా కార్యాలయాలకు పీరికోసం ప్రత్యేకంగా టెలిప్రింటర్ సౌకర్యం ఉంటుంది. దీనిద్వారా సకాలంలో పత్రికకు వార్తలు అందిస్తారు.

విలేకరి వృత్తి గ్లామరస్‌గా ఉంటుందనడంలో సందేహం లేదు. గ్లామరస్‌గా ఉన్నా ఒక్కో సందర్భంలో వార్తల సేకరణలో ఇబ్బందులకు కూడా గురి కావల్సి వస్తుంది. అందరూ విలేకరిని ఆదరిస్తారనే గ్యారంటీ కూడా ఏం లేదు. ఒక్కోసారి ప్రతికూల పరిస్థితుల్లో సైతం విలేకరిపనిచేయాలి. ప్రజలతో సంబంధ బాంధవ్యాలు కలిగి ఉండాలి. పత్రిక అంటే ప్రజల దృష్టిలో విలేకరే మెదులుతాడు. పత్రిక ప్రతిష్ఠకు చెరపు రానివిధంగా విలేకరి ప్రవర్తన ఉండాలి. చొరవ, ఉత్సాహం, స్నేహశీలత, కార్యదక్షత ఉన్నవారు విలేకరులుగా బాగా రాణిస్తారు.

---

## ఖైదీ సమస్య

ఇరాన్‌లో ఆ ఖైదీని ఆరోజు కాల్చి చంపబోతున్నారు. ఉదయం పూట నల్గురు సైనికులు ఆ ఖైదీ గదిదగ్గరకొచ్చి ఖైదీని శిక్ష అమలు చేసే ప్రాంతానికి నడిపించుకు వెళ్ళారు.

చాలా దూరం నడిచాక ఆ ఖైదీ "మరో క్షణంలో కాల్చి చంపబోతున్న వ్యక్తి పట్ల ఇలాగేనా వ్యవహరించేది" అని అన్నాడు.

"ఏమిటి నువ్వనేది-వివరంగా చెప్పు" అన్నాడు ఓ సైనికుడు.

"మళ్ళీ మనం వచ్చినంతదూరం నడిచి వెనక్కి వెళ్ళాలికదా! అదే నా బాధ" ఖైదీ సమాధాన మిచ్చాడు.

---

# మనసుంటే మార్గాలనేకం

వార్తల సేకరణలో విలేకరులు తగు జాగ్రత్తతో, మెళకువతో, నేర్పుతో వ్యవహరించ వలసి ఉంటుంది. చాలామంది విలేకరిని మంచి చేసుకుని పత్రిక ద్వారా ఉచితంగా ప్రచారం పొందాలని యత్నిస్తుంటారు. ఇలాంటి వారిపట్ల ఓ కన్ను వేసి ఉంచి జాగ్రత్త పడాలి. ఎవరేది చెప్పినా వెంటనే అది నిజమని విలేకరి నమ్మకూడదు. మరో మార్గంద్వారా అందులోని నిజా నిజాలను ధృవ పరచుకోవాలి. వార్తాన్వేషణ దృష్టి ఉండాలే కాని వార్తలకు కొదవంటూ లేదు. అనేక మార్గాలద్వారా వార్తల సేకరణకు వీలుంది. పట్టణానికి ఎవరైనా ప్రముఖ రాజకీయ నాయకుడు వచ్చినపుడు ఆ పార్టీవారు విలేకరుల సమావేశం లేక బహిరంగ సభ ఏర్పాటు చేస్తారు. విలేకరుల సమావేశంలో ఆ రాజకీయ నాయకుడు అనేక విషయాలు మాట్లాడతాడు. విలేకరి ప్రశ్నల రూపేణా మరికొంత సమాచారాన్ని రాబట్టవచ్చు. ఇలా సేకరించిన సమాచారాన్ని ఆ రాజకీయ నాయకుని స్థాయి అతని ప్రసంగంలోని విషయ ప్రాముఖ్యం ఆధారంగా తగినంత వార్త ఇవ్వవచ్చు.

ఏ వార్త లేక ఏ ప్రసంగం ఎంత నిడివి రాయాలో నిర్ణయించుకునే విచక్షణ ముట్టమొదట విలేకరిదే. ఊకదంపు ప్రసంగాలను సాధ్యమైనంతగా కుదించాలి. విలేకరుల సమావేశాలు కాకుండా ఏదైనా ఒక నిర్దిష్ట అంశంపై సదస్సులు నిర్వహిస్తుంటారు. ఆ సదస్సులో కూడా ప్రజలకు తెలియ చెప్పాల్సిన ఆసక్తికరమైన విషయాలు అనేకం ఉంటాయి.

అందుకే రాజకీయంగా, శాస్త్ర పరంగా అధునాతన పరిణామాలను, పరిజ్ఞానాన్ని ఆకళింపు చేసుకోగలగాలి. ఉదాహరణకు సౌరశక్తి పై ప్రముఖ శాస్త్రవేత్తలతో ఓ సదస్సు నిర్వహిస్తున్నారనుకుందాం. ఆ సదస్సు విశేషాల సేకరణకు వెళ్ళే విలేకరికి స్థూలంగానైనా సౌరశక్తిని గురించి అవగాహన ఉండాలి. సదస్సులో చర్చ ప్రధానంగా ఏ అంశం మీద కేంద్రీకృతమైనదీ, అది ప్రజలకు ఏ మేరకు ప్రయోజనం అనే విషయాలను గ్రహించ గలిగి ఉండాలి. ఇదే కాదు ఒక రాజకీయ నాయకుడి ప్రసంగం ఉదాహరణగా తీసుకున్న అతని ప్రసంగంలోని టాపికాలిటీని, నాడిని పట్టుకోవాలి.

ఒక కాలంలో హాట్ హాట్‌గా అందరికీ చర్చనీయాంశమైన విషయాన్ని రాజకీయ నాయకుడు తన ప్రసంగంలో ప్రస్తావించినపుడు ఆ విషయాన్ని ప్రముఖంగా వెలుగులోకి తేవడానికి యత్నించాలి. కొందరు వివాదాస్పద విషయాన్ని లేవనెత్తితే ఆ విషయానికి విలేకరి తన వార్తలో తగు ప్రాధాన్యం ఇవ్వాలి. తప్పదు.

ఇక వార్తలకు మరో రూపం పత్రికా ప్రకటనలు. రాజకీయ నాయకులు స్వచ్ఛంద సంస్థలు అడపా తడపా ప్రజాసమస్యలపై లేదా తమ పార్టీకి సంస్థకు సంబంధించిన విషయాలపై పత్రికా ప్రకటనలు విడుదల చేస్తుంటాయి. అలాగే పౌర సంబంధాల అధికారి కార్యాలయంనుంచి ప్రభుత్వం వారి ప్రెస్‌నోట్‌లు అందుతాయి.

కొన్ని సందర్భాల్లో పత్రికా ప్రకటనలను యధాతధంగా ఉపయోగించవచ్చు, ప్రకటనలోని ముఖ్యాంశాన్ని ప్రధానంగా తీసుకుని ప్రకటనను తిరగ రాసుకోవల్సి రావచ్చు. కొన్నిమార్లు పత్రికా ప్రకటనలు అసమగ్రంగా ఉండవచ్చు. తమ ప్రాంతంలోని నీటి సమస్యపై ఓ రాజకీయ నాయకుడు పత్రికా ప్రకటనను విడుదల చేశాడనుకుందాం. విలేకరి కేవలం ఆ ప్రకటనను వార్తగా రాయటానికి బదులు నీటి సమస్యపై సమగ్రంగా విశేషాల సేకరణకు పూనుకోవటం మంచిది. అసలు నీటి సమస్య ఎందుకు ఏర్పడింది. ప్రజలు పడుతున్న అవస్థ లేమిటి? వంటి విషయాలను నేరుగా ఆ ప్రాంతాలకు వెళ్ళి సేకరించవచ్చు. నీటి సమస్య నివారణకు అధికారులు తీసుకుంటున్న చర్యలను కూడా అడిగి తెలుసుకుని వార్తలో జోడించాలి. అవసరమైతే కుళాయిల దగ్గర నీళ్ల బిందెలతో నీటి చుక్కకోసం అలమటిస్తున్న ప్రజల ఫొటోనుకూడా తీయించి వార్తతో ప్రచురించవచ్చు. ఇలా ఒక్కోసారి పత్రికా ప్రకటనలు మంచి వార్తలకు ప్రేరణగా నిలుస్తాయి.

పోలీస్ శాఖనుంచి కూడా వార్తలు పొందవచ్చు. దొంగతనం వంటి నేరాలు, రోడ్డు ప్రమాదాలు, మానభంగాల వంటి అత్యాచారాలు, దుర్ఘటనలు, ఘర్షణలు మొదలైన సంఘటనలపై పోలీసుల నుంచి సమాచారం సేకరించి వార్తగా మలచాలి. పోలీసులు ఇచ్చిన సమాచారంతో తృప్తిపడక వివరాల

కోసం నేరుగా బాధితులను కలుసుకోవటం కూడా అవసరం. అలాగే అగ్ని ప్రమాదాల వార్తలు సేకరించవచ్చు. తీవ్రస్థాయిలో అగ్నిప్రమాదమో రోడ్డు ప్రమాదమో జరిగినపుడు విలేకరి ప్రమాదస్థలాన్ని స్వయంగా సందర్శించాలి. ప్రమాద స్థలంలో వివిధ వర్గాల నుంచి వివరాలు సేకరించాలి. కొన్ని సందర్భాల్లో కళ్ళతో చూడటం ద్వారానే విషయాన్ని ఆకళింపు చేసుకోవాలి. ఆకళించుకున్న విషయాన్ని కాగితంపై ఉంచగలగాలి. ఒక్కోసారి విలేకరికి వార్తా దారిద్ర్యం ఏర్పడుతుంది. వార్తలకోసం వెంపర్లాడే పరిస్థితి ఏర్పడుతుంది. అలాంటపుడు స్పెషల్ స్టోరీస్‌కు నడుం బిగించాలి. ఊళ్లో గ్రంథాలయం ఉంటుంది. అందులో తగిన సౌకర్యాలు ఉండవు. లేదా ఆ గ్రంథాలయం అత్యంత ప్రాచీనమైనది కావచ్చు; ఆ గ్రంథాలయం అందిస్తున్న సేవలను గ్రంథాలయంలోని లోటుపాట్లను అవకతవకలను ఇటు పాఠకుల నుంచి అటు అధికారుల నుంచి సేకరించి వార్తారూపం తొడగవచ్చు. ఇలా గ్రంథాలయం ఏమిటీ, ఆసక్తి ఉండాలే కాని తవ్వినకొద్దీ వార్తలే.

---

## ఇలా అయితే మరీ బాగు

అస్సాద్ అతని సోదరుడు సిరియా గగన తలంలో విమానంలో ప్రయాణిస్తున్నారు. అస్సాద్ కొంత డబ్బును కిటికీగుండా కిందకు విసిరాడు.

"నా ప్రజల్లో ఎవరో ఒకరు సంతోషిస్తారు." సోదరుడితో అస్సాద్ అన్నాడు.

అస్సాద్ సోదరుడు మరిన్ని డబ్బులు కిటికీ నుంచి విసిరేశాడు.

"ఇంకా ఎక్కువమంది ప్రజలు ఆనందిస్తారు." అని అస్సాద్ సోదరుడు అంటుండగా పైలట్ అక్కడకు వచ్చి—

"మీ ఇద్దరినీ కిటికీలోంచి తోసేస్తాను. మన ప్రజలంతా సంతోషిస్తారు" అన్నాడు.

---

# పాయింట్ పట్టుకోవడం

ఓ విలేకరుల సమావేశం కావచ్చు, ఓ బహిరంగ సమావేశం కావచ్చు. ఓ పత్రికా ప్రకటన కావచ్చు. ఏదైనప్పటికీ విలేకరి, ఉపసంపాదకులు వాటిలోని అసలు సారాన్ని పట్టుకో గలగాలి. దీన్నే జర్నలిస్ట్ పరిభాషలో లీడ్ అంటారు. ఉదాహరణకు విలేకరిగా మీకో బహిరంగ సభకు వెళ్ళారు. ఆ సభకు వెళ్ళ టానికి ముందే ఏ విషయం మీద ఆ సభ ఏర్పాటవుతోందో క్షుణంగా తెలుసు కోవాలి. అందులో పాల్గొంటున్న వక్తలెవరో కూడా దృష్టిలో వుంచు కోవాలి.

కార్యక్రమం మొదలవుతుంది. స్వాగతాలు, అధ్యక్షోపన్యాసాలు, వక్తల ప్రసంగాలు, వందన సమర్పణలు ఇలా సాగుతుంది. ఆ సమావేశంలో ఓ ముఖ్య అతిధి కూడా వుండవచ్చు వక్తల ప్రసంగాలన్నీ మీరు రాసు కుంటారు. ఇలా నోట్ చేసుకున్న ప్రసంగాలను అలాగే వరసగా రాసేస్తే అదివార్తకాదు.

ఆ సభలో పాల్గొన్న ప్రముఖ వ్యక్తి ఎవరు? అతను మాట్లాడే దాంట్లో పసవుందా? అతడేదైనా కొత్త విషయం చెప్పాడా? అతను తను మాట్లాడిన విషయంపై క్షుణ్ణంగా తెలిసిన వాడేనా? వంటి ప్రశ్నలను వేసుకోవాలి. ఈ ప్రశ్నలకు అవునని మీరు ఒప్పుకో గలిగితే ఆ సభ వార్తకు ఆ వక్త ప్రసం గాన్ని లీడ్ చేయచ్చు.

ఒక నాయకుడు ప్రసంగిస్తుంటే ఆ నాయకుడు అంతకుముందు చెప్పని కొత్త అంశం ఏదైనా ఉందా అని ఆలోచించాలి. ఏ ముఖ్యమంత్రో రాయల సీమలో జరిగే ఓ సభలో రాయలసీమ ప్రాంత సమస్యలకు ప్రత్యేక ప్రాధాన్య మిస్తూ ప్రసంగిస్తే మూడు పాళ్ళు అదే లీడ్ అవుతుంది. ఒక్కోసారి రాష్ట్రాని కంతటికీ వర్తించే విధాన నిర్ణయమూ ఆ ప్రసంగంలో దొర్లవచ్చు. విధాన నిర్ణయం కొత్తదైనపుడు రాయలసీమ సమస్యల స్థానే ఆ విధాన నిర్ణయం లీడ్ అవుతుంది.

జర్నలిస్టు పత్రికల్లో వచ్చే వార్తలను క్షుణ్ణంగా చదవాలి. అప్పుడు గానీ ఏది పాత అంశం, ఏది కొత్త అంశం అనేది తేల్చుకోలేం. కొందరు రాజకీయ నాయకుల ప్రసంగాలు రోకటి పాటలా సాగుతుంటాయి. ఎప్పుడూ చెప్పేవి, ఎప్పుడూ వినేవీ అయినా విలేకరి ఓర్పు కోల్పోకూడదు. ఆ నాయకుడే ఆ రోకటి పాట ప్రసంగం చివరన ముఖ్య విషయాన్ని ప్రకటించవచ్చు. ఆ అంశాన్ని విలేకరి తన వార్తలో అందివ్వ గలగాలి. అంటే విలేకరి ఒక కార్యక్రమానికి వెళితే చివరిదాకా కూడా శ్రద్ధతో, ఆసక్తితో మెలగాలి. ఓ సమావేశం వివరాల సేకరణకు వెళ్ళినపుడు సభా కార్యక్రమం మీదే దృష్టి వుండాలి కానీ పక్క వాళ్ళతో కబుర్లలో పడకూడదు. కబుర్లలో పడ్డామంటే విలేకరిగా చేయాల్సిన విధులను విస్మరిస్తున్నా మన్నమాటే.

# ఇంటర్వ్యూ చేయడం ఓ కళే




ప్రముఖులను ఆయా రంగాల్లోని నిష్ణాతులను విలేకరి ఇంటర్వ్యూ చేసినపుడు ఎంతో విలువైన సమాచారం పొందవీలుంది. వార్తల సేకరణలో దైనందిన వృత్తి కార్యకలాపాలలో ఇంటర్వ్యూ విడదీయలేని ముఖ్యభాగం. అందుకే విలేకరి చొరవగా ఇతరులను కలుసుకునే నేర్పరితనాన్ని, స్నేహశీలతను అలవర్చుకో గలగాలి. ఇంటర్వ్యూ అంటే కేవలం ఓ వ్యక్తిని కొంతసేపు కలిసి ప్రశ్నలు గుప్పించటం కాదు. నిజానికి మున్ముందు వార్తలందించే ఓ స్నేహానికి అదో తొలిమెట్టు. ఒక్కోసారి వివాదాన్ని సృష్టించి తద్వారా పాఠకుల్లో ఆసక్తి రేకెత్తించడానికి కూడా ఇంటర్వ్యూ ఉపకరిస్తుంది. ఉదాహరణకు ఉధృతంగా సమ్మె జరుగుతున్నప్పుడు ప్రత్యర్థి వర్గం నుంచి ఇంటర్వ్యూ రూపేణా అభిప్రాయాలు సేకరించి ప్రచురిస్తే ఆ వార్త వివాదాస్పదంగా పరిణమించవచ్చు. ఆ వార్తలో వ్యక్తం చేసిన అభిప్రాయాలను ఖండిస్తూ అవతలి వర్గం వారు తిరిగి మరో ప్రకటన చేయ వీలుంది. అలాగే ఒక్కోసారి ఒక అంశం అస్పష్టంగా ఉన్నప్పుడు ఆ రంగాల్లో నిష్ణాతులైన వారిని ఇంటర్వ్యూ చేసి వాస్తవ పరిస్థితిని పాఠకులకు తెలియ చేయవచ్చు. ఏదైనా రాజ్యాంగ పరమైన విషయాలతో కూడిన వివాదం తలెత్తితే రాజ్యాంగ నిపుణులతో జరిపే ఇంటర్వ్యూ ద్వారా వాస్తవ పరిస్థితి తెలుసుకోవచ్చు.

ఫలానా వ్యక్తిని ఇంటర్వ్యూ చేయాలనుకున్నపుడు ముందు ఆ వ్యక్తి నుంచి అనుమతి పొందాలి. సాధారణంగా ఆ వ్యక్తికి అనుకూలమైన వేళకే ఇంటర్వ్యూ జరపటానికి సిద్ధపడటం మంచిది. ఇంటర్వ్యూ ఏ రంగంలోని వ్యక్తితో ఏ పరిస్థితుల్లో జరువుతున్నదీ, ఏయే విషయాలపై సమాచారం

సేకరించ వలసి ఉన్నదీ, ముందుగానే అవగాహనకు రావాలి. రాజ్యాంగ నిపుణుడితో రాజ్యాంగ విషయాలపై ఇంటర్వ్యూ జరప దలచినపుడు రాజ్యాంగానికి సంబంధించిన మౌలిక అంశాలను కొన్ని తెలుసుకున్న పిదపే ఇంటర్వ్యూకి వెళ్ళాలి. అలాకాని పక్షంలో అపతలి వారికి కేవలం ఉబుసు పోక ఇంటర్వ్యూకు వచ్చినట్లు కనపడుతుంది. తెలిసో తెలియకో మన అజ్ఞానాన్ని బయట పెట్టుకున్న వారం కూడా అవుతాం. విలేకరికి ప్రాథమిక పరిజ్ఞానం కూడా లేదని గ్రహించినపుడు ఇంటర్వ్యూ ఇచ్చే వ్యక్తి ఆసక్తి కోల్పోవచ్చు. ఇంటర్వ్యూలో అడగవలసిన కొన్ని ప్రశ్నలను కాగితంపై రాసుకోవాలి. అంటే కేవలం ఆ ప్రశ్నలని చూస్తూ జవాబులు రాబట్టాలని కాదు. ఇంటర్వ్యూ స్నేహపూరిత వాతావరణంలో ఇష్టా గోష్టిగా జరగాలి. ఇంటర్వ్యూ చేసే వ్యక్తి కాస్త సర్దుకుని మూడ్‌లోకి వచ్చిన పిదప రాబట్ట దలిచిన కీలక సమాచారానికి సంబంధించిన ప్రశ్నలు అడగాలి. ఒక్కోసారి ప్రశ్నలు అడిగేటప్పుడు కూడా విలేకరి తనకు తెలియ కుండానే పక్షపాతం కనపరిచే ప్రమాదం ఉంది. దానిని నివారించు కోవాలి. అలాగే ఇంటర్వ్యూ ఇచ్చేవ్యక్తి చెప్పేవన్నీ సత్యాలు కాక పోవచ్చు. అడిగాం కదా అని తెలియదని చెప్పటం ఇష్టంలేక ఏదో ఒకటి చెబుతారు. అలాంటప్పుడు విలేకరి మెళకువ చూపాలి. వ్యక్తం చేసిన అభిప్రాయాల్లో అస్పష్టత ఏమైనా ఉంటే వాటిని నివృత్తి చేసుకోవాలి.

కొంత మంది 'ఆఫ్ ది రికార్డు' అంటూ కొన్ని విషయాలు బహిర్గతం చేస్తారు. ఆఫ్ ది రికార్డు అంటే పత్రికల్లో ఆ విషయాన్ని ప్రచురించ వద్దని అర్థం. నిజానికి ఆ వ్యక్తి అంతరాంతరాల్లో ఆ విషయాలు బహిర్గతం కావాలన్న కాంక్షతోనే వాటిని బయట పెడతాడు. ఇలా ఆఫ్ ది రికార్డుగా చెప్పిన సమాచారాన్ని ఆ వ్యక్తి పేరు ఉటంకించ కుండా మరో రూపంలో వినియోగించు కోవచ్చు.

కొందరు ప్రముఖులు ఏదైనా విషయాన్ని తెలియ చెప్పాలనుకున్నప్పుడు వారే స్వయంగా విలేకరుల సమావేశాలు ఏర్పాటు చేసి విలేకరులను ఆహ్వానిస్తారు. సమావేశంలో పాల్గొన్న ప్రముఖుడు తను చెప్పదలుచుకున్న విషయాన్ని వివరిస్తాడు. తరువాత విలేకరులు మరికొన్ని ప్రశ్నలు అడగవచ్చు. సమావేశంలో పాల్గొన్న విలేకరులు క్రమ శిక్షణతో వ్యవహరించాలి. ఒకరి తర్వాత ఒకరు ప్రశ్నలు అడగాలి. అలాగే సాటి విలేకరులు అందరికీ అవకాశం కల్పించాలి. కొందరు సీనియర్ రిపోర్టర్లు విలేకరుల సమావేశాన్ని నీరుగార్చే సందర్భాలు ఉంటాయి. విలేకరి వ్యక్తిగత హోదాలో గాక ఒక పత్రిక ప్రతినిధిగా ఇంటర్వ్యూ చేస్తున్నాడు గనుక హుందాగా, మర్యాదగా, స్నేహశీలంగా వ్యవహరించాలి. విలేకరి సరిగా వ్యవహరించక పోతే అతను పని చేసే పత్రికకు అపకీర్తి తెచ్చిన వాడవుతాడు.

# చెల్లని వార్తలు

కొత్తగా విలేకరి పదవి వరించిందనుకోండి. ఉత్సాహం ఉరకలు వేస్తుంటుంది. పేపర్లో పంపించిన వార్తలన్నీ అచ్చు కావాలని ఆశించడం సహజం. ఈ రోజు అయిదారు వార్తలు పంపితే వాటిలో ఏ ఒక్కటీ అచ్చు భాగ్యానికి నోచుకోకపోతే విలేకరి జావకారిపోతాడు ఇక ఆ రోజు ఏ వార్తా పంపబుద్ధి కాదు. 'ఉన్న వార్తలు రానీ, అప్పుడు చూసుకుందాం' అని కూడా కొందరు అనుకుంటారు. కానీ ఈ ధోరణి సరికాదు.

పత్రికకు మన ఊరివార్త ఒక్కటే కాదు. అనేక ఊళ్లనుంచి వచ్చిన అనేక వార్తలు ఉంటాయి. వాటిల్లో ఆ రోజుకారోజు అచ్చేయాల్సిన ప్రాముఖ్యం గల వార్తలూ ఉంటాయి. మనం పంపినవార్తలు (గ్రామీణ సమస్యలు వగైరా) ఒకరోజు అటూ ఇటూగా అచ్చేసినా పర్లేదనుకుని సబ్ ఎడిటర్లు భావించినపుడు వాటిని నిలిపివేస్తుంటారు. విలేకరి ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. వార్తను క్లుప్తంగా పంపడం కూడా ముఖ్యమే. అంటే దీనికి అర్థం వివరాలు అసమగ్రంగా ఇవ్వమని కాదు. వార్తకు అవసరమైన అన్ని వివరాలు ఇవ్వాల్సిందే. కాపోతే వ్యర్థ ఉపోద్ఘాతాలు, కవిత్వాలు మానుకోవాలి.

విలేకరికి సత్యశోధన దృష్టిలోపిస్తే, సత్తా కొరవడితే మంచి వార్తకూడా ఖూనీ అవుతుంది. ప్రజల ముఖ్య సమస్య సైతం పేపర్లో నీరుకారిపోతుంది. రోజూ ఏదో ఒక వార్త పంపాలి కదా అని చెప్పి మొక్కుబడి తంతుగా ఇంట్లో కూర్చుని వార్త రాసి పంపడం వాంఛనీయం కాదు. చాలామంది విలేకరులు "ప్రజలు ఇలా విమర్శిస్తున్నారు, అలా విమర్శిస్తున్నారు. ప్రజలు ఆందోళన చెందుతున్నారు" అంటూ ప్రజలను కర్తలుగా చేసి తమ సొంత అభిప్రాయాలను ప్రజలపై రుద్దుతుంటారు. ఈ పద్ధతిని విలేకరులు వీడటం ఎంతయినా శ్రేయస్కరం.

ప్రజలు సమస్యలు ఎదుర్కొంటున్నప్పుడు ఆ సమస్య తీవ్రతనుముందు విలేకరి బేరీజు వేసుకోవాలి. నలుగురి దగ్గరికీ వెళ్ళి అభిప్రాయ సేకరణ జరపాలి. ఆ సమస్య ఎందుకు ఏర్పడింది? ఎలా ఏర్పడింది? ఎవరు దాన్ని పరిష్కరిస్తారు? అనే ప్రశ్నలు వేసుకుని వాటికి సమాధానాలు రాబట్టటానికి ఉద్యుక్తం కావాలి. సమస్య పూర్వాపరాలను లోతుగా తెలుసుకోవాలి. సంబంధిత అధికారిని కలుసుకుని అతని వివరణను కూడా అడగాలి. అతను మంచి అధికారి అయితే ప్రభుత్వం ఏ దిశలో చర్య తీసుకుంటే సమస్య చిటికలో

ఎలా పరిష్కరించవచ్చో అతనే లోపాయికారిగా సూచిస్తాడు కూడా. అధికారుల దగ్గరకు వెళ్ళినపుడు విలేకరి ఒక విషయం గమనంలో ఉంచుకోవాలి. మన అవసరం కొద్దీ వెళ్ళాం. కాబట్టి ఓర్పు, సహనం అవసరం. అధికారి మనలను స్నేహశీలి అనుకునేట్లు ప్రవర్తించాలి. అంతే కానీ అధికారిని బెదిరిస్తున్నట్లుగా వ్యవహరించకూడదు. "నేను రాసే వార్త నీ తలకు చుట్టుకుంటుంది" అన్న ధోరణి వ్యక్తం చేయకూడదు.

ఒక సమస్యకు వార్తారూపం ఇస్తున్నామంటే అది పరిష్కారం కావాలన్నదే లక్ష్యంగా ఉండాలి తప్ప అధికారులను ఊదరగొట్టటానికి మాత్రం కాదని గ్రహించుకోవాలి.

ట్రాఫిక్ సమస్యలు, పారిశుధ్యం సమస్యలనే తీసుకోండి. కొన్ని గల్లీల్లో నడవటానికే చోటుండదు. కాలిబాటలను చిన్న వ్యాపారులు ఆక్రమించి ఉంటారు. రిక్షాలు, సైకిళ్లు, కార్లు ఇలా సమస్త వాహనాలూ ఆ గల్లీలోంచే వెళ్ళాలి. కొన్ని సందర్భాల్లో సినిమాలు వదిలినపుడు సమస్యగా పరిణమించవచ్చు. అందునా పక్కపక్కన థియేటర్లు ఉన్నపుడు ఈ రద్దీ మరీ ఎక్కువ. చిన్న వ్యాపారులను ఖాళీ చేయిస్తే పాదచారులకు ఎంతో సుఖంగా ఉంటుంది. నిజమే. కానీ ఇందులో ఓ సామాజిక సమస్యా ఉంది. చిన్న వ్యాపారులను తొలగిస్తే వాళ్లు ఎక్కడికి పోతారు. వాళ్లకు ప్రత్యామ్నాయ స్థలం ఏమిటి? ఆ ప్రత్యామ్నాయ స్థలం చూపాల్సింది ఎవరు? మున్సిపాలిటి చూపాలి. దానికి ట్రాఫిక్ పోలీసులతో సంబంధం లేదు. రద్దీగా ఉండే బజార్లలో 'వన్‌వే'లను ప్రవేశపెట్టడం కొంతలో కొంత పరిష్కారం. అలాగే సినిమా హాళ్లన్నీ ఒక్కసారి ఆటలను వదలకుండా కాస్త ముందు వెనకలుగా వదిలేట్లు చూడటం ఒక మార్గం. ఇలా ఏ చిన్న సమస్య తీసుకున్నా అందులో చాలా విషయాలు ఇమిడి ఉంటాయి.

అందుకే విలేకరి ఆ సమస్యను అన్ని కోణాలనుంచి నిశితంగా పరిశీలించాలి. ట్రాఫిక్ సమస్యపై వార్త రాసేటపుడు సంబంధిత అధికారి దగ్గరకు వెళ్ళి సమస్య పరిష్కారానికి మార్గాలను సూచించవచ్చు.

పారిశుధ్యం సమస్యే ఉంది. వీధుల్లో చెత్త పేరుకు పోతుంటుంది. వారాలు నెలలు గడిచినా తొలగించరు. "ఈ చెత్తవల్ల వ్యాధులు ప్రబలుతున్నాయి" అంటూ ఆవేశంలో వార్తరాసేకంటే ఏ శానిటరీ ఇన్‌స్పెక్టర్ దగ్గరకో వెళ్ళి పరిస్థితిని వాకబు చేయాలి. అతను చెప్పే సమాధానం సంతృప్తి

కరంగా లేకపోతే వార్తాపరంగా ఘాటుగా విమర్శించవచ్చు. "చెత్తబళ్లు చాలి నన్ని లేవు. పనివాళ్లు సెలవులో ఉన్నారు. ఉన్న సిబ్బంది చాలరు. బళ్ల కోసం అదనపు సిబ్బంది కోసం ప్రభుత్వానికి అభ్యర్థన పంపాం. అవి మంజూ రయ్యేవరకూ ఈ సమస్య తప్పదు" అని శానిటరీ ఇనస్పెక్టర్ వివరణ ఇచ్చా డనుకుందాం. అప్పుడు సమస్య మూలకారణం అర్థం అవుతుంది. అసలు సమస్య పరిష్కారానికి తన వార్తద్వారా విలేకరి శ్రద్ధ చూపాలి. విలేకరికి సామాజిక బాధ్యత ఉంది. అతడికి ప్రజలే ముఖ్యం. ఆ ప్రజల సమష్టి ప్రయో జనాలకే అతడు అంకితం కావాలి.

చాలా సమస్యలను విలేకరి తానే స్వయంగా పరిష్కరించవచ్చు. అత డికి అభిరుచి, సేవా దృక్పథం మెండుగా ఉండాలి. ఒక సమస్యపై విలేకరి వార్తా సేకరణకు ఉద్యుక్తుడైతే కొన్ని సందర్భాల్లో ప్రాథమిక విషయసేకరణ దశలోనే ఆ సమస్య మబ్బులా విడిపోవచ్చు. అలాంటపుడు తన ద్వారా ఆ సమస్య పరిష్కారమైనందుకు సంతోషించాలే కానీ, ఓ వార్త పత్రికకు పంప కుండా చేజారి (పరిష్కారమై) పోయిందే అని బాధపడకూడదు.

వార్తలు కోకొల్లలు. దాని గురించి విలేకరి బెంగపడక్కర్లేదు. మొక్కు బడిగా, అరకొర వివరాలతో పంపిన వార్తలను మచ్చుకు కొన్ని మీ ముందుంచు తాను. తద్వారా కొన్ని వార్తలు ఎందుకు అచ్చు భాగ్యం నోచవో మీకే అవ గతమవుతుంది.

[నెక్కొండ గ్రామంలో వెనుకబడిన తరగతుల కులానికి చెందిన రెండు కాళ్లులేని అంగ వికలాంగురాలైన ఎడ్ల సమ్మక్క 22 సం॥ అను ఈమె నడువలేక ఇంటిలోనే ఉంటుంది. నన్ను ఆదుకొని బ్యాంకునుంచి రుణం ఇప్పించి కాళ్లులేని నేను స్వయంగా బ్రతుకుతెరువు గడుపుకోవటంకోసం ఏదైనా ఉపాధి ఏర్పాటు చేయండి అంటూ-తన తండి ఇదివరకు రోకండ్ల మిషన్ కోసం దరఖాస్తు కూడా చేసినట్లు ఆమె తెలియచేసింది.]

ఈ వార్తను నిశితంగా పరిశీలిస్తే అది అసమగ్రమని తేలిపోతుంది. సమ్మక్క అనే ఆవిడ వికలాంగురాలే, దాంట్లో సందేహం లేదు. ఈ వార్తను బట్టి సమ్మక్కకు ఓ తండ్రి ఉన్నాడు. అంటే సమ్మక్క పోషణ భారం ఆ తండ్రిదే. అయితే అతను ఏం చేస్తున్నాడు. ఇప్పటివరకూ ఎలా కుటుంబాన్ని పోషించుకుంటూ వస్తున్నాడు. సమ్మక్కకు ప్రమాదవశాత్తూ కాళ్లు పోయాయా? లేక పోలియో వంటి వ్యాధి కారణంగా కాళ్లు చచ్చుబడ్డాయా? ఆమెకు ఏదైనా వృత్తి తెలుసా? ఆమె ఏమైనా పనులు చేయగలదా? ఇప్పటివరకూ ఫలానా

సాయం కావాలని కోరుతూ అధికారులను సంప్రదించిందా ? సమ్మక్క తండ్రి రోకళ్ల మిషన్‌కు దరఖాస్తు చేస్తే అది ఎందుకు మంజూరు కాలేదు. దానికి కారణాలు ఏమిటి ? రోకండ్ల మిషన్ మంజూరు చేసే అధికారి ఎవరు ? అప్పు ఇచ్చే బ్యాంకు ఏది ? సంబంధిత అధికారుల వివరణ ఏమిటి ? రోకండ్ల మిషన్ మంజూరైతే సమ్మక్క కుటుంబం కష్టాలు గట్టెక్కుతాయా ? ఇలా రాస్తూ పోతే వార్తలో అన్నీ ఖాళీలే. విలేకరి ఈ వార్త విషయంలో ఎంతటి అశ్రద్ధ చూపాడో తేలుతుంది. పైన లేవనెత్తిన ప్రశ్నలన్నింటికీ వివరాలు సేకరించాలి. రోకండ్ల మిషన్‌ను విలేకరే పూనుకుని ఇప్పించగలిగితే ఆ కుటుంబానికి ఆధారం దొరికినట్లే. అయితే అధికారుల తాత్సారానికి కారణం ఏమిటో మరి. ఆ విషయాన్ని విలేకరి తెలుసుకోవాలి. మరో వార్త—

[నర్సంపేట మండల ప్రజా పరిషత్ అధ్యక్షుడు కె. మల్లయ్య "ఉపాధ్యాయుల బదిలీలలో మతలబులు" అను శీర్షికతో ఆంధ్రజ్యోతిలో ప్రచురించిన విలేకరిని తన ఖండనలో జర్నలిజానికి అవమాన కరమని, రాజకీయ దురుద్దేశంతో చౌకబారు ప్రకటనలు చేయడం అని పత్రికా ప్రకటన ఖండన వార్తలో కె. మల్లయ్య మండల ప్రజాపరిషత్ అధ్యక్షుడు పేర్కొనడం పట్ల నర్సంపేట ప్రాంతీయ జర్నలిస్టుల సంఘం తీవ్రంగా ఖండించింది.

వాస్తవాలను తెలిపే జర్నలిస్టులకు రాజకీయాలను అంటగట్టడం చౌకబారు ప్రకటనలుగా పేర్కొనడం ఎంతో చశోనీయం అంటూ జర్నలిస్టుల సంఘం గర్హించింది. నర్సంపేట మండల ప్రజా పరిషత్ సమావేశాల వర్తమానం విలేకరులకు ఎందుకు పంపడం లేదని అధ్యక్షుడు కె. మల్లయ్యను గత నెలలో ఆంధ్రజ్యోతి, ఉదయం పత్రికా విలేకరులు అడిగినందుకు వారి పట్ల దురుసుగా ప్రవర్తించినందుకు ఆ పార్టీ నాయకుల దృష్టికి నర్సంపేట జర్నలిస్టుల సంఘం తీసుకు రాగా నర్సంపేట, చెన్నారావు పేట, నల్లబెల్లి మండల యం. సి. పి. ఐ. నాయకుల ముందు మల్లయ్య గత నెల 10 న విలేకరులకు క్షమాపణ చెప్పారు. తిరిగి మళ్ళీ 'ఆంధ్రజ్యోతి' విలేకరిని జర్నలిజాన్ని, అవమాన పరిచినందుకు నర్సంపేట జర్నలిస్టుల సంఘం నిరసిస్తూ యం. సి. పి. ఐ. పార్టీ సమావేశాలను, పత్రికా ప్రకటనలను ప్రచురించ కూడదని తీర్మానించారు.]

ఈ వార్త సారమేమిటో ముందు అర్థం చేసు

"ఉపాధ్యాయుల బదిలీలలో మతలబులు శీర్షికతో ప్రచురితమైన వార్తపట్ల నర్సంపేట మండల ప్రజా పరిషత్ అధ్యక్షుడు కె. మల్లయ్య ప్రతిస్పందించారు. ఆ వార్త సరికాదని, రాజకీయ దురుద్దేశాలతో రాసినదని మల్లయ్య

అభిప్రాయం. మల్లయ్య ఇలా తన అభిప్రాయాన్ని ప్రకటించినందుకు స్థానిక విలేకరులంతా ఒక్కటయ్యారు. సమావేశమై మల్లయ్యను తూర్పార బట్టారు. ఇక మల్లయ్య వార్తలను పంప కూడదని తీర్మానించారు కూడా. ఆ వార్తలోని వివరాన్ని బట్టి చూస్తే మల్లయ్యకూ, స్థానిక విలేకరులకు కొంత కాలంగా సత్సంబంధాలు ఉన్నట్లు లేవు. ప్రజా పరిషత్ సమావేశాల వార్తలను చెప్పడం లేదని విలేకరులకు అసంతృప్తి, ఆగ్రహం కలిగి పార్టీ నాయకులకు ఫిర్యాదు చేశారు. వారు ఏదో సర్ది చెప్పి ఉంటారు.

స్థానిక పరిస్థితి ఏమిటో పూర్తిగా మనకైతే తెలీదు. కాని ఫలానా వారి వార్తలను బహిష్కరించాలని నిర్ణయించడమే పెద్ద తప్పు. సమాచారాన్ని తెలుసుకునే హక్కు ప్రజలకు ఉంది. ఏదో ఒక రకంగా ఆ సమాచారాన్ని విలేకరి ప్రజలకు అందించాలి. కొన్ని ఊళ్ళలో కొందరు రాజకీయ నాయకులతో కొన్ని విషయాల్లో గొడవలు ఉంటే ఉండవచ్చు. విలేకరిలో చాక చక్యం వుంటే ఎంతటి మొండికెత్తిన రాజ కీయ నాయకుడి నుంచైనా సమాచారం తెలుసు కోవచ్చు. అతడితో సత్సంబంధాలు ముఖ్యం. ఇది "చెరువుమీద కోపం వస్తే" లాంటిది. వార్తలను బహిష్కరించడమంటే విలేకరితన మౌలిక విధినే విస్మరించడం.

మల్లయ్య అనే ఈ నాయకుడిని సమర్థించడం లేదు. అయితే విలేకరుల సరళి మాత్రం అది కాదని చెప్పడమేనా ఉద్దేశం. 'ఉపాధ్యాయుల బదిలీలలో మతలబులు' అని ఓ పత్రికలో వార్త ప్రచురితమైతే దానికి ఖండన కూడా ఆ పత్రిక ప్రచురిస్తుంది. ఇతర పత్రికలు అసలు వార్తను వేయలేదు కనుక ప్రతి స్పందనను కూడా ప్రచురించవు. ఆ వార్త పంపిన విలేకరిని ఆ నేత పిలిచి వార్తలోని విషయాలు అసత్యాలని పేర్కొనవచ్చు. టీచర్ల బదిలీల్లో ఏ అక్రమాలు జరగ లేదని అతను వివరాలతో రుజువు పరచు కోవచ్చు. ఒక వేళ విలేకరి ఆ వివరణను పత్రికకు పంప లేదన్న అనుమానం నాయకుడికి వచ్చిందనుకోండి, ఆ వార్త కటింగ్‌తో సహా తన వివరణను పరిస్థితిని నేరుగా ఎడిటర్‌కు పంపవచ్చు. అప్పుడు ఎడిటర్ విలేకరిని పిలిపించి అతడిలో తప్పు వుంటే మందలించటానికి, చర్య తీసు కోవటానికి వీలు కల్గుతుంది.

ఒకరి వార్తలను బహిష్కరించడమే తప్పు అనుకున్నపుడు అలా బహిష్కరిస్తూ తీసుకున్న నిర్ణయానికి విలువ ఏముంటుంది. అది వార్త ఎలా అవుతుంది?

## ఇంకో వార్త చూద్దాం

[దంతాలపల్లి ఊరు శివార్లలో గత మూడు సంవత్సరముల నుంచి వ్యభిచారము బాహాటముగా జరుగుతుందని స్నేహశీలి యువజన సంఘం దంతాలపల్లి తెలియ చేశారు. ప్రతి రోజూ రాత్రి పదిగంటల నుండి తెల్లవారు వరకు ఈ వ్యవహారము జరుగుతుంది. రోడ్డుపై వచ్చే పోయే వాహనాలను ఆపి మరీ చేస్తున్నారు. గతంలో దంతాలపల్లి ఊర్లోనే ఈ వ్యవహారం జరుగుతుండగా ఈ యువజన సంఘం వీరిని తరిమి వేశారు. మళ్ళీ ఊరు శివార్లలో ఈ వ్యవహారం నడిపిస్తున్నారు. కొంతమంది గ్రామస్తుల అండ వలననే ఈ వ్యభిచారం బాహాటంగా జరుగుతుందని వారు అంటున్నారు.]

ఇలా సాగింది వార్త. ఊరి శివార్లలో వ్యభిచారం జరుగుతోందని ఓ సంఘం తెలియచేయగా వెంటనే విలేకరి బరబరా వార్త రాసి పంపేశాడు.

అసలు ముందు ఆ సంఘానికి ఊళ్లో ఏపాటి పలుకుబడి వుంది? గతంలో ఏ యే సామాజిక కార్యకలాపాలు చేపట్టింది, ఈ సంఘం నిజ్యమైతే కనుక క్రియాశీలురైతే సమీపంలోని పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు ఎందుకు చేయలేదు? ఒకవేళ చేసివున్నా పోలీసులు చర్య తీసుకోలేదా? గ్రామంలోని కొందరి అండదండలతోనే ఈ వ్యభిచారం సాగుతున్నట్లు యువజన సంఘం విలేకరికి చెప్పి వుంటే వారెవరో విలేకరి వాకబు చేశాడా? వ్యభిచారం ఓ సామాజిక బెడదే. దాంట్లో సందేహం లేదు. స్నేహశీలి యువజన సంఘం వారే నడుం కట్టి (అవసరమైతే విలేకరిని తోడు తీసుకెళ్ళి) ఆ వ్యభిచారిణులను అక్కడి నుంచి తరిమివేయ వచ్చుగదా! ఓ యువజన సంఘంవారి చైతన్యాన్ని గురించి చక్కని వార్త అప్పుడు రాసుకోవచ్చు. ఉబుసుపోని ప్రకటనలు ఇవ్వడం, దాన్ని విలేకరి పంపడం ఏమాత్రం తగవు,

విలేకరులు అధికారులతో, రాజకీయ నాయకులతో మర్యాదగా మెలగాలే కానీ వాళ్లు అన్యాయం చేస్తున్నా 'రాజీ' పడకూడదు, ఉపేక్షించకూడదు, ఎండగట్టాల్సిందే. అలాగే నీతి నిజాయితీపరులైన అధికారులు, రాజకీయ నాయకులకు అండదండగా నిలవాలి. విలేకరి ప్రజల సమష్టివాణి, విలేకరి ప్రజల ఆశాదీపం, ఆ బాధ్యత గుర్తెరిగి విలేకరి సమర్థవంతంగా ప్రజలకోసం పరిశ్రమించాలి. కలం వీరుడై కదను తొక్కాలి.

# వార్తలు అమ్మబడును

సొంత విలేకరులు ఉన్నప్పటికీ ఆ విలేకరుల బలగం సరిపోదు. సాధారణంగా తెలుగు పత్రికలు తమ విలేకరులను రాష్ట్రంలో వార్తల సేకరణకు మోహరించి ఉంటాయి. ఇతర రాష్ట్రాలు దేశ రాజధాని, ఇతర దేశాలలో జరుగుతున్న వార్తల కోసం పత్రికలు వార్తా సంస్థల సేవల మీద ఆధారపడతాయి. కేవలం వార్తలను సేకరించి వివిధ పత్రికలకు విక్రయించటం వార్తా సంస్థల విధి. వార్తా సంస్థలకు దేశ, విదేశాల్లో విలేకరులు ఉంటారు. ఆ విలేకరులు పంపే వార్తలను వార్తా సంస్థలు తమ సర్వీసు కోరే పత్రికలకు అందచేస్తాయి. పత్రికా కార్యాలయంలో వార్తా సంస్థలు, టెలిప్రింటర్‌లను అమర్చుతాయి. వార్త సంస్థకు చేరిన వార్తలను ఎడిట్ చేసి ఆ టెలి ప్రింటర్ ద్వారా పత్రికకు పంపుతుంటారు. ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా ( పి.టి.ఐ. ) యునైటెడ్ న్యూస్ ఆఫ్ ఇండియా ( యు.ఎన్.ఐ. ) వాటిలో ముఖ్యమైనవి. ఈ వార్తా సంస్థలు రాయటర్ వంటి అంతర్జాతీయ వార్తా సంస్థలతో కూడా సంబంధాలు కలిగి ఉంటాయి. అంటే అంతర్జాతీయ వార్తల కోసం , దేశీయ వార్తా సంస్థలు ప్రధానంగా అంతర్జాతీయ వార్తా సంస్థల మీద ఆధార పడతాయి. పత్రిక సొంత విలేకరి అందించిన వార్తనే వార్తా సంస్థకూడా అందించవచ్చు. అటువంటప్పుడు సామాన్యంగా సొంత విలేకరి వార్తనే ఉపయోగించు కుంటుంటారు. వార్తా సంస్థ పంపిన వార్తలో అదనపు వివరాలు ఉంటే వాటిని విలేకరి వార్తకు జోడిస్తారు. వార్తా సంస్థలు పంపిన వార్తలన్నీ ఉపయోగించు కోవల్సిన పనిలేదు. వాటిలో పత్రికకు అవసరమైన వార్తలను మాత్రమే ఉపయోగించుకుని వ్యర్థమనుకున్న వాటిని చెత్త బుట్ట దాఖలు చేస్తారు.

వార్తా సంస్థలు ఒక్కో వార్తను పలు భాగాలుగా టెలిప్రింటర్ మీద పంపుతుంటాయి. ఉదాహరణకు ఒక ప్రమాద వార్త ఉంటే 'యాక్సిడెంట్' అని పైన స్లగ్ (గుర్తు) తో యాక్సిడెంట్-1గా అంద చేస్తాయి. ఆ తర్వాత యాక్సిడెంట్-2, యాక్సిడెంట్-3 అని ఆ వార్త మిగిలిన భాగాలు అందిస్తుంది. వార్త నిడివి తక్కువగా ఉన్నప్పుడు ఒకే పార్ట్‌తో కుదించవచ్చు. ఒక వార్త ప్రసారం చేశాక ఆ వార్తకు సంబంధించి తదనంతర పరిణామాలు ఏమైనా చోటు చేసుకుంటే వాటినీ వార్తా సంస్థలు అంద చేస్తాయి. ప్రమాద వార్తనే తీసు కుందాం, ఆ ప్రమాదంలో మరణించిన వారి సంఖ్య 13 అని తొలుత వార్తా సంస్థ తెలియ చేస్తుంది. ఆ తర్వాత ప్రమాద వివరాలు మరికొన్ని తెలుస్తాయి, మరణించిన వారి సంఖ్య పెరగవచ్చు. అప్పుడు ఆ వివరాలతో 'లీడ్ యాక్సిడెంట్' అనే స్లగ్‌తో వార్త అందచేస్తారు. కొన్ని సందర్భాల్లో

'సెకండ్ లీడ్ యాక్సిడెంట్' 'థర్డ్ లీడ్ యాక్సిడెంట్' అనే స్లగ్‌తో కూడా తర్వాత వార్త రావచ్చు. ఇక్కడ గమనించాల్సింది మామూలు యాక్సిడెంట్ స్లగ్‌తో వచ్చిన వార్తకంటే లీడ్ యాక్సిడెంట్ లేటెస్ట్. దానికంటే సెకండ్‌లీడ్ దానికంటే థర్డ్‌లీడ్ లేటెస్ట్ అని గ్రహించాలి. వార్తా సంస్థనుంచి అందే ఈ తరహా వార్తల్లో పైన ఉన్న స్లగ్‌ను గమనించి పత్రికకు ఉపయోగించు కోవలసి ఉంటుంది.

ప్రస్తుతం కొన్ని పత్రికలు తామే స్వయంగా వార్తా సంస్థలను నిర్వహిస్తున్నాయి. 'ఈనాడు' పత్రికకు చెందిన 'న్యూస్‌టుడే', ఉదయం పత్రికకు చెందిన 'టెలిన్యూస్' ఈ కోవకు చెందినవే. ఈ తరహ వార్తా సంస్థలు ప్రధానంగా తమ పత్రికలకే వార్తలందిస్తున్నాయి. పోటీలేని ఇతర భాషా పత్రికలకు కూడా వార్తలను విక్రయించవచ్చు.

---

## ఇన్ పేషెంట్

ఓసారి విజయవాడలో జర్నలిస్టుల సమావేశం జరుగుతోంది. ఓ యువ పాత్రికేయుడు లేచి నిలబడి—ఇ.ఎస్.ఐ. ఆస్పత్రులు పరమ అధ్వాన్నంగా ఉన్నాయి. అక్కడ పట్టించుకునే నాధుడేలేరు" అని ఆవేశంగా అన్నాడు.

సమావేశానికి అధ్యక్షత వహించిన ఎడిటర్ ఆ యువకుడికి నచ్చ చెప్పారు. "మన ఎజండా ఇప్పుడు ఇ.ఎస్.ఐ. గొడవకాదు. దానిగురించి తర్వాత చర్చిద్దాం" అని ఎడిటర్ చెప్పగానే ఆ యువ పాత్రికేయుడు కూర్చున్నాడు.

ఇంతలో వెనక వరసలోంచి ఓ వృద్ధ పాత్రికేయుడు వీరావేశంతో లేచి నిలబడి—

"ఎజెండాలో లేదంటే ఎలాగండీ! నేను ఇ.ఎస్.ఐ. లో ఇన్‌పేషెంట్‌నికూడా ఆ అస్పత్రులపై చర్చించాల్సిందే" నని గట్టిగాఅరిచాడు.

దానికా ఎడిటర్ ఇలా అన్నారు. "చూడండి మహాశయా! మీరు ఇన్‌పేషెంట్ అయితే అయ్యారు. ఇంపేషెంట్ మాత్రం కాకండి"

ఆవృద్ధ పాత్రికేయుడు చటుక్కున కూర్చుండి పోయాడు.

---

# విలేకరి కొందరికి శత్రువే

పత్రికల్లో తనకు వ్యతిరేకంగానో, తమను విమర్శిస్తూనో వార్తో, వ్యాఖ్యో వస్తే కొందరు రాజకీయ నాయకులు ఆ పత్రికపై కసి పెంచుకుంటారు. ఆ పత్రికనూ, ఆ పత్రికా విలేకరిని శత్రువును చూసినట్లు చూస్తారు. తమ పలుకుబడి ఉపయోగించి ఆ పత్రిక పీకనొక్క చూస్తారు. కొందరైతే ఆ పత్రిక విలేకరిని తాము ఏర్పాటు చేసే సమావేశాలకు పిలవరు.

నిజానికి సామాన్యులైనా, మాన్యులైనా ఓ విషయం గుర్తుంచుకోవాలి. మనల్ని ఎవరేని విమర్శిస్తున్నారంటే మన లోపం సరిదిద్దుకునే అవకాశం అతడు కల్పించినట్లే గదా! ఆ రకంగా ఉపకారం జరిగినట్లే. ఎదుటివాడు పొగడ్తలతో, ప్రశంసలతో ముంచెత్తినపుడే కడు జాగ్రత్తగా మెలగాలి. ఎదుటివారిని మాటలతో, చేతలతో సంతృప్తిపరిచి పబ్బం గడుపుకునే బాపతు కొందరుంటారు. వ్యక్తుల మాదిరే పత్రికల్లోనూ ఈ రెండు రకాలనే చూడచ్చు.

ముఖానికి ఏ బురదో అంటితే ఆ బురదను శుభ్రం చేసుకోవాలి కానీ ఆ బురదను చెప్పిన అద్దం పగలగొడితే జరిగే మేలేదీ వుండదు. మంచి పత్రిక ధ్యేయమూ, నికార్సయిన రాజకీయవేత్త ధ్యేయమూ ఒకటే. ప్రజల బాగును కోరడం ప్రజలకు మంచి జరిగేట్లు చూడటం. ప్రజా హితవును కాంక్షించి ఓ పత్రిక ఓ నాయకుడిని విమర్శిస్తే ఆ విమర్శలోని ఔచిత్యాన్ని గుర్తించి సరిదిద్దుకునే ప్రయత్నం చేసుకోవాలి. దురదృష్టవశాత్తూ చాలామంది రాజకీయ నాయకుల్లో ఇదే లోపించింది.

పత్రికా విలేకరులతో ఎలా వ్యవహరించాలన్న విషయంలోనూ మహాత్మా గాంధీ ఆదర్శంగా నిలుస్తారు విలేకరులు గుప్పించే ప్రశ్నలకు ఆయన చతురోక్తులతో జవాబిచ్చేవారు. అనవసరంగా ఆవేశపడటం అసలు జరిగేదే కాదు. బ్రిటన్ పాలకులకు మద్దతునిస్తూ, స్వాతంత్రోద్యమాన్ని నిరసించే పత్రికలతో సైతం ఆయన మామూలుగానే వ్యవహరించేవారు. ఆ పత్రికలను గాంధీ వేలెత్తి చూపేవారు కాదు. లండన్‌లో 1931 లో రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ జరిగింది. ఈ కాన్ఫరెన్స్ విశేషాలను చక్కగా విలేకరులకు వివరించిన ఘనత మహాత్ముడిదే.

బ్రిటన్‌లో క్షణం తీరుబడిలేని కార్యక్రమాల్లో తలమునకలై వుండీ విలేకరులతో సంభాషించేటపుడు అప్పటికప్పుడు హాస్యం, వ్యంగ్యం కురిపించేవారాయన. బ్రిటన్ విలేకరులు ఆయన వస్త్రధారణపై దృష్టి సారించినపుడు

బోసినవ్వులు చిందిస్తూ "మీ దేశంలో నాలుగు రకాలు ధరిస్తారు. నేను నాలుగు రకాలు ధరించను ఒకటే ధరిస్తాను" అని సమాధాన మిచ్చారు.

కింగ్ జార్జితో సమావేశమై బకింగ్‌హామ్ పాలెస్ నుంచి బయటకు రాగానే ఓ విలేకరి, గాంధీని ఇలా ప్రశ్నించాడు. "కేవలం ఖద్దరు అంగ వస్త్రంతో వున్న మీకు లోపల చలి అనిపించలేదా?" అని విలేకరి అడగ్గా, గాంధీజీ వెంటనే- "అదేం లేదు. మా ఇద్దరికీ సరిపోగలిగిన దుస్తులను రాజు గారు ధరించారు" అని సమాధాన మిచ్చారు.

రాయటర్ విలేకరి అప్పటికే గాంధీజీపై చాలా ప్రశ్నలు గుప్పించాడు. మరో ప్రశ్న అడగ్గా- "మా మేక పాలు పితికినట్లు ఇప్పటికే నా దగ్గర్నుంచి పూర్తిగా పిండేసుకున్నావు (విషయాలు రాబట్టుకున్నావు) అని గాంధీజీ సుతారంగా మందలించారు.

ఓసారి కొలంబియా బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్, అమెరికా ప్రజల నుద్దేశించి ప్రసంగించవలసిందని గాంధీని కోరింది. అప్పట్లో మైక్రోఫోన్‌ను కొత్తగా కనిపెట్టారు. మైక్ దగ్గరకొచ్చి- "నేను దీంట్లో మాట్లాడాలా?" అని గాంధీ అమాయకంగా ప్రశ్నించడం లక్షలాది శ్రోతలను ముగ్ధుల్ని చేసింది.

రాజకీయ నాయకులకు కూడా క్రీడాస్ఫూర్తి కావాలి. స్వీయ లోపం తెలుసుకోవటం పెద్ద విద్య అన్నారు. ఆ విద్యను రాజకీయవేత్తలే కాదు అందరూ నేర్చుకోవాలి. అప్పుడు విమర్శించే పత్రికల్ని నిజమైన మిత్రులుగా చూడగల విశాల హృదయం ఏర్పడుతుంది.

---

## పైకిమాత్రం పంపకండి

ఓ రోజు కార్టూనిస్ట్ మోహన్, శ్రీధర్‌ను కలుసుకోడానికి 'ఈనాడు'కు వచ్చాడు. సెక్యూరిటీ ఆఫీసర్ శ్రీధర్‌కు ఫోన్ చేశాడు.

"సార్! మీ కోసం మోహన్‌గారు వచ్చారట, పైకి పంపమంటారా?"

"మోహన్‌ను నా దగ్గరకు పంపితేచాలు. పైకి మాత్రం పంపకండి" అని శ్రీధర్ చెణుకు విసిరాడు.

"మీ కార్టూనిస్టులతో ఇదే గొడవ అంటూ సెక్యూరిటీ ఇనస్పెక్టర్ ముసి ముసిగా నవ్వుకుంటూ మీరు వెళ్ళండిసార్!" అంటూ మోహన్‌కి గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు.

# 3

# అవీ ఇవి

ఇందులో



---

## బంగారమా? చింతపండా?

రిపోర్టర్ లోకనాధం తను రాసిన వార్త తెచ్చి ఇన్‌చార్జి భైరవయ్య చేతికిచ్చాడు. ఆవార్త చాలా పెద్దదిగా వుంది. లోకనాధం ఏకంగా ముప్పై పేజీలు రాసి పారేశాడు.

భైరవయ్య ఆ వార్త కాగితాలను చేతిలో వుంచుకుని బరువు చూస్తున్న ట్లుగా అభినయిస్తూ.

ఇంతకీ నీవార్త బంగారమా? చింతపండా?" అని అడిగాడు.

లోకనాధానికి అర్ధంకాలేదు.

"బంగారాన్నయితే గ్రాముల్లో తూస్తారు. చింతపండుని కిలోల్లో తూస్తారు. నువ్వు కేజి లెక్కన వార్త ఇచ్చావంటే అది చింతపండే. పసలేదన్న మాట" భైరవయ్య చి ట్లు వేశాడు

లోకనాధం వెంటనే తేరుకుని "నా చింతపండుని బంగారంగా మార్చగల శక్తి మీకెటూవుంది" అంటూ తిప్పి కొట్టాడు.

"ఆపనే చేయబోతున్నా" అంటూ భైరవయ్య ఆవార్తకు కత్తెర వేయ నారంభించాడు.

# ఆ రోజులే వేరు

అవును. నిజమే. పత్రికలకు సంబంధించి ఆ రోజులే వేరు. అప్పట్లో పత్రికలు ఇంత వ్యాపారపరం కాలేదు. అప్పట్లో ఇంత పోటీ లేదు. ఇంతగా వాణిజ్య ప్రకటనలు లేవు, చదువరులూ లేరు.

స్వాతంత్ర్యం రాకముందు కాలంలో పత్రికలు,పాత్రికేయుల దృష్టం తా స్వాతంత్ర్యపోరాటంపైనాఆపోరాటంనడిపిస్తున్నకాంగ్రెస్‌పార్టీపైనేకేంద్రీకృతమై ఉండేది.వార్తలకోసం ఒకే ఒక సంస్థ ఉండేది. ఆ సంస్థ రాయటర్ ద్వారా విదేశీ వార్తలు కూడా అందించేది. ఈ ఏజన్సీ ఏదిస్తే అదే వేదం. ఆ రోజుల్లో పత్రికలకు ఇంతగా విలేకరులు పెరగలేదు. రాజకీయ పార్టీల కార్యకర్తలే వార్తా విలేకరులు. వాళ్లు రాసిచ్చినదాన్నే విలేకరి పేరిట అచ్చేసే వారు. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ముఖాముఖి రాజకీయాల్లో ఉన్నందున ఆంధ్ర పత్రికకు ఆరూపేణా విలేకరులు ప్లస్ కార్యకర్తల బలం బాగా ఉండేదని చెప్పచ్చు. విలేకరులు డబ్బునాశించే వాళ్ళుకాదు. పత్రిక రిపోర్టర్‌గా గుర్తింపు కార్డు ఇస్తే అదే పదివేలని ఆ కార్డుతో 'దర్జా' వెలగబెట్టచ్చని పొంగి పోయే వాళ్ళు.

స్వాతంత్ర్యం రాకముందు-పత్రికల్లో విదేశీ వార్తలే ఎక్కువ భాగం ఆక్రమించేవి. పత్రికల్లో విదేశీ వార్తల వాటా 65 శాతం కాగా దేశీయ వార్తల వాటా 30 శాతం. స్వరాష్ట్ర వార్తల వాటా 5 శాతం. మిగిలిన 5 శాతం. వార్తలు విలేకరులు పంపిన స్థానిక సమాచారం. పత్రికలన్నింటిలో దాదాపు ఒకే వార్తలు ఉంటుండేవి. కారణం ఆ వార్తలన్నీ ఒకే వార్తా సంస్థ ఇచ్చినవి కావడం. ఏదైనా రాతలో (అదీ వ్యక్తిగత శైలి ఉంటే) తేడాతప్పించి వార్తా కథనం ఒకటిగానే ఉండేది. రాజకీయ విశ్లేషణలు అసలు ఉండేవి కావు. గాసిప్‌లు, ఊహాగానాలు మచ్చుకైనా కన్పించేవి కావు.

పత్రికలు ఈ పరిస్థితిలో ప్రజల్ని ఎలా చైతన్యవంతం చేస్తాయి. పత్రికకు అప్పట్లో ఎడిటోరియలే ప్రాణంగా విలసిల్లింది. జాతీయ భావాలను ఎవరు బాగా సంపాదకీయాల్లో చెప్పగలిగారన్నదే అప్పట్లో చర్చనీయాంశం. ఈ రోజుల్లో ఏ వార్త ఎవరు ఇవ్వలేకపోయారని అనుకుంటుంటారు. అప్పట్లో "మిస్‌డ్‌వై" అనే ప్రశ్న ఎదురయ్యేది కాదు.

ఆ రోజుల్లో పత్రికలు ఎడిటర్‌తో గుర్తింపు పొందేవి. ఎడిటర్, ఎడిటోరియల్ అవిభాజ్యంగా సాగేది. నాటినుంచీ కూడా ఎడిటర్ అన్నవాడు ఎడిటోరియల్ రాసితీరాలన్న భావం పత్రికారంగంలో నాటుకుపోయింది.

ఆంధ్ర పత్రిక, ఆంధ్ర ప్రభ ఆదినుంచి తెలుగు లోగిళ్లలో చిరపరిచిత మైనవే. 1944 ప్రాంతంలో తెలంగాణలో గోల్కొండ పత్రికను నెల కొల్పారు. వారానికి రెండుసార్లు అచ్చొత్తేవారు. ఇదే కాలంలో బొంబాయికి చెందిన గులాం మహ్మద్ కలకత్తావాలా అనే వ్యాపారి నైజాం నవాబును మంచి చేసుకుని ఆయన ప్రాపకంతో తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ భాషల్లో మీజాన్ దిన పత్రికను హైదరాబాద్‌లో స్థాపించాడు. తెలుగు మీజాన్‌కు అడవి బాపిరాజు సంపాదకుడిగా ఉండేవారు. ఇదే కాలంలో డక్కన్ క్రానికల్ సంస్థ తెలంగాణా పేరుతో దినపత్రికను ప్రచురించేది. డక్కన్ క్రానికల్‌తోపాటు హైదరాబాద్ బులిటెన్ అనే పత్రిక కూడా వుండేది. 1944లో కమ్యూనిస్ట్ పార్టీ ప్రజాశక్తిని స్థాపించింది. కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా, కమ్యూనిస్ట్ పంథాలో ప్రజాశక్తిలో వార్తలు వెల్వడేవి. తెలంగాణ సాయుధ పోరాట వార్తలకు సోవియట్ వార్తలకు ఎక్కువ మొగ్గు ఉండేది. ప్రకాశం ఆర్డినెన్స్ పేరిట కమ్యూనిస్ట్ పార్టీని నిషేధించారు. దాంతో ప్రజాశక్తి ప్రచురణ నిలిచిపోయింది. 1948 పోలీస్ యాక్షన్‌తో మిజాన్ పత్రికా మూతపడింది. 1953 లో ఎన్నికలయ్యాక ప్రజాశక్తినే విశాలాంధ్ర పేరిట పునః ప్రారంభించారు. ఆ తర్వాత కమ్యూనిస్ట్ పార్టీలో చీలిక రావడం, మార్క్సిస్ట్‌లు ప్రత్యేకంగా తమ పార్టీ పత్రికగా ప్రజాశక్తిని విజయవాడనుంచి ముద్రిస్తున్నారు. విశాలాంధ్ర సి.పి.ఐ పత్రికగా కొనసాగుతోంది.

విజయవాడనుంచి మాతృభూమి, మద్రాసునుంచి సత్యప్రభ దినపత్రికలు వచ్చేవి కానీ, ఎక్కువకాలం వెలుగుకు నోచలేదు. రాజకీయ వారపత్రికగా కృష్ణాపత్రిక ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకత్వంలో వెల్వడేది. 1925కు ముందు పత్రికల్లో భాష భిన్నంగా ఉండేది.

"గవర్నర్ జనరల్ మద్రాసు వచ్చుట" అని శీర్షికలో రాసేవారు. ఆ తర్వాత్తర్వాత 'గవర్నర్ జనరల్ ఆగమనం, రాక' అనే రూపంలో శీర్షికలు వచ్చేవి. ఒకప్పుడు ఒకే వార్తకు నాలుగయిదు రకాల శీర్షికలను విభిన్న సైజుల్లో ఉపయోగించేవారు. ఏడు కాలాల్లో పెద్ద శీర్షిక ఉంచితే దానికింద 3 కాలాల్లో రెండు లైన్లలో మరో శీర్షిక ఉండేది. ఆ తర్వాత అంతకంటే చిన్న సైజులో మరో శీర్షిక ఇలా క్రమానుగతంగా శీర్షికల సైజు తగ్గుతూ వచ్చేది. వెరసి ఒక్కో వార్తకు నాలుగయిదుకు తక్కువ కాకుండా శీర్షికలనండీ, డెక్‌లనండి వుండేవి.

పూర్వం పత్రికల్లో విదేశీ వార్తలకు అధిక భాగం కేటాయించేవారని చెప్పుకున్నాం. ఈ కారణానే విదేశీ వార్తలు రాసే సబ్ ఎడిటర్ అంటే

గొప్పగా ఫీలయ్యేవారు. రాష్ట్రానికి సంబంధించిన వార్తలు రాసే ఉపసంపాద కుడు మధ్యమం, ప్రాంతీయ వార్తలు రాసేవాడు తృతీయ శ్రేణి. ఇప్పటికీ ప్రాంతీయ వార్తలన్నా, వాటిని రాసేసబ్ ఎడిటర్లన్నా కొందరికి చిన్నచూపు. ఇది అవగాహన లోపం మాత్రమే. ఒకప్పుడు విదేశీ వార్తలది బల్క్ షేర్ అయితే ఇప్పుడు ప్రాంతీయ వార్తలది బల్క్ షేర్ అయింది.

పూర్వం ఉద్యోగం కోసమని చెప్పి ఎవరూ పాత్రికేయ వృత్తి చేపట్టే వారు కాదు. డబ్బు ప్రధానంగా ఎంచేవాళ్ళు కాదు. తమ భావాలను పదుగురికి తెలియచెప్పే అవకాశం కల్గుతుందన్న ఆశతోనే పాత్రికేయ వృత్తిని చేపట్టే వారు. అప్పట్లో ఉపసంపాదకుడికి 60 రూపాయలు, ఎడిటర్కు 250 రూపా యల జీతం ఉండేది. అలనాటి పాత్రికేయుల్ని జాతీయతా స్ఫూర్తి నడిపిం చింది. నాటికీ నేటికీ పత్రికాపరంగా మౌలిక మార్పు ఒకటుంది. నాలుగు దశాబ్దాల నాడు పత్రికలు అమ్మకాలమీద బతికేవి, న్యూస్ప్రింట్ చవగ్గా ఉండేది. 50వ దశకంలో కేవలం మూడువేల సర్క్యులేషన్తో పత్రికలు ఆర్థికంగా నిలదొక్కుకో గలిగేవి. ఆ మాత్రం సర్క్యులేషన్ ఉందంటే ఖర్చులు, జీతాలు పోను యజమానికి కాస్తోకూస్తో లాభాలు మిగిలేవి. మరీనాడు వాణిజ్య ప్రకటనలే పత్రికలకు ఆధారం.

ఆంధ్ర పత్రికవారు దినపత్రికతోపాటు వారపత్రికా తీసుకొస్తున్నారు. సాహిత్యంకోసం ప్రత్యేకంగా భారతిని నడిపేవారు. ఇప్పుడు భారతిని ప్రత్యే కంగా ఇవ్వకుండా దినపత్రిక అనుబంధంగా ఇస్తున్నారు.

ఒక దినపత్రిక సంస్థ నుంచి విబిన్న వార, మాసపత్రికలు తేవడమన్న ఒరవడిని దిద్దింది ఆంధ్ర పత్రికే. దీనివల్ల ఒనగూరుతున్న ప్రయోజనాలు అపారం. దినపత్రిక అచ్చేయగా మిగిలిన న్యూస్ప్రింట్ను సద్వినియోగం చేయవచ్చు. కార్మికులు, యంత్రపరికరాల సామర్థ్యాన్ని పూర్తి స్థాయిలో ఉప యోగించుకోవచ్చు. అదనపు సిబ్బంది పెద్దగా లేకుండానే (మాగజైన్లకు ఓ ఎడిటర్, అతనికో అసిస్టెంట్ వుంటే బండి లాగించేయవచ్చు) ఈ పత్రికలు తీసుకురావచ్చు. వీటన్నిటికంటే ముఖ్యం పత్రిక ఏజంట్లు కేవలం దినపత్రిక అమ్మకాలమీద వచ్చే కమీషన్తోనే బతకలేరు. ఒకే సంస్థనుంచి ఇతర పత్రి కలు వస్తే అటు ఏజంటుకి మరో నాల్గు రూపాయలు మిగులుతాయి. యాజ మాన్యానికి పంపిణీ సమస్యా ఉండదు. దినపత్రిక ఏజంటు ఇతర పత్రికలకూ బాధ్యత తీసుకుంటాడు. ఇప్పుడు దినపత్రికలు వెలయిస్తున్న ప్రతి సంస్థా వార, పక్ష, మాస పత్రికలను తెస్తున్నాయి. పిల్లల పత్రిక, మహిళల పత్రిక, సినిమా పత్రిక - ఇలా విభిన్నవర్గాల పాఠకుల అభిరుచులను తీరుస్తున్నాయి.

# పత్రిక పాలసీకి దర్పణం

ఎడిటోరియల్ అనగానే ఈతరం వారికి నార్ల వెంకటేశ్వరరావు, గోరాశాస్త్రి ప్రభృతులు గుర్తుకొస్తారు. నార్ల వారికి సంబంధించి ఓ కథ ప్రచారంలో వుంది. పూర్వం ఆంధ్రజ్యోతిని విజయవాడలో స్థాపించినపుడు ఇప్పటిలా భవనంలేదు. ఓపాక వుండేదిట. ఆ పాకలోనే నార్ల వెంకటేశ్వరరావు కూర్చుని సంపాదకీయాలు రాసే వారట. ఆపాకకు దగ్గర్లోనే పెంటకుప్ప ఉండేదిట. ఓరోజు నార్ల సంపాదకీయం రాయటానికి ఉపక్రమించారట. ఎంతకీ కలం ముందుకు సాగటంలేదు. ఏం చేయటానికీ పాలుపోలేదు. సరే! కాసేపు అలా తిరిగొద్దాం అని చెప్పి కుర్చీనుంచి లేచి అటూఇటూ తిరిగి వచ్చారట. తిరిగి వచ్చాక నార్ల ఫోర్‌మన్‌ను కేకేశారట. పరిస్థితిని ఫోర్‌మన్‌కు చెప్పి ఎడిటోరియల్ కాస్తలేటయ్యేట్లుంది అన్నార్ట నార్ల.

ఫోర్‌మన్ బిత్తరపోయి. "అదేంటిసార్! ఎడిటోరియల్ కంపోజ్ కూడా అయిపోతోంది. ఫైనల్ రీడింగ్ జరుగుతోంది" అన్నాట్ట. ఈమారు ఆశ్చర్యపోవడం నార్లవారి వంతయింది. ఫోర్‌మన్ విషయాన్ని వివరంగా చెప్పాడు. "సంపాదకీయం కోసం ఇంతకుముందు ఇక్కడకు వచ్చానుసార్! మీరులేరు. అటూఇటూ చూసేసరి కింద కాగితాలు పడిపోయివున్నాయి. వాటన్నిటిని వరసగా పెట్టి కంపొజ్‌కి ఇచ్చా"అని ఫోర్‌మన్‌చెప్పాట్ట. 'అయితే సంపాదకీయం పట్రా' అని నార్ల పురమాయించారట. ఫోర్‌మన్ డిసిప్లిన్డ్ సోల్జర్ మాదిరే క్షణంలో ఎడిటోరియలే ప్రూఫ్ పట్టుకొచ్చి నార్ల ముందుంచాట్ట. సందేహంలేదు. అది ఎడిటోరియలే. ఈ కథలో అసలు హైలైట్ ఏమిటంటే నార్ల వారు అటు వెళ్ళగానే ఆయన బల్లమీద కాగితాలు గాలికి కింద పడిపోయాయి. వెనక పెంట కుప్పల మీద తిరుగుతున్న కోళ్లువచ్చి ఆకాగితాలమీద తిరిగాయి, వాటి కాళ్ల అద్దుళ్ల కాగితాలపై పడ్డాయి. వాటిని ఫోర్‌మన్ తీసుకువెళ్ళి కంపొజ్‌చేయించాడు. ఈ కథ కల్పితమే. ఈ కథ ప్రచారంలోకి ఎందుకొచ్చిందీ ఈ పాటికి మీకు అర్థమయ్యే ఉంటుంది. నార్ల రాత కోడిగీతల్లా ఉండేదిట. నరమానవుడికి ఓ పట్టాన అర్థమయ్యేది కాదట. నార్ల వారి సంపాదకీయాలను కంపోజ్ చేయటానికి ప్రత్యేకించి ఓ కంపోజిటర్ వుండేవాట్ట. నార్ల వారి రాతలో అతను ఆరితేరిన ఘటమట.

ఆధునిక తెలుగు జర్నలిజంలో సంపాదకీయాలకు ఒరవడి పెట్టిన ఘనత నార్ల వారికే దక్కుతుంది. ఆయన సంస్కృతాన్ని వ్యతిరేకించే వారు. శిష్ట వ్యవహారానికి పట్టం గట్టేవారు. అయినా సంస్కృత పండితుల పట్ల

గౌరవం. ఆదరం చూపేవారు. ప్రజల పలుకుబడిలోని ఎన్నో మాటలను ఖాయంచేసి వాటికి ప్రాశస్త్యాన్ని చేకూర్చారు నార్ల. డ్రెడ్జర్ అనే మాటకు త్రవ్వోడను, నాన్ ఎలైన్డ్‌కు అలీనను పత్రికల్లో ఖాయం చేసింది నార్లే. క్రొత్త మాటలను ఖాయం చేసేటపుడు సంస్కృతం బాగా చదువుకున్న సహచరులను సంప్రతించేవారు. తాపీ ధర్మారావు, నార్లవారికి జర్నలిజంలో ఓనమాలు దిద్దబెట్టారు. తన సంపాదకీయాలతో పాఠకలోకంలో ఫాలోయింగ్‌ను ఏర్పరచుకున్నారు నార్ల.

సునిశిత హాస్యంతో, వ్యంగ్య విమర్శతో గోరాశాస్త్రి సంపాదకీయాలు గణతికెక్కాయి. గోరాశాస్త్రి సంపాదకీయ రచనకోసం కసరత్తు చేసేవాడు. పరీక్ష హాల్లో సమాధానం తోచని కుర్రాడిలా అప్పుడప్పుడు ఆయన దర్శనమిచ్చేవారు. నోటికొచ్చిన రాతగా కాకుండా-ఇక్కడ ఈ మాట వుండకూడదు, ఇంకా మంచి మాట ఉపయోగించాలి అని చెప్పి ఎడిటోరియల్ చెక్కేవారు. సంపాదకీయం రాయటం ముగించాక ఈ అలసటంతా ముఖంలో కన్పించేది. సంపాదకీయం రాసేలోగా సిగరెట్లు, టీ లు చాలా ఖర్చయ్యేవి. గోరాశాస్త్రి ఓ తువ్వాలు, సబ్బు పెట్టె దగ్గరుంచుకునేవారట. అడపా తడపా ముఖం కడుక్కొని వస్తూ వుండేవారట. ఆయన వినాయకుడి వీణ శీర్షిక నిర్వహించేవారు. సంపాదకీయాల్లో ఈ శీర్షిక ఛాయలు అప్పుడప్పుడు కన్పించేవి.

పండితారాధ్యుల నాగేశ్వరరావును సంపాదక రాక్షసు డనవచ్చు. ఆయన చాలాకాలం క్రితం ఆంధ్ర పత్రికలో పనిచేశారు. ఆ తర్వాత ఆంధ్రభూమి సంపాదకత్వం చేపట్టారు. ఆయన భూమి సంపాదకత్వం చేపట్టేటపుడు సినిమా తరహాలో ప్రచారం సాగింది. ఆయన ఫోటోను ముద్రించి పోస్టర్లు అంటించారు. నిర్దిష్టమైన శైలి లేకపోయినా పండితారాధ్యుల నాగేశ్వరరావు సంపాదకీయం నుంచి సంపాదక లేఖ వరకూ అవసరం ఏర్పడితే రాయటానికి సిద్ధపడేవారు. పండితారాధ్యుల సంపాదకీయంతోపాటు సంకీర్తనం అనే ఫీచర్ నడిపేవారు. వార్తలు రాసేవారు. పేజీ మేకప్ చేయించేవారు. ప్రజాప్రభ పేరిట కొంతకాలం సొంతంగా పత్రిక నిర్వహించిన పండితారాధ్యుల ఎమర్జన్సీ అకృత్యాలను ఎండగడుతూ ఆంధ్రప్రభలో ఎన్నో వ్యాసాలు రాశారు.

నిజానికి ఇప్పటికీ కృష్ణా పత్రికలో ముట్నూరి కృష్ణారావు రాసిన సంపాదకీయాలను 'మోడల్' సంపాదకీయాలుగా పేర్కొంటారు. ముట్నూరి వారి శైలి, భాష, విషయ సమర్పణ ఇందుకు కారణాలు.

పూర్వం సామాన్య ప్రజానీకం కోసం కాక సాహితీప్రియులకే పత్రికలు నడిపేవారు. స్వాతంత్ర్య పోరాట కాలంలో ఈ ధోరణి మారింది. పత్రికలను

సామాజిక చైతన్య దీపికలుగా వెలయించాలన్న కృషి ప్రారంభమైంది. ఈ దిశలో కందుకూరి వీరేశలింగం, ఖాసా సుబ్బారావు వంటి మహనీయుల కృషి అనల్పం. స్వాతంత్ర్యోద్యమ కాలంలో సాహిత్యంకంటే విషయానికి ప్రాధాన్యం పెరిగింది. పదాడంబరం తగ్గి, విషయ వివరణ, చైతన్యం కల్పించాలన్న తపన చోటు చేసుకున్నాయి. స్వాతంత్ర్య సిద్ధికోసం పరితపిస్తున్న రోజులవి. ఎక్కువ శ్రమ లేకుండానే ప్రజల్లోకి భావాలు పరివ్యాప్తమయ్యాయి.

ఆనాటినుంచి ఈనాటివరకూ కూడా సంపాదకులే సంపాదకీయాలు రాయాలన్న అభిప్రాయం పాతుకుపోయి వుంది. అయితే 'ఈనాడు' పత్రిక దీన్ని ఛేదించింది. 'ఈనాడు' వెల్వడిన తొలి రోజుల్లో సంపాదకీయం ఉండేది కాదు. ఆ తర్వాత్తర్వాత సంపాదకీయం చోటు సంపాదించుకుంది. వర్తమాన విషయాలపై పత్రిక విధానమేమిటో తెలిపేదే సంపాదకీయం. ఒక్కోసారి ప్రజలను ప్రభావితం చేసే వేదిక కూడా సంపాదకీయమే. ప్రజల్లో ఆలోచనలను రేకెత్తించి జాగృత పరిచే శక్తి సంపాదకీయాలకు ఉంది.

ఆంగ్ల పత్రికల్లో సంపాదకీయాలు రాసేందుకు 'లీడర్ రైటర్స్' అని ప్రత్యేకంగా ఉంటారు. ఆ పద్ధతిని 'ఈనాడు' అందిపుచ్చుకుంది. ఒక్కోరోజు ఒక్కొక్కరు సంపాదకీయం రాస్తారు కనుక చర్విత చర్వణానికి స్వవచో వ్యాఘాతానికి తావులేకుండా జాగ్రత్త వహించాలి.

సంపాదకీయమంటే నడుస్తున్న చరిత్రలో భాగం. నిర్దుష్ట సమస్యను క్లుప్తంగా వివరించి మంచి చెడ్డలను సమీక్షించి మెరుగైన పరిష్కారాన్ని సంపాదకీయం సూచించాలి. పత్రిక ఒక పార్టీని సమర్థిస్తున్నా ఆ పార్టీని మొండిగా వెనకేసుకురావడం మంచిది కాదు. పార్టీ ఏదైనా ప్రజాభిమతం, ప్రజాశ్రేయస్సే పరమావధి కావాలి. ప్రజాదృక్పథంవున్న పత్రికలే ఆదరాన్ని చూరగొంటాయి.

విషయాన్ని బట్టి సంపాదకీయంలో భాషను ప్రయోగించాలి తప్ప భాషా వ్యామోహంతో ఉక్కు పదాలతో పోపుపెట్టడం తగదు. ప్రజల స్థాయికి అందని భాషలో ఏం చెప్పినా అది నిరుపయోగమే.

గోరాశాస్త్రి సంపాదకీయాలను అభిమానించే వారంతా కలిసి ఎడిటోరియల్ క్లబ్స్ అనేవి ఏర్పాటు చేసుకుని వారం వారం సమావేశమై ఎడిటోరియల్స్‌ను సమీక్షించేవారు. అంతా అభిమానులే కనుక సంపాదకీయాలపై విమర్శలు అంతగా వినపడకపోవచ్చు. అయినా ఈ తరహా క్లబ్‌లు చైతన్యానికి ప్రతీకలు. ఈ చేతన మళ్ళీ చిగురించాలి.

చివరలో మరోమాట చెప్పుకోక తప్పదు. పూర్వపు రోజుల్లో పరిధి వేరు. అప్పటి పాండిత్యమూ వేరు. ఇప్పుడు శాస్త్రం శాఖోపశాఖలయింది. ప్రపంచంలో కొత్త పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి. అన్ని రంగాల్లో అనూహ్య మార్పులు జరుగుతున్నాయి. ఏ సంపాదకుడైనా కాలంతో పరుగెత్తుతూ అన్ని విషయాలు ఆకళింపు చేసుకుంటూ సకల కళావల్లభుడు కాగల్గడం ఏ కొందరికో తప్పితే సాధ్యపడని పని. మనకు తెలియని విషయాన్ని తెలియచెప్పే పుస్తకాలు కావాలి. వాటితోపాటు సమకాలీన సంఘటనలను ఓ మారు గుర్తుచేసే ఫైళ్లూ అవసరం, పేపర్‌లో వచ్చే వార్తల కటింగ్‌లు భద్రపరచడం అంటే సమకాలీన ఘటనలను భద్రపరచడం కిందే లెక్క. సంపాదకీయం రాసేటపుడు పూర్వపు విషయాలను ఒక్కోసారి తిరగదోడక తప్పదు. అలాంటపుడే నిక్షిప్తం చేసిన ఈ సమాచారం ఉపకరిస్తుంది. సమగ్ర గ్రంథాలయం ఇందుకు అవసరం. తెలుగు పత్రికా కార్యాలయాల్లో ఎన్నింటికి మంచి గ్రంథాలయాలున్నాయి అంటే సంతృప్తికరమైన సమాధానం దొరకదు. 'ఈనాడు' దినపత్రికలో ఈ కృషికి గట్టి పునాదులే వేశారు. అది ఇంకా రెమ్మలు, కొమ్మలు వేస్తోంది.

---

## నాలుగు సూత్రాలు

సంపాదకీయాలకు ఓం ప్రథమంగా గౌరవ ప్రతిష్ఠలను కూర్చినవాడు బార్జ్. తన 32వ యేట 1817లో లండన్ 'టైమ్స్' ఎడిటర్ పదవి స్వీకరించిన వెంటనే ఆయన నాలుగు ముఖ్య నిర్ణయాలు చేసు కున్నాడు. 1) పత్రికల కర్తవ్యం, ప్రభుత్వ భజనకాదు. మంత్రుల పాదసేవ మొదలేకాదు. 2) ప్రజాభిప్రాయాన్ని పత్రికలు వ్యక్తం చేయాలి. ప్రజల యోగక్షేమాలను కాపాడాలి. 3) అవసరమైతే సంపాదకీయాల్లో తీవ్ర పదజాలాన్ని వాడటానికి సంకోచించరాదు. 4) పరిస్థితులు మారినపుడు అతఃపూర్వం తాను వెల్లడించిన అభిప్రాయాలకు విరుద్ధమైన వాటిని సంపాదకుడు వెల్లడించవచ్చు. ఇది చంచలచిత్తం కాదు. ఈ సూత్రాలను పాటించినందునే బార్జ్ హయాంలో 'టైమ్స్' ప్రచారం కొన్ని రెట్లు పెరగ్గా, దాని సంపాదకీయాల ప్రతిష్ఠ ఎన్నో రెట్లు పెరిగింది. — నార్ల

---

# పీని పీని విసెనకర్ర

బాలానాం రోదనం బలం అంటారు పెద్దలు. పసివాళ్ళకయినా, పెద్ద వాళ్ళకయినా శరీర వ్యాయామం ముఖ్యం. ఇది తిరుగులేని సత్యం. తెలుగు వాళ్ళకి ఆట పాటలంటే మొదట్నించీ మక్కువే. మగవాళ్ళు కర్రసాము, బలప్రదర్శనలు, ముష్టియుద్ధాలు చేసేవాళ్ళు. స్త్రీలు అల్లీబిల్లీ చెమ్మా చెక్కా, నాలుగు స్తంభాలాట వంటివి ఆడేవారు. పురాణాలు, చరిత్ర తిరగేస్తే క్రీడల ప్రాముఖ్యం గుర్తించవచ్చు. శ్రీరాముడు ధనుర్విద్యలో పేరొందాడు. హనుమంతుడు సరేసరి. రాజుల కాలంలో కూడా ఆట పాటలకు బాగా ప్రాధాన్యం ఇచ్చేవారు. విజయనగరం, బొబ్బిలి, వెంకటగిరి, నూజివీడు రాజాలు, జమిందార్లుకూడా ఆట పాటలను ప్రోత్సహించారు.

కళల్లాగానే క్రీడలుకూడా మన జీవనంలో భాగం. ఈ మధ్య పరిస్థితి మారింది కానీ, నిన్న మొన్నటివరకూ తెలుగు పత్రికలకూ క్రీడా వార్తలకు చుక్కెదురే నని చెప్పాలి. క్రీడలకు సంబంధించిన వార్తలు రోజూ విధిగా ఇవ్వడంకానీ ప్రత్యేక శ్రద్ధచూపడం కానీ జరిగేదికాదు. క్రీడాభిమానులు ఇంగ్లీషు పత్రికలను ఆశ్రయించ వలసివచ్చేది. దూరదర్శన్ వారి పుణ్యమా అని క్రికెట్ విశేష ప్రాచుర్యం, ఆదరణ పొందింది. టీ.వీ.లు ఇంతగా వర్ధిల్లక ముందునుంచీ రేడియోలో కామేంటరీలు ప్రసారం అవుతూనే ఉన్నాయి. కామెంటరీలను కూడా దానికున్న పరిమితుల (భాష వగైరా) కారణంగా కొందరే వినేవారు. టీ.వీ. ల్లో ముఖ్యమైన క్రీడలను ముఖ్యంగా క్రికెట్‌ను ప్రత్యక్ష ప్రసారం చేయటం ప్రారంభించారు. ఆఫీసులకు సెలవుపెట్టో, స్కూలుకు డుమ్మాకొట్టో 70 ఏళ్ల వయోవృద్ధుడి దగ్గర్నుంచీ పాపడి వరకూ ఆసక్తిగా టీ. వీ. ముందు చేరి దాన్నే అంటి పెట్టు కుంటున్నారు.

పూర్వం తెలుగు పత్రికల్లో క్రీడలకు సంబంధించి వరల్డ్‌కప్ వంటి విశేషాలను ఇక తప్పదుగదా అని ఇచ్చేవారు. ఈ దశలో 'ఉదయం' దిన పత్రిక మొదలయింది. ఇతర తెలుగు పత్రికల బలహీనత లేమిటి, వాళ్లు ఏయే రంగాల్లో వెనకబడి వున్నారు అని దృష్టి సారించారు. క్రీడా వార్తలకు తెలుగు పత్రిక లేవీ సముచిత స్థానం ఇవ్వడంలేదు. యువతలో క్రీడలు ప్రత్యేకించి క్రికెట్ అంటే ఆసక్తివుంది. అని భావించి 'ఉదయం' క్రీడావార్తలను ప్రతి రోజూ బాగా హైలైట్ చేయ సాగింది. పత్రికల మధ్య సహజంగానే పోటీ వుంటుంది. మిగతా పత్రికలూ కళ్ళు తెరిచాయి. అవకాశాన్ని బట్టి మూడు నాలుగు కాలాలను క్రీడలకు కేటాయిస్తున్నారు. ఇది శుభ పరిణామం.

ఇంగ్లీషు దిన పత్రికల్లో క్రీడలకు బాగా కవరేజి ఇస్తూనే ఉన్నారు, 'హిందూ' పత్రిక ఈ విషయంలో అగ్రగామిగా ఉంది. క్రీడలకోసం 'హిందూ' రెండు పేజీలు కేటాయిస్తోంది. సగం పేజీ వాణిజ్య ప్రకటనకు పోయినా మిగిలిన ఒకటిన్నర పేజీలూ క్రీడలు ఇస్తున్నారు. ఏదైనా ముఖ్యమైన క్రీడలు జరుగుతుంటే ఎడ్వర్టయిజ్ మెంట్‌ను సైతం వద్దనుకుని (ఆ పేజీనుంచి మార్చో లేక ఆ పూటకి నిలిపివేసో) వార్తలు ఇస్తున్నారు. ఇలా వార్తలకోసం డబ్బులొచ్చే ప్రకటనలు వదులు కోవడం అరుదు. బొంబాయి నుంచి ప్రచురితమయ్యే 'ఇండియన్ పోస్ట్' క్రీడావార్తల్లో హిందూతో పోటీ పడాలని యత్నిస్తోంది. ఆర్. మోహన్(హిందూ), రాజన్‌బాల (ఎక్స్‌ప్రెస్), డికే. రత్నాకర్ (ఈనాడు), ఎస్.కె.శ్యామ్ లు అందించే క్రీడా వార్తలు క్రీడాభిమానుల్లో ప్రత్యేక స్థానాన్ని సంపాదించాయి.

టీ.వీ. ల తో క్రికెట్ ప్రాచుర్యం పొందిందను కున్నపుడు, టీ.వీ. ల్లో క్రికెట్ ఎటూ చూస్తున్నారు గదా, పత్రికల్లో (ఆలస్యంగా) అదే వార్తను ఇచ్చి ఏం లాభం? ఆ వార్త ఏం ఆసక్తి కలిగిస్తుంది? అన్న అనుమానం సహజమే. క్రికెట్‌లో ఇండియా ఓడి పోయిందని టీ.వీ. ప్రేక్షకుడికి తెలుసు. ఎలా ఓడి పోయింది. ఓటమికి ఏయే కారణాలు దారితీశాయి. అలాగే ఓ బాట్స్‌మన్ ఆటరీతులను తెలుసు కోవాలంటే వార్తా పత్రిక తప్పనిసరి, అంటే ఓ పక్క ఆటలో గెలుపు ఓటములు చెప్తూనే ఆటను విశ్లేషిస్తూ రాయాలి. వార్తా వ్యాఖ్య అన్నమాట. ఈ వ్యాఖ్య కోసమే పాఠకులు ప్రత్యేకించి క్రీడా వార్తల్ని చదువుతున్నారు.

తెలుగు పత్రికల్లో క్రీడా వార్తలు బాగా కవర్ చేయటం మొదలెట్టాక ఇంగ్లీషు బాగా అర్థంకాని కుర్రాళ్ళు పత్రికలను చదువుతున్నారు. క్రీడాసక్తిని బట్టి వయఃభేదం లేకుండా వార్తలు చదువుతూనే వున్నారు. ప్రజలను విశేషంగా అలరిస్తున్న ఆట క్రికెట్. థ్రిల్ ప్లస్ యాక్షన్ కలగలవడమే ఈ ఆట ప్రాచుర్యానికి ప్రధాన కారణం. క్రికెట్ తర్వాత అథ్లెటిక్స్ బాగా ఆకర్షిస్తున్నాయి, అథ్లెటిక్స్ ప్రాచుర్యానికి, ఆదరణకు సామాన్యులు సైతం స్వయంగా ఆడటమే కారణం.

క్రికెట్ క్రీడాకారులకు గ్లామర్ పెరిగింది. దీన్ని ఆసరా చేసుకుని ఈ గ్లామర్‌ను సొమ్ము చేసుకుంటున్నారు. ఫలానా మాచ్‌లో ఎందుకు ఓడామో, ఎలా గెలిచామో విలేకరి చెప్పడంకంటే ఆ ఆటలో పాల్గొన్న కపిల్‌దేవో గవాస్కరో చెప్తే బాగా పాఠకులను ఆకర్షిస్తుంది. అందుకే క్రీడా కారులకు ప్రత్యేక కాలమ్స్ మొదలయ్యాయి. ఈ ప్రత్యేక కాలమ్స్‌లో స్వీయానుభవాలను

తోటి ఆటగాళ్ళపై విశ్లేషణను అందిస్తున్నారు. వాణిజ్య ప్రకటనల్లో కూడా క్రికెట్ ఆటగాళ్ళు కన్పిస్తున్నారంటే వాళ్ళ ఆకర్షణ శక్తిని అంచనా వేయచ్చు. గవాస్కర్ ప్రొఫెషనల్ మేనేజ్‌మెంట్ గ్రూప్‌ను నెలకొల్పి ఏదైనా క్రీడలు జరుగుతుంటే ఆయా ఆటగాళ్ళ చేత రాయించి పత్రికలకు విక్రయిస్తున్నారు. ఇక్కడ ఓ వ్యాపార సూత్రానికి కూడా కట్టుబడుతున్నారు. ఈ గ్రూప్ నిర్ణీత భాషలో ఒక పత్రికకు మాత్రమే సేవలందిస్తుంది. గవాస్కర్ సేవలను 'ఈనాడు' పొందుతోంది. మరే ఇతర తెలుగు పత్రికకూ గవాస్కర్ రాయరు. రాయించరు. కపిల్‌దేవ్‌కూడా దేవ్ ఫీచర్స్ పేరిట పత్రికలకు వ్యాసాల్ని సరఫరా చేస్తున్నారు. పత్రికల సర్క్యులేషన్‌ను బట్టి కాలమ్ ఒక్కోదానికి ఎనిమిది వందల నుంచి వేయి రూపాయల వరకూ మూల్యం తీసుకుంటున్నారు.

కొన్ని తెలుగు పత్రికల్లో క్రీడల కోసం ప్రత్యేక విభాగాలను (స్పోర్ట్స్ డెస్క్) ఏర్పాటు చేశారు. ఇందువల్ల ఈ డెస్క్‌లో పని చేసే సబ్ ఎడిటర్లు తమ దృష్టినంతా క్రీడలపై కేంద్రీకరించడానికి, మరింత మెరుగ్గా వార్తలు ఇవ్వడానికి వీలేర్పడింది. సబ్ ఎడిటర్ విధిగా క్రీడాకారుడు అయివుండాల్సిన పనిలేదు. అయితే అన్ని ఆటల ప్రాథమిక సూత్రాలు క్షుణ్ణంగా తెలిసుండాలి. వార్తలపై ఆసక్తి కావాలని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. ఎప్పుడు ఎక్కడ ఏ ఆట జరుగుతుందీ, నిన్న ఫలాన ఆట ఎంత వరకూ వచ్చింది అనే ప్రాథమిక అవగాహన అవసరం. ఎప్పుడు ఎక్కడ ఏ టోర్నమెంట్, మాచ్ జరిగేదీ ముందే తెలుస్తుంది కనుక ఒక ప్రణాళిక వేసుకోవడానికి స్పోర్ట్స్ డెస్క్‌లో వీలుంటుంది.

తెలుగు పత్రికలు క్రీడావార్తలకు ప్రాధాన్యం ఇస్తున్నా ప్రధానంగా ఏజన్సీపైనే ఆధారపడుతున్నాయి. దీనివల్ల క్రీడా విశ్లేషణ కొరవడుతోంది. తెలుగు పత్రికలుకూడా క్రీడా వార్తల సేకరణ కోసం ప్రత్యేకంగా విలేకరులను ఏర్పాటు చేసుకుంటే క్రీడలకు కొంతవరకైనా న్యాయం చేయచ్చు. పాఠకులను తమ ప్రత్యేక పంథా, శైలితో ఆకట్టుకోవచ్చు. ఫొటోల విషయంలో కూడా అంతే ఫొటోల కోసం దూరదర్శన్‌పై ఆధార పడుతున్నారు. వాటిల్లో స్పష్టత వుండటంలేదు. ఇక విధిలేని పరిస్థితుల్లో పాత ఫొటోలనే ఉపయోగించాల్సి వస్తోంది. ఏ రోజువార్త ఆ రోజు వచ్చే ఏర్పాటు వున్నట్లే ఫొటోలుకూడా తెప్పించుకునే ప్రయత్నం జరగాలి.

క్రీడలకోసం ప్రత్యేకించిన పత్రికలు ఇంగ్లీషులో ఎక్కువ లేవు. తెలుగులో క్రీడా పత్రికలు అసలు లేవు. క్రీడలకోసం ప్రత్యేకంగా పత్రికలు రావాలి. మంచి మార్కెట్‌కూడా వుంది.

# పత్రికలు - సామాజిక చైతన్యం

మంచి పత్రికలు సమాజాన్ని ముమ్ముందుకు నడిపించే పధగాములు. మంచి పత్రికలు ప్రజలను తట్టిలేపుతాయి. నిద్రాణ జాతిని జాగృత పరుస్తాయి. కర్తవ్యాన్ని బోధిస్తాయి వాస్తవాలను తెలియిచెప్పి కన్ను తెరిపిస్తాయి. ప్రజలను సమీకరిస్తాయి స్వాతంత్ర్యోద్యమంలో పత్రికలు ప్రధానంగా నిర్వర్తించిన పాత్ర ఇదే.

అయితే ఇక్కడో సందేహం మంచి పత్రిక ఏది? తెలుగు పత్రికలే కాదు ఏ భాషాపత్రిక చూసినా ఆంగ్ల పత్రిక చూసినా ఏదో ఒక పార్టీవైపు, ప్రభుత్వంవైపు మొగ్గుచూపేవే,

కొన్ని పత్రికలు కేంద్రాన్ని వ్యతిరేకిస్తూ రాష్ట్ర ప్రభుత్వాన్ని సమర్థించేవి. కొన్ని పత్రికలు రాష్ట్రాన్ని విమర్శిస్తూ కేంద్రాన్ని వెనకేసుకొచ్చేవి. కొన్ని పత్రికలు ప్రతిపక్షం వెన్నుతట్టి, అధికారపక్షాన్ని చీల్చి చెండాడేవి. ఇక పార్టీకే అంకితమైన పత్రికల సంగతి సరేసరి. వాటితో మనకు పేచీలేదు. ఫలానా పార్టీ పత్రిక అంటె ఆ పార్టీ మద్దతుదారులు, సానుభూతిపరులు, ఆ పార్టీ గురించి విపులంగా తెలుసుకుందామనుకునే ఔత్సాహికులు ఆ పత్రికను చదువుతారు.

ఇలా పత్రికలు ఏదో ఒక పక్షాన్ని భుజానికి ఎందుకు ఎత్తుకోవాలి? అని ప్రశ్నించుకుంటే - ఒక పత్రిక యాజమాన్యానికి ఓ పార్టీ విధానాలు గిట్టవనుకోండి. ఆ పత్రిక ఆ పార్టీని విమర్శించడం సహజం. ఇదే సందర్భంలో మరో పార్టీని వెనకేసుకురావడమూ తప్పదు. చాలావరకు వ్యాపార ప్రయోజనాలు పత్రిక పాలసీని ప్రభావితం చేస్తున్నాయి.

పత్రికలు నిష్పక్షపాతంగా ఉండలేవా? మంచిని మంచిగానూ, చెడును చెడుగానూ చెప్పలేవా? అనే సందేహం వస్తుంది. ఏది మంచి? ఏది చెడు? మీకు మంచి అన్పించింది మరొకరికి చెడుగా తోచవచ్చు. మీరు చెడ్డగా భావించిందాన్ని మరొకరు మంచిగా మెచ్చుకోవచ్చు. అంచేత మంచి చెడులకు కొలమానం అంటూ లేదు.

నిశితంగా పరిశీలించినా నిష్పక్షపాతం అనేది ఆచరణలో అసాధ్యం. వ్యక్తిగతంగా చూసినా నికార్సయిన నిష్పక్షపాతులు దొరకరు. ఏదో ఒక పక్షంపట్ల మొగ్గు తప్పదు. అయితే ఆ పక్షమేమిటన్న స్పృహ మాత్రం అవసరం.

ఈ పూర్వరంగంలో మంచి పత్రికలు ఇవి అని నిర్వచించి చెప్పడం సాధ్యమయ్యే పనికాదు. ఈ పరిమితులున్నప్పటికీ ఇతరత్రా కొలమానాలను ఉపయోగించవచ్చు. అత్యధిక సర్క్యులేషన్ గల పత్రిక అత్యుత్తమ పత్రికగా చెప్పవచ్చా? మంచి పత్రిక అని రూఢి చేయవచ్చా? అలాగే సర్క్యులేషన్ లేని పత్రిక మంచి పత్రిక కాదా? ఏ సాహిత్య పత్రికో చూస్తే దాని సర్క్యులేషన్ వందల్లోనే వుంటుంది అయినా ఆ పత్రిక పండితుల్లో పెద్ద చర్చనీయాంశం కావచ్చు.

ఆంధ్ర దేశాన చదువరుల సంఖ్య తక్కువ. చదువుకున్న వాళ్లలో పత్రికలు చదివే వారి సంఖ్య ఇంకా తక్కువ. ఆ చదివే వారిలో కొని చదివే వారు మరీ తక్కువ. ఇలా చూస్తే కేవలం సర్క్యులేషన్‌నే మంచి పత్రికకు ప్రాతిపదిక చేసుకోలేం. పార్టీ పక్షపాతం, ప్రభుత్వ పక్షపాతం వున్నప్పటికీ పూర్తిగా పెద్దెద్దు చేలోపడ్డట్టుగా కాకుండా బహుజన హితాన్ని కోరే పత్రికను వున్నంతలో మంచి పత్రికగా చెప్పుకోవచ్చు.

పత్రికలకు సామాజిక బాధ్యత వుంది. మత వైషమ్యాల వంటివి చెలరేగినపుడు అగ్నికి ఆజ్యం పోయవు. శక్తిమేరకు వైషమ్యాలను చల్లార్చ ప్రయత్నిస్తాయి. మతమౌఢ్యాలను, దురాచారాలను దరిచేరనియ్యవు. రోజువారీ సంఘటనలను పరిణామాలను ఇవ్వగానే పత్రికల పని పూర్తి కాదు. ఆ సంఘటనలను, పరిణామాలను ఎలా అందిస్తున్నదన్న దానిపైనే పత్రిక పాలసీ ఆధారపడి వుంది. పత్రికల్లో సమాజంలోని అన్నివర్గాలను కొన్ని సందర్భాల్లో కొన్ని వర్గాలను ప్రభావితం చేసే వార్తలు వుంటుంటాయి.

తెలుసుకోవాలన్న తపనను తీర్చడం, పాఠకుడు ఆశించే స్థాయిలో తెలియచెప్పడం పత్రిక బాధ్యత. వాస్తవాలను బుద్ధిపూర్వకంగా అణచివేసే ప్రయత్నాన్ని పాఠకుడు క్షమించడు. అలాంటి పత్రిక ఎక్కువకాలం మనలేదు కూడా. వార్తా ప్రచురణే ఓ సామాజిక సేవ. సామాన్యుడిని ప్రభావితం చేసే పలురకాల విశేషాలను అతడికి అందివ్వడం ద్వారా పత్రికలు ఈ బాధ్యతను భుజాల కెత్తుకున్నాయి. ధరవరల హెచ్చుతగ్గులు, రైలు, బస్‌ప్రయాణ ఛార్జీల పెంపువంటి వార్తలు ఈ కోవకు చెందినవే. దురదృష్టవశాత్తూ ఏ రైలు ప్రమాదమో జరిగితే ఆ ప్రమాదవార్తతోపాటు, మరణించినవారి పేర్లు, గాయపడినవారి పేర్లు పత్రికలు ఇస్తాయి. ఆతృతగా ఎదురుచూసే ప్రయాణీకుల బంధువులకు ఇలాంటి వార్తలు ఇటు ఊరట కల్గించటానికో అటు సత్వరం ప్రమాదస్థలానికి చేరుకోవటానికో ఉపకరిస్తాయి.

తుఫానువంటి ప్రకృతి వైపరీత్యాలు సంభవించి జనావళి తీవ్ర కష్ట నష్టాలకు గురయినపుడు జరిగిన నష్టాన్ని, వైపరీత్య తీవ్రతను పత్రికలు అద్దం పడతాయి. తద్వారా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను కార్యోన్ముఖ దిశలో వేగిరపరుస్తాయి. అవసరమైతే పత్రికలే స్వయంగా తుఫాను సహాయనిధిని ఏర్పాటు చేసి ప్రజలనుంచి విరాళాలు సేకరించి ఆపన్నులను ఆదుకోవచ్చు.

నగరంలో నిషేధాజ్ఞలు, కర్ఫ్యూ, నీటి సరఫరా వేళల మార్పు,కరెంటు వుండని వేళలు ఇలాంటి వార్తలు ప్రజోపయోగమైనవే. ప్రత్యక్ష ప్రభావం చూపేవే. వీటికి మించి పత్రికలు తమ సంపాదకీయాలు, వార్తల ద్వారా పరోక్షంగా పాఠకులను నిరంతరం చైతన్యం చేస్తుంటాయి. పత్రికలు చదివేవాళ్లు (ఆ పత్రికను బట్టి) తమకు తెలియకుండానే ఆ ప్రభావానికి లోనై అభిప్రాయాలను ఏర్పరచుకుంటారు. పత్రికలకు ప్రజలను ప్రభావితం చేసే బలీయ శక్తి వుంది మరి.

పత్రికలు సామాజిక కర్తవ్యాన్ని ఎలా నిర్వర్తించగలవో ఓ ఉదాహరణ ఇస్తాను. 'ఈనాడు' హైదరాబాద్ ఎడిషన్‌లో 'ఒంటికాలి పోరాటం' శీర్షికన ఓ వార్త ప్రచురితమైంది. అహ్మద్‌ఖాన్ అనే వ్యక్తి చిన్నప్పుడు రోడ్డు ప్రమాదంలో కాలు పోగొట్టుకున్నాడు. చిన్నతనాన్నే అతనిపై కుటుంబభారం పడింది. పదిహేనేళ్ల వయసులోనే అలా ఒంటికాలితోనే ఓ కర్ర సాయంతో రిక్షా లాగడం ప్రారంభించాడు. అతనికి మోటారుసైకిళ్లు రిపేరు చేయడం కూడా తెలుసు. ఏదైనా బ్యాంక్ దగ్గర అప్పు తీసుకుని వర్క్‌షాప్ నడుపుకుంటే రిక్షాలాగే కష్టం వుండదని ఖాన్ ఆశించాడు. ఎన్నో బ్యాంకుల చుట్టూ తిరిగినా ఫలితం లేదు. పూచీకత్తు కావాలన్నారు. ఖాన్‌కు పూచీకత్తు ఇచ్చే వారెవరూ లేకపోవడంతో విధిలేని పరిస్థితుల్లో అతను ఒంటికాలితో జీవన పోరాటం సాగిస్తూనే వున్నాడు. ఇదీ వార్త. ఈ వార్తను పత్రికలో చూసి ఖైరతాబాద్ (హైదరాబాద్) స్టేట్ బ్యాంక్ మేనేజర్ వెంటనే రుణం మంజూరు చేయటానికి ముందుకొచ్చారు. క్షణాలమీద రుణం మంజూరు కూడా చేశారు. ఒక జీవితానికి, ఒక కుటుంబానికి ఆ వార్త పుణ్యమా అని మంచిరోజులు వచ్చాయి. పత్రికల సామాజిక సేవ, బాధ్యతలకు ఇంతకంటే నిదర్శనం ఏం కావాలి?

---

- వార్త చెప్పక పోయినా, చెప్పేనేతను చూపెట్టు.
- రాసేదొకరు, చెప్పుకునే దింకొకరు.
- పదవి ఉన్నంతసేపే విలేకరులు మూగేది.

---

# జర్నలిస్టు మొగుడు

[కుటుంబ యజమానివృత్తి వ్యాసంగాల ప్రభావం ఆ కుటుంబ సభ్యులపై ఉంటుంది. షిఫ్ట్ డ్యూటీలుండే జర్నలిస్టుల లాంటి వాళ్ల సంగతి చెప్పక్కరలేదు. ఓ జర్నలిస్టు భార్యగా నా అర్థాంగి ఆలోచనలకు రూపమే ఈ కింది స్కెచ్]

పెళ్ళీడు కెదిగిన అమ్మాయిలు డాక్టరో కాకుంటే యాక్టరో, ఇంజనీరో కాకుంటే బ్యాంక్ ఆఫీసరో మొగుడుగా రావాలని టెక్నికలర్ కలలు కంటారు. అంతేగాని జర్నలిస్టు మొగుడుగా రావాలని ఎదురుచూసే తెలుగింటి బొమ్మలు ఉంటారంటే నేన్నమ్మను. జర్నలిస్టు అంటే ఏమిటో కూడా తెలీని నాకు జర్నలిస్టు మొగుడయ్యాడు. అందుకు నేను కాసింత గర్వపడుతుంటాను మరికొంత విచారపడుతుంటాను. మావారు ఫలానా పేపర్‌లో పనిచేస్తున్నారు అని చెప్పుకోవడంలో క్రేజ్ ఉందని ఇటీవలే అర్థమయింది. అది గర్వకారణం. కాకుంటే నైట్ డ్యూటీలు వగైరాలు నన్ను కుంగదీసే విషయాలు. వేళాపాళా ఉండదు. హాయిగా అందరి మొగుళ్లలాగా ఉదయం పదింటి కెళ్ళి సాయంత్రం అయిదింటికల్లా వచ్చేస్తే ఎంత బావుండునో! సాయంత్రం అలా షికారు కెళ్లొచ్చు. సినిమాలు చూడొచ్చు. ఆ అవకాశం ఈ జన్మకు లేదిక మరి. మా ఆయన పత్రికాఫీసులో ఉజ్జోగం మానేసి ఇంకెందులోనైనా చేరేవరకు. రాత్రి డ్యూటీలు చేయడం.... పగలంతా ఒళ్ళెరక్కుండా నిద్రపోవడం నాకు చెడ్డ చిరాకు తెప్పించేస్తుంది.

ఈ చిరాకులు, పరాకులు అటుంచితే .... ఆయన ఆఫీసులో వార్తలు రాసి రాసి అవే మాటలు ఒంట బట్టించుకుని నన్ను ఊదరగొట్టేస్తున్నారు. "ఏవండీ! పనిమనిషి మానేసింది. ఏదో టెంపరరీగా ఓ పిల్లను కుదిర్చా" అంటే- "దేశమే అలాగుంది.... ఆపద్ధర్మ ముఖ్యమంత్రులు, స్పీకర్లలాగ ఆపద్ధర్మ పనిమనుషులతో బండిలాగించక తప్పదు" అన్నారు.

మరో సందర్భంలో "నువ్వేదీ నిర్దిష్టంగా చెప్పవు. ఎలా అవగతం అవుతుందీ" అని- పిల్లాడు అల్లరి చేస్తున్నాడని చెప్తే-

"నాకు ఫిర్యాదు చేయడం ఏం బావోలే! నీకు పిల్లల ప్రవర్తన వాళ్ల పెంపకంమీద స్పష్టమైన అవగాహన ఉండాలి. అదో ఆర్ట్" అని. ఇలా తనకు తెలీకుండానే పత్రికల పడికట్టు పదాలు నామీద కురిపించేవారు ఓరోజు పక్కింటివాళ్ళ పాపకూడా ఇదే విషయం నాకు కంప్లయింట్ చేసింది. "ఆంటీ!

నువ్వు మాట్లాడేటప్పుడు ఇంగ్లీషు పదాలు ధారాళంగా దొర్లించేస్తావు. అంకుల్ ఒక్క ముక్కకూడా వాడరేం" అని.

"అదంతేలే అమ్మా! తెలుగు బాగా ఒంటబట్టి పోయింది. నీకేదన్నా ఇంగ్లీషు మాటకు అర్థం స్ఫురించకపోతే అంకుల్ నడుగు. ఠక్కున చెప్పేస్తారు. ఆయన వృత్తి అది" అని నచ్చచెప్పి పంపాము. ఓరోజు మా అబ్బాయి వాళ్ళ నాన్న డ్యూటీల బాధ పడలేక విసుగు ప్రదర్శించాడు.

"ఏం ఉద్యోగం నాన్నా! ఉదయం నేను స్కూలుకెళ్లేలోగా నువ్వు నిద్ర లేవవు. స్కూలునుంచి వచ్చాక నువ్వు ఇంట్లో ఉండవు" అని.

ఆయనని అనుకునేం లాభం.... ఇల్లాలిగా నేనూ ఆ బాధను పడుతూనే ఉన్నా. పెళ్ళయిన కొత్తల్లో మరీ బెంగగా ఉండేది. నైట్ డ్యూటీ కని వెళ్లే వారు. ఇక ఒక్కదాన్నీ ఉండాలని ఎంత భయంగా ఉండేదో .... ఇప్పుడైతే కాస్త అలవాటు పడ్డాను. పిల్లలు కాస్తంత తోడు చిక్కారు. ఆ రోజుల్లో భయంతో నిద్రపట్టక డ్యూటీనుంచి వచ్చేదాకా లైటు వేసుకుని మరీ కూరీపాట్లు పడుతూ పుస్తకాలు తిరగేసేదాన్ని. ఆయనకేం మగమహారాజు. పదింటిదాకా తన్ని పెట్టి పడుకునేవారు. ఆరుకాగానే పనిమనిషి రావడం. నిద్రాభంగం కావడం....నిద్రలేక నీరసించి పోవడం....చిరాకు....ఎవరి మీదో తెలియని కోపం....అసహనం....పుట్టింటికెళ్ళి పదిరోజులు గడిపివద్దామనే కోరిక, వెళ్తే అసలే ఈ డ్యూటీలమనిషి ఇబ్బంది పడతారని మానుకోవడం .... నిజంగా అదొక రకమైన ఎవరూ పరిష్కరించలేని సమస్య.

జర్నలిస్టును పెళ్ళిచేసుకునే అమ్మాయికి ఓప్పు, సహనం ఉండాలి అదొక్కటే వారికి అర్హత. అవి లేకుంటే సంసారం నరకం.

పెళ్ళయిన కొత్తల్లో నాకు చాలా వింత అనుమానాలు వచ్చేవి. వచ్చిన అనుమానం అమాయకంగా అడిగేయడం— "ఓసీ! దద్దమ్మా! ఇదీ తెలీదా!" అని చివాట్లు తినడం జరిగిపోయేది.

"పేపర్లో వార్తలు రాసేది మీరేగా. మళ్ళీ పేపరంతా చదవందే నిద్ర పోరేం?" అనడిగితే ముఖం చిట్లించి "పేపరంతా నామీదే నడుస్తోందా? నే రాసిన వార్తలు తప్ప మిగిలిన వార్తలు నాకు తెలీవు. అదీగాక రాసిన ఐటమ్ సరిగా వచ్చిందో లేదో చూసుకునేవరకూ గుండెగుబులే.. ఇదిగో చూశావా! ఈ ఎఫ్. సి. ఐ. ఐటమ్ ఉందా! ఒరిజినల్‌లో పదికోట్లని ఉంటే ఏమరచి పదిలక్షలని రాశామే అనుకో....ఇంకేముంది పెద్ద దూడ దొర్లినట్లే. ఎడిటర్ చివాట్లు కాకుంటే మెమోలు" అంటూ సుదీర్ఘ ఉపన్యాసం ఇచ్చారు.

నేనంతటితో ఊరుకోక- "ఇంగ్లీషులోది చూసి రాయటమేగా. దాంట్లో తప్పులొస్తాయా" అంటే—

"అంతేలే....నా కష్టాలు నీకేం తెలుసు....పుస్తకం చూసి వంట చేసినట్టే....చూసి రాయటంవల్లే తప్పు లొస్తాయి. రిపోర్టర్ల పని హాయి కొంత వరకు. ఏ పొలిటీషియనో చెప్పింది 'స్టెనో'లా ఎక్కిచ్చేస్తే సరిపోతుంది" అన్నారు.

అప్పుడు కానీ నాకు తెలీలా. సబ్ఎడిటర్లకూ, రిపోర్టర్లకూ కోల్డ్‌వార్ ఉంటుందని, వారంటే వీరికి, వీరంటే వారికీ ఓ రకమైన జలసీ అని. జర్నలిస్టు భార్యగా నా అనుభవాలు ఇలా ఎన్నయినా చెప్పుకోవచ్చు. ఇక ముగింపు ముక్తాయింపుగా—

మావారి ఉద్యోగం చూసి టెన్త్ రిజల్ట్స్ వచ్చినపుడు మహా గర్వపడి పోతుంటాను. ఎక్కడెక్కడివారో....ముక్కు ముఖం తెలీకపోయినా రిజల్ట్స్ వచ్చే పదిరోజుల ముందే మా ఇంటిమీద వాలిపోయి నంబర్లు కురిపించేవారు.

"ఆంటీ! అంకుల్ వాళ్ళ ఆఫీసుకు ముందే వస్తాయటగా! కాస్త నా రిజల్ట్ కనుక్కోమని చెప్పవూ" అంటూ పూజారిలాంటి నన్ను ప్రాధేయపడే వాళ్లు.

నా సొమ్మేం పోయిందని చెప్పి- "దాన్దేముంది! ఇవ్వు" అంటూ నేను నంబర్లు కలెక్ట్‌చేసి ఆయన జేబులో కుక్కేదాన్ని.

"నువ్విలా నంబర్లు తీసుకోక. రిజల్ట్స్ రోజు హడావుడిగా ఉంటుంది" అనేవారు.

"పోనీలేండి! పత్రికలో పనిచేస్తూ ఆమాత్రం సాయం చేయలేరా! వాళ్ల ఆత్రుత వాళ్లది" అని అంటే—

"అంతే! అవసరానికి తప్ప జర్నలిస్టు గుర్తుకురాడు. జర్నలిస్టు బతుకు కరివేప లాంటిది. వంటకంలో అన్ని హంగులతోపాటు కరివేప ఘుమ ఘుమ కోసం వెంపర్లాడతారు. తీరా తినవచ్చేసరికి ఏరి పక్కన పారేస్తారు. మేమూ అంతే. అవసరం తీరేవరకే....ఆ తర్వాత అల్లుడు...." అంటూ కోపం ప్రదర్శించారు. ఆయన వేదాంతం అర్థం అయీ అవనట్లు వెర్రినవ్వు నవ్వి—

"నంబర్లు చూడటం మర్చిపోకండేం" అనేదాన్ని చిలిపిగా నవ్వుతూ.... నలుగురిలో నా ప్రిస్టేజి తగ్గకూడదు. అదీ నా తాపత్రయం మరి!

# పత్రికల్లో సాంకేతిక విప్లవం

పూర్వం అయితే పత్రికలో అచ్చు అయ్యే ప్రతి అక్షరాన్ని కంపోజిటర్ చేత్తో కూర్చవలసి వచ్చేది. ప్రూఫ్‌తీసి తప్పులు దిద్దాలి. ఆ దిద్దిన గ్యాలీలను స్టోన్ మీద పరచిన చెస్‌లో అమర్చాలి. ఇలా మేకప్ చేసేటపుడు ఏమాత్రం ఏమరుపాటుగా ఉన్నా అక్షరాలు రాలి వేజికవి కిందపడి పోయేవి. దాంతో మళ్ళీ మొదలెత్తుకోవల్సి వచ్చేది. అలా చెస్‌లో బిగించిన మాటర్‌ను మాట్ తీసేవారు. ఆ మాట్‌నుంచి ప్లేట్, ఆ ప్లేట్‌కి అచ్చు యంత్రానికి ఎక్కేలోపు చాలా శుశ్రూషలు చేయాల్సి వచ్చేది. ఫొటోలు ముద్రించాలంటే బ్లాకులు విధిగా ఉండాల్సిందే. ఫొటోలకు బ్లాకులు చేయడం చాలా వ్యవధి తీసుకునేది. ఈ బ్లాకుల్లో స్పష్టత లోపించేది. సాంకేతికంగా వస్తున్న విప్లవాత్మక మార్పులతో పత్రికల ప్రచురణలో ఎంతో అభివృద్ధి చోటుచేసుకుంది. చేతితో అక్షరాలు కూర్చడం స్థానే ఫొటో కంపోజింగ్ వచ్చింది. కంపోజిటర్లకు నిలబడి కంపోజ్ చేసే శ్రమ తప్పింది. ఇప్పుడు ఏ పత్రిక కార్యాలయానికి వెళ్ళినా ఫొటో కంపోజింగ్ మిషన్ ముందు కూర్చుని వార్తలను టైప్‌చేస్తూ కన్పిస్తారు.

ఇలా కంపోజ్ చేసిన వార్తలను డిస్క్‌లో నిల్వ చేస్తారు. దానిని ఆ తర్వాత లైన్ ప్రింటర్‌కి పంపుతారు. ఇలా లైన్ ప్రింటర్ ద్వారా వచ్చిన ప్రూఫ్‌లో అక్షర దోషాలు సవరిస్తారు. తిరిగి డిస్క్‌ను ఉంచి ఆ వార్తలో తప్పులను దిద్దుతారు. ఇలా దిద్దాక ఆ వార్త మెయిన్ టైప్ సెట్టర్‌కు వెళ్తుంది. టైప్ సెట్టర్‌లో నెగెటివ్ పేపర్ ఉంటుంది. ఏ వార్త ఏ సైజులో కావాలంటే ఆ ప్రకారం డెవలప్ అవుతుంది. ఇదంతా ఆటోమాటిక్‌గా జరిగిపోతుంది. చాలా త్వరితంగా వార్త బ్రోమైడ్ రూపంలో చేతికొస్తుంది.

ఇలా వచ్చిన బ్రోమైడ్‌ను పేజీలో కావల్సిన రీతిలో అంటించడమే. ఈ విధానంలో పేజీ మేకప్‌లో కూడా వేగం పెరిగింది. సిద్ధమైన పేజీ నుంచి నెగెటివ్ తీస్తారు. ఆ నెగెటివ్ నుంచి ప్లేట్ తయారవుతుంది. ఆ ప్లేట్‌ను రోలర్ (అచ్చుయంత్రం) మీద బిగిస్తారు. పేజీలన్నీ ఇలా సిద్ధమయ్యాక అచ్చు యంత్రం మీట నొక్కడమే తరువాయి. ఈ ప్రింటింగ్ విధానంలో టైము కలిసిరావడంతోపాటు కంటికి శ్రమలేకుండా చదువుకునే సౌలభ్యం పాఠకుడికి ఏర్పడింది.

కమ్యూనికేషన్లపరంగా ఎంతో ముందంజ వేస్తున్నాం. ఈ పురోగతి పత్రికలకూ ఎంతగానో ఉపకరిస్తోంది. ఒక పత్రిక రాష్ట్రంలోని మూడు

నాలుగు కేంద్రాలనుంచి అచ్చు అవుతుందనుకోండి. ఒక కేంద్రం నుంచి మరో కేంద్రానికి నేరుగా ఉపయోగించ వీలున్న బ్రోమైడ్ (పేజిలో అంటించటానికి సిద్ధంగా వున్న వార్తలు) పంప వీలేర్పడింది.

ఇక ఫాక్సిమిలీ పద్ధతి ఈ విధానంలో పరాకాష్ట. ఒక కేంద్రం నుంచి మరో కేంద్రానికి తయారైన పేజీని నిమిషాల్లో పంపే విధానమే ఫాక్సిమిలీ. తెలుగులో 'ఈనాడు' పత్రికకు ఈ సౌలభ్యం ఉంది.

ఈ విధానంలో స్కానర్ అనే యంత్రం పేజీని పంపిస్తుంది. ఈ స్కానర్ కేబుల్స్‌పైనా లేదా ఉపగ్రహ సాయంతో పనిచేస్తుంది. పేజీని ఈ స్కానర్‌లో ఉంచి మీట నొక్కితే స్కానర్‌లోని లేజర్ బీమ్ పేజీని చదువుతుంది. కాంతి ఎలక్ట్రానిక్స్‌గా పరివర్తన చెంది మరో కేంద్రానికి ప్రసారం అవుతాయి. ఆ కేంద్రంలోని స్కానర్ తిరిగి వాటిని నెగెటివ్ రూపంలో అందిస్తుంది. హృదయ స్పందనను కొలిచే యంత్రం గ్రాఫ్ రూపంలో ఎలా స్పందన రీతులు వెల్లడిస్తుందో అలాగే ఈ స్కానర్ పనితీరు, స్వభావం కూడా. సాంకేతికపరమైన విషయం కనుక సులభంగా అర్థం కావడం కొంత కష్టమే. స్థూలంగా అవగాహన కల్పించటానికి మాత్రం ప్రయత్నించాను.

---

## కరిమింగిన వెలగపండు

ఆ మధ్య ఓ తెలుగు పత్రికలో ఒక వార్త వచ్చింది. అమెరికాలో ఒక శునకప్రియ కోటీశుడు తన పెంపుడు కుక్కలకు అట్టహాసంగా పెళ్లి చేశాడు. ఆ వార్త ఇంగ్లీషులో వచ్చింది. ఆ పెళ్లికి ఒక మినిస్టర్ కూడా అటెండ్ అయ్యాడని వుంది. దాన్ని తెలుగు అనువాదకులు మన దేశాచారాన్ని చూసి కాబోలు ఒక మంత్రిగారు కూడా హాజరయ్యారని అనువదించారు. ఆ వార్తలో మినిస్టరు చర్చిఫాదరీ అంతే కాని మంత్రి కాదు. సంస్కృతానువాదాలు కూడా ఇంత సొగసు గానే ఉంటున్నాయి. కరిమింగిన వెలగపండు సామెత తీసుకోండి. 'కరి' అంటే సన్నని రెక్కలపురుగు. ఇది వెలక్కాయను రంధ్రంచేసి లోన గుడ్లు పెడుతుంది. ఆ గుడ్లు పిల్లలై గుజ్జుతిని రెక్కల పురుగులై లేచి పోతాయి. ఆఖరికి డొల్ల వెల క్కాయ మిగులుతుంది.

— రాంభట్ల కృష్ణమూర్తి.

---

# మౌన ప్రబోధాలు

పది వాక్యాల వివరణ కూడా అందివ్వలేని అవగాహనను ఒక మంచి ఫొటో క్షణకాలంలో కలిగిస్తుంది. నిరక్షరాస్యులకు సైతం మౌన ప్రబోధాలు ఈ ఫొటోలే. అందుకే పత్రికలో వార్తలతోపాటు ఫొటోలకు కూడా విడదీయరాని అనుబంధం, ప్రాముఖ్యం ఉన్నాయి. ఒకోసారి ఫొటోలు కేవలం ఖాళీ భర్తీకే ఉపకరించినా, కొన్ని సందర్భాల్లో ఫొటోలేకుండా వార్తకు న్యాయం చేసినట్లవదు. ఓ ప్రభుత్వ సభలో అధికారుల నిర్లక్ష్యం కారణంగా లక్షల ఖరీదు చేసే వాహనాలు నిరుపయోగంగా పడి ఉన్నప్పుడు ఆ వార్తతోపాటు ఫొటో కూడా ఉంటే కానీ ఆ నిర్లక్ష్యం తీవ్రత అర్థంకాదు. అలానే కొన్ని ప్రమాదాలు సృష్టించే బీభత్సం కూడా కళ్ళకు కట్టినట్లు చూపేది ఫొటోలే. ఓ ముఖ్యమైన బహిరంగసభ జరిగినా, సదస్సు జరిగినా వార్త ప్రాముఖ్యానికి జీవం తొణికిసలాడుతూ అందివ్వటానికి ఫొటో జతచేయటం తప్పనిసరి. జర్నలిజంలోని ఇతర శాఖల మాదిరే ప్రెస్ ఫొటోగ్రాఫర్‌కు కూడా ప్రతిభ. అవగాహన, ఆకళింపు, చొరవ వంటి లక్షణాలు కావాలి. స్టూడియో ఫొటో గ్రాఫర్‌కి తన స్టూడియోలో ఫొటోలు తీసేటప్పుడు అతనికి కావలసినంత వ్యవధి ఉంటుంది. ప్రెస్ ఫొటోగ్రాఫర్‌కు ఆ వ్యవధి ఉండదు. ఏ మాత్రం అప్రమత్తంగా లేక పోయినా ఒక్క క్షణంలో మంచి సన్నివేశం చేజారిపోవచ్చు. ఓ ప్రముఖ నాయకుడుచేసే ఓ సంస్థ ప్రారంభోత్సవ కార్యక్రమాన్నే తీసుకుంటే రిబ్బన్‌ను ఆయన కత్తిరించే సన్నివేశాన్ని జాగ్రత్తగా ఫొటోలో భద్రపరచవలసి ఉంటుంది ప్రెస్ ఫొటోగ్రాఫర్.

బహిరంగ సభల వంటి కార్యక్రమాలకు వెళ్లినపుడు బాగా చొరవ చూపగలగాలి. ప్రజానాయకుడు ప్రజల మధ్యకు వస్తే ఆయనను ప్రజలు చుట్టు-ముట్టి ఉండటం సహజం. కొన్నిసార్లు పోలీసుల భద్రతా ఏర్పాట్ల వల్లకూడా ఆనాయకుడి చేరువకు ఫొటోగ్రాఫర్ వెళ్లలేకపోవచ్చు. ఇలాంటప్పుడే వీలు చూసుకుని ముందుకు చొచ్చుకు పోగల నేర్పు అవసరం. ఆందోళనలు. ఉద్యమాలు జరిగేటప్పుడు ఫొటోగ్రాఫర్ దెబ్బలకు సైతం వెనకాడకూడదు. పోలీసులు లాఠీచార్జి చేస్తున్నపుడు ఫొటో తీయయత్నించిన ఫొటోగ్రాఫర్లపై పోలీసులు విరుచుకు పడిన సందర్భాలు అనేకం ఉన్నాయి. పోలీసులనుంచి ప్రతిఘటన వస్తుందని తెలిసినా ప్రెస్ ఫొటోగ్రాఫర్ మాత్రం తన వృత్తి ధర్మాన్ని ధైర్యంగా నెరవేర్చడానికే యత్నిస్తుండాలి.

అలాగే కొన్ని సందర్భాల్లో అరుదైన అనేక సంఘటనలు తారసిల్లు తుంటాయి. వాటిని ఫొటోపరంగా చూపగలిగితే వార్తా విలువ ఉంటుంది. వార్త విలువ తెలిసి ఫొటోగ్రాఫర్ ఆ సన్నివేశాన్ని వెంటనే ఫొటో తీయ గలగాలి. ప్రజల కష్టాలు సుఖాలు, వేదనలు, రోదనలు ఒక టేమిటి చూసేదృష్టి ఉండాలే కానీ పనికివచ్చే సందర్భాలు అనేకం తారసిల్లుతుంటాయి. మామూలు ఆలోచనా సరళికి భిన్నమైన దృష్టి ఫొటోగ్రాఫర్‌కు అవసరం. ఓ సినీనటుడిని చూడటానికి వేలాదిగా ప్రజలు తరలి వచ్చారనుకుందాం. చాలామంది ఫొటో గ్రాఫర్లదృష్టి ఆ సినీనటుడిపైనే ఉంటుంది. అతడిని చూసేందుకు ముఖమంతా కళ్లచేసుకుని ఓ పదేళ్ల బాలుడు ఏ పిట్టగోడమీదో, చెట్టు మీదో ఎక్కి కూర్చుని ఉండవచ్చు. ఆ ఒక్క ఫొటో చాలు. ఆ సినీనటుడికివున్న ప్రజాదరణ చెప్పటానికి పత్రిక 'వాసి'కి మంచి ఫొటోలే పట్టుగొమ్మలు. ఫొటోలను పత్రికలో సరైన పంథాలో వినియోగించుకుంటే అవి పాఠకుల మీద చూపే ప్రభావం అంతా ఇంతా కాదు.

---

## భాష పరిమితం-భావాలు అనంతం

ఒకేమాట భిన్న శాస్త్రాల్లో, భిన్న సందర్భాల్లో భిన్నార్థా నిస్తుంది. మనకున్న భాష పరిమితం. ఆలోచనలు, భావాలు అపరిమితం. అనంత భావాలను పరిమిత పదాలమధ్యనే ఇరికించవలసి వుంటుంది. ఇది ఒక్క మన భాషకు మాత్రమే వున్న పరిమితికాదు. అన్ని భాషలకూ ఇలాంటి పరిమితులే వున్నాయి. — రాంభట్ల కృష్ణమూర్తి.

---

## అనువాదాల తీరు

ఇప్పుడు పత్రికలవారు 'అన్‌హోలీ అలయెన్సు' అన్న క్రైస్తవ పదాన్ని తీసుకుని అపవిత్ర కలయిక అని అనువదించుకుంటున్నారు. క్రైస్తవ పరిభాషలో చర్చిలో ఫాదరీ పవిత్రజలం చల్లి మంత్రాలుచదివి చేసిన పెళ్లికి 'హోలీ అలయెన్స్,' అని పేరు. అలా చర్చితో నిమిత్తం లేకుండా పెళ్లి చేసుకుంటే దానికి వారు అన్‌హోలీ అలయెన్స్, అంటే వ్యభిచారం అని పేరు పెట్టారు. — రాంభట్ల కృష్ణమూర్తి.

---

# ఎడిషన్లు- వాటి కథా కమామిషు

కొన్ని పత్రికలు ఒకే కేంద్రం నుంచి ప్రచురణ జరుగుతుంటాయి. మరికొన్ని పత్రికలు రెండు పట్టణాల నుంచి మూడు లేదా నాలుగు పట్టణాల నుంచి ఏక కాలంలో ప్రచురణ అవుతుంటాయి ఒకే పత్రిక ఇన్ని కేంద్రాల నుంచి ప్రచురించటం వల్ల లాభముందా అంటే లాభం ఉందనే చెప్పాలి. ఒక పత్రిక ఎక్కువ కేంద్రాల నుంచి ప్రచురిస్తుంటే ఆయాప్రాంత వాసులకు ఎక్కువ తాజా వార్తలు అందించ వీలవుతుంది. ఇతర పత్రికల పోటీని తట్టుకుని ఏ ప్రాంతాని కాప్రాంతం వార్తలపై ప్రత్యేక శ్రద్ధ చూపి, ప్రాముఖ్యం ఇవ్వ వచ్చు. ఉదాహరణకు ఒక పత్రిక కేవలం హైదరబాదు నుంచే వెలువడు తుందను కుందాం. రాష్ట్రం నలుమూలలకు హైదరాబాదు నుంచే ఆ పత్రిక అందాలన్నమాట. మరి హైదరాబాదు నుంచి దూర ప్రాంతంలోని రాయల సీమకు ఇతర కోస్తా జిల్లాలకు ఆ పత్రికను ఉదయానికల్లా అందించాలి. ఇందుకు రవాణాకు చాలా కాలం అంటే నాలుగు నుంచి పదిగంటలకు పైగా పడుతుం దన్న మాట. అంటే విజయవాడకు పత్రిక కాపీలను పంపాలంటే రేపటి పత్రికను ఈ రోజే కనీసం రాత్రి పదిగంటలకు సిద్ధంచేసి వ్యాన్‌లోనో కారులోనో పంపాలి. పది గంటల కల్లా ప్రచురణ కూడా పూర్తి కావాలంటే ఎనిమిది గంటల వరకు వచ్చిన వార్తలను మాత్రమే విజయవాడ ప్రజలకు ఆ పత్రిక అందివ్వ గలదన్నమాట. అదే విజయవాడ నుంచి వెలువడే పత్రిక అర్ధరాత్రి ఒకటిన్నర వరకు వచ్చిన వార్తలతో సిటీ ఎడిషన్ అందిస్తుంది. ఈ పరిస్థితుల్లో సహజంగా తాజా వార్తలందించే విజయవాడ పత్రికలపట్ల పాఠకుడు మొగ్గు చూపుతాడు. మరో విధంగా చెప్పాలంటే విజయవాడ నుంచి వెలువడే ఓ పత్రిక విజయవాడ పాఠకులకు ఈ రోజు అందచేసిన వార్త హైదరాబాదు నుంచి వెలువడే పత్రిక ఆ మర్నాడు కాని అందివ్వలేని పరిస్థితి ఉత్పన్నమవుతుంది. ఇందువల్ల ఎన్ని ఎక్కువ కేంద్రాలనుంచి ఏక కాలంలో పత్రికను వెలువరిస్తే అంత మంచిది. ఒకే పత్రిక నాలుగు పట్టణాల నుంచి ప్రచురిత మవుతుంటే ఆ పత్రికాధిపతులు ఫలానా కేంద్రం నుంచి వెలువడే పత్రికను ఫలానా జిల్లా వరకు అందివ్వాలని నిర్ణయించు కుంటారు. ఈ నిర్ణయంలో దూరం ప్రధాన పాత్ర వహిస్తుంది ఉదాహరణకు విజయవాడ. విశాఖపట్నం నుంచి పత్రిక వెలువడుతుంటే తూర్పు గోదావరి జిల్లాకు విశాఖపట్నం ఎడిషన్‌ను పంపటం మేలైన పద్ధతి.

ఒక్కో ఎడిషన్ పరిధిలో కొన్ని జిల్లాలు ఉంటాయి. విజయవాడ ఎడిషన్‌ను కృష్ణా, గుంటూరు, ప్రకాశం, పశ్చిమ గోదావరి జిల్లాలకు పంపా

లని భావిస్తే అన్ని జిల్లాలకు ఒకేసారి ప్రచురించి పంపటం సాధ్యపడదు. ప్రకాశం జిల్లాలోని మారుమూల గ్రామాలకు పత్రిక అందాలంటే ముందుగా (అంటే కనీసం ఆరేడు గంటలు) అక్కడికి పంపే పత్రికను సిద్ధం చేయాలి. ఇంకా వివరంగా చెప్పాలంటే విజయవాడ ఎడిషన్‌ను ఎ.బి, సి. డి. అని నాలుగు ఎడిషన్లుగా విభజిద్దాం. దూరాన ఉన్న ప్రకాశం జిల్లాకు 'ఎ' ఎడిషన్‌ను పంపాలి. 'ఎ' ఎడిషన్ ప్రచురణ రేపటి పత్రిక ఈ రోజు రాత్రి పదిగంటలకు పూర్తికావాలి. 'బి' ఎడిషన్‌ను పశ్చిమ గోదావరి జిల్లాకోసం రాత్రి పదకొండు గంటలకు 'సి' ఎడిషన్‌ను గుంటూరు జిల్లా కోసం రాత్రి పన్నెండు గంటలకు ప్రచురించాలి. ఇక కృష్ణా జిల్లాకోసం 'డి' ఎడిషన్‌ను రాత్రి రెండు గంటలకు ప్రచురించినా సరిపోతుంది. ఇలా నమూనాగా సూచించిన ఎడిషన్ల ప్రచురణ సమయాలకు అనుగుణంగా సిబ్బంది పని చేయాల్సి ఉంటుంది. 'ఎ' ఎడిషన్‌ను పదిగంటల కల్లా ప్రచురించాలంటే రాత్రి ఎనిమిది గంటల వరకు వచ్చిన వార్తలను ఆ ఎడిషన్‌కు అందివ్వచ్చన్న మాట. అప్పుడు ఎడిటోరియల్ సిబ్బంది మధ్యాహ్నం రెండు గంటలకు వచ్చి రాత్రి ఎనిమిదిన్నర వరకూ పని చేస్తే సరిపోతుంది. మిగిలిన ఎడిషన్లకు రాత్రి షిఫ్టుకు వచ్చే సిబ్బంది బాధ్యత వహిస్తారు ఒకవేళ రాత్రి షిఫ్టులో ఎక్కువగా పని ఉన్నట్లయితే రాత్రి షిఫ్టుకు ఎక్కువగా సిబ్బందిని కేటాయించుకుంటే సరిపోతుంది. 'ఎ' ఎడిషన్‌కు రాత్రి ఎనిమిదింటి వరకూ వచ్చిన వార్తలను అందించ వీలుందని పైన చెప్పుకున్నాం. ఆ తర్వాత వచ్చిన వార్తలను 'ఎ' ఎడిషన్ చదివే పాఠకులకు అందివ్వటం ఎలా? అలాగే బి, సి, ఎడిషన్ల వేళలు దాటాక వచ్చే వార్తలను 'డి' ఎడిషన్‌కు మాత్రమే అందివ్వ వీలుంది. 'డి' ఎడిషన్‌కు ఇచ్చిన వార్తను కూడా ఎ.బి సి. ఎడిషన్ల పాఠకులకు ఇవ్వాలి. ఇందుకోసమే ప్రతి ఎడిషన్‌లో ట్రాన్స్ఫర్ పేజీలని కొన్నింటిని కేటాయిస్తారు. ఆ పేజీలలో నిన్న అందించ లేని వార్తలను నింపుతారు. ఇదీ ఎడిషన్లు వాటి కథా కమామిషు.

---

## హిస్టరీ రైటింగ్ ఇన్ హర్రీ

జర్నలిజాన్ని ఎవరో హిస్టరీ రైటింగ్ ఇన్ హర్రీ అన్నారు. చరిత్రలో అన్నీ స్వర్ణయుగాలే వుండవు. అన్నీ అంధకారయుగాలూ కావు. ఎంత హడావుడిగా రాసినా సమకాలీన చరిత్ర కారునిగా పత్రికా రచయిత తనకాలానికి సంబంధించి కూడా ఈ సమ దర్శిత్వం విడనాడ కూడదు. కూలిన వంతెనల విషయం తప్పక చెబుదాం. యింకా కూలక మిగిలినవెన్నో వున్న వాస్తవం మరుగున పడే వార్తా కథనమే పరిహరించాల్సింది.

సి. రాఘవాచారి.

# చురకల చిత్రాలు

ఇటీవలి కాలంలో ఏ పత్రికకయినా కార్టూన్ తప్పనిసరి అయింది. పత్రికలో కార్టూన్ విడదీయరాని భాగమయింది. సంపాదకీయం మాదిరే పొలిటికల్ కార్టూన్, పత్రిక పాలసీని తెలియచేస్తుంది. రాజకీయ నాయకులకు చురకలు అంటిస్తుంది. తప్పులను సరిదిద్దుకునే అవకాశమూ వారికి కార్టూన్ వల్ల కలుగుతుంది. కార్టూనిస్ట్ సమర్థుడైనపుడు, విషయాన్ని, భావాన్ని పదునుగా బొమ్మలోనూ, వ్యాఖ్యలోనూ చెప్పగలిగినపుడు ఆ కార్టూన్ పాఠకుడి హృదయంలో సూటిగా నాటుకుంటుంది. రెండు కాలాల నిడివి వుండే సంపాదకీయం సైతం చెప్పలేని వాస్తవాలను కార్టూన్‌లో కళ్లకు కట్టించవచ్చు. నిజానికి కార్టూనిస్ట్ ఓ కంట ఎడిటర్‌లా వర్తమాన పరిణామాలను నిశితంగా పరిశీలిస్తూనే మరోకంట దానికి బొమ్మరూపం ఇచ్చేందుకు కృషిచేస్తాడు. కార్టూనిస్ట్‌లో ఎడిటర్ ప్లస్ ఆర్టిస్ట్ కలిసి ఉంటాడు. ఉండాలి కూడా.

కార్టూన్ పదునుదేరిన అస్త్రమని, అది ఛేదించని లక్ష్యం అంటూ లేదనడానికి ఇటీవలి కాలంలో వచ్చిన ఓ కార్టూన్ ఉదహరిస్తాను. ముఖ్యమంత్రి అల్లుడు, తెలుగుదేశం నాయకుడు చంద్రబాబు నాయుడికి సంబంధించిన ఓ వార్త వచ్చింది దాని సారాంశమేమంటే, చంద్రబాబుకి ఎవరో లంచం ఎర చూపగా బాబు దాన్ని తిరస్కరించి లంచం ఇవ్వచూపిన వ్యక్తిని చట్టానికి పట్టిస్తాడు దీనిపై శ్రీధర్ 'ఈనాడు'లో ఓ కార్టూన్ గీశారు. చంద్రబాబు ఆఫీస్‌ముందు ఓ బంట్రోతు చుట్టతాగుతూకూచుని మరొకరితో ఇలా అంటాడు- "పదికీ పరక్కీ అయ్యగారు కక్కుర్తి పడరంటే విన్నాడు కాదు" అని- ఆ కార్టూన్ ఎలా పేలిందో, ఆ వ్యాఖ్యలోని గూఢార్థమేమిటో వేరే చెప్పక్కర్లేదు.

చిత్రకళ అనేది అంతర్జాతీయ మాధ్యమం. దానికి ఎల్లలు లేవు. భాషాపరమైన అడ్డుగోడలు లేవు. చదువురానివారిని సైతం అలరిస్తుంది. చిత్రాలకు ఈ అపూర్వ శక్తి ఉంది.

చరిత్రలోకి వెళ్తే ప్రజాకంటకులైన పాలకులను తూర్పారపట్టిన కార్టూనిస్ట్‌లు కన్పిస్తారు. ఇలా విమర్శలు సంధిస్తూ, పాలకుల ఆగ్రహానికి బలయిపోయినవారూ కన్పిస్తారు. 1'వ శతాబ్దిలో బ్రిటన్ రాణిని వ్యంగ్యంగా చిత్రిస్తూ వేసిన బొమ్మే కార్టూన్ కళకు శ్రీకారం పలికిందని అంటారు. ఇంగ్లండ్‌కు చెందిన విలియం హోగార్‌ను కార్టూనిస్ట్‌ల పితామహుడిగా చెప్పుకోవచ్చు. 16?7 లో జన్మించి 1764 లో కన్నుమూశాడాయన. కార్టూన్లద్వారా

ఆయన సాంఘిక ప్రయోజనాన్ని ఆశించాడు. ఆ తదనంతరం హోగార్ కృషిని కొనసాగించినవాడు థామస్ రోలాండ్‌సన్. థామస్ కార్టూన్లు ఇంగ్లండ్ లోనేకాక ఐరోపాలో కూడా ప్రాచుర్యం పొందాయి. 1900 నాటికే ఐరోపాలో కార్టూన్ పత్రికలు బహుళ ప్రాచుర్యం పొందాయి.

19వ శతాబ్ది ఆరంభంలో ఫ్రాన్స్‌లో ఫిలిపోన్ అనే వ్యక్తి రెండు జర్నల్స్‌ను ఎడిట్ చేస్తుండేవాడు. ఆయన వ్యంగ్య చిత్రకారులను గుర్తించి వారి సేవలద్వారా కింగ్ లూయిస్ రాచరికాన్ని స్వస్తిచెప్పాలని సంకల్పిస్తాడు. ఓ రోజు ఫిలిపోన్ భోంచేస్తుంటే అతని బుర్రలో ఓ ఆలోచన మెరుస్తుంది. రాజుకి, ఆనపకాయకి పోలికలున్న విషయం స్ఫురిస్తుంది. ఆనపకాయను పోలి నట్లుగా రాజు బొమ్మను గీయమంటాడు. ఇది రాజు ఆగ్రహానికి దారితీస్తుంది. ఫిలిపోన్‌ను కోర్టు కీడుస్తారు రాజుగారు ఆనపకాయలా లేకుంటే ఏ శిక్షకైనా సిద్ధమని ఫిలిపోన్ వాదిస్తాడు. ఆనపకాయ బొమ్మలు గీసినవారందరికీ ఈ లెక్కన శిక్ష విధించాల్సి ఉంటుందని చెప్తాడు. ఆయన తర్కానికి న్యాయ మూర్తులు అవాక్కవుతారు. అయితే ఆరునెల్ల జైలుశిక్ష, జరిమానా మాత్రం విధిస్తారు. ఫిలిపోన్ తన పత్రికలో క్షమాపణకూడా చెప్పుకుంటాడు. ఈ క్షమా పణను సైతం ఆనపకాయ ఆకృతిలో ముద్రించడం విశేషం. ఓ కార్టూన్ వేసి నందుకు ప్రింటర్, పబ్లిషర్‌కు జైలుశిక్ష విధించిన సంఘటన బహుశా ఇదే ప్రథమం కావచ్చు.

ఇటీవలి కాలంలో జరిగిన ఆనంద వికటన్ సంఘటన తెలిసిందే. వేలాది మందికి ప్రాతినిధ్యం వహించే ఎం. పీ లు, ఎమ్మెల్యేలను జేబుదొంగలుగా చిత్రీకరిస్తూ ఆనంద వికటన్ కార్టూన్ ప్రచురించింది. ఈ కార్టూన్‌పై తమిళ నాడు అసెంబ్లీ ఆనంద వికటన్ ఎడిటర్ బాలసుబ్రహ్మణ్యన్‌కు జైలుశిక్ష విధించింది. దేశవ్యాప్తంగా నిరసన వ్యక్తం కావటంతో బాలసుబ్రహ్మణ్యన్‌ను వెంటనే విడుదల చేశారు.

కార్టూనిస్ట్‌లు, ఎడిటర్‌లు కొంత జాగ్రత్తగా మెలగాలని పై ఘటన హెచ్చరిస్తుంది. ఓ కార్టూన్ అచ్చేస్తున్నామంటే అది లెజిస్లేచర్‌ల హక్కులకు భంగం కలిగిస్తోందా అనే విషయం పరిశీలించాలి. మత ఉద్వేగాలను రెచ్చగొట్ట కుండా జాగ్రత్తపడటం రెండో విషయం. కొన్ని సందర్భాల్లో తెలియనితనం వల్ల, విషయ పరిజ్ఞానం కొరవడో కొన్ని తప్పులు దొర్లిపోతుంటాయి. ఆ తర్వాత ఊహించని పరిణామం ఎదురైతేగానీ పాఠం తెలిసిరాదు. అప్పుడు పొరబాటు జరిగిందే అన్చెప్పి నాలిక కరుచుకుంటాం.

తెలుగులో మొట్టమొదటి కార్టూనిస్ట్‌గా రాంభట్ల కృష్ణమూర్తినే చెప్పుకో వచ్చు. (ఆయన గురించి మరో అధ్యాయంలో వివరించాను) ప్రస్తుతం తెలుగు నాట పాప (ఆంధ్రప్రభ), మోహన్ (ఉదయం), సురేంద్ర (ఆంధ్ర భూమి),

టి. వెంకట్రావు (విశాలాంధ్ర), నర్సిమ్ (ఆంధ్రజ్యోతి), శ్రీధర్ (ఈనాడు) కార్టూనిస్టులుగా పాఠకులను అలరిస్తున్నారు.

## ఆర్. ఎస్. నాయుడు

తెలుగువారు మరిచిపోయిన గొప్ప కార్టూనిస్ట్ ఆర్. ఎస్. నాయుడు. ఆర్. ఎస్. ఎన్. పేరిట కార్టూన్లు వేస్తుండేవారు. 1938-39 లో కమ్యూనిస్ట్ వారపత్రిక నేషనల్ ఫ్రంట్‌లో కార్టూన్ల ద్వారా కమ్యూనిస్ట్ ఉద్యమానికి తన వంతు కృషి చేశాడాయన. మొదట్లో పుస్తకాలకు బొమ్మలువేసే ఆర్.ఎస్.ఎన్. కమ్యూనిస్ట్ ఉద్యమంపట్ల ఆకర్షితులయ్యారు. జమీందారి విధానానికి వ్యతిరేకంగా కమ్యూనిస్ట్ పార్టీ సాగించిన పోరాటాన్ని ఆర్. ఎస్. ఎన్. కార్టూన్‌లు ప్రతిబింబించేవి. నేషనల్ ఫ్రంట్‌తోపాటు పీపుల్స్‌వార్ పత్రికకు, నవశక్తికి కూడా కార్టూన్లు వేసేవారాయన. చిత్రప్రసాద్‌వంటి వారికంటే ముందే కమ్యూనిస్ట్ ఉద్యమానికి ఎంతో దీక్షతో కృషిచేసిన వ్యక్తి ఆర్. ఎస్. ఎన్. చిత్తూరు జిల్లాకు చెందిన ఆయన జీవితపర్యంతం అవివాహితుడిగానే గడిపారు. నాసిక్ జైలులో కారాగారం అనుభవించారు. అక్కడే శారీరక, మానసిక ఆరోగ్యం క్షీణించింది. చివరకు 1985 అక్టోబరు ఆరున ఆర్.ఎస్.ఎన్. దిక్కుమొక్కు లేక చివరిశ్వాస విడిచారు.

## కేశవశంకర పిళ్లై

బ్రిటిష్‌వారి హయాంలో దేశంలో తొలి పొలిటికల్ కార్టూనిస్టుగా చెప్పదగిన వ్యక్తి కేశవశంకర పిళ్లై. 1920 దశకం మధ్యలో శంకర్ గ్రాడ్యుయేషన్ చేశారు. 'లా' చదవాలనుకున్నారు. 'లా' చదువుతున్నపుడు పొలిటికల్ కార్టూన్‌కు ఐడియా వచ్చింది. శంకర్ అలా రోజుకో కార్టూన్ చొప్పున వేయసాగాడు. కార్టూన్ గియ్యందే ఆయనకు నిద్రపట్టేది కాదట. ఢిల్లీ హిందుస్థాన్ టైమ్స్‌లో శంకర్ 150 రూపాయల జీతంపై చేరారు జాతీయోద్యమం ఉధృతంగా సాగుతున్న రోజుల్లో వైస్రాయ్ లార్డ్‌లిన్‌లిత్‌గోను మెడలో పుర్రెలదండతో సమాధిలో మృతదేహాలపై నృత్యం చేస్తున్న కాళిలా చిత్రించాడు. వెంటనే వైస్రాయ్ నుంచి కబురు వచ్చింది. అనుకున్నదానికి భిన్నంగా వైస్రాయ్ శంకర్‌ను ఆదరించాడు. ఆ కార్టూన్ అసలును అడిగి తీసుకుని తన భవంతిలో వేలాడదీశాడు. ఆ తర్వాత శంకర్, వైస్రాయ్ మంచి స్నేహితులయ్యారు. జవహర్‌లాల్ నెహ్రూ ప్రోత్సాహంతో ఆయన శంకర్స్ వీక్లీని ప్రారంభించారు. దీంతోపాటే శంకర్ పిల్లలపై అనురక్తి పెంచుకున్నారు.

అంతర్జాతీయ పెయింటింగ్స్, కథల పోటీలు నిర్వహించారు. పిల్లల పుస్తకాలు రాశారు. ఢిల్లీలో అంతర్జాతీయ డాల్ మ్యూజియం స్థాపించారు. ఎమర్జన్సీలో 'శంకర్స్ వీక్లీ'ని మూసేశారు. పద్మశ్రీ, పద్మభూషణ్, పద్మవిభూషణ్‌లు శంకర్‌ను వరించాయి.

## ఆర్. కె. లక్ష్మణ్

ఆర్. కె. లక్ష్మణ్‌కు 61 ఏళ్లు ఉంటాయి. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. నాలుగు దశాబ్దాలుగా ఆయన కార్టూనిస్ట్, ఆర్టిస్ట్, నవలా రచయిత. ఊహ తెలిసినప్పటినుంచి లక్ష్మణ్ స్నేహితుల బొమ్మలు గీస్తుండేవాడు. టైమ్స్ ఆఫ్ ఇండియాలో ఆయన కార్టూనిస్ట్‌గా పనిచేస్తున్నారు. పత్రిక పాలసీ మారినా తన పంథా మార్చుకోని లక్ష్మణ్, 'కామన్ మాన్' అనే పాత్రను సృష్టించారు. నెలకో 50 కార్టూన్‌లు లక్ష్మణ్ కలంనుంచి వెల్వడుతుంటాయి. ఆయన ఇప్పటివరకూ పదివేలకుపైగా రాజకీయ కార్టూన్లు, ఎనిమిది వేలకుపైగా సామాజిక, రాజకీయ కార్టూన్లు గీశారు. 500 మంది నాయకుల డ్రాయింగ్స్‌ను ఇలస్ట్రేటెడ్ వీక్లీకి, ఫిల్మ్ ప్రముఖుల డ్రాయింగ్‌లను ఫిల్మ్ ఫేర్‌కు లక్ష్మణ్ వేసి ఇచ్చారు. భార్య కమల, సోదరుడు ఆర్. కె. నారాయణ్‌లు కూడా రచయితలు. పదేళ్ళక్రితం లక్ష్మణ్ 'సారీ నో రూమ్' అనే తొలి నవలను అచ్చేశాడు. భార్యా, సోదరుడి పుస్తకాలకు కూడా లక్ష్మణ్ ముఖచిత్రాలు గీసిస్తుంటారు. లక్ష్మణ్ ఆదిలో మద్రాసు జెమినీ స్టూడియోలో యానిమేషన్ విభాగంలో పనిచేశారు. కొంత డబ్బు పోగయ్యాక కార్టూనిస్ట్ ఉద్యోగం వెతుకుతూ ఢిల్లీకి చేరాడు. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ రామనాథ్ గోయెంకా, హిందుస్థాన్ టైమ్స్ ఎడిటర్ దుర్గాదాస్‌లు, లక్ష్మణ్‌ను వద్దు పొమ్మన్నారు. తర్వాత బ్లిట్జ్‌లో కార్టూనిస్ట్‌గా చేరాడు. ఆ పిదప బాల్‌థాకరేతో కలిసి ఫ్రీ ప్రెస్ జర్నల్‌లో పనిచేశారు. టైమ్స్ ఆఫ్ ఇండియాలో 600 జీతంపై లక్ష్మణ్ ప్రవేశించాడు. 1948 లో రాజకీయ కార్టూన్లను ప్రవేశపెట్టిన ఘనత లక్ష్మణ్‌దే.

ఉదయం తొమ్మిదింటికల్లా లక్ష్మణ్ టైమ్స్ ఆఫీసుకు అంబాసిడర్ కారులో వచ్చేస్తారు. మూడో అంతస్తులోని కాబిన్‌కు నడిచే వెళ్తారు, వార్తాపత్రికలు తిరగేస్తూ, కావల్సిన వార్తలపై గుర్తు రాసుకుంటారు. ఆయన తన గది సామాన్యంగా వదిలి బయటకు రారు. రాజీనామా చేయటానికో, జీతం పెంచమని అడగటానికో తప్ప లక్ష్మణ్ అసలు కదలడు అని కూడా సరదాగా అనుకుంటుంటారు. ఆయన ఆ గదిలోనే కార్టూన్ ఆలోచనకోసం చెమటలు కక్కుతాడు. ఆవేదన పడతాడు. ఒక్కసారి ఆలోచన మెరిసి చకచకా కార్టూన్

రూపం తొడుగుతుంది. పూర్వం అంటే చరణ్, రాజ్‌నారాయణ్, మురార్జీ వంటి నాయకులు అనేకమంది ఉండేవారు. ఎవరిమీదనైనా కార్టూన్ సంధించ వీలుండేది. మరిప్పుడో రాజీవ్ వన్‌మాన్ షో అయిపోయింది అని చెప్పే లక్ష్మణ్ పద్మభూషణ్, మెగసెసె అవార్డుల గ్రహీత కూడా.

## బాలాసాహెబ్ థాకరే

ఫ్రీ ప్రెస్ జర్నల్‌లో లక్ష్మణ్‌తో కలిసి పనిచేసిన థాకరే మార్మిక్ అనే కార్టూన్ వీక్లీని కూడా నడిపారు. పాతికేళ్ళపాటు దేశంలో ఇద్దరే కార్టూనిస్టులు ఉన్నారు. ఒకరు ఆర్. కె, రెండు నేను అని థాకరే సగర్వంగా చెప్పుకుంటారు. వాల్ట్ డిస్నీ సినిమాలంటే అమితంగా ఇష్టపడే ఆయన మైలు పొడవు క్యూ వున్నా వెనకంజ వేయడు. థాకరే ఇప్పుడు రాజకీయాల్లో నిమగ్నమై ఉన్నందున ఆయన కార్టూనిస్ట్ జీవితం ముగిసినట్లే.

శంకర్స్ వీక్లీని ప్రారంభిస్తూ నెహ్రూ శంకర్‌తో ఒక మాటన్నారు. "శంకర్! నువ్వు నాకో మేలు చేయాలి. అదేమంటే నువ్వు నీ కార్టూన్లలో నన్ను ఏమాత్రం వదిలిపెట్టకు" అని. ఏ రాజకీయ నాయకుడైనా నెహ్రూలా ఆలోచించగలిగితే ఆ రాజకీయ నాయకుడి ఆప్తమిత్రుడు కార్టూనిస్ట్ కాక వేరెవ్వరూ!

---

## వార్త వన్నె చిన్నెలు

ఒక సంఘటన జరిగిన తర్వాత వార్తగా అది మనకు చేరే వరకు ఎన్నో మార్పులు చెందుతుంది. కొన్నిసార్లు ఈ మార్పులు వార్తనే మార్చి వేస్తాయి. చెరిపి వేస్తాయి. కొత్త వాసనలిస్తాయి. ఇందుకు సహజ కారణాలుంటాయి. అసహజ తర్కాలుంటాయి. వార్త ప్రయాణం చేసే వాహనాలు రకరకాలు. నోటిమీద, ఫోను మీద కాగితం మీద. వార్త పాఠకుడిని, శ్రోతను చేరడానికి మళ్ళీ కాగితం, నోరు, ఆలోచన-కూర్పు ఇన్ని వాహకాలు, సహాయం చేస్తాయి. ఈ వలయంలో రాయడం, వినిపించడం, అనువాద, భాషా శక్తులు, అనువాదకుల యుక్తి, సంస్కారం, చదువు ఇన్ని పనిచేస్తాయి,

— పన్నాల సుబ్రహ్మణ్య భట్టు

---

# 4

# ఇంటర్ 'వ్యూ' పాయింట్

ఇందులో

1) రాంభట్ల కృష్ణమూర్తి
2) రామోజీరావు
3) చలసాని ప్రసాదరావు
4) ఎ.బి.కె. ప్రసాద్
5) కె.ఎన్.వై. పతంజలి
6) దాట్లనారాయణమూర్తిరాజు
7) శ్రీధర్
8) మోహన్
9) చేకూరి రామారావు

లతో ఇంటర్వ్యూలు, వారి వ్యక్తిత్వ చిత్రణలు చదవండి.

---

## తద్దినం వార్తలు

"ఈనాడు సాంప్రదాయక హూందాతనంతో ఈ పండుగను దక్షిణ భారత దేశంలో ఆనందంగా చేసుకుంటారు" అంటూ రకరకాల పండుగలను గురించి వార్తలలో ప్రత్యేకంగా వస్తున్నాయి. ఈ వివిధ పండుగల వార్తల వల్ల దేశ సమైక్యతకు దోహదం కల్గుతుందని, ఎప్పుడో పాలక అధికారుల కాగితాలు తెలియపరిచి వుంటాయి. అంత తేలికగా సమైక్యత కల్గితే అంతకంటే కావలసినదేముంది. ఇటువంటి పండుగ వార్తలకి మా విలేకరి తెలియచేస్తున్నరని చెప్పినా ఆ విలేకరి ప్రతి పండుగకి ఎక్కడికీ వెళ్లకుండానే అలా చెప్పగలడు. అవి సమయ పూరకాలే తప్ప విషయగుంభన కలవికావు.

— వన్నాల సుబ్రహ్మణ్య భట్టు.

# కదిలే గ్రంధాలయం రాంభట్ల



ఆయనతో పరిచయమే ఓ మహద్భాగ్యం. ఆయనతో సంభాషించడమే ఓ ఎడ్యుకేషన్. ఇటు ప్రాచీన సాహిత్యం నుంచి అటు ఆధునిక విజ్ఞానశాస్త్రాల వరకూ ఆయన కొట్టిన పిండి. ఏ విషయం మీద ఏ కొద్దిపాటి సందేహం వచ్చినా పూర్వాపరాలన్నీ విశ్లేషిస్తూ ఆయన అనర్గళంగా మాట్లాడుతూ మనకు తెలియని కొత్త ప్రపంచాన్ని కళ్ళెదుట సాక్షాత్కరింప చేస్తారు. ఒక్కముక్కలో చెప్పాలంటే ఆయన ఓ కదిలే గ్రంధాలయం. ఆయన మెదడొక అపూర్వ జ్ఞాపకాల విజ్ఞాన సర్వస్వం. పుస్తకాలు చదివి జీర్ణించుకుంటే గానీ విషయం బోధపడదు. ఈ శ్రమేమి లేకుండా ఆయనతో కాసేపుమాట్లాడితే అలా అరటి పండు వలిచినట్లుగా విషయ బోధ చేస్తారు.

ఆయన పేరు రాంభట్ల కృష్ణమూర్తి. సమకాలీన తెలుగు జర్నలిజాన్ని తన ప్రతిభా పాటవాలతో కొత్త పుంతలు తొక్కించారు రాంభట్ల. ఆయన కృషితో తెలుగు జర్నలిజం పరిపుష్టమైంది. కొత్త సొగసుల్ని పొందింది. రాంభట్లలో రచయిత ఉన్నాడు. జర్నలిస్టు వున్నాడు. కళాకారుడు ఉన్నాడు. విమర్శకుడు వున్నాడు.

తెలుగులో తొలి రాజకీయ కార్టూనిస్ట్ రాంభట్లే. తెలుగు పత్రికల్లో కార్టూన్లకు రాంభట్ల జీవం పోశారు. కార్టూన్ని ఓ ఉద్యమంగా చేపట్టారు. కార్టూన్ ద్వారా ప్రజా చైతన్యాన్ని కల్గించారు.

రాంభట్ల వయసు 68 ఏళ్లు. చొక్కా టక్ చేసుకుని హుషారుగా నడుస్తుంటారు. ఆయనను చూస్తుంటే పాతికేళ్ల కుర్రాడిలోని చలాకితనం కన్పిస్తుంది. వయసు రీత్యా పెద్దే అయినా మనసు రీత్యా ఆయన కుర్రాడే. రాంభట్ల కుర్రాళ్లలో కుర్రాడు పెద్దవాళ్ళలో పెద్దవాడు. కుర్ర జర్నలిస్టులు రాంభట్లని చూడగానే పొంగి పోతారు

"ఏం ఫ్రెండూ ఏంటి కొత్తలు (న్యూస్)" అంటూ ఆయన సంభాషణ మొదలిడతారు. అలా మొదలయ్యే సంభాషణ ఎటు మలుపు తిరుగుతుందో, ఎన్ని హాయలు పోతుందో ఎన్ని విషయాలను తరచి చూస్తుందో ఊహకు మాత్రం అందని విషయం. ఎదుటవున్న వ్యక్తి కాస్తంత తెలివిగా ఆయనను చాలెంజ్ చేసుకుంటే, ఆయనను ట్యూన్ చేసుకుంటే ఇక ఆ పూట బుర్రకి మృష్టాన్న భోజనమే. నెరిసిన జుట్టు, కళ్ళజోడులోంచి తొంగి చూసే చురుకైన చూపులు. తెలుగు పాత్రికేయుల్లో రాంభట్ల శిష్యులు చాలామందే వున్నారు. ఆయన ఎందరినో జర్నలిస్టులుగా తీర్చి దిద్దారు

రాంభట్ల వాక్ ప్రవాహానికి సంబంధించి ఓ చిన్న జోక్. మనం గడియారాలు, వాటి పుట్టు పూర్వాలు వగైరా తెలుసు కోవాలనుకోండి. 'రాంభట్ల గారూ! టైమెంతయింది.' అంటే చాలు మొత్తం విషయాలన్నీ ఆయన చెప్పుకొస్తారు. ఇది జోకే గానీ ఇందులో రవ్వంత నిజమూ లేకపోలేదు ఈ కాలంలో రాంభట్లలా విషయాన్ని సాకల్యంగా వివరించే వారు అరుదు. రాంభట్ల మాటల్లోనే చెప్పాలంటే-చదివిన విషయం, తెలుసుకున్న జ్ఞానం మదిలో సుస్థిరం కావాలంటే రెండే మార్గాలున్నాయి. ఒకటి కాగితం మీద పెట్టడం, రెండోది వాక్ రూప మివ్వడం. ఈ రెండిట్లో ఏదో ఒక మార్గం ద్వారా తెలుసుకున్న విషయం రీప్రొడ్యూస్ కావాలి అప్పుడే ఆ విషయం బుర్రలో నిల్వ వుంటుంది. నేను మాటల ద్వారా రీప్రొడ్యూస్ చేస్తూ విషయాన్ని నిక్షిప్తం చేసుకుంటాను అని అంటారు రాంభట్ల.

పైకి హుషారుగా, చలాకీగా కుర్రాడిలా కన్పించే రాంభట్ల జీవిత నావ ఎన్నో సుడిగుండాలను చూసింది. విరిగి పెరిగితి, పెరిగి విరిగితి, కష్ట సుఖముల సార మెరిగితి అన్నట్లు రాంభట్ల తన జీవితంలో కష్టాల కారుమేఘాలు కమ్మినా చలించలేదు. బాధలు ఉరుముల్లా గర్జిస్తూ భయపెట్టినా చలించలేదు. రాంభట్ల జీవితం సమకాలీన చరిత్రలో కొంత భాగానికి పట్టిన అద్దం, ఓ మంచి నవలో, సినిమానో కాగల కావ్యం.

మీతో ఇంటర్వ్యూ కావాలని అడగ్గానే ఆయన వెంటనే ఒప్పుకున్నారు. బర్కత్‌పురా (హైదరాబాద్) లో తనువుండే శివశక్తి అపార్ట్‌మెంట్స్ చిరు

నామాను మాప్‌తో సహా గీసి చూపించారు. రాంభట్ల వివిధ విషయాలపై తన అభిప్రాయాలను కుండ బద్దలు కొట్టినట్లు చెప్పారు. జీవిత విశేషాలు అడిగితే "ఎందుకోయ్?" అని ప్రశ్నించి దాపరికం లేకుండా జీవిత ఘట్టాలన్నింటినీ జ్ఞాపకాల పుటల నుంచి వరస క్రమంలో కళ్ళకు కట్టించారు.

రాంభట్ల తాతముత్తాతలది విశాఖ జిల్లా. వ్యూడల్ కుటుంబం. రాంభట్ల తండ్రి తన వాటా పొలం పుట్రా అమ్మేసి అప్పులు తీర్చుకుని తూర్పు గోదావరి జిల్లాలోని మావ గారింటికి వచ్చేశారు. అమలాపురానికి దగ్గర్లోని అనాతవరం అగ్రహారంలో ఆయన సెటిల్ అయ్యారు 1920 మార్చి 24న అనాతవరం అగ్రహారంలో రాంభట్ల కళ్ళు తెరిచారు. రాంభట్లకు రెండున్నర ఏళ్ళప్పుడే తండ్రి మరణించారు. అప్పటికే అనంతా హారతి కర్పూరంలా కరిగి పోయింది. తండ్రి దిండు కింద మిగిలిన 200 రూపాయలే సంపద. ఆ కాస్తా తండ్రి అంత్యక్రియలకు వాడేశారు. ఇద్దరన్నదమ్ముల్లో రాంభట్ల చిన్నవాడు.

తండ్రి పోయాక ముద్దుల మనవణ్ణి (రాంభట్లను) తాత చేర దీశాడు. వైజాగ్ తీసుకెళ్ళారు. పూర్వపు రోజుల్లో ఓనమాలు దిద్దబెడ్తే చేతి వేలు రక్తం చిమ్మాలి. పిల్లవాడి చేతికి రక్తం చిమ్మిస్తేనే గురువు సమర్థుడనుకునేవారు. ముద్దుల మనవడి చదువుకోసం తాత ప్రత్యేకంగా ఓ గురువును రప్పించారు. ఆ గురువు రాంభట్లకు అక్షరాభ్యాసం చెయించటానికి చిట్టి వేళ్ళను ఇసుకలో గట్టిగా రాయించాడు అప్పట్లో పలక మీద కాకుండా ఇసుకలో అక్షరాలు దిద్దబెట్టేవారు. దీన్నే గుంట ఓనమాలు అంటారు. రాంభట్ల వేలు కంది పోయింది. ముద్దుల మనవడి శోకానికి తాత హృదయం కరిగి పోయింది. గురువుకు బడితె పూజ జరిగి పోయింది. గుంట ఓనమాలు గంటలో ముగిశాయి. ఆ తర్వాత రాంభట్లకు తాతే గురవయ్యాడు. ముద్దుగా చేరదీసి ఆపేక్షగా తాత చెప్పే గజేంద్ర మోక్షం, రామాయణం ఆదిగా గల కావ్యాలను రాంభట్ల ఒంటికి పట్టించు కున్నాడు. ఇంట్లోవున్న రామాయణం పుస్తకంలోని బొమ్మలు రాంభట్లను విశేషంగా ఆకట్టుకున్నాయి. ఆ బొమ్మ ఎవరిదో తాతనడిగేవాడు. ఆ బొమ్మను గుర్తు పెట్టుకుని దానికెంది అక్షరాలు మనసులో ముద్రించుకునే వారు. ఇలా బొమ్మలతో చదువు ప్రారంభమైంది.

ఓ రోజు తాత పిలిచి "అక్షరాలు నేర్చుకోవా?" అనడిగాడు పలకా బలకం కావాలా? కాగితాలు కావాలా? తాటాకులు కావాలా? అనడిగితే తాటాకులు కావాలన్నాడు రాంభట్ల. గంటం ఎలా పట్టుకోవాలో తాతే నేర్పించాడు. అలా తాటాకుల మీద అక్షరాభ్యాసం సాగింది. రాంభట్ల మకాం గజపతి నగరంలోని బాబాయి గారింటికి మారింది. అక్కడే ఒకటో తరగతి ప్రవేశం. ఏటి

పక్కన స్కూలు, స్కూలు పక్కన సంత తోట, దాని వెనక ఆస్పత్రి. స్కూల్లో చేరినా చదువు మీద ధ్యాస నిలిచేది కాదు. ఏటి ఇసకలో ఆడుకోడం, తోపులోకి వెళ్ళి కోతి కొమ్మచ్చి ఆడటం, చింతకాయలు కోసుకు తినడం. ఓ రోజు హెడ్మాస్టరు బెత్తం పుచ్చుకుని రాంభట్ల ఇంటికి వచ్చాడు. రాంభట్ల గోడదూకి పారిపోయాడు. రాంభట్లను అందుకోవడం వల్లకాక హెడ్మాస్టరు దిగి వచ్చాడు. ఒకటో క్లాస్‌లో కూచోవద్దు నా థర్డ్‌క్లాస్‌లో కూర్చో అని చెప్పారు. హెడ్మాస్టరుకి మూడు విషయాలలో మక్కువ ఎక్కువ. రోజుకో పద్యం అప్ప చెప్తే, గుండ్రంగా అక్షరాలురాస్తే, బొమ్మలు వేయగలిగితే ఆ విద్యార్థులను ఆయన అభిమానించే వాడు. ఒక పద్యం అప్పచెప్పమంటే మూడు పద్యాలు అప్పచెప్పి క్లాస్ నుంచి బయట పడేవాడు రాంభట్ల. తోటి విద్యార్థులను కూడా ఇలాగే ప్రోత్సహించి వాళ్లతో ఆడుకునేవాడు. ఏటికపతల తోట, ఆతోట కావల ఆస్పత్రి అని చెప్పుకున్నాం. ఆ ఆస్పత్రిలో ఓ పొట్టిడాక్టర్ ఉండేవారు. ఆయన ఆస్పత్రి గోడల్ని తెల్లగా ఉంచేవాడు. రాంభట్ల నల్లబొగ్గుతో ఆస్పత్రి గోడల్ని బొమ్మలతో ఖరాబు చేయసాగాడు. ఈ ఆకతాయి పిల్లాణ్ణి పట్టుకోడానికి డాక్టర్ కాపలా ఏర్పాటు చేశాడు. అయినా అర్ధరాత్రి పూట అందరి కళ్లుగప్పి ఆస్పత్రి గోడమీద డాక్టర్ బొమ్మ గీసొచ్చేవాడు. ఇలా చిన్ననాటే రాంభట్లలో కళాకారుడు ఊపిరి పోసుకున్నాడు.

మూడో తరగతి పాసయ్యాక రాంభట్ల మకాం మళ్ళీ మారింది. ఇల్లెందు లోని చిన మేన మామగారింటికి చేరాడు. అప్పట్లో ఇల్లెందులో మూడోతరగతి నుంచి ఉర్దూ నిర్బంధం. దాంతో తిరిగి మూడోతరగతిలోనే చేరాల్సి వచ్చింది. మూడోతరగతి పూర్తిచేసి నాల్గో తరగతిలో చేరదామనుకుంటుండగా హైదరాబాద్‌లోని పెద్దమామగారు రాంభట్లని చదివిస్తానని కబురు పెట్టారు. హైదరాబాద్‌లో పూర్తిగా ఉర్దూ మీడియం. మూడోతరగతి మూడోసారి చదవాల్సి వచ్చింది. ఇలా చదివినక్లాసే చదవాల్సి రావడంతో విసుగెత్తి పోయింది. నాంపల్లిలోని వేమన గ్రంథాలయం గుమాస్తాతో పరిచయం పెంచుకుని, పుస్తకాలు తీసుకుని పబ్లిక్ గార్డెన్‌కు పరుగు తీసేవాడు రాంభట్ల. పధ్నాలుగేళ్ళ ప్రాయంలోనే కథలు, నవలలు, నాటకాలు, శాస్త్ర గ్రంథాలు, సాక్షి సంపుటాలు, ప్రాచీన కావ్యాలు చదవటం పూర్తిచేశాడు. అప్పటికే రాంభట్లకు ఒడుగయింది. సంధ్యా వందనాన్ని వ్యతిరేకించాడు. వీరేశలింగం, పానుగంటి, చిలకమర్తి వారి రచనలు హేతుబద్ధ ఆలోచనలకు ఊపిరిపోశాయి.

బాల్యం తెలీని విధంగా రాంభట్ల బాల్యంగడిచి పోయింది. చిన్నతనాన డబ్బుకోసం కటకటలాడాడు. అవమానాలు సహించాడు. ఆస్తి ఆప్తబంధువులను

నైతం దూరం చేస్తుంది. అందుకే సంపద మీద ద్వేషం పెరిగింది. అది ఆర్థిక విషయాల్లో రాంభట్ల మనస్తత్వానికి బాట వేసింది. ఆరోక్లాస్ చదువుతూ రాంభట్ల స్కూల్‌కు గుడ్‌బై చెప్పేశాడు. ఆ తర్వాత స్కూలు ముఖమే చూశ్ళేదు. చిన్న కొలువులెన్నో చేశాడాయన. అడవి బాపిరాజుగారితో శ్రీకృష్ణ దేవరాయ భాషా నిలయంలో పరిచయం. ఆ పరిచయమే మీజాన్‌లో ఉప సంపాదక ఉద్యోగం ఇప్పించింది. 52 లో విశాలాంధ్రలో చేరారు. విశాలాంధ్రలో కార్టూన్‌లు, ఆ కార్టూన్‌లకింద పాటలతో పాఠకులను ఉత్తేజపరిచారు. కమ్యూనిస్ట్ పార్టీ చీలిక దిశలో రాంభట్లను ఒక వర్గం వాడిగా ముద్రేశారు. దాంతో విశాలాంధ్రకు గుడ్‌బై చెప్పారు. సోదరుడి ఫ్యాక్టరీలలో 16 ఏళ్ళపాటు మెటలర్జిస్ట్‌గా, జనరల్ మేనేజర్‌గా కొనసాగారు. ఆ రోజుల్లోనే రామోజీరావుతో పరిచయం, స్నేహం ఏర్పడ్డాయి. ఆయన 'ఈనాడు' ప్రారంభించాక అందులో ట్రెయినింగ్ కాలేజి ప్రిన్సిపాల్‌గా చేరారు రాంభట్ల. ఆ తర్వాతి పరిణామాలవల్ల ఎగ్జిక్యూటివ్ ఎడిటర్‌హోదాలో పనిచేసి రిటైరయ్యారు. రష్యా, అమెరికాలను ఆయన సంచర్శించారు.

ఆయన జీవితాన్ని విశ్లేషిస్తే, ఆయన చిన్ననాట డబ్బుకోసం కటకట పడ్డారు స్కూలు చదువంటే గిట్టకపోయినా పుస్తకాలపై అనురక్తి పెంచుకున్నారు. కనిపించిన ప్రతి పుస్తకాన్నీ చదివారు. కళలో కూడా స్వయంకృషితోనే నిలదొక్కుకున్నారు. వృత్తులు అనేకం మారినా విజ్ఞాన కాంక్షలోనే మక్కువ నిలుపుకున్నారు. సంప్రదాయ కుటుంబంలో జన్మించినా ఆ వాసనలు దరి రానీయలేదు. ఛాందసాలను వీడి శాస్త్రీయం, హేతుబద్ధతలకే ప్రాధాన్యం ఇచ్చారు. ధనార్జనకు కాక విద్యార్జనకు ఆయన జీవితాన్ని అంకితం చేశారు. రాంభట్ల పుస్తకాభిలాష యువతకు ఆదర్శం కావాలి.

---

## అరకొరగా మెదడుమేత

నిర్బంధంగానైతేనేమి తెలుగు నాటనైతేం చదువరుల సంఖ్య నానాటికీ పెరుగుతున్న మాట వాస్తవం. ఇలాగా అంతో యింతో అక్షర జ్ఞానం సంపాదించిన సామాన్య పాఠకుల జ్ఞానతృష్ణను తీర్చడానికి సరిపడా పఠన సామాగ్రి తెలుగులో సిద్ధంగా లేదు. కాస్తో కూస్తో ఆ వున్నది సయితంవారి అంతస్తుకు తగినట్లుగా ఉందని చెప్పలేం. భాష మాట అలా వుంచి క్షణికోద్రేకాలను రెచ్చగొట్టే క్షుద్ర సాహిత్యం బండ్లకొద్ది విడుదలయి యువ జనతను పెడదారులు పట్టిస్తున్నది. — డాక్టర్ తూమాటి దొణప్ప.

---

# రాంభట్లతో ఇంటర్వ్యూ

శ్రీ రాంభట్ల కృష్ణమూర్తితో ఈ ఇంటర్వ్యూ అయిదారు గంటలకు పైగానే సాగింది. దాదాపు నలభై ప్రశ్నలదాకా సిద్ధం చేసుకుని ఒక్కో ప్రశ్నను ఆయన ముందుంచాను. ప్రతి ప్రశ్నకూ ఆయన సవివరంగా॥ లోతుకు వెళ్లి సమాధానాలిచ్చారు. మొదటిరోజున ఇంటర్వ్యూ కొంత పూర్తికాగానే ఎవరో బంధువులు వచ్చారు. దాంతో ఆపూటకి ఇంటర్వ్యూ స్వస్తిచెప్పి మర్నాడు మళ్ళీ సాగించాను. రెండో రోజు కూడా ఇంటర్వ్యూకి అంతరాయం కల్గుతుందేమోనని భయపడుతూ నా ప్రశ్నలన్నిటికీ సాధ్యమైనంత త్వరగా రాంభట్లనుంచి సమాధానాలకోసం ఆత్రుత పడ్డాను. ఒక్కో-సారి-ఆయన తన వివరణలతో విషయం లోతుకి వెళ్ళి చర్చిస్తుంటే అడ్డు తగిలిన సందర్భాలు వున్నాయి. అయితే ఆయన తను చెప్పదల్చుకున్న విషయాలను సంపూర్ణంగా చెప్పారు. ఇంటర్వ్యూ విజయవంతంగా ముగిసింది. ఆయన నా ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలు విస్తరణ భీతితో పూర్తిగా ఇవ్వటం లేదు. అంత కడివెడు పాలపై ఒకింత మీగడ పేరినట్లుగా ఆయన ఇంటర్వ్యూ సంక్షిప్త రూపాన్నే మీ ముందుంచుతున్నాను. నేను నా ప్రశ్నలను నాలుగు భాగాలుగా చేశాను. మొదటి భాగం జర్నలిజం, రెండో భాగం కార్టూన్లు, మూడో భాగం రాజకీయాలు, నాల్గో భాగం వ్యక్తిగత, సామాజిక విషయాలు. వివిధ విషయాలపై రాంభట్ల అభిప్రాయాలను, ఆలోచనా సరళిని ఈ ఇంటర్వ్యూలో అంచనా వేసుకోవచ్చు. అయితే ఆ అంచనా సమగ్రం కాకపోవచ్చు. ఆయన వాక్ఝురినంతా పట్టి మీ ముందుంచగల సమర్థత నాకు లేదేమోనన్న అనుమానమూ వుంది. ఆయన ఇంటర్వ్యూని ఇక చదవండి.

ప్ర : పత్రికల్లో నాటికీ, నేటికీ విలువలపరంగా మార్పులేమైనా వచ్చాయా ?

జ : వచ్చాయి. ఒకప్పుడు ఎడిటర్‌దే పైచేయి. ఎడిటోరియలే ప్రాణం. ఇప్పుడు యజమానిదే పైచేయి. ఎడిటోరియల్ కూడా సెకండరీ అయిపోయింది. ఈ రోజుల్లో పూర్వంలా ఎడిటోరియల్ చదవటం లేదు. పత్రిక పాలసీ సైతం ఈ రోజుల్లో ఎడిటోరియల్‌ని బట్టి నిర్ధారించలేం. వార్తలను బట్టి, వార్తలు ఇస్తున్న తీరునుబట్టి మాత్రమే పాలసీని నిర్ణయించాలి. ఎడిటోరియల్ ఈ రోజుల్లో అలంకారప్రాయంగా మారింది. స్వాతంత్రోద్యమ రోజుల్లో సంపాదకీయాలు ప్రజల్ని ఉత్తేజపరిచాయి. వాళ్లని నడిపించాయి. పూర్వం యుద్ధాల్లో డాలూ, కత్తి ఉపయోగించారు. ఇప్పుడు వాటిని వాడటం లేదు. అలాగని చెప్పి వాటిని పారేశామా ? లేదే ! డాలూ, కత్తి అలంకారంగా డ్రాయింగ్

రూమ్‌కు చేరింది. అలాగే ఇప్పుడు పత్రికల్లో ఎడిటోరియల్స్ కూడా. అవి అలంకారప్రాయంగా మిగిలి ఉన్నాయి. నిజానికిప్పుడు పత్రికకు ఎడిటర్ అనే వాడు ఆరో వేలులాంటివాడు. పత్రికల్లో వ్యాపారానుకూల పోకడలు వచ్చాయి. బహుముఖ లక్ష్యాల కనుగుణంగా వైరుధ్యమూ వుంది.

ప్ర: మంచి జర్నలిస్ట్‌కు మీరిచ్చే నిర్వచనం?

జ: ఏ పత్రికలో పనిచేస్తే ఆ పత్రిక పాలసీకి అనుగుణంగా నడచుకునేవాడే నా దృష్టిలో మంచి జర్నలిస్ట్.

ప్ర: ఈమధ్య మీరు అమెరికా వెళ్లి వచ్చారు. అక్కడి పత్రికలపై మీ అభిప్రాయం ఏమిటి?

జ: అమెరికన్ పత్రికల్లో ఇక్కడ లేని స్వాతంత్ర్యం వున్నట్లు కనిపిస్తోంది. ప్రభుత్వాన్ని అక్కడి పత్రికలు బాహాటంగా విమర్శిస్తున్నాయి. పరిశోధనాత్మక జర్నలిజం బాగా పెరిగింది. ఏదైనా అవినీతిని వెలికి తీయాలంటే ఫొటోలు, ఆధారాలతో సహా వెలికి లాగుతున్నారు. ఏదైనా ఓ కవరేజికి వెళ్లాలంటే ఆరేడు కెమేరాలు వేసుకుని కారులో రంగంలోకి దిగుతున్నారు. అంత నెట్ వర్క్, ఆర్థిక పరిపుష్టి మన దేశంలో ఎన్ని పత్రికలకు వుంది? అమెరికాలో జర్నలిస్ట్‌లకు సంస్థాపరమైన అండదండలు పూర్తిగా వున్నాయి. ఆ దేశంలో ఆర్థిక స్థిరత్వం వల్ల ఇది వీలయింది. మరి మన పత్రికల్లో పరిశోధనాత్మక జర్నలిజానికి అవకాశాలు తక్కువ. ఎవరేనా జర్నలిస్ట్ ఉత్సాహపడి ఏదైనా మంచి కథ తవ్వి వెలికితెస్తే అదెంతవరకూ ప్రచురణకు నోచుకుంటుందో చెప్పలేం. పత్రికా యజమానుల ఇష్టాఇష్టాలు, ఆయా పార్టీలతో వారి సంబంధాలతో అది ముడిపడి వుంది. ఇక్కడి జర్నలిస్ట్‌లను తక్కువ రేటుకు కొనేయవచ్చు. అమెరికాలో జర్నలిస్ట్‌లనూ కొనవచ్చు, కానీ రేటు బాగా పెట్టాల్సి వుంటుంది. కాస్తాకూస్తా మొత్తాలతో వాళ్ళను లోబరుచుకునే అవకాశాలు తక్కువ. ఈమధ్య అమెరికన్ టీ.వి. లో పోలీస్ శాఖ నిర్వాకం ఎండగడుతూ సీరియల్‌ని ప్లాన్ చేశారు. నాలుగయిదు వారాలు ప్రసారమైంది. ఆ కార్యక్రమాన్ని బేస్ చేసుకుని చాలామంది పోలీస్ అధికారులను సస్పెండ్ చేశారు. పోలీస్ శాఖలో ఆ కార్యక్రమం పెద్ద సంచలనమే సృష్టించింది. అయితే అర్ధాంతరంగా ఆ కార్యక్రమానికి గుడ్‌బై చెప్పారు. అక్కడా ఒత్తిడులు తప్పవు.

ప్ర: నాటికీ, నేటికీ కూడా మన పత్రికల్లో గ్రామీణ వార్తలకు అంతగా ప్రాధాన్యం ఇవ్వడం లేదు. దీనికి కారణా లేమిటి?

జ: నిజమే. గ్రామీణ వార్తలు చోటు చేసుకోవలసినంతగా చోటు చేసుకోవడం లేదు. దీనికి కారణాలనేకం ఉన్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో జరిగే సంచలన వార్తలే పత్రికల కెక్కుతున్నాయి. హత్యలు, మానభంగాలు వగైరా. మానభంగాల వంటి అకృత్యాలు కూడా పట్టణ ప్రాంతాల కంటే గ్రామీణ ప్రాంతాల్లోనే ఎక్కువ. కానీ అన్నీ రిపోర్ట్ కావటం లేదు. గ్రామీణ విలేకరి స్థానిక పెద్దను కాదని అతని అభీష్టానికి భిన్నంగా నడుచుకోలేని పరిస్థితులున్నాయి. కొన్ని వార్తలు వెలుగుచూడకపోవడానికి ఇదొక కారణం. గ్రామాల్లో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలన్నీ ప్రభుత్వపరంగా జరుగుతున్నవే తప్ప విస్తృత మార్గాల్లో జరగడం లేదు. ఇది మరో కారణం. పత్రికల సర్క్యులేషన్‌పరంగా చూసినా గ్రామాల్లో సర్క్యులేషన్, రీడర్‌షిప్ తక్కువ. గ్రామాల్లో ఒక్కో పత్రికను కనీసం ఇరవైమంది చదువుతున్నారు. పట్టణాల్లో ఈ రేటు తక్కువ. పత్రికలనేవి ఎడ్యుకేటివ్ కావు. అందుకే పట్టణ ప్రాంతాల్లో జరిగే తమాషా, సంభ్రమం గొలిపే వార్తలు, గ్రామీణ ప్రాంతాల్లో జరిగే దోపిడీలు, హత్యలు వగైరాలు మాత్రమే పత్రికల్లో స్థానం పొందుతున్నాయి. మరో లోపం ఏమంటే-గ్రామీణ వార్తలకు ఫాలో అప్ ఉండటం లేదు. రూరల్ ఎకానమి మారనంతవరకూ గ్రామీణ వార్తలు పత్రికలకు ఎక్కవు.

ప్ర: పత్రికల్లో రాజకీయ నాయకుల ప్రసంగాలే ప్రధానంగా చోటు నింపేస్తున్నాయి. ఆ ప్రసంగాలే వార్తలుగా చలామణి అవుతున్నాయి. ఈ ధోరణి మంచిదేనా? ప్రజలకు రాజకీయాలే కాక ఇతర సమస్య లనేకం వున్నాయి. పత్రికలు ఆ సమస్యలపై దృష్టి సారించడం లేదు ఎందుచేత?

జ: అసలు సిసలైన వార్తకు నిర్వచనం మారిపోయింది. నిజమైన వార్తను ప్రతివారూ అణచివేయ చూస్తున్నారు. ఒక రాజకీయ నాయకుడినో, మంత్రినో తీసుకోండి. ఆ పథకానికి ఇంత కేటాయించాం, అంత కేటాయించాం అని విలేకరులను పిల్చి చెప్తాడు. ఇది ఓ తరహా ప్రభుత్వ ఎడ్వర్‌టైజ్‌మెంట్. ఆ కేటాయించింది ఎంత సక్రమంగా ఖర్చు అయింది. దానివల్ల ఎంతమందికి లబ్ధి చేకూరింది ఆ మంత్రిగారు తర్వాత చెప్పరు, నిజమైన న్యూస్ అదే. కానీ దాన్ని అణచేస్తున్నారు. ఆర్థిక నేరాలు, వైట్‌కాలర్ నేరాలు అంటుకోడానికి వీల్లేదు. బ్లూ కాలర్‌డ్ నేరాల్ని రాసుకోవచ్చు. ఈ పరిస్థితుల్లో పేపర్ ఎలా నింపాలి రాజకీయ ప్రసంగాలే మరి పత్రికలకు గతి.

ప్ర: మీ దృష్టిలో ఆదర్శ పత్రిక ఎలా వుండాలి?

జ: ఆదర్శాలకు అనువైన భౌతిక వాతావరణం అవసరం. సర్వతో ముఖ ఆర్థికాభివృద్ధి జరిగి అక్షరాస్యత పెరిగితే గానీ ఆదర్శపత్రికలు ఆవిర్భవించవు. రాజకీయ వ్యవస్థలో అవినీతికి ఆస్కారం లేనపుడు మాత్రమే ఆదర్శ పత్రికలు పుడతాయి. తిక్కన మార్క్సిస్ట్ అయితే బావుండును అని చెప్పడం లాంటిదే ఆదర్శ పత్రికల వూహ కూడా.

ప్ర: జర్నలిస్ట్ కరివేప లాంటివాడు. సువాసనకు కరివేపలానే, జర్నలిస్ట్‌నూ అందరూ అవసరానికి వాడతారు. తీరా తినవచ్చేసరికి కరివేపనూ, మేలు చేయవచ్చేసరికి జర్నలిస్టునూ పక్కన పెడతారు. మీ కామెంట్?

జ: ఇది అక్షరసత్యం. జర్నలిస్ట్ కరివేప అయితే, కవులు కొత్తిమీర. వార్తలు కూడా కొత్తిమీరే. కరివేపే నయం. ఎండినా వాసన వస్తుంది. జర్నలిస్ట్ ఎండినా అతడితో అవసరం వుంటుంది.

ప్ర: ప్రజల పత్రిక అంటే ఏమిటి? ఏది ప్రజల పత్రిక?

జ: అసలు ప్రజలంటే ఎవరు? ఎన్టీఆర్ ప్రజా? రాజీవ్ ప్రజా? శీనయ్య ప్రజా? నామవాచకం లేనివాడే ప్రజ. సామాన్యంగా ఎక్కువగా కష్టపడేవాడు ప్రజ. తాజ్‌మహల్‌కు రాళ్ళెత్తిన కూలీలు ప్రజ. పేరు లేకుండా వుండేవాడు ప్రజ. ప్రజలంటే బ్రహ్మపదార్థం. ప్రజల పత్రిక కూడా ఇలాగే బ్రహ్మపదార్థం.

ప్ర: తెలుగు జర్నలిజంలో ఏవైనా మార్పులు వస్తాయని ఊహిస్తున్నారా?

జ: మార్పులు రాకతప్పదు. ఆర్థికాభివృద్ధితో ప్రజల అభిరుచులు మారతాయి. ఆశించేవి (ఎక్స్‌పెక్టేషన్స్) మారతాయి. వాటిని అందుకోవాలి. వాటికి అనుకూలంగా మారాలి. పత్రికల్లో మార్పు ఎలా వస్తుందనేది ప్రజలు ఆశించేదానిపై ఆధారపడి వుంది.

ప్ర: మీ నేతృత్వంలో ఎంతమంది జర్నలిస్టులు కాగలిగారు.

జ: 1943లో మీజాన్‌లో జి. కృష్ణకు ట్రైనింగ్ ఇచ్చా. అతడిని నా తొలి విద్యార్థిగా చెప్పుకోవచ్చు. సంఖ్య ఇందరూ అని చెప్పలేను. ఇప్పటికీ ట్రైనింగ్ కావాలని అడిగితే ఇస్తూనే ఉన్నాను.

ప్ర: పత్రికలు భాషను స్థిరీకరిస్తాయా?

జ: భాషను పత్రికలు స్థిరీకరించవు. భాషను అభివృద్ధి చేస్తాయి. భాషను నిర్ధారించేది జర్నలిస్ట్. ఒక సంఘటనలో ఓ పదం అవసరం ఏర్పడుతుంది. ఏదో ఓ మాట ఖాయం చేయాలి. తన పరిజ్ఞానం మేరకు జర్నలిస్ట్ ఓ మాటను ఖాయం చేస్తాడు. దాని మంచి చెడ్డలతో పనిలేకుండా ఆ మాట ప్రచారంలోకి వచ్చేస్తుంది మన పత్రికల్లో మొదట్లో ఉభయ భాషా ప్రవీణులు (తెలుగు, సంస్కృతం) వుండేవారు. వారే పదాలను ఖాయం చేసేవారు. వాటి మూలార్థం ఏదైనా అవి కొన్నిటికి సంకేతాలుగా రూఢి అయ్యాయి. పత్రికల్లో స్వస్తి చెప్పారు, త్రోసిపుచ్చారు, ఉద్వాసన చెప్పారు అని వాడుతుంటారు. ఇదంతా వైదిక పరిభాష. స్వస్తి అంటే మేలు కలుగుగాక అని అర్థం. ఉద్వాసం అంటే పూజాది కార్యక్రమాలు అయ్యాక కింద అడ్డం లేకుండా దేవుడిని పైకి పెట్టడం, త్రోసిరాజు-ఇది చదరంగంలో ఆటకట్టుకు సంకేతం. ఇప్పుడిప్పుడు రైతు పరిభాష కూడా వస్తోంది.

ప్ర: వ్యవహారిక భాషకు ప్రామాణికం ఏమిటి?

జ: కమ్యూనికేట్ చేయడమే భాష మౌలిక ధ్యేయం. కమ్యూనికేషన్‌లో స్థాయిలు ఉండవచ్చు. కమ్యూనికేట్ అయితే అది ప్రామాణికం. కానిది అప్రమాణికం.

ప్ర: పత్రికా భాషకు, ప్రజా భాషకు ఉన్న సంబంధం ఎటువంటిది?

జ: పత్రికా భాషను ప్రజ్ఞా భాష అనవచ్చు. అయితే ప్రజలు మాట్లాడే దాన్ని యధాతథంగా పత్రికలకు ఎక్కిస్తే ఆ భాషను వాడే ప్రజలే అందుకు అభ్యంతరం చెప్పచ్చు. ఆర్థికాభివృద్ధితో ఎల్లలు చెరిగిపోతాయి. అప్పుడు భాషా అభివృద్ధి చెందుతుంది. అన్ని మాండలికాలు అంతటా ప్రచారంలోకి వస్తాయి. కనీసం ఒక మాండలికాన్ని మరో ప్రాంతంవారు అర్థం చేసుకోగలిగిన అవసరం, అవకాశం ఏర్పడతాయి.

ప్ర: మీరు అభిమానించే రాజకీయవేత్త, జర్నలిస్ట్,కార్టూనిస్ట్‌లు ఎవరు?

జ: ఏ రాజకీయవేత్తనూ అభిమానించడం లేదు. కొందరిలో కొన్ని ప్లస్ పాయింట్లుంటాయి. కొన్ని మైనస్ పాయింట్లుంటాయి. ఆ ప్లస్ పాయింట్ వరకూ ఇష్టపడతాను. లైన్స్, భావాలదృష్ట్యా కార్టూనిస్ట్‌లలో ఆర్.కె. లక్ష్మణ్ అంటే ఇష్టం. జర్నలిస్ట్‌లలో ఇష్టపడే వారెవరూ లేరు.

ప్ర: తెలుగు పాఠకుల స్థాయి ఎలా వుంది?

జ; మనకు గ్రామీణ సంస్కృతి తప్ప పట్టణ సంస్కృతి లేదు. రాజకీయ నాయకులు కూడా గ్రామీణ సంస్కృతిలోంచి వచ్చినవారే .... పట్న భావాలు మనకు లేవు. పట్నజీవితం మనకు లేదు. హైదరాబాద్ పట్టణమే అయినా అది తెలుగు పట్నం కాదు. ఇతర రాష్ట్రాలవారికి పట్టణ సంస్కృతి వుంది. తమవి అని చెప్పుకోదగ్గ పట్టణాలు వారికి ఉన్నాయి. గంతకు తగిన బొంతలా పాఠకులకు తగినట్లే పత్రికలూ వున్నాయి.

ప్ర: ఇప్పటి పత్రికల్లో కార్టూన్లపై మీ అభిప్రాయం.

జ: పత్రికలకు కార్టూన్లు తప్పనిసరి అన్న భావన ఏర్పడింది. దీని వల్ల కార్టూనిస్టులు కూడా బతగ్గలుగుతున్నారు.

ప్ర: మన కార్టూనిస్టులకు మంచి టేస్ట్ ఉన్నదంటారా?

జ: కార్టూనిస్ట్‌కి న్యూస్ ఎడిటర్ స్థాయిలో పరిజ్ఞానం వుండాలి. అవగాహన శక్తి ఉండాలి మరి మన కార్టూనిస్టులలో న్యూస్ ఎడిటర్ హోదా ఎందరికుంది? హోదానిబట్టి జీతం, ఆ జీతాన్నిబట్టి టేస్ట్ డెవలప్ అవుతాయి.

ప్ర: పొలిటికల్ కార్టూన్‌కు మీరిచ్చే నిర్వచనం?

జ: పొలిటికల్ కార్టూన్‌లో ఎవరినయినా విమర్శించవచ్చు. ఏదో కక్ష కొద్దీ ఎద్దేవా చేస్తున్నట్లు కార్టూన్ ఉండకూడదు.

ప్ర: కార్టూన్లను రాజకీయనాయకులు ఎలా రిసీవ్ చేసుకోవాలి?

జ: కార్టూన్లను సరిగా రిసీవ్ చేసుకోలేక పోతే ప్రజా జీవనంలో వుండే అర్హత ఆ రాజకీయ వేత్తకు లేనట్లే. హాస్యం కూడా ఓ కళే కనుక రసికుడైన రాజకీయ వేత్త తనపై వేసిన కార్టూన్ చూసి సంతోషిస్తాడు.

ప్ర: కుర్ర కార్టూనిస్టులకు మీరిచ్చే సలహా?

జ: ఏ కార్టూనిస్ట్ కయినా, ఏరచయిత కయినా ఎలా రాయాలో చెప్పడం భావ్యంకాదు. కార్టూన్ థీమ్ చెప్పచ్చు. ఎలాగియాలో, ఏ ఫక్కీలో హాస్యం ఒలికించాలో ఆలోచించాల్సింది కార్టూనిస్ట్.

ప్ర: కార్టూనిస్ట్‌కి రాజకీయ పునాది, నిబద్ధత అవసరమా?

జ: రాజకీయ పునాది అవసరమే. నిబద్ధత అర్థంలేని మాట. ఇన్వాల్వ్‌మెంట్ కలిస్తేనే నిబద్ధతకు అర్థం. నిష్పక్షపాతి అంటూ ఎవడూ వుండడు. తను ఏ పక్షం అన్న స్పృహ కారూనిష్టకి వుండాలి.

ప్ర : సమకాలీన తెలుగు కార్టూనిస్ట్‌లను గురించి చెప్పండి.

జ : కొందరివి లైన్లు బావుంటాయి. కొందరు సబ్జెక్ట్ బాగా డీల్ చేస్తారు. కార్టూన్ లక్షణాలు తక్కువైనా బాపూ లైన్ బ్రహ్మాండం. మోహన్‌కి పక్షపాతంవుంది. అతనికి రాజకీయాలు ఎక్కువ తెలుసు.

ప్ర : ఈనాటి రాజకీయాలు ఎలా ఉన్నాయి ?

జ : వివిధ ఆర్థిక వర్గాల ప్రయోజనాలకు పాకులాడే యునైటెడ్ ఫ్రంట్‌గా రాజకీయ పార్టీలను పేర్కొనవచ్చు. అధికారం ఒక్కటే. 'బైండింగ్ ఫోర్స్' అయింది.

ప్ర : కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చే అవకాశాలున్నాయా ?

జ : ముందు కమ్యూనిస్టులు ఐక్యం కావాలి. నిజాయితీగల ఇతర ప్రజాస్వామిక పార్టీలను కలుపుకురావాలి. ఏ మేరకు కలుస్తారన్నది కాలమే తేల్చాలి. ఇవన్నీ జరిగితే అధికారం మాట.

ప్ర : నక్సలైట్ల హింసపై మీ అభిప్రాయం ?

జ : వాళ్లు మొదట్లో జెన్యున్ కాజ్ కోసమే వచ్చారు. రాను రానూ పరిస్థితి మారిపోయింది.

ప్ర : ఎన్టీఆర్ పాలనలో కళాకారులకు ప్రోత్సాహం లేదంటున్నారు. మీ కామెంట్ ?

జ : కళాకారుడు అధికారంలోకి వచ్చినా కళాకారులకు ఏంచేయలేడు. రైతు బిడ్డ పదవిలోకి వస్తే రైతులకు ఒరగ పెట్టేదేమి ఉండదు. ఒకళ్ళిద్దరు మినహా రాష్ట్రాన్ని రైతుబిడ్డలే పాలించారు. ఏం ఒరిగింది ?

ప్ర : పుస్తకాభిరుచి ఎలా పెంచుకోవచ్చు ?

జ : వినియోగ విలువ (యుటిలిటీ వాల్యూ) తెలుసుకోవాలి. తెలుసుకున్న విద్యను వినియోగించాలి. లేపోతే ఆసక్తి చచ్చిపోతుంది.

ప్ర ; మీరేమైనా పుస్తకాలు ప్లాన్ చేస్తున్నారా ?

జ : రెండు పుస్తకాలు రాయాలనుకుంటున్నాను. సమాజ పరిణామం మీద రాస్తాను. వేదకాలంనుంచి ప్రస్తుత కాలంవరకు తీసుకుని భారతీయ సమాజానికి ప్రాధాన్యం ఇస్తూ పరిణామక్రమం చెప్పాలని వుంది. ఇక 'అభ్యుదయ సాహిత్య మీమాంస' పై దృష్టి సారిస్తాను. సమాజం అంటే ఏమిటి ? ప్రజలంటే ఏమిటి ? సాహిత్యం అంటే ఏమిటి ? పురాణాలు ఏమిటి....అభ్యుదయ సాహిత్యం ఏది ? వగైరా అంశాలను ఇందులో చర్చిస్తా.

# ట్రెండ్ సెట్టర్ రామోజీరావు



ఏ ప్రజా ఉద్యమాలో, ఏ స్వాతంత్ర్య పోరాటాలో సాగుతుంటే, పత్రికల పని నల్లేరు మీద బండిలా సాగిపోతుంది. ఆ ప్రవాహంలో ఆ ఊపులో నిలదొక్కుకోవచ్చు.

కానీ అప్పట్లో పరిస్థితి అలా లేదు. నిద్రాణంగా ఉంది. స్తబ్దంగా ఉంది. ఉన్న పత్రికలు ఉండగా ఇంకా కొత్త పత్రికలు ఎవరు కొంటారులే అని నీరసం వ్యక్తమయ్యే రోజులవి. ఆ దశలో విశాఖపట్టణం నుంచి కేవలం అయిదు వేల సర్క్యులేషన్‌తో ‘ఈనాడు’ దినపత్రిక ప్రారంభమైంది. చిన్న పాయలా మొదలిడి సెలయేరుగా పుంజుకుని మహాసాగరంగా అనతికాలంలోనే రూపొంది మొత్తం పత్రికారంగంలో అగ్రస్థాయిలో నిలుస్తుందని ఆనాడెవరూ ఊహించలేదు.

కానీ అలా ఊహించిన వ్యక్తి ఒకరున్నారు. ఆయనే రామోజీరావు. రామోజీరావుకు ‘ఈనాడు’ నాటికీ నేటికీ మానస పుత్రికే. తెలుగు జర్నలిజానికి వేడి పుట్టించి, గూడ్సులా సాగుతున్న జర్నలిజం బండికి సూపర్ స్పీడ్‌ను అందించిన ఘనత రామోజీరావుకే దక్కుతుంది. ‘ఈనాడు’ ఆవిర్భవించక ముందు ‘ఆంధ్ర’ అనే పదంలేని పత్రికే లేదు. దానికి భిన్నంగా వెల్వడిన ఈనాడు ఎన్నో ప్రయోగాలు చేసింది. విశాలాంధ్ర తర్వాత ఇటీవలి కాలంలో కార్టూన్ ప్రాముఖ్యాన్ని, ప్రాచుర్యాన్ని పెంచిన పత్రికగా ‘ఈనాడు’ని చెప్పుకోవచ్చు.

రామోజీరావు ‘ఈనాడు’ను వ్యాపారంగా చూడలేదు. పార్టీ బంధాలు, ప్రాముఖ్యాల కంటే పాఠకుల ప్రయోజనాలు, ఆసక్తికే ఆయన ప్రాధాన్యం ఇచ్చారు. ఇస్తూనే ఉన్నారు. పలురకాల వ్యాపకాలున్నా తన సమయంలో అత్యధిక భాగాన్ని ‘ఈనాడు’కే అంకితం చేస్తున్నారాయన. రామోజీరావు

మాటల్లోనే చెప్పాలంటే, "కొందరికి మందు కిక్కు, కొందరికి డబ్బు సంపాదన కిక్కు. డబ్బు సంపాదించాలన్న తాపత్రయం నాకిప్పుడు లేదు. ఈనాడు నిత్యం బాగా వస్తేనే నాకు కిక్కు".

ఈనాడు తెలుగువారి లోగిళ్లలో నిలవడానికి, అగ్రగామి దినపత్రికగా తీర్చిదిద్దడానికి ఆయన ఎంతో శ్రమించారు. నమ్మిన మంచి కోసం ఎన్నో క్లేశాలను చిర్నవ్వుతో అధిగమించారు.

ఒక మారుమూల గ్రామంలో కేవలం ఒక్క కాపీ సర్క్యులేషన్ ఉన్నప్పటికీ ఆ ఒక్క కాపీ కోసం విపరీత ఖర్చుతో ప్రత్యేక ఏర్పాట్లు చేసి పత్రిక అందేట్లు చూశారు. సినిమాల ఎడ్వర్టయిజ్‌మెంట్ల విషయంలో సైతం ఆయన రాజీలేని పోరాటం సాగించారు. ఒకప్పుడు సినిమాల ఎడ్వర్టయిజ్‌మెంట్లను 'అరువు'మీదనే అచ్చొత్తేవి పత్రికలన్నీ. సినిమా బాగా ఆడితే వాటికి డబ్బులు వచ్చేవి. లేకుంటే లేదు. నిర్మాతలందరూ ఈ ధోరణిలో వ్యవహరించారని అనలేం గానీ మొత్తంమీద పరిస్థితి అదే. పైగా సినిమా ఎడ్వర్‌టైజ్‌మెంట్ ఇచ్చాం గదా! మా సినిమా గురించి సమీక్ష రాయండి అనే ఒత్తిళ్లు ఒకటి.

'ముందు పైకం చెల్లిస్తేనే వ్యాపార ప్రకటనలు స్వీకరించేది' అనే విధానాన్ని రామోజీరావు చేపట్టారు. దీంతో మొదట్లో సినిమా ఎడ్వర్‌టైజ్‌మెంట్లు పూర్తిగా బందయ్యాయి. అయినా రామోజీరావు బెంగపడలేదు. ఇప్పుడిప్పుడు సినిమా ప్రకటనలూ పుంజుకున్నాయి.

దినపత్రికలో ఎన్ని శాఖలుంటాయో అన్నిట్లో ప్రత్యేకత, ప్రావీణ్యత కోసం కృషి చేయడం రామోజీరావులోని మరో విలక్షణత. పత్రిక పంపిణీకి మార్కెటింగ్ సంస్థ, వాణిజ్య ప్రకటనలకు ప్రత్యేకంగా కిరణ్ యాడ్స్ (ఈ సంస్థ ఈనాడుకు మాత్రమే వ్యాపార ప్రకటనలు అందించటానికి ఉద్దేశించ లేదు) వంటివి ఈ కోవలోనివే.

సర్క్యులేషన్ నష్టపోయినా పర్లేదు 'తారా బలాలు'వంటి శీర్షికలు ఇవ్వ కూడదని ఆయన నిర్ణయం తీసుకుని ఈనాటికీ దాన్ని అమలు చేస్తున్నారు. భాషా పత్రికల్లో దేశంలో ఒక్క మళయాళ మనోరమ, ఈనాడులకు మాత్రమే ఫాక్స్‌మిలి సౌలభ్యం ఉంది. ఖర్చుకు వెనకాడనితనం, ఆధునిక పరిజ్ఞానం ద్వారా పాఠకులకు సత్వరం తాజా వార్తలు అందించాలన్న తపన ఫలితమే ఈ ఫాక్స్‌మిలి.

తన నమ్మకాలు, తన స్వీయ అభిప్రాయాలు ఎలా వున్నా వార్త విషయంలో రామోజీరావు రాజీ పడలేదు. ఫలానా వార్త ప్రచురించవద్దని తన సహచర సిబ్బందిని ఏనాడూ కోరలేదు. తనకు వ్యక్తిగతంగా ప్రతికూలంగా ఉన్న వార్తలు సైతం 'ఈనాడు'లో ప్రచురితమైన సందర్భాలు అనేకం.

రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ అధికారంలో ఉన్నప్పుడు ప్రత్యేకించి చెన్నారెడ్డి హయాంలో అవినీతి విశృంఖల విహారం చేసింది. రాష్ట్ర రాజకీయాల్లో మార్పును కోరుకున్నారు రామోజీరావుకు. కాంగ్రెస్‌కు బలమైన ప్రత్యామ్నాయం అవసరమని భావించారు. ఓ దశలో సొంతంగా ఓ పార్టీ స్థాపించాలనే ఆలోచనా వచ్చింది. అంతలోకే ఎన్. టి. రామారావు రాజకీయ రంగ ప్రవేశం చేశారు. సినీనటుడిగా రామారావు ప్రజల్లో పలుకుబడి వున్నందున ఆయనను ప్రోత్సహించాలని సంకల్పించి ఎన్.టి.ఆర్. కు విశేష ప్రచారాన్ని పత్రికద్వారా ఇచ్చారు. తర్వాతర్వాత ఎన్టీఆర్ ప్రభుత్వం గాడి తప్పుతున్నప్పుడల్లా సంపాదకీయాల ద్వారా చురకలు వేస్తూ హెచ్చరించడంలో రామోజీరావు సంశయించడం లేదు.

రాజకీయ పదవులపై రామోజీరావుకు మోజు లేదు, మొగ్గు లేదు. రాజకీయాలా ? జర్నలిజమా అన్న మీమాంస వస్తే ఆయన జర్నలిజానికే పట్టం గట్టారు.

"రామోజీరావు కేమయ్యా ? ఆయన పట్టిందల్లా బంగారమే' అని చాలా మంది వ్యాఖ్యానిస్తారు.

రామోజీరావు విజయాల వెనక కఠోర పరిశ్రమ ఉంది. ఆయన తెల్లవారుఝామునే లేస్తారు. పత్రికలు చదువుతారు. రోజూ ఆఫీసులో పరిశ్రమిస్తారు. వందల సంఖ్యలో దేశ విదేశీ పత్రికలను తిరగేస్తారు. ప్రపంచవ్యాప్తంగా పత్రికారంగంలో వస్తున్న పోకడలను ఆకళింపు చేసుకుంటారు. రామోజీరావు ఎడిటర్స్ గిల్డ్ అధ్యక్షుడిగా కూడా ఉన్నారు. వ్యాపకాలు, వ్యావృత్తులు ఎన్ని ఉన్నా ఆయన ధ్యాసంతా 'ఈనాడు' మీదే. ఆయన తపనంతా 'ఈనాడు' కోసమే.

ఆధునిక తెలుగు జర్నలిజాన్ని కొత్త మలుపు తిప్పిన సాహసి రామోజీరావు. ఆయన ఓ ట్రెండ్ సెట్టర్.

---

## చదువరి

జర్నలిస్ట్ అన్నవాడు కనిపించిన ప్రతి రిపోర్టూ చదవాలి. ఇందువల్ల ఎదుటివారు ఎలా రాస్తున్నారో తెలుస్తుంది. వారి తప్పులేమిటో తెలుస్తాయి. ప్రత్యేకతలేమిటో గుర్తించ వీలవుతుంది. ఆ తప్పులను పరిహరించుకుని, ఆ ప్రత్యేకతలను పుణికి పుచ్చుకోవడానికి ఇది బాగా ఉపకరిస్తుంది.

మాటల్లోనే చెప్పాలంటే, "కొందరికి మందు కిక్కు, కొందరికి డబ్బు సంపాదన కిక్కు. డబ్బు సంపాదించాలన్న తాపత్రయం నాకిప్పుడు లేదు. ఈనాడు నిత్యం బాగా వస్తేనే నాకు కిక్కు".

ఈనాడు తెలుగువారి లోగిళ్లలో నిలవడానికి, అగ్రగామి దినపత్రికగా తీర్చిదిద్దడానికి ఆయన ఎంతో శ్రమించారు. నమ్మిన మంచి కోసం ఎన్నో క్లేశాలను చిర్నవ్వుతో అధిగమించారు.

ఒక మారుమూల గ్రామంలో కేవలం ఒక్క కాపీ సర్క్యులేషన్ ఉన్నప్పటికీ ఆ ఒక్క కాపీ కోసం విపరీత ఖర్చుతో ప్రత్యేక ఏర్పాట్లు చేసి పత్రిక అందేట్లు చూశారు. సినిమాల ఎడ్వర్టయిజ్‌మెంట్ల విషయంలో సైతం ఆయన రాజీలేని పోరాటం సాగించారు. ఒకప్పుడు సినిమాల ఎడ్వర్టయిజ్‌మెంట్లను 'అరువు'మీదనే అచ్చొత్తేవి పత్రికలన్నీ. సినిమా బాగా ఆడితే వాటికి డబ్బులు వచ్చేవి. లేకుంటే లేదు. నిర్మాతలందరూ ఈ ధోరణిలో వ్యవహరించారని అనలేం గానీ మొత్తంమీద పరిస్థితి అదే. పైగా సినిమా ఎడ్వర్‌టైజ్‌మెంట్ ఇచ్చాం గదా! మా సినిమా గురించి సమీక్ష రాయండి అనే ఒత్తిళ్లు ఒకటి.

'ముందు పైకం చెల్లిస్తేనే వ్యాపార ప్రకటనలు స్వీకరించేది' అనే విధానాన్ని రామోజీరావు చేపట్టారు. దీంతో మొదట్లో సినిమా ఎడ్వర్‌టైజ్‌మెంట్లు పూర్తిగా బందయ్యాయి. అయినా రామోజీరావు బెంగపడలేదు. ఇప్పుడిప్పుడు సినిమా ప్రకటనలూ పుంజుకున్నాయి.

దినపత్రికలో ఎన్ని శాఖలుంటాయో అన్నిట్లో ప్రత్యేకత, ప్రావీణ్యత కోసం కృషి చేయడం రామోజీరావులోని మరో విలక్షణత. పత్రిక పంపిణీకి మార్కెటింగ్ సంస్థ, వాణిజ్య ప్రకటనలకు ప్రత్యేకంగా కిరణ్ యాడ్స్ (ఈ సంస్థ ఈనాడుకు మాత్రమే వ్యాపార ప్రకటనలు అందించటానికి ఉద్దేశించ లేదు) వంటివి ఈ కోవలోనివే.

సర్క్యులేషన్ నష్టపోయినా పర్లేదు 'తారా బలాలు'వంటి శీర్షికలు ఇవ్వ కూడదని ఆయన నిర్ణయం తీసుకుని ఈనాటికీ దాన్ని అమలు చేస్తున్నారు. భాషా పత్రికల్లో దేశంలో ఒక్క మళయాళ మనోరమ, ఈనాడులకు మాత్రమే ఫాక్స్‌మిలి సౌలభ్యం ఉంది. ఖర్చుకు వెనకాడనితనం, ఆధునిక పరిజ్ఞానం ద్వారా పాఠకులకు సత్వరం తాజా వార్తలు అందించాలన్న తపన ఫలితమే ఈ ఫాక్స్‌మిలి.

తన నమ్మకాలు, తన స్వీయ అభిప్రాయాలు ఎలా వున్నా వార్త విషయంలో రామోజీరావు రాజీ పడలేదు. ఫలానా వార్త ప్రచురించవద్దని తన సహచర సిబ్బందిని ఏనాడూ కోరలేదు. తనకు వ్యక్తిగతంగా ప్రతికూలంగా ఉన్న వార్తలు సైతం 'ఈనాడు'లో ప్రచురితమైన సందర్భాలు అనేకం.

పత్రికలు నిర్వహించి తీరాల్సిన ఈ బృహత్తర పాత్రను అధికారంలో ఉన్న వాళ్లు అర్థం చేసుకోలేకపోతున్నారు. అవినీతి, బంధుప్రీతి, అధికార దుర్విని యోగం వంటి అక్రమాలను రచ్చకీడ్చి తమ అసలు రంగును రట్టుచేసిన పత్రి కలమీద అటు కేంద్రంలోనూ, ఇటు రాష్ట్రాలలోనూ అధికారంలో ఉన్నవారు మూడోకన్ను తెరచి మట్టుపెట్టడానికి అనేక సందర్భాల్లో ప్రయత్నించారు, ప్రయత్నిస్తున్నారు. పలుకుబడి, పవరు ఉన్నవారు ఎక్కడ ఆగ్రహిస్తారోనన్న భయంతో నొప్పించక, తానొవ్వక తప్పించుకునే పత్రికలూ ఉన్నాయి. పర్యవసానాలకు వెరవకుండా కర్తవ్యదీక్షతో అప్రియ సత్యాలను బైటపెట్టి సాధింపులు, వేధింపుల రంపపుకోతకు గురవుతున్న పత్రికలూ ఉన్నాయి. ఇది ఆకస్మికంగా దాపురించిన పరిణామం కాదు. ఒక్కరోజులో తాలిగేదీ కాదు. ఇదొక కంటిన్యుయస్ ప్రాసెస్.

ప్ర : పత్రికాస్వేచ్ఛ వ్యాపార ప్రయోజనాల స్వేచ్ఛగా మారిందన్న విమర్శ ఉంది. ఈ విషయంలో మీ అభిప్రాయమేమిటి ?

జ : మీరన్నట్టు పత్రికాస్వేచ్ఛ వ్యాపార ప్రయోజనాల సంరక్షణ సేచ్ఛగా మారిందన్న విమర్శ ఉంది. మనుషుల్లోలాగే పత్రికల్లోనూ ఎన్నో రకాల ధోరణులు, ఎన్నోరకాల పోకడలు సహజంగా ఉంటాయి. పత్రికా నిర్వహణ అనేది అత్యున్నత విలువలకు కట్టుబడి ప్రజా ప్రయోజనాలే పర మావధిగా అసిధారావ్రతంలా సాగించాల్సిన గురుతర బాధ్యత - ఈ విశాల దృష్టి కొరవడినప్పుడు పత్రికాస్వేచ్ఛ స్వార్థప్రయోజనాలకోసం దుర్వినియోగం అయ్యే అవకాశం ఉంది. నిజానికి ఇప్పుడలా దుర్వినియోగం అవుతున్నది కూడా. అది యాజమాన్యం వ్యాపార స్వార్థంకోసం కావచ్చు. పత్రికలో పని చేసే వ్యక్తుల స్వార్థానికి ఈ దుర్వినియోగం జరగొచ్చు.

పత్రికల ద్వారా "తెలుసుకునే హక్కు" గురించి పాఠకులు, ప్రజలు ఎంతగా చైతన్యవంతులైతే, వృత్తిధర్మం పట్ల పత్రికారంగంలో పనిచేసేవారి నిబద్ధత ఏ మేరకు పెరిగితే ఆ మేరకు పత్రికాస్వేచ్ఛ పదిలంగా ఉంటుంది.

ప్ర : ఇటీవలి కాలంలో తెలుగులో కొత్త పత్రికలు వచ్చాయి. పాత పత్రికలు విస్తరిస్తున్నాయి అనారోగ్య పోటీ కూడా పెరిగింది. ఇది ఏ పోకడ లకు దారితీస్తుంది ? ఇది మంచి పరిణామమేనా ?

జ : పోటీ అనేది ఆరోగ్యకరమైందయితే సర్వత్రా అభిలషణీయమే.... పత్రికల్లో కూడా. దానివల్ల పత్రికల స్థాయి, ప్రమాణాలు పెరుగుతాయి. విశాల ప్రజా ప్రయోజనాలకూ అలాంటి పోటీ తోడ్పడుతుంది. అలాగే అనా

రోగ్యకరమైన పోటీ తాత్కాలికంగా ఎవరికైనా ఉపయోగపడవచ్చేమో తప్ప దీర్ఘకాలంలో అందరికీ హాని తప్పదు.

ప్ర: దేశంలో ఏ భాషా పత్రికల్లో తలెత్తని రంగుల పోటీ తెలుగు పత్రికల్లో ప్రబలింది. ఉత్తరాది పత్రికలు రంగులు లేకుండానే వార్తలు, ఫొటోలు ఇస్తున్నాయి. తెలుగు పత్రికల్లోనే ఎందుకీ రంగుల యుద్ధం మొదలైంది? రంగులు వాంఛనీయమేనా?

జ: నలుపు తెలుపు సినిమాల స్థానే రంగుల చిత్రాలు వచ్చినట్టే పత్రికారంగంలోనూ రంగులశకం మొదలైంది. ఇందులో అభ్యంతరకరమైనదీ, ఆందోళన చెందాల్సింది ఏమీలేదు. పత్రికల పరిణామక్రమంలో ఇదీ ఒక భాగం. పత్రికా ముద్రణలో నూటయాభై ఏళ్ల కిందటి పురాతన పద్ధతులకూ నేటి అధునాతన సాంకేతిక హంగులకూ మధ్య ఈగకూ ఏనుగకూ ఉన్నంత తేడా ఉంది. నిన్న మొన్నటివరకూ అక్షరాలను చేతితో కూర్చుకుని పత్రికలు ముద్రించేవారు. ఇప్పుడా పనిని అత్యాధునిక ఫోటోటైప్ యంత్రాలు అవలీలగా చేస్తున్నాయి. అలాగే పత్రికలు ఆఫ్‌సెట్ ప్రింటింగులోకి మారిందీ ఇటీవలే కదా! ఆ క్రమంలో భాగంగానే రంగులు వచ్చాయి. కలర్ ఫోటోలు మరింత సహజసిద్ధంగా ఉండటంవల్ల పాఠకుల ఆదరణను విశేషంగా పొందుతున్నాయి. ఇది సంతోషించాల్సిన పోటీయే తప్ప ఇక్కడేదో యుద్ధం జరుగుతోందన్న అభిప్రాయాన్ని నేను అంగీకరించను. ఇలాంటి మంచి పరిణామం మన దేశంలో ముందుగా తెలుగునాట మొదలైనందుకు నిజానికి మనమంతా సంతోషపడాలి. ఇవాళ కాకపోతే రేపైనా దేశం ఇతర ప్రాంతాల్లోని పత్రికలూ రంగుల మెరుగులు దిద్దుకోక తప్పదు.

ప్ర: 'ఈనాడు'లో శీర్షికలు న్యూస్‌ను చెప్పేవిగా కాకుండా అభిప్రాయాన్ని ప్రకటించేవిగా ఉంటున్నాయి. ఎందుచేత?

జ: అలా జనరలైజ్ చేయడం న్యాయం కాదు. వార్తా శీర్షిక వార్తలోని విషయాన్ని ప్రతిఫలించాలే తప్ప ఆ వార్త మంచి చెడ్డలమీద అక్కడికక్కడే తీర్పు చెప్పేవిగా ఉండకూడదన్నది ఈనాడు పాలసీ. అయితే ఆచరణలో అడపా దడపా పొరపాట్లు దొర్లుతుండవచ్చు. పత్రికను ఆకర్షణీయంగా తీర్చిదిద్దాలన్న తహతహలో మా సహచరులు అవసరానికి మించిన ఉత్సాహం కనపరుస్తూండవచ్చు. ఏమైనా మిగతా విషయాల్లోవలే శీర్షికల్లోనూ ఆబ్జెక్టివిటీ చెడకూడదనే మేము ముమ్మాటికీ కోరుతున్నాం.

ప్ర : ఈనాడులో గ్రామీణ వార్తల కోసం ప్రత్యేకించి ఓ పేజీ కేటాయించినా గ్రామీణ వార్తలు ఎన్నో ఇంకా వెలుగు చూడటం లేదు. చాలావరకు విజ్ఞప్తులు, డిమాండ్‌లు, పత్రికా ప్రకటనలు ఏవో చిన్నపాటి సమస్యలు మినహా సమగ్ర గ్రామీణ చిత్రణ కొరవడింది. సమగ్రంగా గ్రామీణ వార్తలు అందించే విషయంలో మీకెమైనా పథకాలు ఉన్నాయా?

జ : మీ స్టేట్‌మెంటు మరీ స్వీపింగ్‌గా ఉంది. జిల్లా వార్తలకు ప్రత్యేక స్థానాన్ని తెలుగు పత్రికా రంగంలో మొట్ట మొదట ఈనాడే కల్పించింది. ఈనాడులో ప్రచురిస్తున్నవి విజ్ఞప్తులు, డిమాండ్‌లు మాత్రమే కాదు. స్థానిక సమస్యలను గ్రామ సీమల అవసరాలను ఈనాడు విస్తృతంగా వెలుగులోకి తెస్తున్నది. తద్వారా ఆయా సమస్యల పరిష్కారానికి తన పరిధిలో తోడ్పడుతున్నది. గ్రామీణ జీవితాన్ని సమగ్రంగా ప్రతిఫలించాలనే మొదటి నుంచీ మా ప్రయత్నం. అయితే విషయ బాహుళ్యం దృష్ట్యా, వార్తా సేకరణలో, వార్తా ప్రచురణలో ఉన్న సాధక బాధకాల వల్ల ఆచరణలో అనేక ఇబ్బందులు ఎదురవుతాయి. ఉన్న పరిమితుల్లో వార్తల్ని ఇంకా సమగ్రంగా, ఇంకా సమర్థంగా అందించేందుకు ఈనాడు కృషి అనంతంగా సాగుతూనే ఉంటుంది.

ప్ర : పరిశోధనాత్మక జర్నలిజం ఇటీవలి కాలంలో 'ఈనాడు'లో బాగా తగ్గి పోయింది. దీనికి కారణం?

జ : మరేముంటుంది? ప్రయత్నలోపమే.

ప్ర : ఎన్టీఆర్ మంచి పాలన అందిస్తాడన్న ఆకాంక్షతో మీరు ఆయన్ని సమర్థిస్తూ వచ్చారు. ఎన్టీఆర్‌పై మీరు పెట్టుకున్న ఆశలు సఫలీకృతమయ్యాయా? మీ ప్రమాణాలకు దీటుగా పరిపాలన పరంగా ఎన్టీఆర్ ఎదగగలిగాడా?

జ : అనేకానేక సందర్భాల్లో ఎన్టీఆర్ పరిపాలన మంచిచెడ్డలను సమీక్షిస్తూ ఈనాడు రాసిన సంపాదకీయాలే మీ ప్రశ్నకు సమాధానం.

ప్ర : ఎడిటర్స్ గిల్డ్ కార్యకలాపాలు? మీ సారథ్యంలో గిల్డ్ వేసిన ముందడుగు?

జ : ఎడిటర్స్‌గిల్డ్ పత్రికా రంగం విశాల ప్రయోజనాలకు ముఖ్యంగా పత్రికా స్వేచ్ఛ పరిరక్షణకు ఒక బాడీగా కృషి చేస్తుంది. పత్రికా స్వేచ్ఛకు ప్రమాదం అటు కేంద్రం నుంచి ఎదురైనా, ఇటు రాష్ట్ర ప్రభుత్వాలవల్ల

ఉత్పన్నమైనా ఆ సవాలును ఎదుర్కొనేందుకు గిల్డ్ శాయశక్తులా ప్రయత్నిస్తుంది. ప్రమాదం గురించి ప్రజలకు తెలియ చేప్పేందుకు గట్టి కృషి చేస్తుంది. సారధ్యం ఎవరిదైనప్పటికీ పత్రికా స్వేచ్ఛకు బిగిస్తున్న రకరకాల ఉచ్చుల గురించి ప్రజా చైతన్యాన్ని పెంపొందించడంలో గిల్డ్ కృతకృత్యమైంది. దేశంలోని ప్రముఖ పత్రికల సంపాదకులందరూ సభ్యులు కావడంవల్ల వృత్తి పరమైన విలువలు, ప్రమాణాల సంరక్షణకూ గిల్డ్ యధాశక్తి తోడ్పడుతున్నది.

ప్ర : యువ జర్నలిస్టులకు మీరిచ్చే సలహా?

జ : ఈ వృత్తి కేవలం బ్రతుకు తెరువుకే కాదు. స్వార్థం, పరమార్థం మిళితమై ఉన్న కొద్ది ప్రొఫెషన్లలో జర్నలిజంకూడా ఒకటి. యువ జర్నలిస్టులు ముందుగా ప్రజా జీవితంలో తమ పాత్రను అర్థం చేసుకోవాలి. తమ ధ్యేయం ఏమిటో నిర్ణయించు కోవాలి. ఈ వృత్తిలో అనేక పరీక్షలు, ఎన్నో ఒత్తిళ్లు ఎదురవుతాయి స్వార్ధ ప్రలోభాలకు లోను గాకుండా విశాల ప్రజా ప్రయోజనాలను మరవకుండా వాటిని తట్టుకోవాలంటే చిత్తశుద్ధి, మనఃస్థైర్యం కావాలి. అగ్ని పరీక్షలకు నిలబడి యువ మిత్రులు వృత్తి వ్యాపకాల్లో ఎదగాలన్నదే నా ఆకాంక్ష

ప్ర : మీ విజయ రహస్యం?

జ : నా బుద్ధికి తోచింది నేను చేస్తున్నాను. అది విజయమో కాదో నాకు తెలియదు. స్వార్ధమూ సామాజిక బాధ్యతా తగు పాళ్లలో ఉండేలా చేపట్టిన ఏ పనైనా చిత్తశుద్ధిలో సాగించడమే నేను చేస్తున్నదల్లా.

ప్ర మీ రొటీన్ ఎలా ఉంటుంది?

జ : ఉదయం 4 గంటలకు పత్రికలతో ప్రారంభమై రాత్రి 11 గంటలకు పత్రికలతో ముగుస్తుంది. ఇందుకు లోబడే ఇతర వ్యాపకాలు ఏవైనా.

---

## మర్మరాలు

- ట్రయినీ రాసిన వార్త వస్తే వస్తుంది. రాకపోతేరాదు.
- మన వార్తలో పసలేకపోతే ఎడిటర్‌ని అని ఏం లాభం?
- నల్లురిలో పడ్డవార్త పేపర్లో రాక చస్తుందా?
- స్కూప్ వార్తకు వెళుతూ ప్రత్యర్థిని తోడు తీసుకెళ్ళినట్లు.
- వార్త కోసం వచ్చి నోట్ బుక్ దాచినట్లు.

# 'నిశ్శబ్ద' జగతిలో నిండు జాబిల్లి




నిశ్శబ్ద తీరంలో నుంచుని అలల ఘోషను ఆయన ఆకళింపు చేసుకోగలరు. ఓ పిల్ల తెమ్మెర అలా ఎగిరి వస్తే అదే పలకరింపుగా, ఆ తెమ్మెరతో మౌనంగా భాషించగలరు. 'నిశ్శబ్దపు' ప్రకృతిలో పసిపిల్లాడిలా పరవశించి పోగలరు.

తెలుగు సాహిత్య, కళా రంగాల్లో ఆయనో తపస్వి. స్వయంకృషితో అందరూ అబ్బుర పడే స్థాయికి ఎదిగిన ధీశాలి. ఆయన పేరు చలసాని ప్రసాదరావు. వారం వారం 'కబుర్ల'తో ఆయన ఈనాడు పాఠకులను అలరిస్తారు. 'ఈనాడు' మాగజైన్ సెక్షన్‌కు ఆయనే ఎడిటర్. విపుల, చతుర జంట మాస పత్రికలు ఆయన నేతృత్వంలోనే రూపం తొడుగుతున్నాయి. పాఠకుల నాడిని పట్టుకోగల నేర్పరి చలసాని విపుల, చతురల విశేష ఆదరణ, ప్రాచుర్యాల్లోనూ, 'ఈనాడు' అనుబంధం వైవిధ్యంలోనూ ఈ విషయమే స్పష్ట మవుతుంది. ఆయన వివిధ అంశాలపై 16 పుస్తకాల వరకూ రాశారు. వాటిలో కొన్ని ఇంగ్లీషు, మరాఠీ, హిందీ, ఉర్దూలలోకి కూడా అనువాద మయ్యాయి.

చలసాని ప్రసాదరావు కృష్ణాజిల్లా భట్లపెనుమర్రులో 1939 లో అక్టోబరు 27 న మధ్యతరగతి కుటుంబంలో జన్మించారు. చలసాని తండ్రి అధ్యాపక వృత్తిలో కొంత కాలం గడిపి తర్వాత సొంతగా రవాణా వ్యాపారం చేపట్టారు. చలసాని చిన్నతనాన అందరు పిల్లలానే సుఖంగా గడిపారు. స్కూలు పరీక్షల్లో మంచి మార్కులు కూడా వస్తుండేవి.

1949 లో చలసాని 98 శాతం మార్కులతో అయిదోక్లాసు పాసయ్యారు అప్పుడే జ్వరంతో అనారోగ్యం పట్టుకుంది. అది టైఫాయిడ్‌గా మారింది. టైఫాయిడ్ ఆరునెలలు పట్టి పీడించింది. నోటికి పక్షవాతం సోకింది. మాట

పడిపోయింది. కలత చెందిన తల్లి తండ్రులు వైద్య నిపుణులకు చూపించారు. పక్షవాతం నుంచి కోలుకున్నారు. ఆ దశలోనే వినికిడి పూర్తిగా లోపించింది. తల్లి తండ్రులు తమ బిడ్డడికి వినికిడి తెప్పించేందుకు ఎంతో శ్రమపడ్డా ఫలితం దక్కలేదు

చలసాని బతుకులో దట్టంగా అలముకున్న కారుమబ్బుల్లో ఆయన మామ సుగుణభూషణరావు ఓకాంతి రేఖను చూశారు. ఆయన మార్క్సిస్ట్. చలసానిని పుస్తక పఠనం వైపు మళ్ళించింది ఆయనే. స్వీయవిద్య అలా మొదలైంది. ఇంగ్లీషు భాషలో వెనక బడివున్నానన్న సంగతి చలసాని గ్రహించారు. స్వీయబోధినుల సాయంతో ఇంగ్లీషును కూడా బాగా నేర్చుకున్నారు.

అలా సంవత్సరాలు దొర్లాయి. ప్రజాశక్తి తెలుగు వారపత్రికలో చలసాని పాత్రికేయ జీవితం ప్రారంభమయింది. ఆ తర్వాత ఈ ప్రజా శక్తే సి.పి.ఐ దినపత్రి విశాలాంధ్రగా అవతరించింది. రెండేళ్ళపాటు చలసాని వరంగల్‌నుంచి ప్రచురితమయ్యే కాకతీయ పత్రికలో అసోసియేట్ ఎడిటర్‌గా వున్నారు. ఈ సమయంలోనే హైదరాబాద్‌లో ప్రభుత్వ ఫైన్ ఆర్ట్స్ కళాశాల గురించిన ఓ వ్యాసం చలసాని కంట పడింది. కళ పట్ల అంతరాంతరాల్లో దాగివున్న అభిరుచి ఊపిరిపోసుకుంది. అయితే ఈ కాలేజిలో చేరాలంటే కనీస విద్యార్హత మెట్రిక్యులేషన్. తన పరిస్థితిని వివరిస్తూ చలసాని దరఖాస్తు చేశారు. ప్రత్యేక కేసుగా పరిగణించి ఆయనకు కాలేజిలో సీటు ఇచ్చారు. చలసాని ఆంధ్ర యూనివర్శిటీలో మెట్రిక్యులేషన్ కూడా తర్వాత పూర్తి చేశారు. ఆర్ట్సులో డిప్లమా కోర్సు అయ్యాక అదే కాలేజిలో పెయింటింగ్ కోర్సు చేశారు. స్టాఫ్ ఆర్టిస్ట్‌గా రాష్ట్ర ప్రభుత్వోద్యోగం చేపట్టారు. ఓ పక్క ఉద్యోగం చేస్తూనే మరో పక్క నైట్ కాలేజిలో లిటరేచర్ బి.ఎ. చేశారు. ఈలోపే లండన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఫొటో టెక్నాలజీనుంచి ఫొటోగ్రఫిలో డిప్లమా సాధించారు. ఓ ఏడాది పాటు తెలుగు మాసపత్రిక 'వసుధ'కు సంపాదక బాధ్యతలు నిర్వహించారు. 1974లో చలసాని ఈనాడు ఆదివారం అనుబంధానికి పార్ట్ టైమ్ ఎడిటర్‌గా చేరారు. 1975 జనవరిలో ఫుల్‌టైమ్ ఎడిటర్ అయ్యారు.

చలసాని భార్య సివిల్ ఇంజినీరింగ్‌లో పాలిటెక్నిక్ గ్రాడ్యుయేట్. ఎందరో వారించినా ఆమె చలసాని జీవితంలో ప్రవేశించి అండ దండగా నిలిచారు. చలసానికి ఇద్దరు పిల్లలు రఘుకిరణ్, రేఖ. పిల్లలిద్దరూ వాళ్ళ డాడీతో కాగితాలపైనే సంభాషిస్తుంటారు.

"నేను మా అబ్బాయికి చేసిందేమీలేదు. తనంతట తనే అన్నీ సాధించుకున్నాడు" అని గర్వంగా చెప్తారు చలసాని తండ్రి.

నైట్ కాలేజిలో బి.ఎ చేస్తున్న రోజుల్లోనే సాహిత్య వ్యాసంగం మొదలయింది. కళ, సాహిత్యాలపై ఆయన వందలాదిగా వ్యాసాలు రాశారు. 200కి పైగా పుస్తకాలను సమీక్షించారు. హైదరాబాద్ ఆకాశవాణి నుంచి నాటికలు, చిన్నకథలు, కళపై ప్రసంగాలు ప్రసారమయ్యాయి. రవి కథ (రవీంద్రుడి జీవితగాథ), కథలు కాకరకాయలు (కథా సంకలనం), మాస్టర్ పీసు (కథా సంకలనం), మార్పు (చైనా కథల అనువాదం), కబుర్లు (వ్యంగ్య వ్యాసాలు), రాజుల బూజు (నలభై అనువాద కథలు) వంటివి చలసాని రాసిన పుస్తకాల్లో కొన్ని.

కాకతీయ రాజుల కాలం నాటి శిల్పకళపై పరిశోధన చేసి చలసాని వెలయించినదే 'కాకతీయ శిల్పం'. ఈ రచన ఇంగ్లీషు, హిందీల్లో కూడా అనువాదం చేశారు. కళపై వ్యాసాల సంకలనం ఆధునిక చిత్రకళ పేరిట పుస్తకంగా వచ్చింది. తెలుగు వారి శిల్పకళ, తెలుగు వారి చిత్రకళ చలసాని కృషిలో మరో రెండు మైలు రాళ్లు. ఇవన్నీ కాక 'కళ' పేరిట ఆయన వార్షిక సంచికలు వెలయిస్తున్నారు. ఇప్పటికి ఆరు వాల్యూమ్స్ వెలుగు చూశాయి. ఇప్పటికీ తెలుగులో 'కళ' తప్పించి ఈ శాస్త్రానికి సంబంధించి వేరే ఏ ప్రచురణా లేదు. చలసాని కెమేరాతో దేశమంతా చుట్టి వచ్చారు. ఫొటోగ్రఫీలో డిప్లమా వుండటమే కాక ప్రత్యేక ఆసక్తి, అనురక్తి ఉన్నాయి ఆయనకు.

చలసాని మన మాటలు వినలేక పోవచ్చు. కానీ ఆయన మన మనసుల్ని అలవోకగా చదవగలరు. మన కళ్ళ భావాలనే ఆయన శబ్దాలుగా మార్చుకోగలరు.

పట్టుదల, తీవ్ర పరిశ్రమ, తపనలతోనే చలసాని ఇంత ఎత్తుకు ఎదగగలిగారు చలసానిది నిశ్శబ్ద జగతి అయితే కావచ్చు. అయినా విశేష జీవితానురక్తిని పెంచుకున్నారు. నిశ్శబ్ద జగతిలో సదా చిర్నవ్వుతో ప్రకాశించే నిండు జాబిల్లి చలసాని.

# చలసానితో ఇంటర్వ్యూ

"మీకు నా ఇంటర్వ్యూ ఏం పనికొస్తుంది?" అని అడిగారు చలసాని.

"మీరేదో జర్నలిజంగురించి కదా చెప్తున్నారు." అని ఆయనే అన్నారు.

"పాఠకుల్లో విభిన్న అభిరుచుల వాళ్ళుంటారు గదా! మీకు తెలియనిదేముంది. కొంత మందిని ఈ ఇంటర్వ్యూలే విశేషంగా ఆకట్టుకుంటాయి. అందుకే మీరు ఇంటర్వ్యూ ఇవ్వాలి" అనడిగా. నా విజ్ఞప్తికి చలసాని ప్రాంప్ట్‌గా రెస్పాండ్ అయ్యారు. కొన్ని ప్రశ్నలను ఆయన ముందు వుంచగా తీరిక లేని పని ఒత్తిడిలో వుండీ వివరంగా సమాధానాలిచ్చారు.

చతుర, విపుల రచనల ఎంపికలో తాను అనుసరించే పద్ధతుల నుంచీ ఈ 'సంధియుగా' న యువ రచయితలు అనుసరించాల్సిన పంథాదాకా అనేకానేక విషయాలపై చలసాని తన అభిప్రాయాలను వ్యక్తం చేశారు. ఇంటర్వ్యూ చదవండిక.

ప్ర : సాహిత్య కళారంగాల్లో అభిరుచి ఎలా ఏర్పడింది? అది ఎలా అభివృద్ధి చెందింది?

జ : ఈ ప్రశ్నకు సూటి సమాధానం వుండదు. నిజానికి మనవాళ్ళు ఈ విషయంలో చెప్పే అభిప్రాయాలు కేవలం గొప్పగా చెప్పుకునే డాబుసరి సమాధానాలే. సంఘ జీవిగా వ్యక్తి మీద పడే పరిసరాలు, వ్యక్తులు, కుటుంబ వ్యవస్థ, సాంఘిక పరిస్థితులు, సాంస్కృతిక కార్యకలాపాల ప్రభావం లోంచి ఆవ్యక్తి మానసిక పరిపక్వత, దృఢ నిశ్చయాలు, అందిన అవకాశాలను బట్టి ఇవి అభివృద్ధి చెందటమో, అణగారి పోవటమో ఉంటుంది. బాల్యం లోనే నేను లెఫ్టిస్ట్ రాజకీయాలు, సాహిత్యం, సిద్ధాంతాలకు సన్నిహితంగా వెళ్ళాను. తర్వాత ప్రజాశక్తి, విశాలాంధ్ర పత్రికలలో పని చేస్తూ ఆనాటి హేమా హేమీలైన సాహితీపరులు, జర్నలిస్టులు, కళాకారుల మధ్య పెరిగాను. నా అభివృద్ధికి, నా అభిరుచుల పరిణతకి కారణం ఇదేఅని నేను నమ్ముతున్నాను. అదే సమయంలో సర్దార్ పృథ్వీసింగ్ నుండి తరిమెల నాగిరెడ్డి దాకా అనేక మంది మార్క్సిస్ట్ రాజకీయ వేత్తలతో లభించిన సాన్నిహిత్యం కూడా ఒక రకంగా రాజకీయ దృక్పథాన్ని, దానికి అనుబంధంగా సాహిత్య, కళా దృక్పథాన్ని తీర్చి దిద్దాయి. దృక్పథం అంటూ ఏర్పడ్డాక ఆయారంగాలపై సాధికారికంగా మాట్లాడగల, ఆలోచించగల 'అభిరుచి' దానంతటదే అభివృద్ధి చెందుతుంది.

ప్ర : ఏది ప్రజాసాహిత్యం, సాహిత్యానికి ప్రజాసాహిత్యానికి మధ్య వైరుధ్యం ఉన్నదా?

జ : ఈ విషయంపై ఇప్పటికే చాలా చర్చ జరిగింది. "ప్రజలు" అంటే నా దృష్టిలో మెజారిటీ వర్గంగా ఉన్న మధ్య తరగతి, అంతకన్నా కింది తరగతుల ప్రజలు. వారిని దృష్టిలో ఉంచుకుని, వారి జీవితాల్ని మరింత ఉన్నతంగా తీర్చి దిద్దేందుకు ఉపయుక్తపడేదే ప్రజా సాహిత్యం. మతం, స్వార్థ రాజకీయాలు, వర్గ ప్రయోజనాలు రాజ్యమేలే సమాజంలో వాటి అసలు స్వరూపాన్ని కళాత్మకంగా విశ్లేషించి, పాఠక హృదయాలకు హత్తుకునేలా, ఆలోచింప జేసేలా, ఆచరణకు పురి కొల్పేలా తీర్చి దిద్దబడినదే "ప్రజా సాహిత్యం".

ఈ పని సమర్థవంతంగా జరగాలంటే రచయిత ముందు తన "పాఠకుడు" ఎవరు? అనే విషయంలో స్పష్టమైన అవగాహన కలిగి ఉండాలి. తన రచన ఎవరిదాకా? ... ఏవిధంగా వెళ్ల నున్నదనేది కూడా తెలిసి ఉండాలి.

ప్ర : మంచి సాహిత్యానికి కొలమానం ఏమిటి?

జ : మంచికి దోహద కారిగా ఉండటమే కొలమానం. ఒకరికి మంచి మరొకరికి మంచి కాక పోవచ్చు. అలాంటపుడు పైన పేర్కొన్న "ప్రజా సాహిత్యం" అనేదే దీనికి సమాధానం అవుతుంది. ఇంకా సూటిగా చెప్పాలంటే అందరూ అభ్యుదయ లేదా ప్రగతిశీల సాహితీపరులే లేని సమాజంలో ఒక జనరల్ సూత్రీకరణ చేయవచ్చునేమో. ఏ రచన అయినా యదార్థజీవితాన్ని, ఆలోచనాత్మకంగా చిత్రిస్తూ, అది విప్లవాత్మకంగా లేకున్నా కనీసం వెనక్కు నడిపించేలా, తిరోగమన ధోరణిలో ఆలోచింప చేసేలా, నిరాశా, నిస్పృహల్ని బలపర్చేలా లేకుంటేనూ, ధైర్యంగా ఆలోచింప చేసేదిలా ఉంటేనూ "మంచి" రచనే అనవచ్చు.

ప్ర : తెలుగు దినపత్రికలలో ఆదివారం అనుబంధాలు ఎలా ఉంటున్నాయి ?

జ : నేను "ఈనాడు ఆదివారం"ను ఎడిట్ చేసిన తీరులోనే వాటిపై నా అభిప్రాయం ఇమిడి ఉంది. పాఠకులలో పఠనాసక్తిని పెంచి, అతన్ని అంత వరకూ పరిచయంలేని నూతన ప్రపంచంలోకి తీసుకు వెళ్లాలనేది ఆ"తీరు" వెనుకనున్న లక్ష్యం. అది విజయ వంతంగా జరిగిందనే నేను నమ్ముతున్నాను. ఓ రెండు కవితలు, ఓ సాహిత్య వ్యాసం, మరో కథ ఉంటేనే

సంస్కృతి సాహిత్యాలను ఉద్ధరించినట్లు—అనే చాదస్తం నాకు లేదు. అలాగని వాటిని నేను తక్కువ అంచనా వేయటమూ లేదు. మొక్కుబడిగా తయారయిన వీటిని ప్రయోజన కరంగా, ఆసక్తి కరంగా, నూతన కోణంనుండి రాయ వలసిఉంది. సమర్థులైన సాహితీ పరులనుండి అలాంటి రచనలు రావలసి ఉన్నాయి. ప్రస్తుతం అలా జరగటం లేదనే నా అభిప్రాయం. ఈ కారణం వలన కాక పోయినా, మిగతా దిన పత్రికల ఆదివారం అనుబంధాలు కూడా "ఈనాడు" వరవడిలోనే రూపుదిద్దుకుంటున్నందువలన, పదమూడేళ్లుగా ఈ పద్ధతినడిచి పాతబడినందువలనా "ఈనాడు ఆదివారం" రూపు రేఖలతోపాటు, స్వభావం కూడా మార్చివేశాం. దినపత్రికలీనాడు శక్తి వంతమైన ప్రజాప్రచార సాధనాలుగా రూపొందాయి. వాటి ఆదివారం అనుబంధాల్ని కూడా అంత శక్తి వంతంగానూ తీర్చి దిద్దుకోవల్సివుంది. దినపత్రికను దైనందిన రాజ కీయ, ఆర్థిక, సామాజిక విషయాల్లో ఆసక్తిగల వారే చదువుతారు. ఆది వారం అనుబంధం అందరూ చదివే అవకాశం ఉంది. కనుక "అంగర్ని" అంటే కుటుంబాన్ని దృష్టిలో ఉంచుకుని దాన్ని రూపొందించాలి.

ప్ర : విపుల, చతురల విజయానికి బాటవేసిన కారణాలు?

జ : ఎడిటర్‌గా నా కృషి మాత్రమే కాక ఇంకా చాలా కారణాలు ఉన్నాయి. లక్షలు నష్టపోతున్నా, సర్క్యులేషన్ పడి పోతున్నా చలించ కుండా చేస్తున్న పని మంచిది, ప్రయోజనకరమైనది, ప్రత్యేకతగలది అనే దృష్టితో ధైర్యంగా కొన సాగిస్తూ వచ్చిన రామోజీరావుగారికే ఆ క్రెడిట్ దక్కుతుంది. ఈ రెండు పత్రికలు పదేళ్లనుంచి ప్రచురణ జరుగుతోంది. మరే ఇతర మాసపత్రికకూ లేనంత సర్క్యులేషన్ వీటికి ఉంది. అయినా నేటికీ విపుల, చతుర రెండూ నష్టాలతో నడుస్తున్నాయి. వ్యక్తిత్వంగల పత్రికల్ని నడపటం ఎంత కష్టమో దీన్ని బట్టే తెలుతుంది.

"విపుల" ఇప్పటికి రెండువేలదాకా అనేకానేక భాషల కథలను తెలుగు లోకి అనువదింప చేసి ప్రచురించింది. ఇవన్నీ సేకరించటానికి ఆయారచయి తలకు ప్రతిఫలం చెల్లించి అనుమతి పొందడానికి, అనువాదకులను సమీకరించి పాఠకులకు ఆసక్తి కరంగా ఉండేలా అందచేయటానికి ఖర్చుకు మించి శ్రమ అనంతం. అయినా అనువాద రచనలకు అంతగా అలవాటు పడని తెలుగు పాఠకులను ఆకట్టుకుంది "విపుల". దీని వెనక పదేళ్ల నిర్విరామ కృషి ఉండటం వలన మాత్రమే ఈనాడు "విపుల" అగ్రశ్రేణి మాసపత్రికగా విశిష్టస్థానం పొందగలిగింది. అలాగే నవలా పత్రికగా 'చతుర' కూడా. విపులను అధిగమించిన చతుర నవలలు ఒక స్థాయికి కట్టుబడి ఉండే, వర్థ

దలా వచ్చిన వ్యాపారధోరణి నవలల జోలికి పోకుండానూ ఈ స్థానాన్ని సాధించుకున్నాయన్నది ఇక్కడ గమనికలోకి తీసుకోవాల్సిన ముఖ్యాంశం. ఈ రెండు పత్రికలు కూడా ఎడిటోరియల్ పాలసీగా తొలినుండీ 'శ్రోతలు కోరినపాటలు' పేరుతో ఏది అమ్ముడుపోతే అది ప్రచురించకుండా, "శ్రోతలు వినదగిన వినితీరాల్సిన పాటలు" మాత్రమే ప్రచురించటాన్ని పాలసీగా పెట్టుకున్నాయి. ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా ఆ పాలసీకి కట్టుబడి మాత్రమే తమ పాఠకుల్ని వెతుక్కున్నాయి. నిలబడ్డాయి. ఇదే వాటి విజయ రహస్యం.

ప్ర : విపుల, చతురలకు రచనల ఎంపికలో మీరు అనుసరించే సూత్రాలు ఏమిటి?

జ : రచనల ఎన్నికకు నిర్దిష్ట విధానాలున్నాయి. తెలుగు పాఠకులు ఇప్పటికే వందలాది నవలలు, వేలాది కథలు చదివేసి ఉన్నస్థితిలో కొత్తదనం చూపగలగటం కష్టం. వివిధ భాషల కథావేదికగా "విపుల"లో ఈ పని మరీకష్టమైనది. ఉదాహరణకు కన్నడంలో గొప్ప కథగా కీర్తింపబడిన ఓ కథ చదివి తెలుగు పాఠకులు "ఓస్ ! ఇదా, పాతికేళ్లనాడు తెలుగు రచయితలు దంచేసిన పాతసబ్జక్టే" అనుకోవచ్చు. అందువలన తెలుగేతర భాషా కథ అయినంత మాత్రాన ఏ కథా కష్టపడి అనువదించనవసరం లేదు. కథలో తెలుగు పాఠకులకు ఏదో ఒక కొత్తదనం, అభివృద్ధికర భావాలు ఉన్నప్పుడే అది ప్రచురణ యోగ్యం. అన్నింటికీ మించి చదివించేలా ఉండటం ముఖ్యంఅనేది పాలసీగా పెట్టుకున్నాను. శ్యాంబెనెగల్ 'మండీ' వంటి సినిమాలకూ, అనేకానేక టి. వి సినిమాలకు మూలమైన కథలు వాటికన్నా ముందే 'విపుల' ద్వారా తెలుగు వారు చదివేశారని మనం గర్వంగా చెప్పుకోవచ్చు. చతుర నవలల ఎన్నికలో కూడా స్థూలంగా ఇవేనియమాలు. రాసిందెవరు ? వారెంత ప్రఖ్యాతులు ? అనేదానికన్నా రాసిందేమిటి ? అదెంత బాగా రాశారు ? అనేదే ఎన్నికకు గీటురాయి. ఈ కారణం వలననే "రచయితలకు పెద్దగా ప్రాముఖ్యం, గౌరవం ఇవ్వరు" అనేమాట కొంత ప్రచారంలోకి వచ్చింది.

కానీ రచన ప్రాముఖ్యంగలది, ప్రత్యేకత ఉన్నది, రచయిత ప్రతిభకు అద్దం పట్టేదిగా ఉన్నపుడు రచయితకు రావలసినగౌరవం,గుర్తింపు రాకుండా ఉండవు. ఏమీలేని రచనను గురించి ఊదరగొట్టి, పాఠకులను అదరగొట్టటం ద్వారా సాధించే ప్రచారం చాలా తాత్కాలికమైనది. అలాంటి అడ్డదార్లు ఆయా రచయితలకే హానికరం. వ్యాపార రీత్యా

ఇందువలన వారికి తాత్కాలిక ప్రయోజనం కలగవచ్చుగానీ, సాహిత్యపరంగా, రచయితగా వారు శాశ్వత నష్టానికి గురవుతారు. అంతకన్నా బాగా ఊదరగొట్టగలవారు రాగానే వీరు తెరమరుగవటం - మనకళ్లముందే జరుగుతున్న చరిత్ర. కనుక ముందు రచనకే ప్రాముఖ్యం. దానిని రాసిన సృజన శీలి, ప్రతిభావంతుడుగానే రచయితకు గుర్తింపు, గౌరవం అనేది తొలినుండి నా పాలసీ- అలాగే ఒక రచయితకు ఇతరత్రా వచ్చిన గిరాకీని బట్టి అతని రచనలకోసం బేరాలాడటం, ఎగబడటం వంటి వాటికి నేను వ్యతిరేకం. విపుల, చతుర, ఈనాడు ఆదివారంల్లలో ప్రచురించే రచనలకు నిర్దిష్టపారితోషికాలు ఉన్నాయి. పత్రికల్లో ప్రచురణ అంటూ జరిగాక తరతమభేదాలెలా ఉన్నా ప్రచురార్హత కలవిగా గుర్తింపు పొందినవే కనుక ప్రఖ్యాతులవైనా, నూతన రచయితవైనా పారితోషికంలో మార్పు ఉండనవసరం లేదనేది నా అభిప్రాయం. ఒక రచయిత నవల మూలంగా ఫలానా పత్రిక లక్షకాపీలు అమ్ముడుపోతోందనే వారు - అదే రచయిత నవల ప్రచురించే మరో పత్రిక పాతిక వేల కాపీలకు మించి ఎందుకు అమ్ముడు పోవడంలేదో వివరించ వలసి ఉంది.

ప్ర: ఈనాటి కథా, నవలా సాహిత్యం పై మీ అంచనా?

జ: 95 శాతం కథలు, నవలలు కేవలం పఠనాసక్తి పెరిగిన నూతన పాఠక వర్గాన్ని ఎలాగోలా ఆకట్టుకునే దృష్టితో వ్యాపార పరంగానో, మొక్కుబడిగానో రూపొందు తున్నవే. నవలల ఎన్నికలో నేను అనేక సందార్భాల్లో, 'పర్వాలేదు' అనే రాజీ ధోరణిలో సరిపెట్టుకోవల్సి వచ్చింది తప్ప పూర్తి సంతృప్తి నిచ్చిన రచనలు అల్పం. ఇందుకు బాధ్యత రచయితలదే. వాళ్లు చెప్పే నీతులకూ, రాసే రచనల స్థాయికి సంబంధం చాలా తక్కువ. కష్టపడి రాస్తే "మంచి" రచనలకు స్థానం ఎక్కడ? అనే ప్రశ్న పూర్తిగా అర్థరహితం కాదు గానీ బాధ్యతా రహితం ఉన్న కొద్దిపాటి అవకాశాలనైనా సద్వినియోగం చేసుకుని తాము చెప్పే మంచి రచనలను పాఠకుల దాకా తీసుకు పోవాలనే "నిజాయితీ" కన్నా ఈనాటి రచయితలలో కొద్దికాలమేఅయినా "సెన్సేషనల్"గా పాఠకుల దృష్టిలో "ఓ వెలుగు" వెలుగుదామనే దృక్పథం పెచ్చుగా కన్పిస్తోంది. దీనికితోడు బహుకొద్దిమంది ఆర్థికంగా బాగుపడుతున్న రచయితలుగా స్థిరపడటం వలన కూడా మిగతా వారిలో ఆ దృష్టి అధికమైంది. తత్ఫలితమే ఈనాడు పెరిగిన పత్రికల పేజీల్ని నింపేందుకు ఉత్పత్తి అవుతున్న నానా గోత్రిక సాహిత్యం. దీని వలన నష్టం పాఠకులకే కాదు. మంచి సాహిత్యానికి కూడా. అయితే "మంచి" రచయితలు కూడా ఓ అంశం గమనించాలి. మారిన

పరిస్థితులలో కేవలం మంచి ఆశయాలు, ఆదర్శాలు తమ రచనలలో ఉన్నంత మాత్రాన చాలదు. వాటిని ఈ నాటి పాఠకుడు వదలకుండా ఆసక్తిగా చదివేలా వారు తమ రచనలను తీర్చి దిద్దవలసి ఉన్నారు. ఇది ఏ రచయిత శక్తి సామర్థ్యాలకైనా పరీక్షే. తను చెప్పదలచుకున్న విషయాన్ని పాఠకుని చేత చదివించేలా చెప్పలేనివాడు రచయిత అన్పించుకోడానికే అనర్హుడని నా అభిప్రాయం.

ప్ర : తెలుగు సాహిత్యంలో మీరెలాంటి మార్పుల్ని ఊహిస్తున్నారు?

జ : పైన చెప్పిన వాటిల్లోనే జవాబు లున్నాయనుకుంటాను. మార్పు ఎందుకు రాదు? వచ్చి తీరుతుంది. ఇప్పటికే అది మొదలయింది కూడా! అయితే ఆ మార్పు "మనం" ఆశించే రీతిలో కాకుండా కొంత వరకూ సెక్స్ వైపూ, ఇంకొంత ఇన్వెస్టిగేటివ్ నవలల ముసుగులో పక్కా డిటెక్టివ్ నవలల స్థాయి లోకి మళ్ళింది. ఇది కూడా మళ్ళీ మారక తప్పదు. ఆ మార్పు ప్రజోపయోగ కరంగా, పాఠకుల్ని ప్రగతిశీల వాదులుగా ఆలోచింప చేసే దిశలో జరగవలసి ఉంది. రచయితల్లో అలాంటి దృక్పథం గలవారు శక్తివంతమైన రచనలు సృష్టించటం ద్వారానే అదిసాధ్యం. తప్పంతా పూర్తిగా ఎడిటర్ల మీదకే తోసి వేసి చేతులు ముడుచుక్కూర్చోవటం ఉత్తమ రచయితల లక్షణంకాదు.

ప్ర : కాలమిస్ట్ కష్టాలు ఏమిటి?

జ : అసలు కాలమిస్ట్ లక్ష్యం ఏమిటి అనే దాని మీద ఈ ప్రశ్నకు జవాబు ఆధార పడి ఉంటుంది. ఉదాహరణకు 'కబుర్లు' రచయితగా నా లక్ష్యం నా పాఠకుల్ని కాసేపు నవ్వించే హాస్యగాడుగా మిగిలిపోవటం కాదు. అది తప్పని నేను అనుకోను. కానీ, నా లక్ష్యం అంతకన్న పెద్దది. ఒక అంశం గురించి నేను ఫీలయిన దాన్ని నా పాఠకులు కూడా ఫీల్ అయేలా నా రచన కొనసాగాలి. అందుకే "కబుర్లు" లో హాస్యం కన్నా వ్యంగ్యం పాలు ఎక్కువ

ఇహ కష్టాలనేవి-ఆ రాసేవాడు కేవలం నవ్వించేబఫూన్‌లా ఉండిపోనపుడు తప్పవు. బెదిరింపులు, విరోధాలు, కేసులు, ప్రివిలేజ్ మోషన్లు వంటి ఇబ్బందులెపుడూ ఉంటాయి. ముఖ్యంగా లీగల్ గొడవల్లో ఇరుక్కోకుండా రాయటం ఓ సమస్య. ఆ విధంగా కొన్ని పరిమితులు. వాటంతటవే వచ్చి కూర్చుంటాయి. ఇవి తప్పవేమో!

ప్ర : "కబుర్లు" శీర్షికన ఎన్ని వ్యాసాలు రాసి ఉంటారు?

జ : నవంబరు 1987నాటికి నేను రాసిన "కబుర్లు"300 పూర్తయ్యాయి.

తొలుత 1971 లో "జ్యోతి" మాస పత్రికలో ప్రారంభమై, ఎమర్జన్సీతో ఆగిపోయి 1977 సెప్టెంబర్ దాకా కొనసాగాయి. అవి అన్నీ కలిపి ఓ 50 దాకా ఉంటాయి. పుస్తక రూపాన ఎపుడో వచ్చాయి. ఈనాడులో 1982 అక్టోబరు 22న ప్రారంభమై వారం వారం కొనసాగుతున్నాయి.

ప్ర : కాలమిస్టు కాగోరే వారికి మీ సలహా ?

జ : కాలమిస్టులు అవకాశం దొరికింది గదా అని మొక్కుబడిగానో, ప్రయోజన శూన్యంగానో రాయకుండా ఉండటం అవసరం. వ్యక్తిగత రాగద్వేషాలకు అది అతీతంగా ఉండి తీరాలి. "బాధ్యత" చాలా ముఖ్యం. పులిమీద సవారీ చేయాలని సరదా పడేవాడు ఆ పులి చేత మింగి వేయబడే ప్రమాదానికి కూడా సిద్ధపడే ఉండాలి. ఏదీ వదులు కోకుండా దేన్నీ సాధించ లేం. అధ్యయనం, పరిశీలన, ఆలోచన, నిజాయితీ ఇవన్నీ కాలమిస్టుకు తప్పని సరి.

ప్ర : చిత్రకళారంగాల్లో మీ కృషి ఏ విధంగా కొనసాగింది ?

జ : ఈ కృషి ప్రధానంగా రచనల రూపంలోనూ, నేను స్థాపించి ఎడిట్ చేసిన "కళ" ఆరు సంపుటాల రూపంలోనే ఉంది. అదనంగా "కాకతీయ శిల్పం" మీద రాసిన గ్రంథం ఒకటుంది. వ్యాసాలన్నీ "ఆధునిక చిత్రకళ" పేర పుస్తకంగా వచ్చాయి. ఇవన్నీ రెండేసి ముద్రణలు జరిగాయి.

పుస్తకంగా "తొలి సోషలిస్టు దేశంలో చిత్రశిల్ప కళా పరిణామ క్రమం" లక్ష్యంగా "రష్యన్ చిత్రకళ" గురించి గ్రంథం రాశాను. ఆ తరువాత వరుసగా "తెలుగువారి చిత్రశిల్ప కళా పరిణామం" మీద ఒక గ్రంథం, "భారతీయ చిత్ర కళ" మీద ఒక గ్రంథం, "విశ్వకళా చరిత్ర" మీద మరో గ్రంథం రాసే ప్రణాళికలు ఉన్నాయి. ఇన్నేళ్లూ వీటిని గురించిన అధ్యయనంతో సరిపోయింది. ఇహ రాయాలి. ప్రచురించేదెవరు ? అనే ప్రశ్న కాల యాపనకు ముఖ్య కారణం.

ప్ర : "కళ" రెగ్యులర్‌గా తేలేకపోతున్నారేం ?

జ : నేను "ఈనాడు"లో చేరిన కారణంగా నా "కళ" ఆగిపోయిందని జనాభిప్రాయం. కానీ అది సరికాదు. కళ ఆరో సంపుటి తర్వాత 1974 లో వెలువడవలసిన ఏడో సంపుటికి "సబ్జెక్ట్"గా "తొలిసోషలిష్టు దేశంలో కళా పరిణామ క్రమం" అనేది ఎన్నుకున్నాను. మన చిత్ర కళారంగంలో ప్రజా దృక్పథం అనేది దాదాపు పూజ్యం. పారిశ్రామిక పెట్టుబడిదారీ విష సంస్కృతీ ఫలాలైన రకరకాల పాశ్చాత్య ఇజాల ప్రభావం సర్వే సర్వత్రా చలామణీ అవుతున్నది. దీనికి విరుగుడుగానే ఆ సబ్జెక్టు ఎన్నుకోవడం జరిగింది.

అయితే అసలే మనకు చిత్రకళా రచయితలు తక్కువ. ఆ కొద్దిమంకీ లోనూ రష్యన్ కళల గురించిన అవగాహన గలవారు మరీ తక్కువ. వీరందరిది వేర్వేరు అంశాల మీద రాసేపని అప్పగించి కావలసిన రిఫరెన్సు పుస్తకాలన్నీ పోగు చేసి అప్పగించాను. కానీ కొందరే అనుకున్న ప్రకారం రాయగలిగారు. మిగిలిన వారి జాప్యం కారణంగా, ఇదుగో-అదుగో అంటూ ఇన్నేళ్లూ గడచి పోయాయి. అందుకే ఇపుడు మొత్తం నేనే రాయబూనుకున్నాను. ఇది పూర్తి చేసి, వేరే సబ్జెక్ట్‌తో "కళ-"ను వెలువరించాలనీ, తర్వాత ప్రతి ఏటా ఒకసంపుటిని క్రమ పద్ధతిలో తేవాలని ఆశ. కళ ఆఖరి సంపుటి వెలువడి 15 సంవత్సరాలైనా వెలువడింది ఆరు సంపుటాలే అయినా, కళాభిమానులు దానిని మరచి పోలేదం టేనే దాని ప్రాముఖ్యం, అవసరం అర్థం అవుతుంది.

ప్రశ్న : యువతకు ప్రత్యేకించి సాహిత్య కళాభిరుచిగల యువకులకు మీరేం చెప్తారు.

జ: యువతకు మరేనాడు లేనంతగా వృత్తిపరంగా అవకాశాలు ముందున్నాయి. వాటిని దుర్వినియోగానికి ప్రేరేపించే పరిస్థితులూ, శక్తులుకూడా బలంగానే ఉన్నాయి. ఇది ఒక రకంగా సంధికాలం లాంటిది "ఆకర్షణ"లను జయించి తమ తమ రంగాల్లో ఉన్నత విలువలను కొనసాగించడానికి, కొత్త వాటిని రూపొందించి నిలబెట్టడానికి చాలా కృషి జరగవలసి ఉన్నది. ఆటంకాలున్నమాట నిజమే! అంతా మన చేతిలోనే లేని మాటానిజమే! కానీ ఈనాడు మనం గౌరవిస్తున్న ఆ కొద్దిపాటి విలువలకైనా అవి సాధించిన వారు ఏ త్యాగాలూ చేయకుండానే సాధించ లేదని గుర్తిస్తేచాలు.

---

## మీరు ఇలా ఉండండి

1) అనుక్షణం ఎలర్ట్‌గా ఉండాలి
2) కామన్ సెన్స్ ముఖ్యం
3) ప్రజలకు ఏ వార్త ఎంత అవసరమో బేరీజు వేయగలగాలి
4) భాషలో స్పష్టత, సరళత ఆవశ్యం
5) తెలియని దాన్ని తెలుసుకో...
6) కొత్త కోసం వెంపర్లాడాలి.
7) పైకి ఎదగాలన్న ఆకాంక్ష ఉండాలి
8) పక్షపాతం విడిచి పెట్టాలి
9) పాఠకుడి ప్రయోజనాలకే అంకిత. కావాలి

# ఎ. బి. కె. ఎ. బి. కే నే



సమకాలీన తెలుగు జర్నలిజంపై ఎ. బి. కె. ప్రసాద్ గట్టి ముద్ర వేశారు. ఎ. బి. కె. తెలుగులో ఏ ఒకటో అరో మినహాయించి అన్ని పత్రికల్లోనూ పనిచేశారు. అయితే ఆయన ఏ పత్రికనూ పదికాలాల పాటు అంటి పెట్టుకుని ఉండలేదు. ఇది ఆయన వ్యక్తిత్వంలోని ప్రత్యేకత. ఎ. బి. కె. ప్రసాద్‌కు తెలుగు జర్నలిజంలో మంచి ఫాలోయింగ్ ఉంది. ఆయనంటే పడి చచ్చే కుర్ర జర్నలిస్టులూ ఉన్నారు. ఎ. బి. కె. లో ఇటు ఎగ్జిక్యూటివ్ లక్షణాలు, అటు జర్నలిస్ట్ లక్షణాలు రెండూ సమపాళ్లలో కలగలిసి ఉన్నాయి. ఆయన విజయ రహస్యం అదే. ఆయనలోని మరో ప్రత్యేకత-మంచి టీమ్‌ని తయారు చేసుకోవడంలోనూ, ఆ టీమ్‌కు మార్గదర్శిగా నిలిచి వారిలోని ప్రతిభను సాన బెట్టడంలోనూ ద్యోతక మవుతుంది.

ఎ.బి.కె. ని గ్లామరస్ ఎడిటర్‌గా చెప్పుకోవచ్చు. గ్లామరంటే సినీ ప్రపంచపు మాయజలతారు గ్లామర్ కాదు. ఆయన ఏ పత్రికలో పని చేస్తే ఆ పత్రిక కొని చదివే పాఠకులు వేనవేలు. పాఠకుల మీద తన సంపాదకీయాల ద్వారా అంతటి ముద్ర వేశారాయన. అంతటి ప్రభావం చూపారాయన.

ఎ.బి.కె. ఈ స్థాయికి చేరడానికి బాసటగా నిలిచినవి పుస్తకాలే. ఆయన మంచి చదువరి. ఒకప్పుడు పరీక్షకు వెళ్లే విద్యార్థిలా సబ్బుతో ముఖం

కడుక్కొని (రాత్రిళ్ళు నిద్రను దూరం చేసుకోవడానికి) చదివే వారు. ఇప్పటికీ ఎన్ని పని ఒత్తిళ్లున్నా ఆయన పుస్తకాల పురుగే. దేశ విదేశాల్లో ప్రచురిత మైన ఏ మంచి పుస్తకమయినా ఎ. బి. కె కన్నుగప్పి వెళ్లలేదు. మార్కెట్‌లోకి ఏదైనా విశేష పుస్తకం విదేశాల నుంచి వచ్చిందంటే వచ్చిన అనతి కాలం లోనే ఆ పుస్తకం ఎ.బి.కె. చేతుల్లో రెక్కలు కట్టుకుని వచ్చి వాలుతుంది. జ్ఞాన సముపార్జన పైజిజ్ఞాస, కొత్తవిషయాలు తెలుసు కోవాలన్న తపన, సమకాలీన పరిణామాలను ఎప్పటికప్పుడు ఆకళింపు చేసుకోవాలన్న దృఢదీక్ష ఇందుకు కారణం. ఆయన రాసిన సంపాదకీయాలు పుస్తకాలుగా వెలుగు చూశాయి. ఆయన పలు అనువాదాలు కూడా చేశారు. జర్నలిజంపై పుస్తకానికి బృహత్ ప్రణాళికకూడా వేసుకున్నారు. తీరుబడి కోసం ఎదురు చూస్తున్నారు. కాస్త వ్యవధి చిక్కితే దృష్టికేంద్రీకరిస్తానని ఎ.బి.కె. చెప్పారు.

ఎ.బి.కె. సిద్ధాంతం ఒకటే ఆ సిద్ధాంతం ప్రజాబద్ధం. ప్రజల ప్రయోజనాల పరిరక్షణకే ఏ.బి.కే. కలం నిబద్ధమైంది. ఎ.బి.కె. ప్రస్తుతం ఆంధ్రజ్యోతి దిన పత్రికలో అసోసియేట్ ఎడిటర్‌గా వున్నారు. కోరగానే ఇంటర్వ్యూకి అవకాశం కల్పించారు. ఆయన ఆఫీసు గదిలోనే ఇంటర్వ్యూ సాగింది. ఆయన బల్లనిండా పుస్తకాలు, కాగితాలు, పేపర్ కటింగ్స్. మరోపక్క వరసగా పేర్చి ఉంచిన మాగజైన్స్. పెదవులపై సదా చిరునవ్వులు వెలిగిస్తూ ఆ పుస్తకాల మధ్య ఎ.బి.కె. ఓ విజ్ఞానఘనిలా కన్పించారు. అడిగిన ప్రశ్నలు వేటికీ నీళ్లునమల లేదు నిష్కర్షగా సూటిగా జవాబులిచ్చారు. ఇంటర్వ్యూ వివరాలివిగో.

ప్ర : మీరు సక్సెస్‌ఫుల్ ఎడిటర్ ఈ సక్సెస్ వెనక మీ కృషి, పాత్ర?

జ : మీ ప్రశ్నలోనే సమాధానం కూడా ఉంది తీవ్ర పరిశ్రమతో నన్ను నేను మలుచుకున్నాను. విజయ రహస్యం నా ఒక్కడిదికాదు, సిబ్బంది సమష్టిశ్రమ ఫలితం. బాగా పుస్తకాలు చదవడం, ఎప్పటి పరిణామాలను అప్పుడు తెలుసు కోవడం, వాటిని శ్రద్ధతో అధ్యయనం చేయడం విజయానికి కారణం. చదువులో రెండు రకాల పద్ధతులున్నాయి. సాధ్యమైనంత వరకూ చదివేయడం మొదటి పద్ధతి. రెండోది ఎక్కువ పుస్తకాలు చదవడానికి యాంగ్యులర్ రీడింగ్ అలవాటు చేసుకోవడం. అంటే పుస్తకాన్ని చేతిలో ఏట వాలుగా పుచ్చుకుని ( ఆపద్ధతిని చూపారు కూడా) పై నుంచి కిందిదాకా 'స్కాన్' చేయాలి. ఇలా 'స్కాన్' చేయడం ద్వారాకూడా త్వర త్వరగా అనేకవిషయాలు తెలుస్తాయి. ఏ పుస్తకంలో ఏముందో ఏ విషయానికి ఏ పుస్తకాన్ని రిఫర్ చేయాలో ఈ పద్ధతిలో సులువవుతుంది. అందుకే విజ్ఞానం రెండు రకాలన్నాడు శామ్యూల్ జాన్సన్. చదవడమేకాదు, ఏ అంశం ఎక్కడ లభిస్తుందో తెలిసి ఉండటం కూడా విజ్ఞానమేనన్నాడు.

ప్ర : పత్రిక నిర్మాణంలో ఎడిటర్‌పాత్ర ఆయన వేసే పునాది ఏమిటి?

జ : ఇప్పుడు పరిస్థితి ఎ. బి. కె. వర్సెస్ ఎ. బి. కె. అయింది ! నేను ఏ పత్రికలో పని చేసినా నా హయాంలో ఆ పత్రిక సర్క్యులేషన్ పెరిగింది. ప్లానింగ్‌లో జాగ్రత్తలు తీసుకుంటాను. సహచర సిబ్బంది ఎంపికలో ప్రత్యేక శ్రద్ధ వహిస్తాను. ఉద్యోగం కోసం వచ్చిన వారిలో జర్నలిజం పట్ల ఆసక్తి ఏమేరకు వుంది అనేది తెలుసు కోడానికి అధునాతన అమెరికన్ ప్రశ్నావళి సరళిని ఉపయోగిస్తాను. మంచి టీమ్‌ను ఎంపిక చేసుకోవడం, వారికి శిక్షణ ఇవ్వడం నావరంగానేను చేసేపని.

ప్ర : మీరు అనేక పత్రికల్లో పని చేశారు. మీ అభిప్రాయాలకు పత్రిక పాలసీకి వైరుధ్యం ఎదురైనపుడు మీరు అనుసరించే పద్ధతి ?

జ : పత్రికల్లో సొంత ఐడియాలజీకి ఆస్కారం ఉండదు. అది పలు రకాల భావాల, అభిప్రాయాల సమ్మేళనం అనవచ్చు. వ్యక్తిగత అభిప్రాయాలు, పత్రిక పాలసీతో సంఘర్షణ పడవు.ఆ రెంటివీ దేనిదారిదానిదే.

ప్ర : పత్రికా స్వేచ్ఛ గురించి ఏమంటారు ?

జ : పత్రికా స్వేచ్ఛ రిలిటివ్. ఇప్పుడు పత్రికా స్వేచ్ఛ యజమానుల వ్యాపార ప్రయోజనాలతో, ప్రభుత్వ ప్రయోజనాలతో ముడి పడిన వ్యాపార ప్రయోజనాలతో సాగుతోంది. పత్రికను చేతుల మీదుగా వెలికి తెచ్చే పాత్రికేయుడికి ఉండవలసిన పత్రికా స్వేచ్ఛ ఇతరుల కోసం ఎక్కువ ఊడిగం చేస్తోంది. మన దేశంలో 'స్టేట్స్‌మన్'కు తప్ప ఏ పత్రికకూ ఇండిపెండెంట్ పాలసీ లేదు. తమది ఇండిపెండెంట్ పాలసీ అని ఏ పత్రికా ప్రకటించ లేదు. విషయ ప్రాధాన్యం బట్టి, మంచి చెడులను బట్టి ఏ రోజుకారోజు (Depending on the merit of the issue of the day) స్టేట్స్‌మన్ తన విధానాన్ని రూపొందించి అనుసరిస్తుందే తప్ప ఒక పార్టీకో, ప్రభుత్వానికో అది బానిస కాదు. మిగతా పత్రికలు కూడా స్టేట్స్‌మన్ చూపిన బాటలో ఇండిపెండెంట్ పాలసీని ప్రకటించనంత వరకూ పత్రికస్వేచ్ఛ మేడిపండే. మనది నిజానికి పేరుకే ప్రెస్. కాని మన డ్యూటీ కొన్ని సందర్భాల్లో న్యూస్‌ను సప్రెస్ చేయడం! ప్రభుత్వం తన రాజకీయ లబ్ధికోసం, పత్రికాయజమానులు తమ స్వార్థకోసం న్యూస్‌ను సప్రెస్ చేస్తున్న ఉదాహరణలున్నాయి. పత్రికా వ్యాసంగం ప్రజలపక్షాన ప్రజల కోసం వారి ప్రయోజనాలను మాత్రమే ఆశించి కొనసాగవలసి వుంది. కానీ అలా జరగడంలేదు.

ప్ర : వివిధ ప్రపంచ పరిణామాలను పాఠకులకు అందివ్వడంలో తెలుగు పత్రికలు న్యాయం చేస్తున్నాయా ?

జ : తెలుగు పత్రికల్లో అంతర్జాతీయ వార్తలు ఎక్కువగా చోటు చేసుకోని మాట వాస్తవమే. దీనికి కారణం ప్రభుత్వం అనుసరిస్తున్న న్యూస్ ప్రింట్ విధానమే. ప్రజలకు సమాచారాన్ని తెలియచెప్పే పత్రికలకు వలసినంత న్యూస్‌ప్రింట్ అందుబాటు ధరల్లో దొరకడం లేదు. ఆ కారణంగా మన పత్రికలు పరిమిత పేజీల్లోనే వార్తలు అందివ్వాల్సి వస్తోంది. విదేశాల్లో న్యూస్ ప్రింట్ చవక. అందుకని పేజీలు ఎక్కువ. పేజీలు పరిమితమైనపుడు వచ్చిన వార్తల్లో ప్రాంతీయ ప్రాధాన్యతలవైపు మొగ్గు చూపక తప్పదు. ఉన్న స్పేస్ తక్కువ. విదేశాల్లో కొన్ని దినపత్రికలు వందల పేజీలతో వెలువడుతుంటాయి. ఇక్కడ మనకు ఆ పరిస్థితి లేదు. అయితే న్యూస్‌ప్రింట్ పరిమితి ఉన్నప్పటికీ తెలుగు పత్రికలు ముఖ్యమైన అంతర్జాతీయ వార్తలు అందిస్తూనే ఉన్నాయి. వాటికి న్యాయం చేస్తూనే ఉన్నాయి. విదేశీ పత్రికల్లో ఇండియా గురించి ఈమాత్రం కూడా వార్తలుండవని గ్రహించాలి.

ప్ర : ఇప్పుడు ఎడిటోరియల్స్‌ని బట్టి పత్రిక పాలసీని నిర్ణయించలేమన్న అభిప్రాయం ఉంది. మీరేమంటారు ?

జ : ప్రజాభిప్రాయాన్ని మలచడం, రోజువారీ వార్తలపై విజ్ఞానదాయకంగా, విమర్శయుతంగా విశ్లేషించడం ఎడిటోరియల్ ఉద్దేశం. పత్రిక పాలసీ అనేది అది అందిచ్చే వార్తల తీరుపైనా, సంపాదకీయాలపైనా - రెంటిమీదా ఆధారపడి ఉంటుంది. పత్రిక పాలసీ విషయంలో రెంటినీ పరిగణనలోకి తీసుకోవాలి. పత్రికా యజమానులకంటే, సంపాదకులకంటే పాఠకులు తెలివైనవారు. ఆ సంగతిని మాత్రం విస్మరించకూడదు. ఎడిటర్స్ 'ఎడిటర్' పాఠకుడు.

ప్ర : ఇటీవలి కాలంలో పత్రికల మధ్య పోటీ పెరిగింది. ఇది ఆరోగ్యప్రదమేనా ?

జ : పోటీ పెరగడం మంచిదే. పోటీవల్ల సంచలనం సృష్టించే తపన కూడా పెరుగుతోంది. ఇది ఎల్లో జర్నలిజానికి దారితీసే ప్రమాదం లేకపోలేదు. ఆ విషయం మినహాయిస్తే, పోటీ కారణంగా ఎవరికి వారు ప్రజా సమస్యలపై పూర్వంకంటే ఎక్కువగా దృష్టి కేంద్రీకరిస్తున్నారు. ఈ విషయంలో ఈ దశాబ్దంలో యువ పాత్రికేయుల కృషి అభినందనీయం.

ప్ర: అయితే పత్రికలు పాజిటివ్ రోల్ నిర్వర్తిస్తున్నాయా ?

జ: అభ్యుదయ పాత్రే పాజిటివ్ రోల్. నిర్భీతితో, నిష్పక్షపాతంగా అన్యాయాలు, అక్రమాలు, అత్యాచారాలను వెలికితేవడం అంటే ప్రజలపక్షాన మొగ్గు చూపడమే. అది పాజిటివ్ రోల్ కిందకే వస్తుంది గదా !

ప్ర: తెలుగు పత్రికల్లో పరిశోధనాత్మక వార్తల స్థానం ఏమిటి ?

జ: ఉన్న పరిమితుల్లో పరిశోధనాత్మక వార్తలను విలేకరులు పంపుతూనే ఉన్నారు. అవి ప్రచురణకు నోచుకుంటూనే ఉన్నాయి. అయితే ఈ విషయంలో చేయవలసింది ఇంకా చాలా వుంది. కాకపోతే ఈ తరహా వార్తలు ప్రచురించినవుడు యాజమాన్యాలు పూర్తి అండదండల నివ్వడం లేదు. కొన్ని సందర్భాల్లో కోర్టులకు ఎక్కవలసి వచ్చినపుడు ఆ వార్త పంపిన విలేకరి, ప్రచురించిన పాపానికి ఎడిటరూ ఆ క్లేశాలను అనుభవించాల్సి వస్తోంది. తన విలేకరి పరువును కాపాడగలిగిన యాజమాన్యం తన పత్రికా స్వేచ్ఛను కూడా కాపాడుకోగల్గుతుంది.

ప్ర: పత్రికల్లో పూర్వానికి ఇప్పటికీ విలువలు, ప్రమాణాల పరంగా పతనం ఉందంటారా ?

జ: కొన్ని సందర్భాల్లో ప్రమాణాలు పడిపోతున్న మాట నిజమే. స్వాతంత్రోద్యమకాలంలో మనకు నిర్దిష్టమైన లక్ష్యం ఉంది. ఒక్కడే శత్రువు. తెల్లవాళ్ళ స్థానంలో ఇప్పుడు బ్లాక్ పవర్ వచ్చింది. తెలుపయినా, నలుపయినా అధికారంలోకి వచ్చాక ఎవరేనా ఒకేరకంగా వ్యవహరిస్తున్నారు! ప్రజాస్వామ్య సంస్థల అభివృద్ధికి దోహదపడుతూనే బ్లాక్ పవర్స్ అధికార దౌర్జన్యంపైన, ప్రజా వ్యతిరేక విధానాలపైన పత్రికలు పోరాటం సాగించాలి. ఈ పోరాటంలో ఒకోసారి కథ అడ్డం తిరిగే ప్రమాదమూ ఉంది.

ప్ర: ఒక పత్రికకు ఎక్కువ సర్క్యులేషన్ ఉందంటే ఆ పత్రిక పాలసీకి ఎక్కువ మంది ప్రజల అమోదముద్ర ఉన్నట్లే పరిగణించవచ్చా ?

జ: సర్క్యులేషన్ రెండు రకాలు. సహజసిద్ధమైన సర్క్యులేషన్ ఒకటి కాగా అంకెల తారుమారుతో చూపే సర్క్యులేషన్ రెండోది. పత్రికలకు ముఖ్యమైన కేంద్రాల్లో యాజమాన్యమే పంపిణీ ఏజంట్‌గా ఉంటోంది! పంపిణీ యంత్రాంగం తమ చేతుల్లో ఉన్నపుడు కాపీలు తిరిగొచ్చినా దాన్ని కప్పి పుచ్చుతారు. ఎక్కువ సర్క్యులేషన్‌గా చూపితే వాణిజ్య ప్రకటనలు ఎక్కువొస్తాయి ! కాపీలపరంగా వచ్చే నష్టం ఈ విధంగా పూడుతుంది ! సర్క్యు

లేషన్‌కు మార్కెటింగ్ టెక్నిక్స్ కూడా దోహదపడతాయి. అత్యధిక సర్క్యు లేషన్ గల పత్రిక అయినంతమాత్రాన అది ప్రజాభిమతానికి పూర్తి ప్రాతి నిధ్యం వహిస్తుందని చెప్పలేం.

ప్ర : ప్రాంతీయ పార్టీల ఆవిర్భావంపై మీ కామెంట్ ?

జ : అధికారంలో వున్న పార్టీయే, ప్రాంతీయ పార్టీల ఆవిర్భావానికి కారణం. రాష్ట్రాల వాటాలను, నిధులను కేంద్రం క్రమంగా హరించేస్తోంది. సమస్యల పరిష్కారానికి రాజ్యాంగంలో అంతర్ రాష్ట్రమండలి అని ఒక టున్నా దాని సేవలను ఒక్కనాడూ ఉపయోగించుకున్న పాపాన పోలేదు. మన దేశం యూనియన్ ఆఫ్ స్టేట్స్ అన్న భావననే కోల్పోయి, "కేంద్రం" అన్న భావనతో వ్యవహరిస్తున్నది. ఆ కేంద్ర ప్రభుత్వం పోకడలే ప్రాంతీయ పార్టీల ఆవిర్భావానికి మూలం. దేశంలోని పెక్కు వేర్పాటు ఉద్యమాలకు ఆరంభకులు కాంగ్రెస్‌వారే కావడం అనర్థాల్లోకెల్లా పెద్ద అనర్థం.

ప్ర : నక్సలైట్ల హింసపై ఏమంటారు ?

జ : వ్యక్తిపరమైన హింసను ప్రతివారూ వ్యతిరేకిస్తారు, వ్యతిరేకించాలి. గిరిజనుల్లో నక్సలైట్లు మంచి పేరు సంపాదించారు. ప్రభుత్వం సంక్షేమ కార్యక్రమాలు చేపట్టి ఆ క్రెడిట్‌ను తానే పొందచ్చు గదా. భూస్వాములు, ఇతర దోపిడీదార్ల ప్రయోజనాల పరిరక్షణపైనే ప్రభుత్వ దృష్టి కేంద్రీకృత మైంది. నక్సలైట్ సమస్య సమాజపరమైన సమస్య. సమాజంలో మౌలిక మార్పురానంతవరకూ ఇది కొరకరాని కొయ్య. అధికార హింస, అనధికార హింసల మధ్య సామాజిక వ్యవస్థ తన రూపుదిద్దుకుంటోంది.

---

## అగ్రాసనం పత్రికలదే

ప్రజా బాహుళ్య ప్రచార సాధనాల్లో శక్తివంతమైన రేడియో, టెలివిజన్‌లకన్నా, భావ ప్రకటనా రంగంలో ముందున్నవి వార్తా పత్రికలు. పరిణామ శీలమైన సమాజంలో అభిప్రాయాలన్నీ ఎల్లకాలం ఒకేరీతి వుండవు. మారుతున్న అభిప్రాయాల మార్పిడి, భావసంఘర్షణ, ఈ క్రమానికి దోహదం చేసేది భావ ప్రకటన. వార్త వలన జగము వర్ధిల్లుచుండుననడం కూడా అందుకే వార్తాపత్రికల్లో అంతా వార్తలే వుంటాయనీ, ప్రతి వార్తా జగతి వర్ధిల్ల చేసేదనీ దానికర్థంగా చెప్పుకో నక్కరలేదు. కానీ అనుబంధ వ్యాసంగాలెన్నివున్నా స్థూలంగా వార్తా పత్రికల ప్రయోజనానికి సంబంధించిన ప్రధాన లక్షణంగా ఈ అంశాన్ని పేర్కొనవచ్చు. — సి. రాఘవాచారి.

---

# నిజాలు తప్ప ఇజాలు పట్టని పతంజలి



కె. ఎన్. వై. పతంజలితో కలిసి పనిచేయడంలో ఓ ఆనందం ఉంది ఆహ్లాదం ఉంది. పని చేస్తున్నామన్న శ్రమే తెలీదు. నవ్వుతూ జోకులు రువ్వుతూ, లాలిస్తూ, బుజ్జగిస్తూ, ఎవరేనా తోక ఝాడిస్తుంటే మొట్టికాయలు వేస్తూ అలా అలా సాగిపోతుందాయన పని తీరు. పతంజలి మంచి స్నేహశీలి. తనదైన ముద్ర వేసుకున్న రచయిత. తను నమ్మిన భావాలను నిష్కర్షగా ప్రకటించగల జర్నలిస్టు.

కె. ఎన్. వై. పతంజలి ప్రస్తుతం "ఉదయం" హైదరాబాద్ ఎడిషన్‌కు రెసిడెంట్ ఎడిటర్‌గా ఉన్నారు. అంతకుముందు అంటే 1984 జనవరి ఒకటో తేదీన ఉదయంలో ప్రవేశించకముందు తిరుపతి 'ఈనాడు' ఎడిషన్‌లో చీఫ్ సబ్ ఎడిటర్‌గా ఉండేవారు. తిరుపతి ఎడిషన్‌కు అప్పట్లో ఆయనే ఇన్‌ఛార్జి.

19 5లో ఎమర్జన్సీ వచ్చిన రోజున పతంజలి 'ఈనాడు'లో చేరారు. విశాఖపట్నంలో కొంతకాలం పనిచేశాక విజయవాడ ఈనాడు ఎడిషన్‌కు బదిలీ అయ్యారు ఆ తర్వాత తిరుపతి ఎడిషన్ ప్రారంభంతో తిరుపతికి బదిలీ అయ్యారు.

1952 లో విజయనగరం జిల్లా ఆలమండలో పతంజలి జన్మించారు. చైనాతో యుద్ధం సాగుతున్న రోజులు. అప్పుడు పతంజలికి పదేళ్లు. వీరావేశంతో ఓ దేశభక్తి గీతం రాసేశారు. కవిత్వమంటే, సాహిత్యమంటే ఏమీ

తెలీకుండానే. ఆ ప్రాయంలోనే ఓ డిటెక్టివ్ నవలను ఎక్సర్‌సైజ్ పుస్తకంలో రాసిపారేశారు.

1961 లో ఓ బంధువు టేబుల్ మీద ఓ పుస్తకం ఉంచి వెళ్లాడు. అదో డిటెక్టివ్ నవల. పేరు క్రుకెడ్ మాన్. క్రుకెడ్ మాన్ అంటే దొంగ వెధవ. ఆ దొంగవెధవ గురించి తెలుసుకోవాల్సిందే ననుకుంటూ ఆసక్తిగా ఆ నవల చదివేశాడు. ఇదిగో అలా మొదలైంది పుస్తక పఠనం. 1966 లో ఓ నిరుద్యోగి ఇతివృత్తంగా 'చివరిదారి' పేరిట కథ రాశారు. అదే పతంజలి తొలి కథ. 1967 లో ఈ కథ అచ్చు అయింది. 1968 లో విశాఖలో పి. యు. సి చదువుతున్న రోజుల్లో శ్రీశ్రీ మహాప్రస్థానం కంఠతా పట్టేశారు. ఆ ప్రభావంలో ఆ దారిలో కొన్ని గేయాలు కూడా రాశారు. విజయనగరంలో చదువుతున్నపుడు 'మరో సారా కథ' రాసి ప్రజారథం పత్రిక్కి పంపారు దాన్ని భాట్టం శ్రీరామమూర్తి నడుపుతుండేవారు.

పతంజలి నాలుగైదు నవలలు, 30 కథలు రాశారు. పోలీస్ వ్యవస్థ తీరు తెన్నులను విశ్లేషిస్తూ సాగిన 'ఖాకీవనం' నవల బాగా ప్రాచుర్యం పొందింది 'వీర బొబ్బిలి' పేరిట ఆంధ్రజ్యోతి వారపత్రిక ప్రత్యేక సంచికలో వచ్చిన నవలికపై కూడా బాగా ప్రతిస్పందించారు. ఉదయం వీక్లీలో సీరియల్‌గా వచ్చిన 'అప్పన్న సర్దార్' సెటైర్‌కే కొత్త పదును పెట్టింది. ఈ నవల పతంజలికి మంచి సెటైర్ రైటర్‌గా గుర్తింపు తెచ్చింది.

తెలుగు జర్నలిజం, సాహిత్య విషయాలపై పతంజలితో ఇంటర్వ్యూ ఇలా సాగింది

ప్ర: తెలుగు జర్నలిజం ఇప్పుడెలా ఉంది?

జ: పదేళ్లక్రితం కంటే ఇప్పుడు బావుంది. పూర్వం తెలుగు పత్రికలు మన రాష్ట్రం గురించి, గ్రామీణ ప్రాంతాల గురించి, పట్టణాల్లోని మారుమూల గల్లీల గురించి ఇంతగా పట్టించుకునేవి కావు. అవినీతిని వెలికితీయడం ద్వారా ప్రభుత్వానికి (దగ్యాప్తు జరిపేందుకు) సహాయపడగల స్థితిలో ఇప్పుడు పత్రికలు ఉన్నాయి.

ప్ర: పరిశోధనాత్మక జర్నలిజం తెలుగులో ఏస్థాయిలో ఉందంటారు?

జ: ఉండాల్సిన స్థాయిలో లేదనే చెప్పాలి. ఈ విషయంలో ఇంగ్లీషు పత్రికలతో పోలిక కూడా అనవసరం. వాటి పరిధి వేరు. పత్రికల మధ్య పోటీ కారణంగా, సర్క్యులేషన్‌కోసం తాపత్రయం కారణంగా ముమ్ముందు తెలుగులోకూడా పరిశోధనాత్మక జర్నలిజం బాగా పెరిగే అవకాశాలున్నాయి.

ప్ర: జర్నలిజంపై ఎలా అభిరుచి పెరిగింది?

జ: పొరబాటున, తెలీక జర్నలిజంలోకి వచ్చా-అంతే....

ప్ర: పత్రికా స్వేచ్ఛ గురించి ఏం చెప్తారు?

జ: పత్రికా స్వేచ్ఛకు ఆచరణలో అర్థాలే మారిపోతున్నాయి. నిజానికి పత్రికా స్వేచ్ఛ అంటే - నిజం చెప్పే హక్కు, వార్తలు నిర్భయంగా రాసే హక్కు, సమాచారాన్ని తెలుసుకునే హక్కు తెలియచేసే హక్కు - ఇప్పుడు పత్రికా స్వేచ్ఛకు అర్థం యాజమాన్యపు వ్యాపార స్వేచ్ఛగా మారింది.

ప్ర: "ఉదయం" పాలసీ ఏమిటి? సంచలనమే ధ్యేయంలా కన్పిస్తుంటుంది?

జ: ఇతర పత్రికల్లా "ఉదయం" ఏ రాజకీయ పార్టీని సమర్థించడం లేదు మా సిబ్బందిపై ఏ విధమైన ఆంక్షలు లేవు. తప్పుంటే ఎవరినైనా ఎండగడుతున్నాం. ప్రజాస్వామ్య హక్కుల కోసం, ప్రజాస్వామ్య విలువల కోసం పోరాటం జరుపుతున్న పత్రిక, పౌరహక్కుల కోసం కాలమ్ నడిపిన ఏకైక పత్రిక కూడా ఉదయమే. అవినీతిని ఒక ఉద్యమంలా బయటపెట్టే కార్యభారాన్ని 'ఉదయం' భుజానికెత్తుకుంది. ఇలాంటి సందర్భంలో కొంత సంచలనంగా కన్పడవచ్చు. అవినీతిని బయటపెట్టడంద్వారా - నైతిక విలువలకు కట్టుబడిఉండాలనే ఆలోచన బలపడటానికి దోహదపడుతోంది ఉదయం.

ప్ర: "ఉదయం" ఆవిర్భావంతో జర్నలింలో వచ్చిన మార్పేమిటి?

జ: "ఈనాడు" రాకతో గ్రామీణప్రాంత వార్తలు వెలుగు చూశాయి. "ఉదయం" రాకతో గ్రామీణ ప్రాంతాల్లోని దౌర్జన్యాలు, దుష్పాలన, అవినీతి, ఆశ్రిత పక్షపాతాలు వెలుగు చూస్తున్నాయి.

ప్ర: కర్నాటకలో అల్లర్లకు దారితీసిన ఓ కథను మీరు రీప్రొడ్యూస్ చేశారు. అది మీ అరెస్ట్‌కు కూడా దారితీసింది?

జ: రీప్రొడక్షన్ కాదు. ఆ కథను కంపోజ్ చేయించి వేయలేదు. కర్నాటకలో వివాదం సృష్టించిన కథ ఇదేనని చెప్పడానికి ఆ కథ అచ్చు ప్రతిని చిన్నసైజు ఫొటో తీయించి వేశాం. ఇందులో ఇతరత్రా ఉద్దేశాలు ఏం లేవు. తెలియపరచాల్సిన బాధ్యత పత్రికలది. తెలుసుకునే హక్కు పాఠకులది.

ప్ర: మీరు ఏ రాజకీయ సిద్ధాంతాన్ని సమర్థిస్తారు?

జ: ప్రత్యేకంగా ఒక రాజకీయ సిద్ధాంతమంటూ లేదు.

ప్ర: నక్సలైట్ల హింసపై మీ కామెంట్ ?

జ: అది ప్రవృత్తిలోంచి వచ్చిన హింస కాదు. అది ధోరణి కూడా కాదు. అదో రాజకీయ పంథా అనే భావంతో హింసామార్గం ఎంచుకున్నారు. అది హింస కాదు ప్రతిహింస అంటున్నారు.

ప్ర: మీ దృష్టిలో కథ, నవల, కవిత్వం, నాటకం - ఈ నాలుగు ప్రక్రియల్లో ఏది కష్టం ?

జ: ప్రక్రియకు సంబంధించి ప్రత్యేక కష్టం అంటూ ఉండదు. కొందరు కవిత్వమే రాయగలరు. మరికొందరు కథలు, నవలలు మాత్రమే రాయగలరు ఇంకొందరు నాటకాలే రాయగలరు. ఇది వ్యక్తిగతం. విశ్వనాధ సత్యనారాయణ వంటి సమర్థులు, ప్రతిభాశీలురూ అన్ని ప్రక్రియల్లో రాశారు.

ప్ర: విలువలపరంగా ఏ ప్రక్రియ అగ్రగామిగా ఉంది.

జ: కవిత్వమే.

ప్ర: ఇప్పుడు తెలుగు సాహిత్యంలో నవలే రాజ్యం ఏలుతోంది ఎంచేత?

జ: డబ్బులొస్తున్నాయి కాబట్టి. సాహిత్య విపణిలో నవల రాజ్యం ఏలుతోందనండి బావుంటుంది. అయినా దీన్నో ట్రెండ్‌గా భావించాల్సిన పని కూడా లేదు. పూర్వం కొవ్వలి, జంపని నవలలకు సాహిత్య గౌరవం వుండేది కాదు. వాళ్ళ నవలలను ఏ పత్రికల్లో వేసేవారు కారు. వారే సొంతంగా అచ్చేసుకునేవారు. అప్పట్లో ఆ నవలల్ని జనం విపరీతంగా చదివారు. కాల గతిలో పత్రికలకు వ్యాపార దృష్టి, లాభాపేక్ష పెరిగింది దీంతో జనం ఏది చదువుతారో అది అందివ్వాలన్న తపనతో ఒకప్పటి ద్వితీయ, తృతీయ శ్రేణి రచయితలకు పత్రికలు ప్రధమ స్థానాన్ని కల్పించాయి. ఈ వ్యాపార ధోరణులు చాలాకాలం కొనసాగుతాయి. కాలక్షేపం కావల్సినంత కాలం ఈతరహా నవలలు వస్తూనే ఉంటాయి. మీరు గమనించారో లేదో - టి. వి. ప్రసారాలు బాగా పుంజుకున్నాక వ్యాపార నవలల వెర్రి కొంత తగ్గింది. కాలక్షేపానికి నిన్నటివరకూ పూర్తిగా నవలలమీద ఆధారపడ్డారు. ఇప్పుడు కాలక్షేప మార్గాలు విస్తృతమవుతున్నాయి.

ప్ర: ఈ నవలా ధోరణులవల్ల చెరపు ఉండదంటారా ?

జ: సాహిత్యానికి వీటివల్ల వచ్చే కీడు ఏమీ ఉండదు. సాగరంలో మురికి కాల్వలు అనేకం వచ్చి కలుస్తుంటాయి. పెద్ద హాని ఏముంటోంది, ఇదీ అంతే.

ప్ర: ప్రజా కళలని వేటిని అంటారో చెప్తారా ?

జ: కళలు, సాహిత్యం అందరికీ చెందినవి. మరప్పుడు ప్రజాకళలని, ప్రజాసాహిత్యమని ముద్ర వేయడంలో అర్థం లేదు. గద్దర్‌ను చాలామంది ప్రజా కళాకారుడని అంటారు. కానీ నేను మాత్రం కళాకారుడిగానే గౌరవిస్తాను. కథ చెప్పడంలో, బొమ్మ వేయడంలో పాటపాడటంలో జానపద రీతి, జానపద సంప్రదాయం అంటే నేను ఎక్కువగా ఇష్టపడతాను.

ప్ర: కళాకారులకు నిబద్ధత కావాలా ?

జ: కళాకారుడైనా, రచయిత అయినా ప్రతి ఒక్కరూ ఏదో ఒక విలువలకు నిబద్ధులైనవారే. నిబద్ధత లేకుండా రచయిత, కళాకారుడు ఉండరు. సరైన అవగాహన లేని నిబద్ధత మాత్రం నిరుపయోగ మవుతుంది.

ప్ర: మిమ్మల్ని ప్రభావితం చేసిన రచయితలు, కవులు, జర్నలిస్ట్‌లు

జ: గురజాడ, శ్రీశ్రీ, రావిశాస్త్రి, కాళీపట్నం రామారావు. జర్నలిస్ట్‌లెవరూ లేరు. మంచి కవిత్వం ఎక్కడున్నా అభిమానిస్తాను.

ప్ర: రచయితగా, జర్నలిస్ట్‌గా మి లక్ష్యాలు. మీరు ఏమేం రాయాలని సంకల్పించారు ?

జ: నాకు ప్రత్యేకించి లక్ష్యాలంటూ ఏమీ లేవు. ఇక ప్లాన్ చేసుకున్న రచనల గురించి - విలువలకు సంబంధించి కొన్ని సెటైర్‌లు రాయదల్చుకున్నాను. నా బాల్యం నుంచి ఇప్పటివరకూ వచ్చిన మార్పుల్ని నవలగా రికార్డ్ చేస్తా. అయితే ఇది స్వీయకథ కాదు.

---

## ప్రజాశక్తి — పత్రికలు

పత్రికాధిపతులు తమ బాధ్యతను గుర్తించినకొలది, అధికారులును, సంస్కారులును పత్రికా నిర్వహణమునకు బూనుకొనిన కొలదీ, దేశములోని రాజకీయ సాంఘిక పరిస్థితులు పరిష్కృతములై ప్రజాశక్తి జాగరితమైన కొలదీ పత్రికల పలుకుబడి, వశీకరణశక్తి, స్వాతంత్ర్యదీప్తి హెచ్చునే కాని తగ్గనేరవు.

— ముట్నూరి కృష్ణారావు.

---

# 'పాఠక' శాస్త్ర బారెట్లా-దాట్ల



దాట్ల నారాయణ మూర్తిరాజు రాసింది తక్కువ కథలే, అయినా గత దశాబ్దంలో వచ్చిన కథకుల్లో దాట్ల నారాయణ మూర్తి రాజుకి కథకునిగా ప్రత్యేక గుర్తింపు ఉంది. కథకు ప్రాణమైన చక్కని భాష, శైలి, శిల్పాలకు ఆయన కథలు నిదర్శనాలు. ఆయన దివాణం కథలు ఎక్కువ మందికి తెలీని, అలనాటి క్షత్రియ కుటుంబాల విషాద నేపథ్యాలు. ఊగరా ఊగరా ఉరికొయ్య నందుకుని ఊగరా, జయ జయ జయహే, జాతీయ గీతం, దూదిపులి తదితర కథలు ఆయన కలం పదునుతో పాటు, వ్యవస్థపట్ల ఆయన అవగాహనను తెలుపుతాయి. అరచేతిలో నరకం పేరిట రాసిన నవల కమర్షియల్ వేవ్‌లో నిలదొక్కుకొన్న మంచి నవల. జర్నలిజంలోకి నాలుగేళ్ళ క్రితమే వచ్చినా ఇవాళ 'దాట్లం'టే అందరికీ తెల్సు. ఉదయం ఆదివార పత్రిక ఇన్‌చార్జిగా దాట్ల 'సండే మేగజైన్'లో చేసిన చాలా మార్పులు మిగతా చాలా వీక్లీలు, సండే పత్రికలు కూడా అనుసరించాయి, అనుసరిస్తున్నాయి. 'సండే మేగజైన్'ని ఏ 'వీక్లీ'కి తీసిపోకుండా పాఠకుల అభిరుచి మేరకు నవరసాలను కలిపి ఇచ్చిన ఘనత మేగజైన్ సెక్షన్లో 'దాట్ల'కు ప్రత్యేకమైన స్థానాన్ని ఏర్పరచింది. అదే కాకుండా ఒక్క హైద్రాబాద్ ప్రాంతానికి చెందిన రచయితల కే ప్రాధాన్యత నివ్వకుండా చాలా ఎక్కువ మంది కొత్తవాళ్ళ చేత రచనలు చేయించి వారిచేత

పత్రికకు అనుగుణంగా రాయించి, ప్రోత్సహించడం కాడా దాట్ల పొందిన గుర్తింపునకు ఒక కారణం. మామూలు పాఠకుడికి ఏం కావాలో ఎలా ఇవ్వాలో 'లే అవుట్'లో ఎన్నెన్ని కొత్త పోకడలు చేయొచ్చో, అన్నీ చేస్తున్న 'దాట్ల'కు అతి తక్కువ కాలంలో మేగజైన్ సెక్షన్లో గుర్తింపు, పేరు రావడానికి బాట వేశాయి. దాట్ల నారాయణ మూర్తిరాజుతో ఇంటర్వ్యూ చదువుదాం.

ప్ర: దిన పత్రికల అనుబంధాలు పాఠకుల బలహీనతలను కాష్ చేసుకునే ప్రయత్నం చేస్తున్నాయి. అర్ధనగ్న దృశ్యాలు, సెక్స్‌తో ముడిపడిన కథలు ఈ ప్రయత్నంలో ఒక భాగం. ఈ ధోరణి ఎంతవరకు సమర్థనీయం?

జ: 'సెక్స్'ని సైన్స్ పేరుతో వేస్తూ పాఠకుల బలహీనతల్ని 'కేష్' చేసుకోవడం, సెక్స్‌ని సెక్స్ పేరుతోనే వేస్తూ 'కేష్' చేసుకోవడం. ఇదంతా తప్పే. వేరే దారిని వెళ్ళేందుకు 'దారి' కన్పించనంత కాలం ఇదే దారి.

ప్ర: ఆదివారం మాగజైన్లలో ఇటీవల కాలంలో రూపంలో, సరళిలో కొట్టొచ్చిన మార్పు కనిపిస్తోంది. ఈ మార్పునకు బాట వేసిన కారణాలు ఏమై ఉంటాయి. ఈ మార్పు సవ్యమైన ఆరోగ్యకరమైన ధోరణిలో ఉందంటారా?

జ: రూపంలో, సరళిలో వచ్చిన మార్పు ఆరోగ్యకరమైందే. ఎందుకంటే పాఠకుడిని ఆకర్షించడమే దీని ప్రధాన ఉద్దేశ్యం కాబట్టి. ఒకప్పుడు 'ఆదివారం అనుబంధాలు' ప్రధానంగా సాహిత్యానుబంధాలుగా ఉండేవి. ఆరు రోజులూ వార్తలతో విసిగి పోయే పాఠకులకు సాహిత్యం పట్ల అభిరుచిని, మక్కువను కలిగించేందుకు వాటిని ఉద్దేశించారు. రాను రానూ అనుబంధాల్లో సాహిత్యం కరువైంది. బతుకులో వేగం పెరిగింది. సైన్సు, టెక్నాలజీ అభివృద్ధి చెందుతోంది. ప్రధానంగా టీ.వీ వీడియోలు ఊహించనంత ఎదిగి ప్రజల మధ్య కొచ్చాయి. ఏదైనా క్షణంలో చూసేసి 'జ్ఞాను'లై పోతున్న ప్రజలు కాసేపు కూర్చుని చదవడం ఇబ్బంది అవుతోంది. పేజీలకు పేజీలు చదివే ఓపిక కూడా లేదు. దానికవసరమైన అభిరుచి కూడా కొరవడుతోంది. వింతలు, విడ్డూరాలు క్రైం కథలు చదివే పాఠకులు ఎక్కువవుతున్నారు. అలాంటి వాళ్ళే ఎక్కువమంది ఉంటున్నారు.

దీంతో పాటు తెలుగు ఆదివారం అనుబంధాల్ని గత పది హేనేళ్ళుగా పరిశీలిస్తే అప్పటికీ, ఇప్పటికీ, పాఠకులకు అందిస్తున్న 'విషయం'లో ఏం తేడా లేదు. అందుకే రూపంలో మార్పు అనివార్యమైంది. కొత్త సీసాలో పాత సారా అనే పద్ధతే. కొత్త కొత్త గ్లేజ్డ్ పేపరు మీద, రంగుల ఆకర్షణల

మధ్య పాత విషయాలు. అవీ ఎక్కువ శాతం చౌక బారు విషయాలు. పత్రికా యాజమాన్యాలకు ఆదివారం అనుబంధాల పట్ల సరైన అవగాహన ఇప్పటి వరకూ లేదు. ఉంటే అవి ఇలా ఉండవు.

ప్ర: పత్రికలు ఇటీవల పాఠకుల పార్టిసిపేషన్‌కు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నాయి. కొన్ని పత్రికలు క్విజ్‌లు, పిల్లల ఫొటోలు, సీరియల్స్, రచయితల జవాబులు ఇస్తున్నాయి. రీడర్స్ పార్టిసిపేషన్‌వల్ల పత్రికకు లాభముంటుందా? ప్రధానంగా పత్రిక సర్క్యులేషన్‌కు ఉపకరిస్తుందా?

జ: పత్రికల్లో రోజువారీ మనమిచ్చే వార్తలకన్నా, ప్రధానంగా పాఠకుడిని 'హ్యూమన్ ఇంటరెస్టింగ్ స్టోరీ' ఆకర్షిస్తుంది. ఇందుకు నిదర్శనం ప్రతి రోజూ ఏదో ఒక 'హ్యూమన్ ఇంటరెస్టింగ్ స్టోరీ' ఉండాలని ఓ పత్రికా యాజమాన్యం పట్టుబట్టడం నాకు తెల్సు. ఎక్కడో చోట జరిగే ఈ కథల్నిచ్చి పాఠకుల్ని ఆకర్షించడానికి బదులు, ఆ పాఠకుడికి సమీపంలోనున్న కథల్ని, దృశ్యాల్ని, అనుభూతుల్నిస్తే ఇంకా ఆకర్షితుడవుతాడు. ఆ పాఠకుడిని పత్రికలో 'ఇన్‌వాల్వ్' చేస్తే పత్రికతో ఆ పాఠకుడి అనుబంధం పెరుగుతుంది. ఆ అనుబంధం పెంచడం కోసమే రీడర్స్ పార్టిసిపేషన్ పద్ధతి ఉపయోగించడం జరుగుతోంది. ఏ పద్ధతైనా 'మూసలో మంద'లా చేస్తే ఉపయోగం ఉండదు. వెరైటీ ఉండాలి. ఆ వెరైటీ సంపాదకుడికి రీడర్స్ మీదున్న అవగాహన ద్వారా మాత్రమే వస్తుంది. ఇది తప్పనిసరిగా పత్రిక 'సర్క్యులేషన్' పెరుగుదలకు ఆస్కారం అవుతుంది.

ప్ర: వార్తాపత్రికలు రోజువారీ సీరియల్స్, డైలీ సీరియల్స్ ఇవ్వడం సమర్థనీయమా? వార్తలను మాత్రమే ఇవ్వడం పత్రిక మౌలిక ధ్యేయం. ఆ ప్రధాన సూత్రానికి భిన్నంగా సీరియల్‌తో పాఠకుడిని ఆకర్షించాలనుకోవడం సరైన పద్ధతా?

జ: వార్తాపత్రిక ఎప్పుడూ ఏ ఒక్క వర్గం పాఠకులకోసం కాదు గదా! వార్తలను మాత్రమే పాఠకుడికి ఇవ్వాలనుకునే స్థాయినుంచి పాఠకుల భిన్న భిన్న అభిరుచుల మేరకు పత్రికను తయారుచేయాలనే 'సరికొత్త రూపాన్ని' ఇవాళ దినపత్రిక పొందింది. అందుకే సీరియల్స్ వచ్చాయి. ప్రతి రోజూ సాహిత్యం స్త్రీ, బాల, వృద్ధ, యువక, స్పెషల్స్ వచ్చాయి. భవిష్యత్‌లో ఈ రూపం మారుతుంది. ఏం కావాలనుకున్నవాడికి దానిని సరైన పద్ధతిలో ఇవ్వడం వ్యాపారం. ఇవాల్టి పత్రికలు ఆ పక్కా వ్యాపారానికి చక్కని నిదర్శనాలు, అంచేత 'సీరియల్స్‌తో కట్టిపడేయడం' అనేది విషయంకాదు.... ఇందులో

ఒక ప్రధానమైన విషయం ఉంది. 'సీరియల్స్'ని సాహిత్యంలో ఓ భాగంగా పత్రికలు వేస్తున్నాయా? లేక కాలక్షేపంకోసం 'సీరియల్' అనే ఒక కొత్తరకం 'వాణిజ్య ప్రక్రియ'ను కనిపెట్టి, దానిద్వారా పాఠకులను కట్టేయడం జరుగుతోందా? దీనికి జవాబు చెప్పుకోవాలంటే ఇవాళ 'సీరియల్'సాహిత్యంలో ఒక భాగం కాదు. 'వాణిజ్య ఆకర్షక ప్రక్రియ'. మార్పు అనివార్యమయ్యే, 'ఫోర్త్ ఎస్టేట్'లో ఇదికూడా ఒక మార్పే. బహుజన ప్రాచుర్యంకోసం ఈ 'ప్రక్రియ' పత్రికల్లో తలెత్తింది కాబట్టి పాఠకుల 'మోజు'న్నంత కాలం ఇది ఉంటుంది. తర్వాత చాలా పోయినట్టే ఇదీ పోతుంది. నవల లుంటాయి. ప్రతి రోజూ డైలీతోపాటు ఒక 'డైరెక్ట్' నవలే రావొచ్చు. మనం చెప్పలేం....

ప్ర: ఇప్పటికే వార్తాపత్రికల అనుబంధాలు, వారపత్రికల సైజుతో విషయంతో పోటీపడుతున్నాయి. ఇది వారపత్రికల మనుగడకు ప్రమాదం అని కొంతమంది మాట. ఈ మాటలో నిజముందా?

జ: నూటికి నూరుపాళ్లూ నిజమే ఉంది. వారపత్రికలు, ఆదివారం అనుబంధాలు రెండూ వారానికొకసారి వచ్చేవే. రెండిటి సదాశయం పాఠకుర సత్కాలక్షేపమే. ఆలస్యంగానైనా ఎదిగిన ఆదివార అనుబంధాలు వారపత్రి కల్ని పక్కకు నెడతాయి. ఆదివారం అనుబంధాల్లో ఇంకా జరగాల్సిన మార్పులు చాలాఉన్నాయి. వాటిలో కొన్ని ప్రధానమైన మార్పులు 1990లోపే జరుగుతాయి.

ప్ర: ఒకప్పుడు పాఠకుడి చేత ఏం చదివించాలో ఆలోచించేవారు. ఇప్పుడు పాఠకుడిని ఏది 'ఆకర్షిస్తుందో'నని అన్వేషిస్తున్నారు. పాఠకుడిని 'ఎడ్యుకేట్' చేయడం అనే దృష్టినుంచి దిగువకు దిగడంపై అభిప్రాయం?

జ: వ్యాపార దృక్పథం. ఒకప్పుడు ఉత్తమ విలువల్ని పాఠకులకు ఇవ్వాలని, విశ్వమానవ శ్రేయస్సుకోసం పాటుపడాలని, దేశానికి స్వాతంత్ర్యం కావాలని, మూఢాచారాలు నాశనం కావాలని,మనిషి మనిషిగా నిలవాలని వగైరా ఆశయాలతో పత్రికలను నడిపించిన వారు సంపాదకులైతేనేమి, యాజమాన్యం అయితేనేమి, పత్రికలను 'రాబడి' సాధనాలుగా భావించలేదు. ఇప్పటి పరిస్థితి వేరు. ఇప్పటి పత్రికా సమాజానికి 'ఎడ్యుకేట్' చేయడం అనే పదం చాలా పెద్దది. ఆ పదానికి అర్థాలు కూడా వేరుగా ఉంటున్నాయి. మెజీషియన్ పెట్టె లోపలి పెట్టెలాంటి పెట్టుబడిదారీ వ్యవస్థలోని 'పత్రికా' ప్రపంచంలో పనిచేసే 'సంపాదకుడు' పాఠకుల్ని 'అలరించ'డానికే ఉపయోగపడుతున్నాడు తప్ప 'ఎడ్యుకేట్' చేయడానికి ఉపయోగపడలేక పోతున్నాడు. దానికి కారణం పూర్తి స్వతంత్రం లేకపోవడం.

ప్ర: రానున్న పదేళ్లకాలంలో తెలుగు పత్రికల్లో, మాగజైన్ విభాగాల్లో ఏ యే మార్పుల్ని ఊహిస్తున్నారు ?

జ: తెలుగు డైలీ విడి ప్రతి ఐదు రూపాయలు, దానికి దగ్గరగా రావడం మన కళ్ళముందే జరగొచ్చు. రోజుకు ముప్పై నలభై పేజీల్తో డైలీ రంగు రంగుల హరివిల్లుల్లా రావొచ్చు. ఆదివారం అనుబంధాలు వీక్లీలా 150 పేజీల్తో, డైలీలతోపాటు రావొచ్చు. రాన్రానూ ఇప్పుడొస్తున్న వీక్లీల రూపం మారే అవకాశం ఉంది. తక్కువ ధరకు అవి కుంచించుకుపోవొచ్చు. కంప్యూటర్ యుగంలో విప్లవాత్మక మార్పులు రావడం సహజమే. కానీ ప్రజల అభిరుచుల్ని అంచనా వేయడం కష్టం. ఎందుకంటే అక్షరాస్యతలో అనాదిగా మన రాష్ట్రం వెనుకంజలో ఉంది కాబట్టి.

ప్ర: ప్రస్తుత సాహిత్యంలో నవలే రాజ్యం చేస్తోంది. పాఠకుడి బలహీనత ఆసరాతో అది నడుస్తోంది. ఈ పోకడలో మంచికథలు రావడం లేదు. నవలారాజ్యంలో తెలుగుకథ చిన్నబోతోంది. కామెంట్?

జ: ఇప్పుడొస్తున్న నవలల్లో ఎక్కువ శాతం నవలలు కావు. ఉత్తి 'గీతలు' ఎలా చిత్రాలు కావో, ఉత్తి రాతలు నవలలూ కావు. అడపాదడపా మంచి నవలలొస్తున్నాయి. వాటి గురించి ఎవరికీ ఏమీ తెలీడం లేదు. బురద నీటి అడుగున తేట నీరెప్పుడూ ఉంటుంది. ఈ పరిణామం ఇలా ఎప్పుడూ ఉండిపోదు. అలాగే కథ కూడా. కథల్లో ఇప్పటికీ మంచికథ లొస్తున్నాయి. వస్తాయి. జీవితంలోగాని, సాహిత్యంలోగాని ఉత్తమ విలువల్ని ఎవరూ హత్య చేయలేరు. కాని గుర్తించకపోవచ్చు. దానికి చాలా కారణాలు ఉన్నాయి. ఉంటాయి. కారణాలు, దశాలు అయిపోయాక విశాలమైన మైదానంలో లేత మొక్కలు కొత్త ఊపిరితో మొలకెత్తి శ్వాస పీలుస్తాయి. తప్పదు.

ప్ర: రచనల ఎంపికలో మీరనుసరించే సూత్రాలు, ప్రమాణాలు ?

జ: జనబాహుళ్యానికి పత్రికను దగ్గరగా తీసికెళ్ళడమే ప్రస్తుతానికి నా ధ్యేయం. సత్సాహిత్యాన్ని వెయ్యలేకపోయినా పర్వాలేదు. చెడ్డ సాహిత్యాన్ని మాత్రం 'పాఠకుల అభిరుచి' పేరిట వారిమీద రుద్దకుండా ఉండేందుకు తీవ్ర ప్రయత్నం చేస్తున్నాను. నాకుండే పరిధిలో సాధ్యమైనంత మంది ఎక్కువమంది 'రచయితల్ని' తయారుచేసే ఉద్దేశం ఉంది.

# కార్టూనిస్ట్ శ్రీధర్‌తో కాసేపు



భూమికి జానెడు మనిషి. బక్కపలచని శరీరం. ఎప్పుడూ పెదిమలపై తొణికిసలాడే చిర్నవ్వు. రాజకీయ నాయకులపై చురకలువేస్తూ లక్షలాది 'ఈనాడు' పాఠకులను తనదైన ముద్రతో ఆకర్షిస్తున్నది ఈ కుర్రాడేనా అని అతనితో పరిచయం లేని వారు కాసేపు అవాక్కవుతారు. అతని పేరు శ్రీధర్. స్వయం కృషితో ఎదిగివచ్చిన కుంచె వీరుడతను. పొట్టివాడయినా గట్టివాడని నిరూపించినవాడతడు. ఇంటిపేరు వంటి 'తోకలు' గిట్టనివాడు.

నల్గొండ జిల్లా పోచంపల్లి మండలం జీలుకపల్లి గ్రామం స్వస్థలం. ఊహ తెలిసినప్పటినుంచి పిచ్చిగీతలు, మట్టిబొమ్మల తయారీయే శ్రీధర్ వ్యాపకమైంది. ఊపిరిలో ఊపిరయింది. పెద్దవాళ్ళు వద్దన్నా, కాదన్నా, వారించినా బొమ్మలపై మక్కువపోలేదు. బొమ్మలకే గుండెల్లో కోవెల కట్టాడు. ఆ బొమ్మల్లోనే కాలక్షేపంచేస్తూ వాటిలోనే తృప్తిని గ్రోలుతూ, కాలం దొర్లించేశాడు. స్కూలుకు వెళ్ళి 'అ, ఆ'లు నేర్చుకోకపోయినా, హైదరాబాద్ వచ్చి ఏకంగా ఆరో క్లాసులో చేరిపోయాడు. ఆరో క్లాసునుంచి ఇంటర్‌వరకూ నిరాటంకంగా చదువు కొనసాగింది. ఈ మధ్యకాలంలో ప్రాణంలో ప్రాణమైన బొమ్మలకు తాత్కాలిక తెరపడింది. ఇంటర్ చదివేటపుడు శ్రీధర్ కూడా ఇంజినీర్ కావాలని కలలు కన్నాడు. విదేశీ భాషలు నేర్చుకోవాలని ఆశపడ్డాడు. ఇంజినీర్ కల కలగానే మిగిలింది. అదే అతని జీవితంలో మలుపు. ఆ మలుపే తెలుగుప్రజకు ఒక మంచి కార్టూనిస్టును ఇచ్చింది. ఇంజినీరింగ్ సీటుపై ఆశ వదులుకున్న శ్రీధర్ బికామ్‌లోనయితే చేరాడు. బాలేదని చెప్పి మానేశాడు. ఈసారి బి. ఎస్. సి. (ఎలక్ట్రానిక్స్) లో ప్రవేశించాడు. ఈ దశలో ఆరోగ్యం పాడయింది. తట్టా బుట్టా సర్దుకుని ఇంటికెళ్ళిపోయాడు. అప్పుడు మళ్ళీ శ్రీధర్‌కు బాల్యం గుర్తొచ్చింది. తన పిచ్చిగీతలు,మట్టిబొమ్మలు స్ఫురణ

కొచ్చాయి. అవి ఇచ్చిన ఆనందపు తలపుల్లో తేలియాడాడు. మళ్ళీ బొమ్మల వ్యాపకం మొదలయింది. రెండు మూడు నెలలపాటు తోచిన బొమ్మలు గీసుకుంటూ కాలం గడిపేశాడు.

సితార సినిమా పత్రికకు లే అవుట్ ఆర్టిస్ట్ కావాలని 79 లో ప్రకటన రావడం చూసి అప్లయి చేశాడు. సితారనుంచి పిలుపొచ్చింది. ఇంటర్వ్యూలో ఓ బొమ్మ వేసి చూపమన్నారు. మామూలు పెన్నుతో బొమ్మ గీసిచ్చి శభాష్ అనిపించుకున్నాడు. ఆర్టిస్ట్‌గా సితారలో ఉద్యోగం ఇచ్చారు. సితారలో చేరే సమయానికి కూడా బొమ్మల్ని ఇండియన్ ఇంక్‌తో వేస్తారన్న కనీస పరిజ్ఞానం నాకు లేదు అంటూ శ్రీధర్ జ్ఞాపకాల పుటల్లోకి వెళ్లారు. ఉన్న విషయాన్ని డాంబికాలు లేకుండా ఒప్పుకునే వ్యక్తిత్వం మరి శ్రీధర్‌ది. సితారలో లే అవుట్ ఆర్టిస్ట్‌గా ఉంటూ సితార, విపులల్లో కార్టూన్లు గీయసాగాడు. లైన్ బావుంది, ఎవరబ్బా ఇతగాడు? అని రామోజీరావు శ్రీధర్‌పై దృష్టి సారించారు. "ఈనాడు'లో పాకెట్ కార్టూన్లు (ఇదీ సంగతి) వేయమని ప్రోత్సహించారు. అలా 81 నుంచి పాకెట్ కార్టూన్లు వేస్తున్న శ్రీధర్ తెలుగుదేశం పార్టీ ఆవిర్భావానికి ముందు పూర్తిస్థాయి కార్టూనిస్ట్ అయ్యాడు. ఒక పక్క ఉద్యోగ ధర్మాన్ని నిర్వహిస్తూనే మరోపక్క అర్ధంతరంగా ఆగిన చదువునూ సాగించాడు. పొలిటికల్ సైన్స్‌లో యం. ఎ. చేశాడు.

అన్ని రంగాల్లో మాదిరే కార్టూన్లపరంగా కూడా గత దశాబ్ద కాలంలో అనూహ్య మార్పులు వచ్చాయన్నారు శ్రీధర్. పాఠకుల అభిరుచులు మారుతున్నాయి. కార్టూనిస్ట్‌లమధ్య పోటీ పెరిగింది. సామాజిక జీవనంలో మార్పులు చోటు చేసుకుంటున్నాయి. పురాణ పాత్రలు స్టేల్ అయిపోయాయి. తలిశెట్టి రామారావుగారు లావుపాటి అమ్మాయి అరటి తొక్కమీద కాలువేసి జారిపడినట్టు బొమ్మ వేస్తే పాఠకులు ఎంజాయ్‌చేసేవారు. ఈ మధ్యవరకూ అంజయ్యకు తోక పెడ్తే బాగా రిసీవ్ చేసుకునేవారు. కానీ ఇప్పుడు పరిస్థితి అలా లేదు. కొత్త ఆలోచనలు, కొత్త పుంతలు తొక్కాల్సి వస్తోంది. అలా కొత్తదనాన్ని చూపించే కార్టూనిస్ట్‌కు మాత్రమే ఈ రోజుల్లో ఆదరణ మరి అని కుండబద్దలు కొట్టినట్లు శ్రీధర్ చెప్పారు.

అంజయ్యను గీతల్లో మలచటానికి పెద్దగా కష్టపడలేదు. ఎందుకంటే అంజయ్యపై అప్పటికే సుప్రసిద్ధుల కార్టూన్లు వచ్చాయి. ఆ కార్టూన్ల మార్గదర్శకత్వంలో చాలా తేలిగ్గా అంజయ్యను పట్టేశాను. అంజయ్య రూపం తేలిగ్గా బొమ్మలో ఇముడుతుంది. ఎన్టీరామారావు విషయంలోనే బాగా కష్టపడ్డాను. ఆయన రాజకీయాల్లోకి వస్తున్నారని తెలియగానే ఎన్టీఆర్ బొమ్మను

సాధన చేయటం మొదపెట్టాను. వందల సంఖ్యలో ఎన్టీఆర్ స్కెచ్‌లు గీసు కున్నాను. ఆ కృషి ఫలించింది. ఇప్పుడు ఎన్టీఆర్ బొమ్మను కళ్లు మూసుకుని వేస్తాను అన్నారు శ్రీధర్. అనటమే కాదు కళ్ళు మూసుకుని ఎన్టీఆర్ బొమ్మను వేసి మరీ చూపించారు

అందంగా ఉండేవాళ్లపై కార్టూన్లు గీయటం కొంత కష్టం. ఎన్టీఆర్ విషయంలో మొదట్లో ఎక్కువ సాధన చేయాల్సి వచ్చింది అందుకే-ఏ ఇందిరా గాంధో అనుకోండి, కొటపాటి ముక్కు, బాబ్డు హెయిర్‌తో ఇందిర పోలిక తెప్పించేయచ్చునన్నారు శ్రీధర్, ఓ పక్క తలవంచుకుని బొమ్మలు గీసు కుంటూనే.

శ్రీధర్ ఏడింటికల్లా నిద్రలేస్తాడు. పేపర్లన్నీ తిరగేస్తాడు. ఆ రోజు ముఖ్య వార్తలు, పరిణామాలను నోట్స్ రాసుకుంటాడు. పదింటికల్లా ఆఫీసు కొచ్చేసి పనిలో పడతాడు. రాత్రి మళ్ళీ ఏ ఎనిమిదికో తొమ్మిదికో ఇంటికి చేరి ఒంటిగంటదాకా పుస్తక పఠనం. ఇంటిదగ్గర మాత్రం బొమ్మలు గీయనే గీయడాయన. అందరి కార్టూనిస్టుల మాదిరే స్కెచ్ బుక్‌తోపాటు జనరల్ కార్టూన్ల కోసం ఆలోచనా పుస్తకం మెయిన్‌టెయిన్ చేస్తాడు. ఎవరైనా ఓ రాజకీయవేత్త ఫొటో ఉంటే భవిష్యత్ అవసరాలకోసం ఆ ఫొటోనుంచి రేఖా చిత్రం గీసుకుని భద్రపరుచుకునే పుస్తకమే స్కెచ్ బుక్. బస్సుల్లో ప్రయా ణిస్తున్నపుడో, ఫ్రండ్స్‌తో మాట్లాడుతున్నపుడో, ఇంకే ఇతర సందర్భంలోనో చటుక్కున ఓ ఆలోచన బుర్రలో మెరుస్తుంది ఆ ఆలోచనను గుర్తుగా రాసు కునేదే ఆలోచనల పుస్తకం. ఎప్పుడేనా జనరల్ కార్టూను వేయడానికి ఈ పుస్తకం స్ఫూర్తిగా నిలుస్తుంది.

నాదెండ్ల భాస్కరరావు అక్రమంగా ఎన్టీఆర్‌నుంచి అధికారాన్ని హస్త గతం చేసుకుని నెలరోజుల పాలన సాగించాడు. ఎన్టీఆర్, నాదెండ్ల అక్రమా నికి వ్యతిరేకంగా పెద్ద ఉద్యమాన్నే నడిపి చివరకు విజయం సాధించి తన పదవిని తాను పొందగలిగాడు. ఈ నెలరోజుల కాలంలో అనేక నాటకీయ పరిణామాలు, క్షణక్షణం ఉత్కంఠ, మలుపులు చోటు చేసుకున్నాయి. ఈ పరి ణామాలపై శ్రీధర్ సంధించిన కార్టూన్లకు పాఠకులనుంచి ఊహించని ప్రతి స్పందన వ్యక్తమైంది. ఈ నెల రోజుల్లోనే పాఠకులనుంచి శ్రీధర్‌కు వేయికి పైగా ఉత్తరాలు అందాయి. రేపు ఈ విషయం మీద కార్టూను గీయాలని ఒకరు సూచిస్తే, ఏ కార్టూన్ అద్భుతంగా ఉందని మరొకరి ప్రశంస.

సెన్సాఫ్ హ్యూమర్ అనేది మన రక్తంలో ఉంది. మన సాహిత్యంలో ఉంది. మన నిత్య జీవితంలో ఉంది. ఆ సెన్సాఫ్ హ్యూమరే కార్టూనిస్టును

ఆదరిస్తోందంటారు శ్రీధర్. కార్టూన్ సరదాగా నవ్వుకోడానికే కాదు. సీరియస్‌గా ఆలోచించటానికి కూడా. భోపాల్ దుర్ఘటనే ఉంది. శ్రీలంక పరిణామాలే ఉన్నాయి. సతీ సహగమన సంఘటనే తీసుకోండి. ఇవి బాధను తప్ప నవ్వు పుట్టించేవి కావు. కానీ పొలిటికల్ కార్టూనిస్ట్ ఇలాంటి సంఘటనలపైనా ప్రతిస్పందించాలి అన్యాయాన్ని బొమ్మ కట్టించాలి. పాఠకులను జాగృతపరచాలని శ్రీధర్ చెప్పారు.

కార్టూనిస్ట్ కూడా సామాన్యుడే. ఎప్పుడూ ఒకేస్థాయి ఆలోచనలు రావు. ఒక్కోసారి ఎంత గింజుకున్నా కార్టూన్ ఐడియా స్ట్రయిక్ కాదు. డైలీ జర్నలిజంలో మరి కాలంతో పరుగు తప్పదాయె. అన్ని కార్టూన్లు ఒకే స్థాయిలో ఉండక పోవడానికి ఈ పరిమితులే కారణం అన్నది ఆయన అభిప్రాయం. కార్టూన్ కొందరిని బాధ పెట్టించేదిగా ఉండొచ్చు. కానీ స్పోర్టివ్ స్పిరిట్‌తో రిసీవ్ చేసుకోగలగాలి అన్నారు.

మీ అభిమాన కార్టూనిస్ట్‌లు ఎవరన్న ప్రశ్నకు డేవిడ్‌లో, శంకర్, ఆర్. కె. లక్ష్మణ్‌లని చెప్పారు. లక్ష్మణ్ ప్రభావం తన బొమ్మలపై విశేషంగా ఉందని ఒప్పుకున్నారాయన. లక్ష్మణ్‌ది కార్టూనిస్ట్‌గా విలక్షణ వ్యక్తిత్వం. ఆయన ఆలోచనలు ఏ పరిమితికి లోబడని సర్వస్వతంత్రమైనవి. తక్కువ గీతల్లో ఎక్కువ ఎఫెక్టు చూపిస్తారు అని శ్రీధర్ అన్నారు.

నన్ను కార్టూనిస్ట్‌ని చేసింది రామోజీరావుగారే. ఆయనను వాదనలతో ఎంతో విసిగిస్తుంటాను. కానీ ఆయన ఎన్నడూ చిరాకు మాత్రం పడరు. అదే ఆయన గొప్పతనం. ఓర్పుగా, ఓపిగ్గా నన్ను ఎడ్యుకేట్ చేస్తున్నారు. ఆయన. అండ, ఆశీస్సే కొండంత బలం అని శ్రీధర్ తన అభిమానాన్ని, రామోజీరావు పై తన గౌరవాన్ని వెల్లడించారు.

శ్రీధర్ బెంగుళూరులో పౌరసన్మానాన్ని అందుకున్నారు. ఈ సందర్భంగా ఓ చిన్న సంఘటన జరిగింది. బెంగుళూరు సన్మాన వేదిక చేరేవరకూ శ్రీధర్ ఎలా ఉంటాడో నిర్వహకులకు తెలీదు. నిర్వాహకుల్లో ఏ ఒక్కరి పరిచయమూ శ్రీధర్‌కు లేదు. పైగా సన్మాన వేదిక చిరునామా కూడ తెలీదు బెంగుళూరు స్టేషన్‌లో మిమ్మల్ని రిసీవ్ చేసుకుంటామనీ, ఫలానా నంబరుగల మా కారు మీ కోసం రెడీగా ఉంటుందని నిర్వాహకులు రాసిన ఉత్తరం శ్రీధర్‌కు చేరకముందే ఆయన బెంగుళూరు రైలెక్కారు. స్టేషనులో దిగి స్థానిక పత్రిక కొనుక్కొని సభలూ-సమావేశాల కాలమ్‌లో సన్మానం జరిగే

చోటును తెలుసుకుని నేరుగా అక్కడికి వెళ్లారు. ఈలోగా స్టేషన్‌లో రిసీవ్ చేసుకోవటానికి వచ్చిన నిర్వాహకులకు సన్మానం అందుకోవల్సిన వ్యక్తి జాడ తెలీక కంగారు. బీ.పి.లు పెరగడాలు. శ్రీధర్ నేరుగా సన్మానస్థలికి వెళ్లి "నేనే శ్రీధర్"నంటూ పరిచయం చేసుకుని నిర్వాహకుల్ని ఆనందాశ్చర్యాల్లో ముంచి తేల్చారు.

పోలీస్ అత్యాచారాలపై కార్టూన్లపరంగా శ్రీధర్ సెంచరీ పూర్తి చేశాడు. ఇప్పటివరకూ అంటే 1987 డిసెంబర్ నాటికి శ్రీధర్ మూడువేల పాకెట్ కార్టూన్లు, 1500 మెయిన్ కార్టూన్లు వేశాడు. ఒకప్పుడు శ్రీధర్ కవిత్వం కూడా రాసేవాడు. కొన్ని కవితలు అచ్చయ్యాయి కూడా. ఇప్పుడు కార్టూన్లతో తీరిక లేక కవిత్వాన్ని రాయటం మానేశాడు. కానీ పుస్తక పఠనం నిరంతరం సాగిస్తూంటాడు. గురజాడ, శ్రీ శ్రీ అభిమాన కవులు కొ.కు, శ్రీపాద సుబ్రమ్మణ్య శాస్త్రి, చలం, అభిమాన రచయితలు.

రాయలసీమలో శ్రీధర్‌కు అభిమాన సంఘాలున్నాయంటేనే పాఠకుల హృదయాల్లో ఆయన ఎంతటి చెరగని ముద్ర వేస్తున్నదీ తెలుస్తుంది. కార్టూన్ కళమీద పుస్తకం లాంటిదేమన్నా రాస్తారా అంటే నవ్వుతూ అలాంటి ఉద్దేశమేం లేదు. అయినా నాకు తెల్సింది తక్కువేనన్నారు. తెలుగు పత్రికల్లోని ఇతర కార్టూనిస్టుల వర్క్‌ను ప్రశంసించారు. మోహన్ కార్టూన్లు ఆలోచింప చేసేవిగా ఉంటున్నాయన్నారు.

బొమ్మలే జీవితం, బొమ్మలే జీవనం, బొమ్మలే ఆనందం, బొమ్మలే సర్వస్వంగా బొమ్మలకే అంకితమైన శ్రీధర్ కలం సమకాలీన రాజకీయ రంగంపై చిందులు తొక్కుతూనే ఉంటుంది. పాఠకులను రంజింప చేస్తూనే ఉంటుంది 27 ఏళ్ళ ప్రాయంలోనే స్వయంకృషితో పైకి ఎదిగి వచ్చిన శ్రీధర్ తెలుగు పాఠకులకు ఎసెట్.

---

## సంక్షిప్తతే ప్రాణం

వార్త ప్రాణమంతా సంక్షిప్తతలోనే ఉంది. వార్త సుదీర్ఘంగా వుంటే ఎవరూ చదవరు. ఒకవేళ చదివినా వెంటనే మరచిపోతారు.

---

# తెలుగు కూపంలో ఇమడలేని మోహనుడు



కొందరికి కొన్ని అపురూప అవకాశాలు చిన్ననాటే అంది వస్తాయి. పథ నిర్దేశం చేస్తాయి. నీ గమ్యం ఇదీ అని చూపి సాగమంటాయి. అటువంటివారికి ఇటా అటా అనే మీమాంస, తడబాట్లు ఉండవు. ఈ అరుదైన అవకాశాన్ని చిన్ననాటే అందిపుచ్చుకున్న వాడు మోహన్. కమ్యూనిస్ట్ కుటుంబంలో పుట్టి పెరగడం, ఒక ఆలోచనల పునాది పై వ్యక్తిత్వాన్ని మలచుకోవడమే. సిద్ధాంతం ఏదైనా ఒక సిద్ధాంతం ఆసరాగా జీవితాన్ని, ప్రపంచాన్ని పరికించే విషయంలో వ్యక్తమయ్యే ప్రత్యేకత వేరు. ఆ ప్రత్యేకత మోహన్‌కు వెన్నతో పెట్టిన విద్య.

అతను ప్రస్తుతం సాధన చేస్తున్న రంగంలోనే కాదు ప్రపంచ పరిణామాలన్నిటి పైనా స్పష్టమైన అవగాహన, ఆలోచన ఉన్నవాడు ఏ భేషజాలు లేనివాడు. స్వీయ లోపాలు సైతం వెల్లడించటానికి సంశయించని వాడు. మోహన్ 37 ఏళ్ళక్రితం అంటే 1951లో ఏలూరులో జన్మించాడు. తండ్రి కమ్యూనిస్ట్ నాయకుడు. ఆయన పేరు తాడి అప్పలస్వామి. కమ్యూనిస్ట్ నాయకులు, కాంగ్రెస్ నాయకులు మోహన్ ఇంటికొచ్చేవారు. చర్చలు జరిపేవారు. ఉపన్యాసాలు చేసేవారు. మోహన్ లేతబుర్రకి అవి అర్థం అయ్యీ అవనట్లుండేవి. ఆ వాసన మాత్రం గుబాళించేది. అయిదేళ్ళ ప్రాయానికే జైలు అనుభవాలు వినే అవకాశం మోహన్‌కి కల్గింది.

అయిదో ఏటే ఎన్నికల ప్రచారంలో పాల్గొన్నాడు మోహన్. సుత్తి, కొడవలి ముగ్గుల్ని మోహన్‌చేత పెట్టించి ప్రతిగా చాక్లెట్లు ఇచ్చేవారు. అలా మోహన్‌లో కళాకారుడు ఊపిరి పోసుకున్నాడు. అతని జీవిత ప్రధాన వ్యాసం

గానికి, వ్యావృత్తికి అలా అయినో ఏదో బీజం పడ్డది. ఆ రోజుల్లో ఏలూరు రాజకీయంగా చైతన్యం కలిగిన ప్రాంతం. వలస వచ్చిన అల్యూమినియం, బీడి కార్మికులు ఒకవక్క, మహామహులైన సాహితీమూర్తులు మరో పక్క. చలం, కొనకళ్ల, బుచ్చిబాబు వగైరా సాహితీమూర్తులు, జగ్గయ్య, కన్నాంబ వంటి కళాకారులు ఏలూరుతో సన్నిహిత సంబంధాలు కలిగి ఉండేవారు. వీరితో ప్రత్యక్ష పరిచయం అయ్యే వయసు మోహన్‌కు లేదు. అయినా కళాసీమ ప్రభావం మోహన్ వ్యక్తిత్వంపై బలీయంగానే పడ్డది. తండ్రి పలురకాల మాగజైన్లను, పుస్తకాలను తెప్పించేవాడు. ఆయనే మోహన్‌కు మార్క్సిజంలో తొలిపాఠాలు నేర్పాడు. భారత, భాగవతాలను సైతం తండ్రే కూర్చోబెట్టి చెప్పేవాడు. చలం వంటి రచయితల రచనలను చదవడానికి మోహన్‌కు అక్క ఆలంబన అయింది.

ఇంటికి వచ్చే పలురకాల మాగజైన్స్ చూడటం వాటిలోని బొమ్మల్ని మనసులో ముద్రించుకోవడం, తండ్రితో కలిసి జిల్లా గ్రంథాలయ సంస్థకు వెళ్లి పుస్తకాలు చదవడం, అంతర్జాతీయ వార్తలపై ప్రత్యేక ఆసక్తి అనురక్తి పెంచుకోవడం, జ్యోతి మంత్లీ, ఆంధ్రప్రభ వారపత్రికల్లో బాపు బొమ్మల్ని ప్రత్యేక శ్రద్ధతో వీక్షించడం. ఇలా కళాకారుడిగా మోహన్ వ్యక్తిత్వం రూపురేఖలు దిద్దుకున్నాయి.

కమ్యూనిస్ట్ పార్టీ చీలిపోయాక తండ్రి మార్క్సిస్ట్ పార్టీ వైపు మొగ్గు చూపగా మోహన్ సి పి ఐ.కే అంకితమయ్యారు. పార్టీ పరంగా తండ్రి బిడ్డల మధ్య వైరుధ్యాలు, వైమనస్యాలు చోటు చేసుకున్నాయి. ఏడాదిపాటు తండ్రి, బిడ్డలు మాటలకు దూరంగా ఉన్నారు. 1967లో పశ్చిమ బెంగాల్‌లో నిర్వహించే ప్రదర్శనలో పాల్గొనేందుకు మోహన్ కలకత్తా వెళ్ళాడు. అక్కడ అరెస్ట్ అయి ఆ తర్వాత విడుదలయ్యాడు. విడుదలై కూడా కలకత్తాలోనే గడిపాడు. హైస్కూలు దశలోనే కొన్ని పుస్తకాలకు టైటిల్స్ వేసిన ఘనత మోహన్‌ది. వెల్చేరు నారాయణరావుగారు గ్రాఫిక్ ఆర్ట్‌ను పరిచయం చేశారు. శంకర్స్ వీక్లీ కార్టూన్లపై ఆసక్తిని పెంచింది. పార్టీ పరమైన శిక్షణ కోసం మోహన్ ఢిల్లీ వెళ్ళాడు. దేవీ చట్టోపాధ్యాయ, మొహిత్ సేన్, నిఖిల్ చక్రవర్తి, డాంగే, సర్ దేశాయ్ వంటి ఉద్దండులు వివిధ శాస్త్రాల్లో మోహన్‌కు గట్టి పునాదులు వేశారు. ఢిల్లీలో ఉన్నపుడు కొత్త తరహా పుస్తకాలెన్నో ఆయన దృష్టికి వచ్చాయి. ఢిల్లీ తన జీవితంలో మంచి మార్పునకు దోహద పడిందంటారు మోహన్.

1970లో విశాలాంధ్ర దినపత్రికలో సబ్ ఎడిటర్‌గా చేరి 79 వరకు ఆ పనిలోనే కొనసాగాడు మోహన్. ఆ ఉద్యోగం మానేసి మూడేళ్ల ఖాళీగా ఉన్నాడు. 1982లో ఆంధ్రప్రభ డైలీలో కాంట్రాక్టు పద్ధతిపై కార్టూన్లు వేయ నారంభించాడు. ఉదయం ప్రవేశంతో అందులో చేరాడాయన.

మోహన్‌ని అర్థం చేసుకోవడానికి, ఆయన వ్యక్తిత్వాన్ని ఆకళింపు చేసుకోవడానికి సంక్షిప్తంగా ప్రస్తావించిన ఆయన జీవనగమనం చాలావరకు దోహద పడుతుంది.

మోహన్ ఎక్కడుంటే అక్కడ సందడి. ఎప్పుడూ ముగ్గురు నలుగురు స్నేహితులు చుట్టూ ఉంటారు. మీతో ఇంటర్వ్యూ కావాలంటూ మోహన్ దగ్గరకు వెళ్లినపుడు ప్రశ్నలేమిటో చెప్పండన్నారు. అవి విన్నారు, "ఓ పని చేయండి ఆ ప్రశ్నల కాగితం ఇచ్చి వెళ్ళండి. జవాబులు రాసిచ్చేస్తాను" అన్నారాయన.

మీరు సమాధానాలు రాసిస్తే లైవ్‌లీనెస్ ఉండదన్నాను. రాసిచ్చాక మీరు మళ్లీ అడగచ్చు అన్నారు. ప్రశ్నలు ఇచ్చా. ఆయన సమాధానాలు రాసివ్వలేదు. ఇలా కాదని చెప్పి "ఉదయం" ఆఫీసులోనే కొంత ఇంటర్వ్యూ సాగించాను. మోహన్ కోసం ఎవరో రావడంతో ఇంటర్వ్యూకి బ్రేకు పడ్డది. మళ్లీ ఒక రోజు మోహన్ ఇంటికి వెళ్లి ఇంటర్వ్యూ పూర్తి చేద్దామన్నాను.

"ఓ రెండు గంటలు మిమ్మల్ని కిడ్నాప్ చేస్తాను" అని చెప్పి ఆయనను మా ఇంటికి తీసుకొచ్చి కూర్చోబెట్టాను.

మా ఇంటికొచ్చి కూర్చున్న మోహన్ టైము చూసుకోకుండానే మూడు నాలుగు గంటలు గడిపారు. అడిగిన ప్రశ్నలన్నింటికి వివరంగా సమాధాన మిచ్చారు. ఇక మోహన్ ఇంటర్వ్యూ చదవండి.

ప్ర : కార్టూనిస్ట్‌కి రాజకీయ నిబద్ధత అవసరమా? అదెంతవరకూ ఉపయోగపడుతుంది?

జ : రాజకీయాల మీద కామెంట్ చెయ్యాలంటే ముందు అవేంటో తెలిసుండాలని చెప్పక్కర్లేదు గదా. రాజకీయాలంటే వర్గసంబంధాలేనంటారు. కార్టూన్ అనేది ఎవర్నో ఒకర్ని 'జిందాబాద్' అనో "డౌన్ డౌన్" అనో అనాలి. అపుడు ఎవర్ని అనాలి? ఎందుకనాలి? అనేది తెలిసి ఉంటే చెప్పేవిషయం స్పష్టంగా ఉంటుంది. కనక స్పష్టమైన ప్రపంచ దృక్పథం - అంటే కమిట్ మెంట్ అనేది కూడా ఉండి తీరుతుంది. నిష్పాక్షికులు, నిబద్ధతలేని స్వేచ్ఛా కళాకారుడంటూ ఎవడూ ఉండడు. తెలిసో తెలీకో అందరూ అటో ఇటో కమిట్‌మెంట్ ఉన్నవాళ్లే.

ప్ర : పత్రిక పాలసీకి, కార్టూనిస్ట్ నిబద్ధతకూ మధ్య ఘర్షణ తలెత్తితే?

జ : జీతం పుచ్చుకునే కిరాయివాడిగా కార్టూనిస్టు ఉన్నంత కాలం ఈ గొడవ వుంటూనే ఉంటుంది. రాజుగారి కొలువులోని ఒకనాటి శిల్పులూ, యూరప్ చర్చిల్లో ఐకన్స్, ఫ్రెస్కోలు చేసిన చిత్రకారులందరిపైనా మత పరమైన ఆంక్షలో, ప్రభుత్వం హుకుమో ఉంటూనే ఉంది. స్వేచ్ఛ మన కెవడూ తెచ్చివ్వడు. పోరాడి గెలుచుకోవాలి. ఒక రోజు స్పార్టకస్‌లాగా ఓడిపోతాం. మరో రోజు చేగువేరా లాగా గెలుస్తాం. డైలీ పేపర్లో ఈ రక్త పాతం దిన దిన గండం. ఇందులో నూరేళ్లాయుష్షుతో ఉండటం కూడా కార్టూన్‌తో ప్రమేయం లేని అరవై అయిదో కళ. రినైజాన్స్ కాలం నుండి ఇప్పటి వరకూ ఆర్టిస్టులంతా ఈ చివరి కళని మాస్టర్ చేయడానికి కుస్తీ పడుతూనే ఉన్నారు. దీనికి మించి మరో గండం ఉంది. అది పాఠకుల స్థాయి. టీ కొట్లో కూచుని ఎన్టీఆర్, చిరంజీవి, రాజీవ్, శ్రీదేవి అందరి అదృష్టాన్ని బేరీజు వేసే వాళ్లుంటారు. బెర్లిన్‌లో మిసిలీల గురించీ, బొలీవియాలో కొత్త కూప్ గురించీ మాట్లాడే వాళ్ళు ఉంటారు. వాంటెడ్ కాలమ్ నుండి స్పోర్ట్స్ పేజీ వరకూ రకరకాల జనం. వీళ్లంతా అన్ని వార్తలూ వ్యాసాలూ చదవకపోయినా కార్టూన్ దగ్గర ఓ క్షణం ఆగుతారు.

ఆ క్షణంలోనే వాళ్ళందరికీ తెలిసిన వార్త మీద, వాళ్ళందరికీ అర్థమయ్యే సింబల్స్‌తో టకామని ఏదో ఒకటి చెప్పేయాలి. సంపాదకీయాల్లోలా ఉప న్యాసం మొదలిడితే వినరు. ఆ క్షణంలోనే పాఠకుడు ఎంతో కొంత సరదాగా నవ్వుకోవాలి. అదిలేకపోతే నా మొహంచూసి 'ఎక్కిలాయిలే' అని నవ్వుతాడు. (బోల్డుసార్లు అలా జరుగుతూంటుంది. అయినాసరే సిగ్గులేకుండా మళ్ళీ కార్టూన్‌లు వేయడమే ఉత్తమం. అందువల్ల పత్రికాధిపతి మనకు డబ్బులిస్తాడు. ఎంచక్కా ఖర్చు పెట్టుకోవచ్చు) అసలు సంగతి- అప్పుడప్పుడూ, అనేకసార్లూ, చౌకబారు, నేలబారు కార్టూన్‌లు వేస్తాం, అలాంటివి చూసి నవ్వే వాళ్లుండక పోతారా అని ఆశ. అప్పుడప్పుడూ తలా తోకా అర్థంకాని "కంగాళీ అవకతవక" కార్టూన్ గీస్తా, మొదటి దానికి కమర్షియల్ ఫిలిం, అనీ రెండో దానికి ఆర్ట్‌ఫిలిం' అనీ పేరు పెట్టుకుని మురిసి పోతుంటా. చాలాసార్లు పాత ఐడియాకే మసిపూసి తిరగేసి వేస్తాం. అలాంటి అక్రమాన్ని కూడా 'అద్భుతం' అని పొగిడే అమాయకులు తగిలినపుడు ఎంతో ఆనందంవల్ల బాధవేస్తుంది. ఒక్కోసారి నా చాతకాని తనం నాకే బాగా తెలిసిపోయినపుడు 'పాఠకులు సన్నాసులు' అని రహస్యంగా నాలో నేనే తిట్టుకుని హేపీగా ఫీలవుతా. చాలా కాలం ఈ పూలూ రాళ్ళూ అందుకున్నాక కొంత ముదిరి, ఐహికమైన రియాక్షన్

లకు అతీతంగా 'ఆనందో[బహ్మ' అనే ముదురు స్టేట్‌లోకి వెళ్తాం. అప్పుడు తిట్లూ పొగడ్తలన్నిటినీ మార్లిన్ [బాండోలాగా ఉడెన్ ఫేస్‌లో వినే దళసరి చర్మపు చెవులు మొలుస్తాయి.

[ప : నిబద్ధతవల్ల నిస్పాక్షికత లోపించే [ప్రమాదం ఉందా?

జ : బొత్తిగా లేదు. కమిట్‌మెంట్ డిక్షనరీలో పాక్షికత అంటే నిస్పాక్షికత అని అర్థం. నిబద్ధత అంటే ఒక పార్టీ తాత్కాలిక ఎత్తుగడలకూ కొంతమంది నాయకుల [ప్రవర్తనకూ పరిమితం కానిది. చుట్టూ ఉన్న సొసైటీ, మనుషులూ నడిచేపద్ధతి గురించి ఒక అవగాహన ఉండడమే. అలా ఉంటే ఈ పాక్షికత గొప్ప ఆబ్జెక్టివిటీతో మెరుస్తుంది.

[ప : బాపుని కార్టూనిస్టుగా గుర్తిస్తారా?

జ : బాపూ సూపర్ కార్టూనిస్ట్. మన తెలుగుదేశం ఈ మూడు దశాబ్దాల్లో [ప్రొడ్యూస్ చేసిన అరుదైన ఆర్టిస్టు (ఆయన పొలిటికల్ కార్టునిస్టు కానందుకు ఏ బెంగా లేదు) మన తెలుగుతనాన్నీ జీవితాన్నీ [ప్రపంచానికి చూపడానికి సాధికారమైన డాక్యుమెంట్లు బాపూ ఇలస్ట్రేషన్లు. మన జానపద కళలు అన్నీ రంగాల్లో దిక్కుమాలిన చావుచస్తుంటే ఆయన బొమ్మల్లో వాటిని సజీవంగా ఇంకా ఉంచాడు. పశ్చిమ యూరప్ కళనీ, ఓరియంటల్ ఆర్ట్‌నీ ఆయన అర్థం చేసుకున్నంతగా ఎవరూ చేసుకోలేదు. ఈ రోజు నా కార్టూన్లు అడపాదడపా బాపున్నాయంటే అర్థం నేను బాపూ బకాయి దారుణ్ణనే. అరవయ్యో దశకంలో బాపూ దండయాత్రలకి పత్రికలన్నీ పేజీలు పరిచాయి. ఆ తర్వాత మాతరంలోంచి మరో పదిమంది బాపూలు పుట్టాల్సింది. ఇరవయ్యేళ్లు గడిచినా ఎందుకో అలా జరగలేదు. 70, 80వ దశకాల్లో కొన్ని బాపూ జిరాక్స్ సెంటర్స్ వెలిసి, తర్వాత తుఫాన్‌లలో వెలిసిపోయాయి. ఈనాటి కొత్త కార్టూనిస్టులకు చాల మందికి 'కొంటె బొమ్మల బాపు' పుస్తకం తప్ప ఆయన ఇలస్ట్రేషన్‌లు, కవర్ డిజైన్‌లు తెలీవు. కార్టూన్ వెయ్యడమెలా అని తంటాలు పడే వాళ్లంతా అమెరికన్ 'మాడ్' మాగజైను ముందేసుకుని జుట్టు పీక్కుంటున్నారు. తెలుగు తనం (లేదా మన నేషనల్ ఆర్ట్) తెగనరకబడే కాలం తోసుకొచ్చేస్తోంది. పత్రికల అవసరాలు మరీ కృత్రిమంగా, చౌకబారుగా మారుతున్నాయి. ఆర్టిస్టులు వాటి తోక పట్టుకుని మునగడానికి పోతున్నారు. ఇది డేంజర్. ఇది [ట్రాజడీ. ఇది మన పేదరికం. కనీసం నలుగురు బాపులని అర్జెంటుగా పుట్టించాలని ఆ దేవుడికి మొక్కుతున్నా. విని చస్తాడా?

ప్ర: అసలు ఎందుకొచ్చిందీ దారిద్ర్యం?

జ: చెప్తున్నాగదా. డజనుమంది బాపూలు పుట్టి ఉండాల్సింది. 'బాపూ' అనిపేరు చెప్తే, పాపం పాతకాలంవాడు పాత తరహా బొమ్మలు, ఈనాటి వెరైటీ అప్పుడెక్కడా, అని ముసలాణ్ణి చూసి జాలిపడే పరిస్థితి ఉండాల్సింది. అలా లేకపోగా మాలాంటి కుక్క పిందెల వారసులం పుట్టాం. ఇప్పుడున్న కార్టూనిస్టులు చాలమంది ఇలస్ట్రేషన్‌లో, జానపద శైలిలో పోస్టర్, తరహా ఐడియా ప్రెజెంట్ చేయడంలో బొత్తిగా ప్రవేశంలేని వాళ్ళు. ఆర్టు ఆల్బమ్‌లూ, కళావిమర్శ గ్రంథాలూ ఎక్కువగా దొరకని వాళ్ళు. గీత గీయటంలో, ఐడియా మెరుపులో ఏమాత్రం మిషనరీ జీల్ గానీ క్రూసేడింగ్ స్పిరిట్‌గానీ లేని వాళ్ళు. వీళ్ళంతా నిరుపేదలు, గర్భదరిద్రులు. మా బొమ్మలన్నీ దగ్గర పెట్టి ఈ పేదరికాన్ని ఫొటో తీసి చూపిస్తా.

ప్ర: మీకు బద్ధకం జాస్తి అనే విమర్శ ఉంది.

జ: బద్ధకం. నిజమే. పనిచేస్తా. అదీ నిజమే. ఏంచేయాలి. దేనికి ప్రయారిటి ఇవ్వాలి అనేదే డైలమా. "ఫలానా రోజున ఫలానా కార్టూన్ వేశావు గాబట్టి ఈరోజు కూడా అది చెయ్" అని ప్రెషర్ వస్తుంది. ఆ రోజు అలా కార్టూన్ గీయటం సరదా వల్ల చేసి ఉంటాను. ఇవాళ మరోటి ఎందుకు. "అసలు రోజూ కార్టూన్ గీయటం నాకు పడదు" అని చెప్పాల నుకుంటా. కానీ చెప్పను. "నేనెప్పుడూ అంతే కార్టూన్‌లు వేసి పేల్చేస్తుంటా" అని కోతలు కోసి మళ్ళీమళ్ళీ అవే, అలాటి వేసి కార్టూనిస్టుగా చెలామణీ అవుతుంటా (ఇందువల్ల డబ్బులొస్తాయి తెల్సా.) కానీ ఇలా వేషాలు వేసినందు వల్ల అలసట వస్తుంది. విసుగూ డిజప్పాయింట్ మెంట్ వరసగా నడిచొస్తాయి. మళ్ళీ మళ్ళీ ఈ చిల్లర పనే చేయాలా? అనిపించినపుడు చేయం. దాని పేరు బద్ధకం. తీరా బొమ్మ వేశాక ప్రశంస వస్తుంది. అందంగా నవ్వుతాం. ఎందుకొచ్చిన గొడవ అనుకుంటాం. దాని పేరు పరాజయం.

ప్ర: మీ కార్టూన్లలో ద్యోతక మయ్యే ఆలోచనా గాఢతకి కారణాలు?

జ: బాబోయ్ థాట్ డెప్త్ అంటే నాకేం సంబంధంలేనిది. చిన్నపుడు అకారణంగా బొమ్మలేశాను. ఇపుడు జీతం రాళ్ళు పారేస్తున్నారు గనక వేస్తున్నాను. చిల్లర డబ్బులు తడుముకునే నేల క్లాసు పావరుగాణ్ణి గనక పెద్ద పెద్ద వాళ్ళంటే కడుపుమంటా, వాళ్ళ వైభవం చూసి కళ్ళలో నిప్పులు పోసుకోటం లాంటివి సహజంగా నా కుంటాయి. బొమ్మలే వేయగలను గనకా మరో పని-చాతకాదు గనకా ఆ బొమ్మల్లో చిన్న చిన్న సరదాలు తీర్చు

కుంటూ. బొమ్మ గీస్తున్నపుడు ఆ సరదా బుర్రనిండా ఆవరించుకుంటుంది. అపుడు డబ్బులూ ఈతి బాధలూ గుర్తురావు. అదో గణాచారి పూనకం స్టేట్. ఆ రకంగా ఎవర్నన్నా వ్వెవ్వెవ్వె అని వెక్కిరించి నా సరదా తీర్చుకున్నందు వల్ల మీకు సరదా కలిగితే నాకెంతో సరదా.

ప్ర : మీరు గీసిన కార్టూన్లలో మీకు బాగానచ్చిన కార్టూన్?

జ : అలా అమాంతంగా చెప్పలేను. వివాదాస్పదమైనవి చాల ఉన్నాయి. అందువల్ల మంచి కార్టూన్ కంటే అవి గుర్తుంటాయి.

ఆంధ్రప్రభలో పనిచేసేటపుడు ఎడిటర్ ఎ.బి.కె పీకెల మీద కొచ్చే కార్టూన్లు బోల్డు వేశాను. ఆయన నన్ను ఉదారంగా వదిలేసేవాడు. చాలసార్లు నన్ను ఉద్యోగం నుండి పీకెయ్యాలని పైనుండి తాఖీదులొస్తే నెత్తి నోరూ బాదుకుని ఫోన్లు చేసి నన్ను రక్షించాడు కూడా. భద్రాచలంలో ఒకమ్మాయిని కానిస్టేబుల్ రేప్ చేస్తే, రామలక్ష్మణుల పక్కనున్న సీతమ్మ వారికి కానిస్టేబుల్ కన్ను కొట్టే కార్టూన్ వేశా. మర్నాడు గొడవ. హిందూ సెంటిమెంట్ హర్టు అవుతుందనీ దేవుళ్లని అవమానించాననీ. ఎ.బి.కె అందరికీ సర్ది చెప్పుకోవాల్సి వచ్చింది. మార్గదర్శి చిట్‌ఫండ్స్ ఎడ్వర్‌టైజ్‌మెంట్‌ని పారడీ చేస్తూ "గుడ్డుకోసమా మీ బెంగ? గుల్ల చేస్తాడులే మా దొంగ" అని కార్టూన్ గీసినపుడు వయొలెంట్ రియాక్షన్. అది కోర్టు కేసు గూడా అపబోయి ఆగిందట. బ్రెజ్నెవ్ చనిపోయినపుడు కొంపలు మునిగిపోయినట్టు శాంతి పావురం బావురుమంటూ ఏడుస్తున్న కార్టూన్ వేస్తే న్యూస్‌ఎడిటర్ పార్థసారథి గారు ఇన్‌స్పైర్ అయి కింద కవిత్వం వెలగబెట్టారు. పైన "కామ్రేడ్ బ్రెజ్నెవ్ కన్నుమూత" అని తాటి కాయలంత అక్షరాలతో బానర్ పెట్టారు. ఈ పాపం అంతా ఆరోజు మద్రాసులో ఉన్న ఎ.బి.కే గారి పీకకి చుట్టుకుంది. దేవీప్రియ రన్నింగ్‌కామెంటరీ ఉన్నంతకాలం చిల్లరమల్లర కోతివేషాలతో కాలంగడిచింది. ప్రభ నుండి ఉదయంలోకెళ్లే ముందు ఆఖరి కామెంటరీకి మటుకు చార్లీచాప్లీన్ సినిమాల్లో చివరి సీనులాంటి బొమ్మగీశా. అది అచ్చయిపోయింది. మర్నాడు అమాయకంగా ఆఫీసుకొస్తే ఎడిటర్ పొత్తూరి వెంకటేశ్వరరావుగారు కొట్టబోయినంత పని చేశారు. అది గుర్తొచ్చినపుడల్లా పశ్చాత్తాపం ముంచుకొస్తుంది.

ఉదయంలో ఒకసారి నాదెళ్ళ భాస్కరరావుని మూర్ఛ రోగిగా వేసి మెడలో రాగిబిళ్ళమీద అడ్డమైన వాక్యాలూ రాశాను. మర్నాడు ఓ అరడజను భారీ విగ్రహాలు (మాంఛి ఊపులో) ఎ.బి.కె ఛాంబర్‌లోకి దూసుకొచ్చారు. కాస్త అటూ ఇటైతే కొట్టడం గూడా జరిగుండేది. యాభైఆరోసారి ఎ.బి.కె

గారికి గండం తెచ్చాను. అప్పటికే నాదెండ్ల మీద మరింత డేమేజింగ్‌గా వేసిన ఇంకో కార్టూన్‌ని హడావుడిగా పేజీల నుండి పీకేశాం. ఒకసారి అసెంబ్లీ మొదలయ్యే ముందు 'కర్టెన్ రైజర్' లాంటి రన్నింగ్ కామెంటరీ దేవీప్రియ రాశాడు. దానికి పది నిముషాల్లో టకటకా బొమ్మ గీసి దర్జాగా ఇంటికి పోయా. మర్నాడు ఆఫీసుకొస్తే అసెంబ్లీలో గొడవ. హక్కుల తీర్మానం గురించి చెప్పారు. ఎడిటర్ ఆమోదం లేకుండా కార్టూన్ ఎందుకు పంపావని ఎ.బి.కె మెమో (ఇలాంటి మెమోలు ఉదయంలో కనీసం పాతిక వచ్చాయి కార్టూన్ గీసినందుకు సంజాయిషి నోటీసులు ఇన్ని అందుకున్న ఏకైక వీరుణ్ణి నేనే) మళ్ళీ నన్ను డిఫెండ్ చేస్తూ ఎ.బి.కె పెద్ద ఎడిటోరియల్ రాశాడు. విచారణ తదితరాలన్నీ జరిగాయి. ఇలాంటివి చాలా ఉన్నాయి.

ప్ర : ఒక అంశం మీద కార్టూన్ వేయాలని కూర్చుంటారా? లేక మెరుపులా ఆలోచన వస్తే కార్టూన్ రూపమిస్తారా?

జ : రెండు రకాలూ ఉంటాయి. మీరు ఫ్రెండ్స్‌తో మాట్లాడుతున్నపుడు ఉంటుంది ఒక జోక్ ఢామ్మని పేల్చేస్తారు. అందరూ పగలబడి నవ్వేస్తారు. ఒక్కోసారి అవతలి మాటకి జవాబు చెప్పలేక తడుముకుని తంటాలు పడతారు. ఇదీ అంతే. విజువల్ లాంగ్వేజ్‌లోకి అనువాదం చేయటంలో కార్టూనిస్టుకున్న అదనపు పనీ—ఎడ్వాంటేజి కూడా.

ప్ర : కార్టూనిస్టుల మధ్య పోటీ ఉంటుందా?

జ : పోటీ ఖాయంగా ఉంటుంది. కానీ ఎందుకో ఇపుడు లేదు. దాదాపు అందరం చచ్చు కార్టూన్లే వేస్తున్నాం గనుక ఫర్వాలేదులే. చల్తాహై అని అందరికీ ధీమా వచ్చేస్తోంది. కనక పోటీ బాదర బందీ లేదు.

ప్ర : కార్టూనిస్టుగా మీ సాధన ఎలాంటిది?

జ : సాధన అంటూ ప్రత్యేకంగా ఏంలేదు. గియగా గియగా ఒక బెటర్ ప్రెజెంటేషన్‌కి సెటిల్ అయిపోతాం అంతే. వేయగా వేయగా వికారపు కేరికేచర్ కూడా జనం సెటిల్ అవుతారు.

ప్ర : రాజకీయాలు, తెలుగు సాహిత్యం గురించి చెప్పండి?

జ : రాజకీయాలు తెలుగు సాహిత్యం గురించి మీరడిగిన దానికి పెద్ద పెద్ద లెక్చర్లు దంచొచ్చు. 'మరీ బడాయి పోదురూ' అని మీరే అంటారు. నన్ను ప్రభావితం చేసిన రచనల గురించి అడిగారు. రచనల కంటే

ఒక కాలం గురించి చెప్తా. అది నాకంటే, నా కార్టూన్‌ల కంటే గొప్పది. కొంచెం చాదస్తంగా చెప్తా. భరించండి. అది అరవయ్యో దశకం. నేను టీనేజర్‌ని. పిల్ల విద్యార్థి నాయకుణ్ణి ప్లస్ కార్యకర్తని. అప్పుడందరూ వియత్నాం గురించి మాట్లాడేవారు. రాజ్‌కపూర్ పాటలు, వడ్డాది పాపయ్య, బాపూ బొమ్మలు రాజ్యం చేసేవి. శ్రీ శ్రీ మహా ప్రస్థానం చిన్న బైబిల్. కమ్యూనిస్టులు చీలిపోయి 'భారత విప్లవ పంథా ఏటు' అంటూ రోజుకో కరపత్రం వేసేవాళ్లు. జ్యోతి వీక్లీ, మంత్లీ కథల్ని బొమ్మల్ని మోసుకొచ్చేవి. లుముంబా, చేగువేరా. మార్టిన్‌లూథర్‌కింగ్‌ల హత్యలు, ఆఫ్రికాలో, ఇండో-చైనా తుపాకి కాల్పులు ఇంటి పక్కన జరుగుతున్నట్టే వినిపించేవి. 1968 లో వియత్నాంలో "టెట్ అఫెన్సివ్" (కొత్త సంవత్సరం దాడి) మొదలయింది. రోజూ కూలిపోయే అమెరికా విమానాల్ని లెక్క పెట్టేవాళ్లం. చిన్నమురికి పేటల్లో యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలు ఎవ్వరికి అర్థంగాని సామ్రాజ్యవాద వ్యతిరేక నినాదాలూ ఇచ్చేవాళ్ళం. యూరప్‌లో కుర్రకారంతా ఎర్రజెండాలు పట్టుకున్నారు. పారిస్‌లో విప్లవం బద్దలయింది. అమెరికాకి అగ్గి అంటుకుంది. మనదేశంలో కాంగ్రెస్ ఒకేసారి ఏడెనిమిది రాష్ట్రాల్లో ఓడిపోయింది. నేను కృష్ణశాస్త్రి కవితలకి, బొలీవియన్ జంగిల్ వార్‌కి, టెట్ అఫెన్సివ్‌కి, బాపూ, చిత్ర ప్రసాద్ బొమ్మలకి పుట్టినబిడ్డని. బయాఫ్రాలో చనిపోయిన బిడ్డల ఏడుపు నుంచీ మా పేటలో జూట్ కార్మికుల మురికి బ్రతుకులనుంచీ జమిన్ రాయ్ లాట్రేక్, ఇల్యా రెపిన్ పెయింటింగ్‌ల నుండీ పుట్టాను. అరవయ్యోదశకం తెచ్చిన నెత్తూరూ, కన్నీళ్లూ విప్లవకేకలు నావెంటే ఉంటాయి.

ప్ర : మీ డెలీ రొటీన్ ఎలా ఉంటుంది?

జ : నా డెలీ రొటీన్ అల్లకల్లోలం. ఏ గాలి వీస్తే అటుపోవటం సాయంత్రానికి ఆఫీసుకి చేరి రన్నింగ్ కామెంటరీ తీసుకోడం. కాకుల్లాగా గోల చేసే రిపోర్టర్ల బ్యూరో మధ్యలో కూచుని గీయటం. ఈ మధ్యలోనే మా ఎంప్లాయీస్ రోజువారీ ఉద్యోగ బాధల్తో వస్తారు (నేను ఉదయం ఎంప్లాయీస్ యూనియన్ ప్రెసిడెంట్‌ని కూడా ఉన్న బాధలు చాలక అదనంగా ఇదో యాతన) అప్పుడప్పుడు యూనియన్ వాళ్ళందరం కలిసి పర్సనల్ డిపార్టుమెంటు మీదికో, దాసరినారాయణరావు మీదికో యుద్ధానికి వెళతాం. చాలాసార్లు చైర్మన్‌గారికి (ఉదయంలో వాళ్లంతా చైర్మన్ అనీ సినిమా వాళ్ళంతా డైరెక్టరుగారనీ ఆయన్ని పిలుస్తుంటారు. డబుల్ రోల్) కోపం వస్తుంది. ఇవన్నీ గొంతెమ్మ కొరికలంటారు. కాదంటాం. ఔనంటారు. ఒక్కోసారి తెగుతుంది. మళ్ళోసారి ముడి పడుతుంది. కొన్ని విజయాలతో ఉత్సాహంగా వస్తాం. కొన్ని

వీర స్వర్గాలతో వె(్రిమొహాలు వేసుకుని తిరిగొస్తాం. జయాపజయములు దైవాధీనములు. గెలిచినా ఓడినా ఆరోజు కార్టూన్ ఎగ్గొట్టటం మాత్రం నా ఆధీనంలోనే జరుగుతోంది. ఇలాంటివీ ఇతర వ్యాపకాలతో ఎక్కువగా కార్టున్ వేయడం మానేస్తుంటాను. కార్టూన్‌కి ఎగనామం పెట్టేబదులు ఉద్యోగానికీ యూనియన్‌కీ ఎగనామం పెట్టి ఒక హాలులో కూచుని కృష్ణా రామా అనుకుంటూ బొమ్మలు గీద్దామని ఉంది. కొంతకాలానికి అలాగే చేస్తా.

ప్ర : మీ భవిష్యత్ కార్యక్రమం, లక్ష్యాలు?

జ : భవిష్యత్ కార్యక్రమం అంటూ ఖచ్చితంగా ఏం లేదు. బొమ్మలు గీయడమే. అవి కార్టూన్లు కానక్కరలేదు పోస్టర్లు, ఈజిల్ పెయింటింగ్స్ ఏదన్నా కావచ్చు. పదేళ్ళ క్రితం అనామకంగా మరణించిన గొప్ప ఆర్టిస్టు చిత్రప్రసాద్ పేరిట చిన్న సంఘం పెడుతున్నా. చిత్రాల్లో యూరప్ వినాశకర ప్రభావాన్ని తట్టుకొడానికి భారతీయతనీ మన తెలుగుతనాన్నీ చూపించడానికీ పది మంది కలిసి పని చేస్తే అదే పది వేలు అనుకుంటున్నాం. ఇది అతివాద భావాలున్న ఆర్టిస్టుల కేంద్రం కావాలని ఆశ. చిత్రప్రసాద్ చిత్రాలు చాల సేకరించాం. అవి ఆల్బమ్‌గా వేసే ప్రయత్నాలు సాగుతున్నాయి. తెలంగాణా సాయుధ పోరాట చరిత్ర చిత్రాలు పుస్తకంగా వేసే పథకం ఉంది. ఇంతకాలం నేను వేసిన బొమ్మల్లో ఏవీ పుస్తకంగా రాకుండా ఉంటానికి అన్ని జాగ్రతలూ చేసుకున్నా. ఇంతకంటే సంఘానికి నేను ఒరగబెట్టేదేముంది?

---

## ఆ రోజుకోసం

జైళ్లలో నేరస్తులుండని రోజుకోసం, ఆస్పత్రులలో రోగులుండని రోజుకోసం
రోడ్లపై ప్రమాదాలు జరగని రోజుకోసం నేను ప్రార్థిస్తున్నాను.
ఎక్కడా పోలీసులు, సైనికులు కనిపించని రోజుకోసం
ఆయుధాగారాల్లో తుపాకులు కనిపించని రోజుకోసం
అడవుల్లో వేటగాళ్లు కనిపించని రోజుకోసం చివరికి
వార్తా పత్రికలలో వార్తలే కనిపించని రోజుకోసం
ను ప్రార్థిస్తున్నాను.

విశ్వ శాంతిని, సౌభాగ్యాన్ని ఆకాంక్షిస్తూ ఓ ఇంగ్లీషు కవి ఊహల్లో ఊపిరిపోసుకున్న దీపాట. ఆ కవి ఎవరో, ఆ పాటను ఎవరు ఆలపించారో తెలీదు. ఆ పాట గుర్తుకొచ్చినపుడు ఆ రోజంతా ఆ పాటే వెన్నాడుతూ వుంటుంది. ఆరోజు వస్తుందంటారా?

---

# తెలుగు 'భాషాడాక్టర్' చే.రా.



ఆంధ్ర దేశాన వేళ్లమీద మాత్రమే లెక్కించ దగిన భాషా శాస్త్రవేత్తల్లో చేకూరి రామారావు ఒకరు చే రా.గా ప్రసిద్ధుడాయన. 'చేరాతలు' శీర్షికతో ఆంధ్రజ్యోతి దినపత్రిక పాఠకులను భాషా, సాహిత్య విషయాలపై కొత్త దృక్కోణాన్ని కల్గిస్తూ ప్రత్యేక ఆసక్తి, అనురక్తి కల్గిస్తున్నారాయన. వీటన్ని టికీమించి ఎందరో విద్యార్థులకు ఆదర్శ గురువు. ఉస్మానియా యూనివర్శిటీలో ఒక దశాబ్దం నుంచి ప్రొఫెసర్‌గా పని చేస్తున్నారు. తెలుగు విశ్వవిద్యాలయం లోని భాషాభివృద్ధి పీఠం డీన్‌గా డిప్యు టేషన్‌మీద ప్రస్తుతం పని చేస్తున్నాడు.

'చేరా' మృదుస్వభావి. కోపం తెప్పిద్దామని కవ్వించినా చిర్నవ్వుతో తిప్పి కొట్టగల చతురుడు ఆయన. భాషా శాస్త్రవేత్తగా ఆయన ప్రత్యేక కోవకు చెందినవారని చెప్పాలి. భాషాపరంగా ఆయనకు చాదస్తాలు లేవు. తాను నమ్మిందే వేదమన్న మొండితనం, మంకుపట్టు లేవు. మరో మాటలో చెప్పాలంటే భాషా విషయకంగా నవ్యతను ఆకాంక్షించే విశాల హృదయుడు. ఎదుటి వారి భాషా దోషాలను సైతం వారి విజయ సోపానాలుగా పరిగణించే ఉదాత్త హృదయం 'చేరా' సొత్తు. తెలుగు వాక్యంలో ఒక అంశం నిర్మాణంపై చేరా పరిశోధన చేసి కార్నెల్ యూనివర్శిటి నుండి డాక్టరేట్ పొందారు. దాని సారాంశమే నామ్నీకరణాల రూపంలో భారతిలో అచ్చయింది. ఇలా భారతిలో వ్యాసాలు రాస్తూనే లింగ్విస్టిక్ జర్నల్స్‌ద్వారా తనపరిశోధనా ఫలితాలు వెలుగు లోకి తెచ్చారు. తెలుగులో వెలుగులు వ్యాస సంకలనం సారస్వత పరిషత్ ముద్రించింది. తెలుగు వాక్యం అనే పుస్తకాన్ని అప్పటి సాహిత్య అకాడమి ప్రచురించింది.

తాను భాషా శాస్త్ర పరిశోధకుడు కావడం ఓ హిస్టారికల్ యాక్సిడెంట్ అంటారు చేరా. సాహిత్య అకాడమీ రూపొందిస్తున్న వృత్తి పదకోశం పనికోసం

చేరా ఫీల్డ్ వర్కర్‌గా నాయని కృష్ణకుమారిగారి సిఫారసుతో చేరారు. ఆ వృత్తి పదకోశానికి భద్రిరాజు కృష్ణమూర్తి ఎడిటర్. భాషమీద ఆలోచించటానికి భద్రిరాజు పరిచయం దోహదపడింది. ఆ తర్వాత ఆంధ్రా యూనివర్శిటీలో ఆయనసలహాపై ఎమ్.ఏ. తెలుగు చేశారు. భద్రిరాజు కృష్ణమూర్తి 1961 లో అమెరికాలో ఉన్నారు. జెరాల్డ్ కెలీ అనే అమెరికన్ ప్రొఫెసర్ తెలుగు భాషా పరిశోధన నిమిత్తం హైదరాబాద్ వస్తుంటే-భద్రిరాజు చేరాను కలుసుకోమని అడ్రసు ఇచ్చి పంపారు. అలా కెలీ పరిచయంతో చేరా జీవిత గమనమే మారిపోయింది. కెలీ తానే స్వయంగా అన్ని ఏర్పాట్లు చేసి చేరాకు అమెరికాలోని విస్కాన్సిన్ యూనివర్శిటిలో అవకాశం కల్పించారు. స్కాలర్‌షిప్ కూడా కెలీగారే ఏర్పాటు చేశారు. ఆయన పర్యవేక్షణలోనే తెలుగు వాక్య నిర్మాణంపై చేరా డాక్టరేట్ చేశారు. కెలీపై చేరాకు విశేష గౌరవాభిమానాలున్నాయి. భాషా శాస్త్ర విషయాలే కాక కెలీ దగ్గర్నుంచి ఎన్నో విషయాలు నేర్చుకున్నానన్నారు చేరా. తన పరిశోధక విద్యార్థుల థిసిస్‌యే కాక వాళ్ల సర్వయోగ క్షేమాలు చూడవలసిన బాధ్యత పర్యవేక్షకుడికి ఉంటుంది అనే విషయాన్ని కెలీగారి దగ్గర్నుంచి పరోక్షంగా నేర్చుకున్న ఒక విలువ అని అంటారు చేరా.

ఈ ఇంటర్వ్యూ చేసేవరకూ చేరాతో నాకు పరిచయం లేదు. ఆయన భాషా శాస్త్రవేత్త అన్నవిషయం ఒక్కటే తెలుసు ఆయన రాసిన పుస్తకాలు వ్యాసాలు చదివిన పరిచయం మాత్రమే ఉంది. చేరాను కలుసుకునేందుకు హైదరాబాద్‌లోని తెలుగు భవన్‌కు వెళ్లి విషయం చెప్పాను. ఆయన ఇంటర్వ్యూకి వెంటనే అంగీకరించారు. ఆ రోజు తీరిక లేనందున ఆ మరురోజు రమ్మన్నారు. అయితే ఆపూట ఆఫీసులో ఇంటర్వ్యూ సరిగా సాగలేదు. ఇంటి చిరునామా ఇచ్చి ఆదివారంనాడు రమ్మన్నారు. నేను ఇంటికి వెళ్లేసరికి ఇంటి ముందు కుర్చీలో కూర్చుని పుస్తకం చదువుకుంటున్నారు. నాకూ ఓ కుర్చీ తెప్పించారు. ఇంటర్వ్యూ దిగ్విజయంగా పూర్తి చేశాను. భాషకు సంబంధించిన అనేక విషయాలను చే.రా వివరంగా చెప్పారు. కొత్త దృక్పథాన్ని, అవగాహనను కల్పించారు. ఓ విద్యార్థిలా ఆయన చెప్పిన విషయాలను ఆకళించుకున్నాను. ఇంటర్వ్యూలోకి నడుద్దాం.

ప్ర : వ్యవహారిక భాషా వాడకంలో తెలుగు పత్రికా రంగం ఏమేరకు విజయం సాధించింది?

జ : అసలు గ్రాంథికమా, వ్యవహారికమా అన్నది ఇప్పుడు చర్చనీయాంశమే కాదు. స్వాతంత్ర్యానంతరం ఏ పత్రికా గ్రాంథికం వాడటం లేదు. పత్రికల్లో కొన్ని సంస్కృత పదాలు భాష చెలామణిలో ఉన్నాయంటారా?

అవి పూర్వం తెలుగులో ప్రవేశించి ఉంటాయి. వాడుకలోకి వచ్చాయి. ప్రజలు కొన్ని మాటలకు కొన్ని విలువలు ఆపాదిస్తున్నారు. మాటలకు అర్థాలతో పాటు సందర్భాన్ని బట్టి వ్యవహర్తలు కొన్ని విలువలను ఇస్తున్నారు. ఆ విలువల్ని గమనించి వాడితేనే భాష సమర్థంగా వాడినట్లు.

ప్ర : ఇప్పటి పత్రికల భాషపై మీ అభిప్రాయం?

జ : పత్రికలతో భాష గురించి నాకేం పేచీలేదు. హడావుడిగా రాసేటపుడు కొన్ని తప్పులు దొర్లవచ్చు. అయితేనేం? తప్పులంటే సృజనాత్మకత తప్పులంటే ఓ కొత్త విజయానికి పలికే స్వాగతగీతి. ఆ తప్పుతోనే అభివృద్ధి అనేది ముడిపడి ఉంది ఇటీవలి కాలంలో పత్రికల్లో అనవసర కవిత్వ ధోరణులు పెరిగిపోయాయి. దివిసీమ తుపాను సమయంలో కడలికెరటాలు కాలసర్పాలై బుసలు కొడుతున్నాయి అని రాయకపోతే ఏం? ఒక విషాద సంఘటనే జరిగినపుడు మనం జాలిపడతాం, అయ్యో పాపం అనుకుంటాం. అటువంటి విషాద సంఘటనను వార్తగా పలికేటపుడు సాదా సీదా భాషలో చెప్పడమే మర్యాద అని నా అభిప్రాయం ఆలా చెప్పడంలోనే హుందాతనం ఉంది. భావోద్వేగాలు అణచుకోలేకపోవడం మన సంస్కృతి ప్రత్యేకతలా ఉంది. పాశ్చాత్యులు భావోద్వేగాలను అణచుకుంటారు. ఈ భావోద్వేగాలను అణచుకోలేకపోవడం అనే లక్షణం ఏయే దేశ ప్రజల్లో ఉంది? ఆయా దేశాల్లోని పత్రికల్లో కూడ ఇలాగే కవిత్వధోరణులు ఉన్నాయా అన్నది ఏ అంతర్జాతీయ సదస్సో నిర్వహించి తేల్చుకోవల్సిన విషయం.

ప్ర : అన్ని భాషలకు మూలం సంస్కృతమంటారు? ఎంతవరకూ ఈ వాదన నిలుస్తుంది. ఇప్పుడు సంస్కృత ప్రాధాన్యం ఏమిటి?

జ : ఇప్పుడున్న ఏ భాషా దేనికీ మూలం కాదు. భాషల్లో కొన్నిటికి సంబంధం ఉంది. ఈ సంబంధం పూర్వాపరాలను శాస్త్రీయంగా విశ్లేషించుకోవచ్చు. ఈ సంబంధాలకు దారి తీసే నియమాలను ఆధారాలతో నిరూపించవచ్చు. అయితే ఈ సంబంధాల అన్వేషణలో మనం ఓ రెండు వేల ఏళ్ళ వెనక్కి వెళ్ళచ్చు. ఒక భాష విడివడినపుడు ఏ భాషకు ఆ భాష జీవిస్తుంది. సంస్కృతం విడివడక ముందు మౌఖిక సాహిత్యంగాను కావ్య భాషగానూ కొనసాగింది. సాహిత్యపరంగా సంస్కృతానికి ఒక స్థాయి ఏర్పడింది. ఇప్పుడు సంస్కృతాన్ని ఎవరూ మాట్లాడటం లేదు. సంస్కృతం మృత భాష అంటే ఎవరూ తప్పుపట్టనక్కరలేదు. సంస్కృతాన్ని ఇప్పుడు ఉద్ధరించడం జరిగే పని కాదు. అయితే ఇప్పటికీ సంస్కృతాన్ని కొన్ని శాస్త్రీయ ప్రయోజనాలకు వాడుకోవచ్చు.

ప్ర : ఒక భాష గొప్ప లేదా ఒక భాష అత్యంత ఉపయోగకారి అని చెప్పేవీలుందా?

జ : భాషల ప్రయోజకత్వాన్ని కొలవటానికి మనకు సాధనాలు లేవు ప్రమాణాలు లేవు. కొన్ని భాషలు కొన్ని విషయాల్లో పటిష్ఠం. మరికొన్ని విషయాల్లో బలహీనం. సంస్కృతంలో ఒక ధాతువు నుంచి వివిధ అర్థాల్లో రకరకాల పదాలను అర్థచ్ఛాయా భేదాలతో ఉత్పత్తి చేసే పద్ధతి ఉంది. భూ, కృ అనే ధాతువులు చేర్చటం వల్ల నామాన్ని క్రియగా మార్చవచ్చు ఆ క్రియ నుంచి రకరకాల శబ్దాలను మళ్ళీ తయారు చేసుకోవచ్చు. విస్తృతమైన సరూప పద నిర్మాణం సంస్కృతానికి ఉంది. కొన్నిరకాల అవసరాలకు భాండాగారంగా సంస్కృతం. ఎప్పుడూ ఉపయోగిస్తూనే ఉంటుంది. అదోనిధి విలువైన వస్తువులాగా దాచుకుంటాం బజారులో అందరూ సంస్కృతాన్ని మాట్లాడాలని నిర్బంధం వద్దు దాని వల్ల ప్రయోజనం శూన్యం.

ప్ర : దేశభాషలందు తెలుగులెస్స అంటారు గదా! ఈలెస్స ఏమిటి?

జ : ఒక భాష గొప్ప ఒక భాషహీనం అని చెప్పడానికి రుజువులు లేవు. నిజానికి లెస్స అనే మాట తెలుగుపదం అని చెప్పటానికి ఆధారాలు లేవు. తెలుగు భాష గొప్పదని చెప్పటానికి ఉపయోగించిన మాట తెలుగుది కాదు. ఆటవిక జాతుల భాషల్లో కూడా అత్యంత క్లిష్టమైన భాషా నిర్మాణాలను కనుగొన్నారు ఎస్కిమో భాషలో వివిధ రకాల మంచు కూర్పులకు సంబంధించి ఎన్నో పదాలున్నాయి. తెలుగులో చూస్తే మంచు, పొగమంచు తప్ప మరో పదం దొరకదు. సందర్భాలు విస్తృతమయితే విస్తృత భేదాలను కూడా భాషేతయారు చేసుకుంటుంది. సందర్భాన్ని బట్టి భాష విస్తృతమవుతుంది. తనలో లేకపోతే ఎరువు తెచ్చుకుంటుందే తప్ప మనిషిని ఇబ్బంది పెట్టదు.

ప్ర : మాతృ భాషలో బోధన ఉపయుక్తమేనా?

జ : బోధనా మాధ్యమంగా ఏ భాష అయినా పనికొస్తుంది. మాతృ భాషలో చదివితే వ్యక్తీకరణ సులువవుతుంది. ఇది ప్రధానంగా రాజకీయ సమస్య. మాతృభాషలో చదువుకున్న వాళ్ల అభివృద్ధికి సమాజం కాని, ప్రభుత్వం కాని ఏమైనా చెయ్యగలదా? అని.

ప్ర : తెలుగు కన్నడాలకు ఒకే లిపిని ఏర్పాటు చేసేందుకు కృషి చేస్తామంటున్నారు. ఇది సాధ్యమేనా?

జ : ఇవన్నీ ఉబుసు పోకకు చెప్పే కబుర్లు. లిపి ఓ పరిణామ క్రమంలో ఆవిర్భవించింది. లిపికి సంస్కృతీ బద్ధ స్థిరత్వం ఉంది. ఆ

సంస్కృతిలో ఉన్నవాళ్లు ఆ లిపిని ప్రేమిస్తారు. ఆ లిపి ప్రజల అవసరాలకు అవరోధం కానంత వరకూ దానిని వ్యతిరేకించ నవసరం లేదు. ఒకస్థాయి వరకూ మార్పుల్ని సహిస్తారు. మార్పుల పేరిట మొత్తం లిపినే తుడిచి పెట్టామనడం సాధ్యం కాదు. భాష వ్యక్తీకరణలో లిపి పనిముట్టు. లిపికి, భాషకు విడదీయరాని సంబంధం లేదు. అయితే నాగరికత అభివృద్ధిలో లిపి పాత్ర అద్భుతం. లిపి లేని సమాజాలు అభివృద్ధికి నోచలేదు. సమాజ అభివృద్ధికి లిపి అవసరం. లిపులను కలిపినంత మాత్రాన భాషలు కలవ్వు.

ప్ర: తమ అవసరాలకు తగిన భాషను తప్పో, ఒప్పో ప్రజలే సృష్టించుకుంటారు. భాషా శాస్త్రవేత్తలు 'ఇది తప్పు' అని ధృవీకరించినంత మాత్రాన ఆ తప్పు చలామణిలో లేకుండాపోదు. మరి ఈ పూర్వరంగంలో భాషా శాస్త్రవేత్తల కృషికి ఉన్న విలువ ఏమిటి? ఉపయోగం ఏమిటి?

జ: ఏ సైన్సూ ప్రపంచ ధర్మాన్ని మార్చదు. సైన్స్ లక్ష్యం అదికాదు. ప్రకృతి నియమాలను గ్రహించడం వలన ప్రకృతి శక్తులను అనుకూలంగా మలచుకోవటానికి వీలవుతుంది. ప్రకృతి ధర్మాన్ని అర్థం చేసుకోవడం మొదటి దశ. ఉపయోగించుకోవడం రెండవదశ. భాషకు సంబంధించి అది ఏమిటో అర్థం చేసుకోవాలి. వెలుగుచూసిన ప్రతిసూత్రం వెంటనే ఉపయోగంలోకి వస్తుందనుకోవడం దురాశే. ప్రపంచంలోని అన్ని భాషల తత్వాన్ని పరిశీలిస్తే మనిషి మౌలికంగా ఒక్కటే. తను సంపాదించిన విజ్ఞానాన్ని, అనుభవాన్ని, ఊహలను వ్యక్తం చేయగల సమర్థ వాహకం భాష. కాలాన్ని, దూరాన్ని దాటి కమ్యూనికేట్ చేసే శక్తి భాషకు ఉంది. భాషలో వ్యక్తంచేసే భావాలకు గరిష్ట పరిమితి లేక పోవడం మరో గొప్ప వరం భాషలో మూడు అక్షరాల మాట, నాలుగు అక్షరాల మాటలే అధికం. అయిదు అక్షరాల మాట అరుదు. ఈ మాటలు రకరకాల కాంబినేషన్స్‌లో ఉంటాయి. అపరిమితత్వం, అనంతత్వం భాషా లక్షణాలు. మార్పులు లేకుండా అదే పద్ధతిలో కొనసాగితే, అవసరాలకు తగిన పూరకశక్తి భాషకు లేకపోతే భాషపనికొచ్చే కమ్యూనికేషన్ సిస్టమ్ కాదు. భాషా విషయకంగా పరిశోధనలు జరపడం, అంతసూత్రాలను వెలికితీయడం భాషా శాస్త్రవేత్తల పని. ఒక భాష పరిణామం చెందుతోందంటే ఆ పరిణామ క్రమానికి ప్రోదిచేసే సామాజిక ఆర్థిక పరమైన కారణాలనేకం ఉంటాయి.

ప్ర: కాలమిస్ట్ (చేరాతలు) గా మీ లక్ష్యం, మీ కాలమ్‌కు ప్రతిస్పందన ఎలా ఉంది?

జ: నేను కాలమిస్ట్ కావాలని చేరాతలు ప్రారంభించలేదు. దేవిప్రియ నన్ను ఇందులోకి దించాడు. నీళ్ళలో పడ్డాక ఈత తప్పదుకదా. కాలమ్ మొదట్లో నత్త నడక నడిచినా తరువాత వేగం పుంజుకుంది.

చేరాతల్లో భాషకు సంబంధించినవి చాలా కొద్దే. భాషను గురించి, వ్యాకరణాన్ని గురించి, లిపుల గురించి మన విద్యావంతుల్లో ఉన్న అపోహలు తొలగించటం ఒక లక్ష్యం.

సాహిత్యానికొస్తే . చాలా లక్ష్యాలున్నాయి. ఒకటి ప్రతిపదార్థం, అలంకారాలు చెబితే సాహిత్య పాఠం చెప్పినట్టు అనుకుంటున్నారు. ఆధునిక కవిత్వంలో ఈ పద్ధతి కుదరదు. ఒక కవిత కవిత్వం ఏ అంశాలవల్ల అయిందీ, గుర్తుపట్టి చూపించాలనుకున్నాను. అన్నిరంగాల్లోనూ, ఐడియాలజీ డామినేట్ చేస్తున్నది. సాహిత్యరంగంలో కూడా అంతే. ఐడియాలజీ ఉండకూడదని నేను అనటం లేదు. నాకూ ఉంది. కాని ఉన్న వస్తువును నిశితంగా చూడ్డానికి ఐడియాలజీని ఉపయోగించుకోవాలి గాని, కళ్లకు గంతలు కట్టుకోటానికి కాదు అని నిరూపించటం ఇంకో లక్ష్యం. నా సొంత ప్రయోజనం ఒకటుంది. భాషా వ్యాసాల్లో శాస్త్ర వచనం రాశాను. ఈ కాలమ్ ద్వారా సామాన్యవచనం ప్రాక్టీస్ చేశాను.

ప్రతిస్పందన అంటారా ? కాస్త చదివే అలవాటున్న పాఠకులకు ఇది నచ్చిందనుకుంటాను. నాకు సన్నిహితుల్లో కొందరు సంతృప్తి పడ్డట్టు కనిపించలేదు. వాళ్లకు కావల్సిందేదో ఇందులో కనిపించలేదనుకుంటాను. అందరినీ సంతృప్తి పరచడం ఏ ఒక్కరికీ సాధ్యంకాదు.

ప్ర : ఈ మధ్య చేరాతలు రావటం లేదేం ?

జ: కాస్త పనుల వత్తిడివల్ల తాత్కాలికంగా నిలిపాను. మళ్ళీ మొదలు పెడతాను.

ప్ర : మీ భవిష్యత్ కార్యక్రమాలేమిటి ?

జ : తెలుగు భాషకు సంబంధించిన ఆలోచన లన్నింటినీ కూర్చి తెలుగు, ఇంగ్లీషుల్లో పెద్ద పుస్తకం రాయాలన్నది నా జీవితాశయం. ఇక తెలుగు బాల ప్రౌఢ వ్యాకరణాలు తీసుకుని భాషా శాస్త్రపరంగా వ్యాఖ్యానించ దలచుకున్నాను. పత్రికాభాష మీద మోనోగ్రాఫ్ తయారు చేయాలని సంకల్పించాను.

# టీ.వి, రేడియో వార్తలే మేలు

## భట్టుతో ఇంటర్వ్యూ

కొన్ని కథలు రాశారు. చాలా వ్యాసాలు రాశారు. పెద్ద మనుషుల చిత్రాలు వందలకొద్దీ సముఖాన గీశారు. 150 సంవత్సరాల తెలుగు పత్రికా చరిత్రను తరచి తరచి చూశారు. 80 సంవత్సరాల భారతీయ వ్యంగ్య చిత్రరీతికి అబ్బుర పడ్డారు. శబ్దానికి పట్టం కట్టే రెండు అభినవ కార్యక్రమాలకు జాతీయ బహుమతులు గెల్చుకున్నారు. వయోజనవిద్యాశాఖ వారి జాతీయ బహుమతి పొందారు. తెలుగులో వ్యంగ్య రచనలకు కొత్తనిగారింపు నిచ్చారు. ఆధునిక అమెరికన్ కవిత, తెలుగునాటకం కొట్టిన వడదెబ్బనుంచి తేరుకుంటున్న పన్నాల సుబ్రహ్మణ్య భట్టుకి అన్ని పత్రికలూ చదవటమే పని. ఈ పిఠాపురం చిన్నోడు 72 నుంచి విజయవాడ ఆకాశవాణిలో ఉద్యోగం



చేస్తున్నాడు. నిజానికి భట్టు ప్రతిభ లోకానికి తెలిసింది. చాలా తక్కువ మందు బాగా కూరిన తారాజువ్వలా దూసుకు వచ్చే వాగ్బాణాలు, విమర్శలు, వ్యాఖ్యలు, విభిన్న ఆలోచనా స్రవంతికి ఆత్మీయులు అబ్బురపడుతుంటారు.

"ప్రజా బాహుళ్యానికి సమాచారం అందించే ప్రచార సాధనాలలో వుండే వారికి అన్ని రంగాలలోనూ గాఢమైన అభినివేశం వుండాలి. కొన్నిట్లోనైనా దున్నాలి. ఎలాంటి డిస్సెంటునైనా గౌరవించే మనసుండాలి. భీమ, వామ వాదాలకి తలపంచక నినాద ప్రతి వాదాలకు చోటివ్వక హుందాగా మెలగ గలగాలి. అతిరథుల వాహనాలను ఎక్కకుండా, సూదంటు రాయిల స్నేహాలకు లోనుకాకుండా నడవాలి. అప్పుడే తెలుగు పత్రికలను పైకి తేగలరు" అని అంటారు భట్టు.

ఖట్టు నిశిత ఆలోచనా దృష్టికి, ప్రత్యేకతకు ఈ ఇంటర్వ్యూ అద్దం పడుతోంది. మరిమీరే ఆయన ఆలోచనల వైశిష్ట్యాన్ని చవి చూడండి.

ప్ర: రేడియోవార్తాప్రసారానికి పనికివచ్చే రచనకి, పత్రికలలోని వార్తా రచనకి మౌలికమైన భేదాలున్నాయా?

జ: రేడియోకి వార్తలు రాసేటప్పుడు విపులంగా రాయడానికి వీలుకాదు. విశేషాలు అన్నీ చెప్పడానికి కుదరదు. పూర్వాపరాలు ఎక్కువ చెప్పడానికి వుండదు. ప్రమాదం గురించి, పెద్దనాయకుని మృతి గురించి, వివరించేటప్పుడే పది పదిహేను వాక్యాలు నడుస్తాయి. మిగత వాటిపై తక్కువ వాక్యాలువస్తేనే వినటానికి సదుపాయంగా వుంటుంది. ఎక్కువగా రంగు పులమటానికి రేడియో వార్తలలో ఒకటిరెండు వాక్యాలు కలుపుతూ పోలేము. ప్రభుత్వం చేతిలోలేని రేడియో కేంద్రాలలో వినవచ్చే వార్తలలోకూడా, నేరాలపైనా, రాజకీయ నాయకులలో వచ్చే విభేదాలపైనా వార్తలు చెప్తున్నపుడు ఎక్కువగా మసిపూసి మారేడుకాయ చేయలేం. ఆ రకంగా రేడియోవార్తలు-సంతృప్తిని కలిగించవు. కానీ పత్రికలో వచ్చేవార్తలు వివరంగా రాయవచ్చు. దృశ్యాన్ని చిత్రీకరించవచ్చు. ఇష్టం వచ్చిన కోణంలో చెప్పవచ్చు. కావలసినరంగు పూయవచ్చు. రేడియోలో వార్తనుచాటే శీర్షికలు- హెడ్డింగులు వుండవు కనుక కొంత ఆకర్షణ తగ్గుతుంది. కొమ్మలు తగ్గుతాయి, రెమ్మలు పుష్పించక పోవచ్చు. కానీ పత్రికా రచనలో అక్షరాలకీ, పదాలకీ, వాక్య నిర్మితికీ, పేరాల వరుసల కూర్పులో రక్తికీ విరక్తికీ చోటు వుంది. భాషలోవుండే అనేక రుచి భేదాలను, సొంపులను పత్రికలలోని వార్తా రచన ఉపయోగించుకొంటుంది. రేడియోవార్తా రచన ఉపయోగించుకోలేదు. న్యూసు స్టోరీలోని అంత మందుగుండు సామగ్రినీ, ఏ రేడియోవార్తా రచన ఉపయోగించుకోలేదు. ఆ రకంగా శ్రోతలు పూర్తిగా సంతృప్తి చెందలేరు. చదువరులు ఆశించే అనేక విషయాలను పత్రికారచన అందివ్వగలదు. ఉదాహరణకు సయ్యద్ మోడి హత్యపై వార్తని తరువాతవచ్చే అనేక వివరాలను పత్రికలో రచించినట్లుగా రేడియోలు నివేదించలేవు. ప్రభుత్వం అజమాయిషీలేని స్వంతరేడియో కూడా విపులంగా చెప్పలేవు. ప్రతి రోజూ చెప్పలేవు. న్యూసు స్టోరీ ఒకశిల్పం అనుకుంటే అనేక ఛాయాచిత్రాలు. అనేక కోణాలలో పత్రికా రచన అందిచ గలదు. రేడియో వార్త ఒకటి రెండు ఛాయాచిత్రాలనే అందించగలదు. వార్తలువ్యాఖ్య-పత్రికారచనలో కలిసినట్లుగా అభిప్రాయం (ఎవరిదైనాసరే) వార్త ఈ రెండూ రేడియోవార్తలలో పూర్తిగా ఇమడలేవు. పైపైనే తెలిసిపోతుంది.. ఆ అభిప్రాయం ఎవరిదో, ఎందుకు ఆ వార్తలోచోటు చేసుకొన్నదో. రేడియోవార్తలలో సూటితనం, వేగం, చురుకు

దనం అనుమానానికి చోటివ్వని పక్షపాత రహితదృష్టిని-అతిసులువుగా ప్రతిపాదించవచ్చు. పదాలు కష్టమైనా వాడుకలో వున్నవి, అర్థమయి పోయేవీ ఉపయోగించవచ్చు. కాని పత్రికలలో చదివేవారికి వీలయిన అక్షరాలు, పదాలు ముద్రించాలి. క్షిపణి, ప్రత్యామ్నాయం, నిరీక్షణ, అప్రమత్తం లాంటి మాటలు చదువుకొనడానికి కొందరికి ఇబ్బంది కలగవచ్చు. అలాగే క్షిపణి అనేమాట అచ్చుకు అంతగా బాగుండదు. వినడానికి రేడియోకి బాగుండదు. సంక్షోభం అనేమాట అచ్చులో పదే పదే వేయడం కుదరదు. కాని ఇవి రేడియోలో వినగా వినగా శ్రోత అలవాటుపడవచ్చు. కాసీ అందరు చదువరులకూ ప్రతిసారి పరీక్షగా మిగులుతుంది. వాక్యాల పదాల అర్థాలనీ స్థితిగతులను మార్చే విశేషణాలు చిన్న వాక్యాలు పత్రికారచనలో కనులకు కట్టించే దృశ్యం. రేడియోలో ఎబ్బెట్టుగా కనబడతాయి. ఉదాహరణకు ఇన్సాట్ 1-సి ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి వదిలేముందు చిన్నలోపం వల్ల కలిగిన ఒక సెకను ఆలస్యం శాస్త్రజ్ఞులలో కలిగించిన ఆరాటం- పత్రికారచనలో వాక్యాలలో అచ్చులో గొప్పగా నివేదించారు. ఆ ఆరాటం రేడియోలో చిన్న ఇబ్బందిగా మాత్రమే వినబడింది. అలాగే ఇందిరాగాంధీ శవయాత్ర నివేదించిన వార్తలో "అశ్రునయనాలతో విలపిస్తున్న జనసందోహం" వినడానికి బాగుండదు. పత్రికలలో కళ్ళకుకట్టినట్లు రాయవచ్చు. ప్రత్యక్ష వ్యాఖ్యానం రేడియోలో వినబడినపుడు కొందరు కళ్ళకు కట్టినట్టు, హృద్యంగానూ చెప్పవచ్చు. అదివేరే విషయం. రససిద్ధి- ఆమాట ఏ కోణంలో అర్థంచేసుకొన్నా సరే-రససిద్ధిని కల్గించడానికి వార్తాప్రతికారచనలో వున్న ఆకర్షణలు రేడియో వార్త రచనలో లేవనే చెప్పాలి. అలాగే తక్షణ శుద్ధిని కల్గించడానికి రేడియో వార్త పనికి వస్తుంది. కడిగిన ముత్యాన్ని తీసినట్లుగా రేడియోవార్తా రచన వుండాలి షోకేసులో పెట్టినట్లు. వజ్రాన్ని తీసి సానపెట్టినట్టుగా కనపడాలి పత్రికలో వార్తారచన. రేడియోవార్తా రచనకి వార్త మూలవిరాటు లాంటిది. సరిగా కొలవకపోతే శ్రోతలకు ఆగ్రహం వస్తుంది. మేకప్పుండకూడదు. పత్రికా వార్తా రచనలో వార్త ఉత్సవ విగ్రహంలాటిది. కొంత బొట్టు కాటుక, చీని చీనాంబరాలు, అగరధూపాలు వీటితో వుంటేనే చదువరులు ఆనందిస్తారు.

ప్ర : రేడియో టీ.విలకు స్వయం ప్రతిపత్తి వలన కలిగే మేలువుందా? అందువల్ల ఎటువంటి మార్పులకు అవకాశం వుంది?

జ : మోకాలు చిప్ప వాపుతీస్తే బాగా నడుస్తారా? అని అడిగినట్లుంది. వాపుతీస్తే తప్పకుండా కాలు సరిగాజాపుకోవచ్చు, నడవచ్చు. నిర్వాహకులకున్న చలిజ్వరంకూడా తగ్గుతుంది. వార్తాప్రసారాలలో కొంత బేలన్సు వస్తుంది. అన్ని

కాల వార్తలను పక్షపాతం తగ్గించి ప్రసారం చేయవచ్చు. అయ్యో ప్రభుత్వంలో వున్నాంకదా, ఇటువంటి కార్యక్రమాలు ప్రసారం చేయకూడదేమోఅన్న శంక పోతుంది. కొంచెం విశ్లేషణతో, చర్చలు, కొంత వివాదాస్పదమైన విషయాలపై కార్యక్రమాలు, కొనసాగించవచ్చు. అంతమాత్రాన గొప్ప మార్పులు వస్తాయని అనుకోనక్కర్లేదు. ఒక్కొక్క మాధ్యమానికి ఒకొక్క నేపథ్యం, చరిత్ర ప్రస్తుత స్థితి ఇవి వుంటాయి. పత్రికలలాగా రేడియో టి.విలు వార్తలు సేకరించే బ్యాంకులు లాటివికావు. విలేకరులు అవినీతిని, కేసులను బయట పెట్టినట్లుగా రేడియో టి.విలు ఏ దేశంలోనూ ఎంత స్వతంత్రంగావున్నా సరే ఉద్యమంగా కొనసాగించలేవు. వార్తలు ఇవ్వడమే, నేరాలను అవినీతిని వెలికితీయడమే పత్రికలకి ప్రధానమైన లక్ష్యాలు. కాని రేడియో, టీవిల భుజాలు ఇంకా పెద్దవి. చెవికీ కంటికీ ఆనందం కలిగించే అనేక కళారూపాలకు అవి వేదికలు. ఇందువల్ల వాటి బాధ్యతలు విస్తృతమైనవి. బోఫోర్సువారి ముడుపుల సంగతి, మనదేశంలోని ఏజెంట్ల సంగతి స్వీస్‌రేడియో ముందు వెలికితీసినా, పూర్తి గుట్టుమట్లను లాగింది .పత్రికలు. హిందూపత్రికలో ప్రచురించిన సాక్ష్యాలు ఏ రేడియో చూపించలేదు. ఏ టీ.విలో ఫోటో చూపించినా, రెండోఫోటో వచ్చేసరికి విసుగువస్తుంది. అలా కాకుండా ఎన్ని ఫోటోలు పత్రికలలో పడితే, అంతతాబాగా చదువరులు చూస్తారు విశ్లేషించడానికి వీలవుతుంది. అలాగే అమెరికాలో నిక్సన్ వాటర్ గేటు వ్యవహారాలు నికరాగ్వా కాంట్రాలకు రీగన్ చేసిన ఆయుధ సహాయాలు వెలికితీయడంలో పత్రికలు చేసినకృషి వారి రేడియో, టీవిలు చేయలేక పోయాయి. ఈ వార్తలు బైటికి వచ్చిన తర్వాత వార్తా విశ్లేషణలో వ్యాఖ్యలను ప్రసారం చేయడంలో ముందంజ వేసివుండవచ్చు. స్వయంప్రతిపత్తి వస్తే బోఫోర్సు వ్యవహారాల తర్వాత భారత దేశ నాయకత్వంమీద మన రేడియో, టీవిలలో చర్చించవచ్చు. వి. పి. సింగ్ భవితవ్యం మీద వ్యాఖ్యానించవచ్చు. ఫెడరల్ విధానం అమలులో రాష్ట్రాలు ఎదొనవుతున్న చిక్కులు ఏకరువు పెట్టవచ్చు. కాని సంగీతంలో పడిపోతున్న విలువలు, నృత్యంలో వేస్తున్న తప్పటడుగులు, చర్చించడానికి, ఇప్పుడూ అడ్డులేదు. కానీ చర్చించరు. ఎవరోఒకరు అభ్యంతరం చెప్తారు కనుక. స్వయం ప్రతిపత్తి వచ్చినంతమాత్రాన- అభివృద్ధికార్యక్రమాలు అవినీతివల్ల కుంటు పడ్డాయని చర్చిస్తే ఏ రాష్ట్రప్రభుత్వం వూరుకుంటుంది? పాలకపక్షంలో ప్రజాస్వామ్యంకంటే నియంతృత్వ ధోరణివుందని ఉదాహరణలు చెప్తే, ప్రతి శాఖలలో పదవులకోసం కుమ్ములాటలు వున్నాయంటేనూ,- ఏ పాలక వర్గం వూరుకుంటుంది? ఏ పార్టీ ఒప్పుకుంటుంది? అందుకని స్వయం ప్రతిపత్తి కలిగినంత మాత్రాన పత్రికల మాదిరి రేడియో, టీవిలు వుండలేవు. కొంచెం

ఆలోచన వికసించి, అన్నిటికీ బుర్ర వూపకుండా, స్వతంత్రించి కొన్ని పనులు చేయవచ్చు. అదీ వార్తా విశ్లేషణలో వివాదాస్పదమైన రాజకీయ విషయాలు చర్చించడంలో కొంత ఉపయోగపడవచ్చు. మిగతా సాంస్కృతిక రాజకీయేతర విషయ ప్రసారంలో మానసిక స్వయంప్రతిపత్తి రావాలి. కాని ఇప్పుడు అవరోధాలు లేవు, ఇంకొకప్పుడు అవతరించగల కొత్త సదుపాయాలు లేవు. స్వయం ప్రతిపత్తి వల్ల భావదాస్యంపోదు. ఉదాహరణకి పార్టీ పత్రికలలో పని చేసివచ్చి ఇతర పత్రికలలో పనిచేస్తున్నవారు పెద్దమార్పులకు కారణభూతులయినట్టుగాని వారి ఆలోచనధోరణుల అనుశీలనకీ వక్రతకీ చోటిచ్చినట్టుగానీ కనపడదు., "మా అభిప్రాయాలు మారనక్కర్లేదు" అనో, "ఇదివరకు మా దృష్టి ఇది-మారి దలచుకోలేదు" అనో అభిప్రాయ పడతారు. స్వయం ప్రతిపత్తి లభించే పాఠ్యమాలలోవారు కూడా అలాగే కరుడు కట్టుకు పోవచ్చు. క్రెడిబిలిటీకోసం ప్రయత్నించడం అనేది ఒక మానసిక ప్రతిపత్తి,హోదా, స్వయం ప్రతిపత్తి వల్ల కాస్మెటిక్ మార్పులు రావచ్చు. కానీ మౌలికమైన మార్పులు వస్తాయని అనుకోను. ఇప్పుడున్న చరిత్ర దృష్ట్యాచూస్తే, ప్రసార యంత్రాంగంలో పత్రికలలోవలే బాహాటంగా ఎవరిమీదా ఏ వ్యవస్థమీదా విరుచుకుపడగల అవయవ శక్తి లేదు. పామె హత్య విషయంలో స్విస్ రేడియో; వియత్నాంయుద్ధం చూసినపద్ధతిలో అమెరికారేడియో; ఫాక్‌లాండ్, ప్రొఫ్యూమో విషయంలో బిబిసి-స్వయం ప్రతిపత్తికి అంతర్గతంగావున్న సంకెళ్ళను గుర్తు చేస్తున్నాయి. స్వయంప్రతిపత్తి వలనవచ్చే స్వతంత్రంకూడా పరిమితమైనదని చెప్పడానికే ఇన్ని మాటలు.

ప్ర : ప్రభుత్వరంగ వుద్యోగులకు వుండే ఇబ్బందులు, పరిమితులు, స్వేచ్ఛాస్వతంత్రాలు సరైన వార్తా ప్రసారానికి అడ్డువస్తున్నాయా?

జ : సరైన వార్త గురించి రెండు ముక్కలు చెప్పకుంటే, అసలుగొడవ తగ్గుతుంది. రేడియోలో వార్తాప్రసారానికి కల్పనలేనివార్త, అతిత్వరితంగా అందించడం సరైన పద్ధతి. ప్రసారంచేసిన వారికి ఇబ్బంది, నష్టం కల్గినాసరే అత్యధికులు వినవలసిన వార్త సరైనవార్త. ఒత్తిడివర్గాల వారికి యిష్టంలేక పోయినాసరే ప్రసారానికి నోచుకునే వార్త సరైనవార్త. ఈ దృష్టితో ఆలోచిస్తే సరైన వార్తల ప్రసారంలో ప్రభుత్వంరంగంలోని ఉద్యోగులకు చిన్నా పెద్దా-ఇబ్బందులు కలుగుతూ వుంటాయి. జగజ్జీవన్‌రామ్ మరణవార్త ఒక ఉన్నతాధికారి, వార్తల అధికారే సేకరించారు. కింది వారికి చెప్పారు. ప్రసారమయింది. ఆయన ఇబ్బందిపడ్డారు. తర్వాత మళ్ళా అదే ఉద్యోగంఇచ్చారు. అదివేరే సంగతి. ఇందిరాగాంధీ హత్యానంతరం ప్రపంచ నాయకుల సానుభూతి సందేశాలు ప్రసారం

చేయవలసి వచ్చింది. ధృవీకరించిన మరణవార్త చెప్పడానికి కొన్ని రాజ్యాంగ రీత్యాకారణాలు అడ్డువచ్చాయి. కొత్త ప్రధాని ప్రమాణస్వీకారం చేయవలసి రావటం, రాష్ట్రపతి విదేశీ పర్యటనలో వుండటం, ఇలాటి కారణాలు. అలాగే గవర్నర్ల ఆదేశాలు రాష్ట్రపతిపాలనపై నిజమైన సమాచారంకూడ సేకరించ గలిగినా ప్రసారం చేయలేకపోవటం, ఈ ఉద్యోగులకువుండే ఇబ్బందులు. అలాగే నేరస్థులు, అవినీతిపరులైన వారి పేరుతో ఆరోపణలు ప్రచారం చేయ డానికి-ఆరోపణలు నిరూపింపబడినా ప్రచారంచేసే మాధ్యమాల గత చరిత్ర వేరు, పత్రికల చరిత్రవేరు. పత్రికలలోపడితే చర్యతీసుకోరు. రేడియోలో పేరు వినపడితే నేరస్థుడు దావావేసి నెగ్గగల అవకాశాలున్నాయి. దుమ్మెత్తిపోసే పత్రికలను సహించిన వారే "రేడియోవాళ్ళు ఒళ్ళుదగ్గర పెట్టుకొని చెప్పవద్దూ" అంటారు. ఆడపిల్లలా రేడియో బతకాలి. మగపిల్లవాడిలా పత్రికలు నడవవచ్చు అనే సంప్రదాయ సమాంతర భావనవుంది మనవారిలో.

ప్ర : ప్రయివేటు యాజమాన్యంలోవున్న యాజమాన్యవిధానాలకి వార్తా ప్రచురణకీ వ్యాఖ్యా ప్రచారానికి; ప్రభుత్వ విధానాలకి రేడియోవార్తా ప్రసారానికీ పోలికలు ఏమిటి? తేడాలు ఏమిటి?

జ : పేపరుకి దగ్గరి బంధువులు, దూరపు బంధువులుంటారు. మనవారు కాని వారు వుంటారు. ప్రకటనలవల్ల ఒత్తిడి కూటములుంటాయి. అన్నీ అటు వుంచి పేపరు యాజమాన్యం అభిమానించే వ్యవస్థలు, పార్టీలు, వ్యక్తులు, విధా నాలుంటాయి. ఇవి ఏమిటి అని ఖచ్చితంగా ఒక్కోసారి వార్తాప్రచురణ సిబ్బం దికి తెలియక, అనేక మందికి అవసరానికన్న ఎక్కువ మేలు జరుగుతుంది. వీరిమీద ఆరోపణలు ప్రచురించకపోవటం, తక్కువగా వేయటం ఇలాటివి. చిన్న విషయమైనప్పటికీ ఎక్కువ ప్రచారం ఇవ్వటం ఇవ్వకపోవటం-ఇలాటి వడ్డింపులకు ఒక లిఖితపద్ధతికాని, సమతూకంగాని వుండవు. ప్రభుత్వరంగంలో ఈవార్త చెబితే, ఎందుకు చెప్పారని ఏ పార్టీవారైనా మంత్రికి రాస్తారేమోనని భయంతో వార్తని నోటీసు చేయకపోవచ్చు. అంతేకాని అమితాబచ్చన్ ప్రధానికి దగ్గరకదా, అని అతనిమీద వార్తలు చెప్పకపోవటం వుండదు. వలచన చేయడం వుండదు. ఘాటుగా శీర్షికలు పెట్టినట్లు చెప్పరు అంతే. సరేవ్యాఖ్యలు ఎలాగూ రేడియోలో సాధారణంగా చోటు చేసుకోవు. అయతుల్లా ఖొమేనీ రాజ్యంలోకి వచ్చినట్లు బ్లిట్జ్ పత్రిక అసలు గుర్తించనేలేదు. అంతకు ముందున్న రాజుకు కరంజియా చాలా స్నేహితుడు కనుక. ఫ్రాన్సుదేశంలో ఖొమేనీ వర్గంవారి కార్యకలాపాలను తగ్గిస్తూ వార్తలు బ్లిట్జ్ పత్రిక ప్రచురిస్తూ వుండేది. నావికాదళానికి చెందిన నానావతి కేసులోకూడా పూనుకుని అతని కధను సీరియల్ చేసి సానుభూతికోసం ఉద్యమం లేవదీసింది. అలాగే రాష్ట్రపతి

జెయిల్‌సింగ్ విషయంలోకూడా ఏమీలేనిదే దుమారం అవసరానికిమించి లేపటంలో ప్రాముఖ్యంలేని వార్తలను, ఆయన గురించి, ప్రధానికీ ఆయనకువున్న అభిప్రాయ భేదాలను భూతద్దంలో చూడటానికి చాలామంచి పేరున్న పత్రికలే ప్రయత్నించాయి. ఇవి సంయమనం లేకపోవటంవల్ల వచ్చినచిక్కు. పత్రికాధిపతులు ఎల్లవేళలా నిర్దేశించినవికావు. ఇలాటి ఎగుడుదిగుడులు రేడియోవార్త ప్రసారంలోతక్కువ. అజ్ఞానం బయటపెట్టే వార్తలు, అనువాద వాక్యాలు రేడియోలో వినవచ్చుకాని, అల్పజ్ఞానాన్ని పంచిపెట్టే పత్రికల ప్రయత్నంలాటి ప్రయత్నాలకు రేడియోలో తావులేదు. కాపునాడు వార్తలను ప్రముఖంగా చెప్పిన ప్రాంతీయ వార్తలుండవచ్చు. మహారుద్ర యాగాన్ని వార్తలలో చెప్పిన రోజులుండవచ్చు. "అనేకచోట్ల కాంగ్రెసు విజయం" అనిచెప్పిన జాతీయ వార్తలుండవచ్చు "అన్నా-బసు" ఒకటేఅని, "మళ్ళీపేలిన బోఫోర్సు" అనీ, తెలుగుదేశం పార్టీ ప్రభంజనం అని "అఖిలపక్ష పోరాటానికై పిలుపు" అనే పతాక శీర్షికలు వినబడే వార్తలలో కుదరదు. పత్రికలలో ఇవి అతి ఎక్కువ. రేడియోలో ప్రభుత్వానికి కొంచెం ముందుపీట వేసి చెబుతున్నారు. చిన్న నాయకుడి వెనెకాల నెలలతరబడి భజనచేస్తూ పైకిఎక్కించడంకానీ, పెద్ద నాయకుడవుతాడని పందెంలో నిలబడి, దన్నుకాయడంకానీ రేడియోలో కుదరని పని. మాటలు మీరడం మాటజారడం, పరుషంగా రాయటం తెలుగు పత్రికలలో అందరూ ఆందోళనపడవలసిన రీతిలో కనబడుతున్నాయి. ఈ ప్రమాదాలకు రేడియో ఎప్పటికీ లోనుకాలేదు.

ప్ర: పరిశోధనాత్మక వార్తల పేరిట వస్తున్న జర్నలిజానికి రేడియో టివిలలో చోటుందా?

జ: నిజానికి ఇది మొదలుపెట్టింది రేడియో అనే చెప్పాలి. వ్యక్తుల ప్రతిభ, కష్టాలలోంచి పైకి వచ్చిన వికలాంగులు వగైరావారి కథలు, అభివృద్ధి కార్యక్రమాలలో పరిచయాలుగా మొదలుపెట్టింది రేడియో. కాని అక్రమాలను పరిశోధించితేకాని, అది ఆ జర్నలిజంకాదు అనుకోవటం వచ్చింది. నిజానికి దీనిలో పరిశోధన ఏమీలేదు. అంతరంచే దర్యాప్తు నివేదికలని అనాలి. ఎక్స్‌ప్రెస్ పోటీ వ్యాపారంలో అధికప్రచార ధోరణులు పెరగటంవల్ల వెనుకవున్న వ్యక్తులని సంస్థలని బట్టి వాటికి నిడివి పెంచటంవల్ల ఈ ప్రాతికేయ వ్యాసాలకు అనవసర గౌరవాలు వచ్చాయి. రమల కేసు పైకితీసుకురావడానికి, కలప కుంభకోణానికి ఎంత విలువ ఇస్తున్నామో పరిశోధనగా నెత్తిన పెట్టుకున్నామో, బాక్సుకట్టి ప్రచురిస్తున్నామో- అంత ప్రచారం గ్రామానికి నీరూ, వెలుగూ, స్వయం సమృద్ధి తెచ్చిన వ్యక్తికి ఇవ్వడానికి మనసు ఒప్పదు. ఇలాటి ధనధృవాల

తాలూకు కథలకు రేడియోలో చాలా అవకాశం ఉంటుంది. కానీ కురియన్ పాలవెల్లువపై వచ్చిన వీక్లీ కథా నివేదికలాటి దర్యాప్తులకు ఎప్పుడూ రేడియోలో చోటుండదు. అలాగే మోడి గురించి కధకూడా ఎప్పటికీ రేడియో మాధ్యమంద్వారా నివేదించలేము. పరిమితులు తప్పవు.

ప్ర: వార్తలను సంచలనాత్మకంగా అందించే ప్రయత్నంలో ప్రజా బాహుళ్య వార్తాసాధనాలు ప్రజలకు హానిచేయడంలేదా?

జ: అలాంటి ప్రయత్నం గట్టిగా పురిమిన పురుములాంటిది. క్షణికం. అందువల్ల హానిలేదు. చెవులుగళ్ళుపడి ఎవరూ చెవిటివారుకారు పైగా శీర్షికలో ప్రళయం సృష్టించినా, ఆ ప్రళయం కింది వార్తల పేరాలలో వుండాలి. అసలు నిజంగా ప్రళయమైనవార్త కావాలి. ఘోరప్రమాదమని 10 మంది చావులుంటే ఎవరూ భయపడరు. పంజాబులో హత్యలకు అలవాటుపడలేదా? రేప్ వార్తలకు అత్యాచారాలకు సంచలనాత్మకంగా శీర్షికలుపెట్టే ఓపిక, సాహసం పోయింది. పైగా చదువరులుకూడా మీ వార్తలధోరణిని ఆమోదించినవారే. వారికి, వారు చదివే పత్రిక సంగతి తెలుసు. చదువులేని మనదేశంలో దూర ప్రాంతాలలో ఎవరు ఎలా పోయినా అక్కర్లేదు. ఇందిరాగాంధీ రాలిపోయినప్పుడు, రామా రావు పదవిపోయినపుడు పత్రికలలో వార్తలు చదివి శోకతప్తులుకాలేదు, సమ్మెలు చేయలేదు. ... టికి వచ్చిన ప్రతిస్పందనకు పత్రికలు కారణం అనుకో వటం భ్రమ. రేడియోలో పంజాబులోని హతుల సంఖ్య చెప్పినా, టీవీలో చూపించినా విచారిస్తారుతప్ప, పట్టించుకోరు. సంచలనాత్మకంగా అందించే ప్రయత్నంలోనే-నమ్మకం పోగొట్టుకునే ప్రమాదంవుంది.

ప్ర: టి. వి. వచ్చాక వార్తా సేకరణ, ప్రసారాలలో రావలసిన చురుకు దనం లేకపోవడానికి కారణమేమిటి?

జ: వార్తలు చెప్పాలన్నా, వార్త జరిగినచోటు, దూరం వెళ్ళడంభారం. ఖట్మండూలో భూమి కంపించింది. రాత్రికల్లా వార్తలలో చూపించగలిగారు. బీహారులోని దర్భంగాలోనూ కంపించింది. ఆ జిల్లానుండి విమానకేంద్రందగ్గర కాదు, ఆ రాత్రి టి.వి.లో చూపించలేకపోయారు సరే. నేరాల కథలు చురుకుగా చెప్పలేం గవర్నమెంటు పట్టుకొన్న దొంగ బంగారం అవీ చెప్పగలం. కొందరు మొండిగా మొదలుపెడతారు. మొండిగానే వార్తలను తయారుచేస్తారు. ఈమధ్య హైద్రాబాద్‌నుండి 2 నిమిషాలకుపైగా వార్తలలో సంక్షేమ వసతి గృహాలు రాష్ట్రంలో ఎలా పనిచేయడం లేదో చూపారు. బండగావుంది. పిచ్చి పిచ్చిగా ఎడిట్ చేశారు. వార్తలు హత్తుకొనేలాగా చిత్రించ గలగాలి. ఆ నేర్పు చెబితే వచ్చేదికాదు. అందరికీ వంటబట్టేదికాదు.

ప్ర : ప్రజా బాహుళ్యానికి వార్తలందించే సాధనాలుగా, పత్రికలు, రేడియో, టీ వి ఏ ఉత్తమ సంప్రదాయాలను వదులుకుంటున్నాయి ?

జ : అగ్లీయాంగిల్ కుమాపిని చూపేకోణం ఎక్కువయింది. వ్యాఖ్యా దృష్టి ఎక్కువయింది, సోదిగుణం ఎక్కువయింది. విలేఖరి వ్యక్తిగత అభిప్రాయాలు, ప్రాపకాలు, తెలివిలేనితనం, సిగ్గువిడిచినదనం ఎక్కువ కనబడుతున్నాయి. వార్తాంశాలలోని లేని విషయాన్ని శీర్షికలో చూపిస్తున్నారు. సంయమనం వుండాలనీ, ఎక్కడిదో పూడ్చకూడదని, వార్త వేరు, వ్యాఖ్య వేరు అని, అతిగా రాయకూడదని, అభిమానించకూడదని, అశ్లీలమైన మాటలు విలేఖరి యధాతథంగా రాస్తే వేయరాదని—ఇలాటి సంప్రదాయాలు వుండేవి అవి అన్నీ ఇప్పుడు అంతరించాయనే చెప్పాలి. "ఈ హత్యతో సంబంధముందని పోలీసులు అనుమానిస్తున్నారు" అని రేడియోలో వార్తలలో ప్రసారమవుతోంది. శవాల వరుసలు టీ విలో కనబడుతున్నాయి.

ప్ర : వార్తాప్రసారాలకీ, ప్రచారానికీ వార్తాపత్రికలకు మరింత స్వేచ్ఛనిచ్చే రాజ్యాంగ సవరణ ప్రవేశ పెట్టాల్సిన అవసరముందా ?

జ : వుంది. పౌరునికివుండే "మాట్లాడేహక్కు అభివ్యక్తీకరణహక్కు" మాత్రమే రాజ్యాంగం మనకిచ్చింది. ఈ ప్రాథమిక హక్కుల పరిధిలోనికే పత్రికలు వస్తాయి. ఆ హక్కుకి మరింత బలాన్ని రక్షణనీ ఇచ్చే సవరణ చేయాలి. అందులోనే వాటిని బాధ్యతగా వినియోగించుకొనకపోతే నష్టపడిన వ్యక్తులు సంస్థలు పత్రికలమీద తీసుకోగల చర్యలకు కూడా ప్రాతిపదిక లభించాలి. కొన్ని అక్రమాలకు కారణభూతులయిన వారిమీద నిజమైన ఆధారాలు కనుక్కొనడం వేరు, అవి కోర్టులో నిరూపణ కావడం వేరు. "ఆధారరహితంగా రాయలేదు" అని పాత్రికేయుడిని కోర్టు గుర్తించగలిగితే చాలు. అతడికి రక్షణ కల్గించే యంత్రాంగాన్ని న్యాయాధీశులు ఆయత్తంచేయగల రీతిలో చట్టాలు రావాలి. ఇప్పుడున్న ఒత్తిడుల ప్రజాస్వామ్యయుగంలో ఏ ప్రభుత్వం వీటిని తలపెట్టలేదనుకుంటాను కాలికి మొక్కనివారికోసం వెండి కడియాలు ఎవరూ చేయించరు.

---

సంపాదకునికి లేని గౌరవం అతడి సంపాదకీయాలకు రాదు.
విశ్వమానవ దృష్టి, శీల సంపద, ధర్మాభినివేశం లేనివాడు ఏమైనా
కావచ్చు కానీ ఉత్తమశ్రేణి సంపాదకుడు మాత్రం కాలేడు.

— నార్ల వెంకటేశ్వరరావు

---

జయశ్రీ ప్రెస్, 2-2-1156/2/జి, తిలక్‌నగర్, హైదరాబాదు-500 044.

# 'చక్ర' భ్రమణం



చండీదాస్ చెప్పినట్లు ఇన్ని పేజీలూ మీరు చదివేశారు కనుక మీతో ఓ ఆత్మీయత ఏర్పడింది. దాన్ని పురస్కరించుకునే ఈనాలుగు ముక్కలు. ఈ రచనకు ప్రేరణనిచ్చిన వ్యక్తి జి.వి.ఎస్ మూర్తి. విషయ సేకరణలో ఎందరో మిత్రులు సహకరించారు. అచ్చు బాధ్యతను వై. వివేకానంద భుజానికెత్తుకున్నాడు. పి వి రామ్ కుమార్ నేనున్నానపదమన్నాడు. బూదరాజు రాధాకృష్ణగారు భాష విషయంలో చూపిన బాటనే నడిచాను. ఇంకా ఎందరో ప్రముఖుల ఇంటర్వ్యూలు చేయలేకపోయాను. అందుకు విచారిస్తుంటాను. విషయాన్ని సరళంగా చెప్పడానికి యత్నించాను. ఈ పుస్తకంపై మీ అభిప్రాయాలను రాస్తారు కదూ। ఇక చివరిలో...

ఈ వృత్తిలో పైకి ఎక్కించే నిచ్చెన మెట్లుంటాయి. కిందకు దిగలాగే పాకుడు రాళ్లుంటాయి. ముఖాన పొగిడే వారుంటారు. వెనక వారే తెగుడుతారు. మురా రాజకీయాలుంటాయి. ప్రలోభ పెట్టే వారుంటారు. బురద చల్లే వారుంటారు. 'ఇంటిగ్రిటీ'ని శంకించే వారుంటారు. ఈ వృత్తే నిత్యసమరం. రోజూ తప్పవు 'టెన్షన్లు'. ఓ రోజు విజయానందం. ఓ రోజు పరాజయ భారం. ఇవన్నీ ప్రతిబంధకం కానీకండి. మీ లక్ష్యం మీ వృత్తి వార్తలు రాయడం. అన్నీ చిద్విలాసంగా పక్కన పెట్టేయండి. యోగముద్ర దాల్చండి. పక్క చూపులు చూడకండి. వార్తలకు, పాఠకులకు అంకితంకండి. అదొక్కటే మిమ్మల్ని ముందుకు నడిపించే రాజమార్గం.

ఇంక ఇంతకంటే ఏం చెప్పనూ!

మీ

చక్రధర్

